# యోగసమన్వయము

(The Synthesis of Yoga)

శ్రీ అరవిందులు

సంపుటి-2

అనువాదం :

కమలాకర వేంకటరావు

కృష్ణా పబ్లికేషన్సు

పాండిచ్చేరీ

ప్రథమ ముద్రణ :
ఫిబ్రవరి 21, 1978
1000 ప్రతులు



అంకితం :

అనంత ప్రేమమూర్తులైన

శ్రీ మాతారవిందులకు

వెల : రు. 8-00

ముద్రణ :

# మున్నుడి

శ్రీ అరవిందు లీ మహాగ్రంథమును 'దివ్యకర్మయోగము,' 'పూర్ణ జ్ఞానయోగము,' 'దివ్యప్రేమయోగము,' 'ఆత్మసంసిద్ధియోగము,' అను నాల్గు భాగములుగా విరచించియున్నారు. అందు, 'దివ్యకర్మ యోగము'లో మొదటి నాలుగు అధ్యాయములను 'అవతారిక' అయిదు అధ్యాయములతో పాటుగ 'సంపుటి-1'లో ప్రచురించబడి యున్నది. 'దివ్యకర్మయోగము'లోని తక్కిన తొమ్మిది అధ్యాయ ములను ఇప్పుడీ రెండవ సంపుటియందు ప్రచురితములు. దీనితో, 'దివ్యకర్మయోగము' పూర్తియైనది. ఇక క్రమముగా, ఈ మహా గ్రంథములోని తక్కిన భాగముల అనువాదమును సైతము ఇట్లే చిన్నచిన్న సంపుటములుగా వెలువరించుటకు శ్రీ మాతార విందుల దివ్యకృపా విశేషముచే త్వరితగతిని విజయవంత మగునుగాక యని ఆశించుచున్నాను.

—కమలాకర వేంకటరావు

# విషయసూచిక

## ప్రథమ భాగము

# దివ్యకర్మయోగము

## అధ్యాయము 5

## యజ్ఞారోహణము 1

### జ్ఞానకర్మలు - హృత్పురుషుడు

ఇదియే, * యజ్ఞేశ్వరుడగు పరాత్పరుని గూర్చిన పూర్ణజ్ఞాన లక్షణము. ఇదియే, భక్తిజ్ఞాన కర్మ యజ్ఞములనెడి త్రివిధ లక్షణములతో నొప్పారు యజ్ఞ స్వరూపము. ప్రత్యేకించి కర్మయజ్ఞమని యన్నప్పుడు, కేవల బాహ్యకర్మలనే కాదు, మనలోని సకల వృత్తులనూ సమర్పించవలెనని యర్థము. మన బాహ్య వృత్తులవలెనే మన ఆంతరంగిక వృత్తులునూ ఒకే బలిపీఠమున నివేదితములై పోవలెను. ఆత్మసంయమము కొరకునూ ఆత్మసంసిద్ధి కొరకునూ చేయు పరిశ్రమమే, యజ్ఞముగా నాచరించబడు సకల కర్మకునూ ప్రాణము. ఈ పరిశ్రమ ఫలితముగనే, పైనుండి మన దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధి ప్రవృత్తులలోనికి పొర్లుకొనివచ్చు దివ్యతేజస్సుతో మనము ప్రకాశించ గలుగుదుము. దివ్యచేతనపు వెలుగు మనలో వృద్ధియగుచున్నకొలది, మనము విశ్వక్రతువున కధీశ్వరుడగు పరమేశ్వరునితో ఆత్మసాన్నిధ్యమునూ అంతస్సాయుజ్యమునూ బడయగల్గు చుందుము. ఇయ్యది ప్రాచీన వేదాంత ప్రతిపాదితమైన జీవితపరమార్థము. అంతియేగాక, మన దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధుల రూపముననున్న సకల సంభూతియందునూ ఆ పరమేశ్వరునితో సారూప్య సాధర్మ్యములనుగూడ గాంచ గలుగుచుందుము. వేదములందు యజ్ఞసంకేతద్వారమున వేదఋషులు ఈ నిగూఢార్థమునే బోధించిరి.

కాని, పూర్ణయోగ లక్ష్యానుసారము మానసిక సత్తలో నుంచి ఆధ్యాత్మిక సత్తలోనికి సత్వరముగ పరివర్తనము చెందు విధాన మిదియేయైనచో, నిచ్చట, మిక్కిలి క్లిష్ట మయ్యునూ అత్యంత ముఖ్యమైన ప్రశ్న

---

* [illegible]

యొకటి ఉదయించుచున్నది. ఇప్పటి ఐహికజీవనమునూ తత్సంబంధమైన కర్మలనూ ఏమిచేయవలెను ? ఇంకనూ పరివర్తనము చెందకయున్న మానవప్రకృతి చేష్టలతో నెట్లు వ్యవహరించవలెను ?

బృహత్తరమైన చేతసలోని కారోహించుటయూ, దాని శక్తులకు మన దేహ ప్రాణ మనములయం దావాసము కల్పించుటయూ పూర్ణయోగపు ముఖ్యలక్ష్యముగా నొకవైపున నంగీకరించుచున్నాము. మరియొకవైపున, ఏదో లోకాంతర జీవనము గాక, ఈ ఇహలోక జీవనమే ఆత్మవ్యాపారమునకు రంగభూమి కావలెనని యను చున్నాము. ఉపకరణప్రాయమైన మన యుపాధినీ ప్రకృతినీ విచ్ఛిన్న మొనర్చుట కాదు, రూపాంతర మొందించవలసి యున్నదని చెప్పుచున్నాము. అట్టియెడ, మన ప్రస్తుత ప్రవృత్తులు, మన జ్ఞానతృష్ణలు, రసపిపాసలు, ఇంద్రియ వ్యాపారములు, బాహ్యచేష్టలు, సకలభూతలముపైననూ ఆధిపత్యము వహించవలెననెడి సంకల్పములు, అన్నియూ నేమికావలెను ?

వాని నన్నింటినీ విసర్జించి, ఆధ్యాత్మిక చేతనాభివ్యక్తి కనుగుణమైన మరియొక జీవనపద్ధతి నవలంబించవలెనా ? లేక, బయటికి మాత్రము వాటిని యథాపూర్వముగనే నడపుచూ, లోపల అంతర్భావమున వాటిని రూపాంతర మొందించుటయో, లేక,- ఆదిలో మానవుడు పాశవికమైన ప్రాణప్రవృత్తులను సంపాళించునప్పుడు తన హేతువాదముచేతనూ, యోచనాయుతమైన సంకల్పము చేతనూ, వాటినెట్లు మానసిక ప్రవృత్తులుగా విస్తృతపరచి పరివర్తనము నొందించెనో, యట్లే చేతనాంతర వ్యాపారముచే వాటిని విస్తరింపజేసి నూతనరూపముల లోనికి మలచుటయో, చేయవలెనా ? అదియునూ గానియెడల, వానిలో గొన్నిటిని త్రోసిపుచ్చి, ఆధ్యాత్మిక పరివర్తనమున కనువగువాటిని మాత్రము నిలుపుకొని, తక్కిన సందర్భములలో, అంతర్భావమునందేకాక బాహ్యరూపమునందుగూడ, ముక్తాత్మ లక్షణములైన శాంతి, ఆనందము, విశాలత, ఐక్యము మున్నగువాటి నభివ్యక్తము చేయగల నూతన జీవనమును నిర్మించుకొనవలెనా? ఇదీ సమస్య. ఈ సమస్యనే, యోగప్రయాణమునందు, మానవత్వమునుండి దివ్యత్వమునకు బోవు మార్గముల నన్వేషించిన సాధకులు దాదాపుగ నెల్లరునూ ఎదుర్కొనుచూ

శారీరికముగా సాధ్యపడినంతవరకు, ఐహిక జీవనమునూ తత్కర్మలనూ పూర్తిగ సన్యసించుట మొదలుకొని, ఐహికజీవనమును ఉన్నదున్నట్లుగా,- బయటికి ఎప్పటిరీతిగనే కనిపించిననూ,- భావమున నూతన దృష్టితో ఆమోదించుట వరకూ, పలువిధములైన పద్ధతులీ సమస్యా పరిష్కారమునకు సూచించ బడి యున్నవి. జగత్తును నిరసించు సన్యాసియూ, అంతర్ముఖుడై మైమెరచు యోగియూ అనుసరించుపద్ధతి 'అతి' లోనికిపోయినదని చెప్పనొప్పును. పూర్ణయోగలక్ష్య మిది కాదు. ఏలయన, ఈ యోగమార్గమున నీ ప్రపంచమునందే దైవమును గాంచ వలసియున్నది. ప్రాపంచిక కర్మలను పూర్తిగ విడనాడుటచే నియ్యది సిద్ధింప నేరదు.

ఇక, అంత 'అతి' లోనికి బోక, కొంత తగ్గుస్థాయిలో మన ప్రాచీనులు సూచించిన పరిష్కారపద్ధతి ఇంకొకటున్నది. సాధనకు సహజముగా అంగభూతములైనట్టియూ, తత్సంబంధము గలట్టియూ కర్మలను మాత్రమే చేయవలెననియూ, వీనికితోడు ఒకవేళ సామాన్య జీవనమునం దపరిహార్యములైన కర్మలను గూడ చేయవలసివచ్చినచో ఆధ్యాత్మిక భావముతో శాస్త్రసంప్రదాయానుసారముగా చేయవలెననియూ ఈ పద్ధతివా రందురు. కాని, యీ నిబంధనము కర్మలయందు స్వేచ్ఛాభావమును సిద్ధింపజేయునది కానేరదు. పైపెచ్చు, కేవలమూ తాత్కాలికమైన పరిష్కారమిది. ఇహజీవనముగాక పరజీవనమే ఇందు చరమైక లక్ష్యముగా నుండును. పరజీవనము ప్రాప్తించువరకూ నెట్లో వెళ్ళద్రోయుటకు మాత్రమే ఇహజీవనము పరిగ్రహించబడును. ఇదికాదు పూర్ణయోగ లక్ష్యము. బంధవిముక్తుడై సత్యసంస్థితిని బొందిన విద్వాంసుడు సైతమూ లోకసంగ్రహము కొరకు,- స్థూలదృష్టికి గోచరించని దైవనియోగానుసారముగా నడచుజగత్పరిణామ క్రమమునకు భంగము వాటిల్లకుండుటకొరకు,- కర్మలను చేయవలెనని చెప్పుచున్న గీతాపద్ధతియెడ పూర్ణయోగసాధకుడు మొగ్గుచూపవలెను.

కాని, అజ్ఞానసంస్థితియం దిప్పుడు ఏ ధోరణిలో, ఏ రూపమున కర్మలను చేయుచున్నామో, అదే ధోరణిలో, అదే రూపమున, ఈ కర్మలను చేయుచున్న నొగల మనము అంతరంగిక ప్రయోజనమును మాత్రమే పొందినవార మగు

దుము. లోపలనున్న వెలుగు వెలుపలనున్న మసక వెలుతురుకు సంబంధించిన పనులను నిర్వర్తించుచున్నట్లగును. పరిపూర్ణమైన యాత్మ తన దివ్యప్రకృతికి విజాతీయమగు అపరిపూర్ణోపాధియందు తనను దా నభివ్యక్త మొనర్చుకొనుచున్నట్లగును. ఇంతకంటె చేయగల్గినది ప్రస్తుతము లేనియెడల,— ఈ విధమైన సంధిదశలో సాధకు డనివార్యముగ పెద్దకాలము ఉండవలసివచ్చుచుండును,— లోని యాత్మవస్తువు శక్తిమంతమై, శారీరిక జీవనమునకుగాని, బాహ్యప్రపంచ జీవనమునకు గాని తన యిచ్ఛవచ్చిన రూపములు విధించ గలుగు పర్యంతమూ ఈ స్థితి తప్పదు. కాని, దీనినొక సంధిదశగా మాత్రమే అంగీకరించవలసియుండును. ఇది మన యాత్మకు చరమలక్ష్యము కానేరదు, మన యాత్రకు పరమగమ్యము కానేరదు.

ఈ కారణముచేతనే, నైతికవిధి పూర్వకమైన పరిష్కారపద్ధతియూ సరియైనది కానేరదు. ఏలయన, నైతిక నియమము ప్రకృతివృత్తులనెడి యడవిగుఱ్ఱముల నోటి కేదియో కొంచెె మడ్డము తగిలించి, అతి కష్టమున నెట్లో వాటిని గొంత యదుపులో బెట్టగలుగునేకాని, ప్రకృతిని బూర్తిగ రూపాంతరమొందించి దివ్యజ్ఞానజనితములగు ప్రేరణల నిర్వర్తించగల సుస్థిరస్వేచ్ఛను దాని కలవరచజాలదు. ప్రకృతి వృత్తుల కొకడల కేవో కొన్ని యవధులు కల్పించి, తదంతర్వర్తులై చరించునట్లుగా వాటిని బలాత్కరించుచూ, సరియైన భద్రతను సమకూర్చ నేరని యొక ఆవరణమును మన చుట్టునూ నిర్మించుటయే, ఎంత విశేషముగ తంటాలుపడినను ఈ నైతిక నియమము మనకు చేయగలిన మహోపకృతి.సాధారణ జీవనమునందుగాని యోగసాధనయందుగాని, ఇట్టి యాత్మ రక్షణోపాయముల యవసరము కొంతకాలముపాటు తప్పనిసరియే కావచ్చును. కాని, యోగమునందివి తరువాత సాధించవలసియున్న ముఖ్య లక్ష్యమునకు పూర్వరంగము వంటివి మాత్రమే యగును.

సమూలమగు రూపాంతర ప్రాప్తితోగూడిన విశాల విశుద్ధాధ్యాత్మిక జీవనమే మన లక్ష్యము. దీనిని మనము సాధించవలెనననిన, నైతిక నియమము కంటె అతీతమైన నియమమును,— ప్రగాఢతరమైన పరిష్కారోపాయమును మనము

నైతికనిష్ఠయూ,-ఇదియే సామాన్యముగా వివిధ మతములు సూచించు పరిష్కారో పాయము. కాని ఇది ఒక విధమైన రాజీపద్ధతి. ఇట్లేదోవిధముగ బాహ్యజీవనము నకూ ఆధ్యాత్మ జీవనమునకూ రాజీచేయుటగాదు మనము కోరునది. అంతస్సత్తతో పాటు బాహ్యజీవనముగూడ ఆధ్యాత్మికముగ మారిపోవలెను. నైతికమునకూ ఆధ్యాత్మికమునకూ గల భేదము గానక మానవబుద్ధి తరచు తబ్బిబ్బగుచుండును. నైతికమే యథార్థమైన ఆధ్యాత్మికమని గూడ వాదించుచుండును. అట్టి వాదము లతో మనకు పనిలేదు. ఏలయన, నైతిక జీవనపద్ధతి ఒక విధమైన మానసిక నిగ్రహము. భ్రమప్రమాదముల కాస్పదమైన పరిచ్ఛిన్న మనస్సెన్నడూ సర్వ స్వతంత్రమైన తేజోమయాత్మ గానేరదు.

అట్లే, ఈ యైహికజీవనమునే ఏకలక్ష్యముగ నెంచి, దాని కిప్పుడున్న ప్రధాన లక్షణములనే ప్రమాణములుగ స్వీకరించి, ఆధ్యాత్మమని భ్రమను మాత్రము కలిగించునట్టియూ, పూర్ణముగ నధ్యాత్మము గానట్టియూ తేజస్సుచే దానిని మెరయింప జూచు పద్ధతియూ మనకంగీకార్యము కానేరదు. అదే విధమువ, అధిప్రాణచేతనకూ ఆధ్యాత్మచేతనకూ అవకతవకగా ముడిపెట్ట జూచుటగూడ తరచుగా జరుగుచుండును. లోని యాత్మానుభూతిని బయటి యింద్రియోపాస నతో,- రసదృష్టి పూర్వకమైన యింద్రియోపాసనతో లంకెపెట్టుచూ, దీనికి అధ్యాత్మానుమతి యున్నట్లు తృప్తిచెందుట సంభవించును. ఇదికూడ స్థిరత్వము లేని,-విజయవంతము కాజాలని రాజీపద్ధతియే. దీనికి సాక్షాద్వ్యతిరిక్తమైన విషయ భోగ పరాఙ్ముఖత్వము పూర్ణసత్యమున కెంత దూరమో, ఇదియూ నంతే దూరము

పైన చెప్పిన ఈ పరిష్కారపద్ధతులేవియూ కుదురైనవి కావు. అధఃస్థితము లైన సాధారణ ప్రాణిక మానసికాశయములకునూ, ఊర్ధ్వమున ఆధ్యాత్మిక శృంగములకునూ సంబంధము గలుపుటకు తడుములాడు మానవబుద్ధికి,-ప్రమాద లక్షణోపేతమైన మానవబుద్ధికి దోచు పరిష్కారములివి. వీనివెనుక ఏ పాక్షిక సత్యము దాగియున్ననూ, అయ్యది ఆధ్యాత్మికస్థాయి కుద్ధరించబడినప్పుడే,-

అజ్ఞాన భూమినుండి పెకలించబడి పరమసత్య చేతనయందు పరిశోధించబడి నప్పుడే,_మనకు స్వీకారయోగ్యమగును.

పర్యవసానమున, మనస్సున కతీతమైన సత్యచేతనోపలబ్ధికలిగి, తద్ద్వార మున వివిధ వస్తురూపములు యథోచితజ్ఞానమును బొందుటయూ, వాని యాత్మ సారము మనకు ప్రత్యక్ష మగుటయూ సంభవించువరకూ, సకల పరిష్కార పద్ధతులునూ తాత్కాలికములైన వేయగును. ఎంత దనుక మనయంతరమునం దా సత్యచేతన యావిష్కరింపదో, ఎంతదనుక మన యూర్ధ్వమున నా సత్యచేతన నధిగమింపకుందుమో, అంతదనుక, మనకు మార్గదర్శకముగా నుండగల యొక ఆధ్యాత్మికానుభవపద్ధతి నూతగా గొనుటయే, ఒక యాంతరిక తేజస్సును విడు దలచేసికొనుటయే, మనకు క్షేమకరమగును. ఏలయన, మనలో బహిర్ముఖమై యుండు తదితరమంతయూ._ఆధ్యాత్మిక జ్ఞానమూ ఆధ్యాత్మిక దర్శనమూ గాని దంతయూ,_ బుద్ధిచేయు కల్పనలూ ప్రాణశక్తిచే గలుగు ప్రేరణలూ భౌతిక వస్తువుల యక్కరలూ అన్నియూ,_ గ్రుడ్డి దీపములే యగును. ఒక్కొక్కప్పుడవి, తాత్కాలికముగ కొంత వెలుగు చూపినట్లే చూపించి, మనకు చిత్తవిభ్రమము కలిగించునట్టియూ ప్రయాణము నరికట్టునట్టియూ మాయదీపము లనవలసి యుండును.

మార్గదర్శకమైన యాధ్యాత్మికానుభవపద్ధతి మనకు అలవడవలెననిన, మానవచేతన అపావృతమై దివ్యచేతనను లోనికి రానిచ్చుట ద్వారముననే అయ్యది సాధ్యము. దివ్యశక్తి యొక్క ప్రబలసాన్నిధ్యమునూ, ఆదేశమునూ, క్రియాకలాపమునూ మనలో నందిపుచ్చుకొనగల తాహతు మనకు గలిగి, ఆ దివ్యశక్తికి మన మధీనులమగుట నేర్చుకొనవలెను. ఇట్టి యధీనత నుండియే పైన చెప్పిన మార్గదర్శనము లభ్యమగును. కృత్రిమానుభూతిలోనికి మనల నవలీలగా లాగుకొనిపోవు మానసిక కల్పనలచేతనూ ప్రాణికోద్వేగముల చేతనూ అహంకా రిక ప్రేరణల చేతనూ మనము ముట్టడించబడియున్నంతవరకూ, ఆ దివ్యశక్తికి మనమధీనులమగుట సునిశ్చితము గానేరదు. మనకా దివ్యశక్తి మార్గదర్శకమై వెలయనేరదు.

ఈ ప్రమాదమునుండి మనము తప్పించుకొనవలెననిన. ప్రస్తుతము పదింట తొమ్మిదిపాళ్ళు మరుగుపడియున్న మన అంతరాత్మను, మనలోనింకనూ సుప్తమై యున్న హృత్పురుషుని,—చైత్యసత్తను (Psychic being) వివృత మొనర్ప వలసి యున్నది. అదియే మనము విడుదల చేయవలసిన లోవెలుగు. అజ్ఞానముచే నావృతులమై మనము నడచుచున్నంత కాలమూ, సత్యచేతనయే మన సాధనకు ఏడుగడ కాకున్నంతకాలమూ, మన అంతరాత్మదగు ఈ లోవెలుగే మనకు తప్పక దారిని చూపుచుండును. అధ్యాత్మము, విజ్ఞానము మన ప్రకృతి యందు సుప్రతిష్ఠితమగుటకు పూర్వము గడపవలసియున్న సంధికాలములో, అంతకంత కధికముగా మన యాచరణమును తీర్చిదిద్దు నంతర్నియమసృష్టికి, ముఖ్యముగా రెండు సందర్భముల కలయిక తోడ్పడుచుండును. ఒకటి,—సంధికాల పరిస్థితులకు లోబడి మనలో దివ్యశక్తి పనిచేయుట, రెండు,—అజ్ఞాన శక్తుల యొత్తిడులనుండి మనలను తప్పించుచూ, ఉన్నత తరశక్తుల ప్రేరేపుడులకు మన కంతకు తెలిసి విధేయుల మంత మగునట్లుగా మనలో మన అంతరాత్మ వెలుగు,— చైత్యసత్త వెలుగు పనిచేయుట.

ఈ సంధికాలములో ననేకదశ లుండవచ్చును. ఒక దశయందు, మనమీ యైహికజీవనమునంతనూ వదలక నడపుచూ, సకలకర్మలనూ, సంశుద్ధినీ మార్పునూ కోరి, వాని యంతస్సత్వము బహిర్గతము కావలెనని కోరి, దైవమునకు సమర్పణము చేయవచ్చును. ఇంకొక దశయందు, ఐహికజీవనమునుండి వెనుకకు మరలి, మనచుట్టునూ నొక ఆధ్యాత్మిక కుడ్యమును నిర్మించుకొని, ఆధ్యాత్మిక పరివర్తనము బొందుట కిచ్చగించు ప్రవృత్తులను మాత్రమే లోనికి రానిచ్చు చుండవచ్చును. మూడవ దశయందు, తిరిగి యైహికజీవనమును పూర్ణముగ, విశృంఖలముగ చేపట్టి, ఆత్మతత్వపు పరమసత్య ప్రకటనమున కనుగుణమైన నూతనరూపములలో ఆ కర్మల నీసారి నిర్వర్తింపవచ్చును. ఈ దశలను నిర్ణయించునవి మానసిక నియమములు కావు. మన అంతరాత్మ వెలుగులో, గుప్తముగనో ప్రకాశముగనో మనలను మొదట ప్రేరేపించుచూ, పిమ్మట క్రమముగా మన సాధనక్రమమును నియమించి తీర్చిదిద్దుచూ, తుదకు మనయోగము

యొక్క బహుళ భారమునంతనూ తానే వహించు దైవీశక్తి విన్యాసమే వీటిని నిర్ణయించుచుండును.

యజ్ఞస్వరూపము త్రివిధమని చెప్పితిమిగాన, కర్మలనుగూడ త్రివిధముగా,- జ్ఞానకర్మలు, ప్రేమ కర్మలు, జీవనకర్మలు అని విభజించి, ప్రతి కర్మవిభాగ మునందునూ ఈ యాధ్యాత్మిక నియమ మెట్లు వర్తించి, అవర ప్రకృతినుండి పరాప్రకృతిలోనికి పరిక్రాంతిని సాధించునో వర్ణించెదముగాక.

* * *

జ్ఞానాన్వేషణపరమైన మానవ బుద్ధివృత్తులను యోగదృష్ట్యా రెండు వర్గము లుగ విభజించవచ్చును. ఒకటి పరావిద్యకు సంబంధించినది. అనంతుని సర్వాతీతు నిగా నుపాసించి తెలిసికొనుటకో, లేక, ప్రకృతి రూపముల వెనుకనున్న పరమ సత్యములను ధ్యానముచే, అంతస్స్ఫురణచే, అపరోక్షానుభూతిచే నధిగమించు టకో, ఇందు ప్రయత్నము జరుగును. రెండవది యపరావిద్యకు సంబంధించినది. వ్యక్తజగత్తుయొక్క బాహ్యరూపములలో గోచరించు ననంతుని మాయవేసముల బాహ్యజ్ఞాన మిచట వికీర్యమాణమగును. రెండునూ రెండర్ధగోళములు. ఒకటి పైది, రెండవది క్రిందది. మనస్సుయొక్క అజ్ఞానావరణములోపల మానవులు వీని నుపాసించుటలో, నీ రెండు విద్యలునూ వేర్వేరుగా నభివృద్ధి గాంచినవి. ఒక వైపున తత్వశాస్త్రమూ, మతధర్మమూ, ఇంకొకవైపున భౌతికదర్శనములూ, కళలూ వీని రూపములే.

తత్వశాస్త్రము (Philosophy) పరమసత్య నిర్ణయమే తన లక్ష్యముగా వృద్ధిపొందినది. ఒకొక్కప్పుడిది అధ్యాత్మమును,- లేక యంతస్స్ఫురణమును,- ప్రమాణముగా గైకొనును. ఒకొక్కప్పుడు కేవలము బుద్ధిబలము నూతగా గొనును. ఒకొక్కప్పుడు, ఆధ్యాత్మికానుభవములను బుద్ధిపాటవముచే వివరిం చును. ఆత్మానుభవములను తర్కముచే బలపరచును. బాహ్య జగత్సంబంధమును విడనాడి కేవలమూ ఆంతరజగత్తులోనే విహరించు లక్షణముగలదికానట్టి సందర్భ ములో కూడ, బుద్ధిప్రధానమైన తత్వశాస్త్రము ఇహజీవనమును సాధారణముగా

శక్తిపూరితము చేయజాలకపోయెను. ఇతర ప్రయోజనముల నాసింపక, మానసిక సత్యమునే తదేక ప్రయోజనముగ నన్వేషించు భావనాసమున్నతి కొకొక్కప్పు డడి శక్తిని పూరించుచూ వచ్చినది. ఒకొక్కప్పుడు, పదజాలపు మసక వెలుగు మబ్బులమధ్య మానసిక వ్యాయామ మొనరించుటకు శక్తి నిచ్చుచూ వచ్చినది. ఏమైననూ అయ్యది, వాస్తవిక జగత్తును వదలి దూరమున నెక్కడనో సాము చేసినదనియే చెప్పవలెను.

యూరపు ఖండపు ప్రాచీన తత్వశాస్త్రము కొంత శక్తిసమన్వితమే కాని, కడు కొలదిమందికి మాత్రమే అయ్యది యుపకరించినది. ఆధ్యాత్మికతా విశిష్టమైన సందర్భమున భారతీయ తత్వశాస్త్రము జాతిజీవనముపై తన ప్రభావమును స్వల్పముగ ప్రసరింపజేయగలినదేకాని పూర్తిగ రూపాంతరము నొందింపలేక పోయినది. మతధర్మము (Reli gion) తత్వశాస్త్రమువలె నొంటరిగా నున్నత శిఖరములపై విహరించుటకు యత్నించియుండలేదు. మానవుని మానసిక కక్ష్యల కంటె వ్యావహారిక జీవన కక్ష్యలను గైవసమొనర్చుకొని దైవముదెస కాకర్షించుట దాని లక్ష్యము ఆధ్యాత్మిక సత్యమునకునూ, ప్రాణిక భౌతిక జీవనము నకునూ మధ్య సేతువును నిర్మించుటకది సమకట్టినది. అవరజీవనమును పరజీవనమునకు విధేయ మొనర్ప నభిలషించినది. ఇహమును పరమునకు వశంవద మొనరింపగోరినది. కాని, యీ ప్రయత్నము తరచుగా విపరీతమై పరిణమించి, ఇహవాంఛలు తీర్చుకొనుటకు పరము నుపయోగించుకొనుట జరుగుచూ వచ్చిన దని యొప్పుకొనక తప్పదు.

మతధర్మ విషయికమైన భావము అహంకార సేవనమున కొక సాకుగా వినియోగపడుచూ వచ్చినది. తన ఆధ్యాత్మికానుభవ కేంద్రమునుండి తరచుగా చలించుచూ, మతధర్మము ఐహికజీవనవాంఛాపరమైన మార్గములో పడిపోవుచూ వచ్చినది. మానవబుద్ధిని సమాధానపరచు ప్రయత్నములో, సిద్ధాంత రాద్ధాంతము లచే దానిని బంధించి యుక్కిరి బిక్కిరి యొనర్చినది. మానవహృదయమును ఆకర్షించు ప్రయత్నములో, ఆవేశపు గోతులయందు తూలి బోర్లపడినది. మానవ జీవనమును గైవస మొనర్చుకొను ప్రయత్నములో, వక్రించి, మతోన్మాదము, సంహారోద్వేగము, హింసాప్రవణత్వము, అజ్ఞానపరత్వము, మున్నగు గుణము

లకు లోబడిపోవుచూ వచ్చినది. మానవునిలోని భౌతికమును దైవముదెస కాకరించు ప్రయత్నములో, శుష్కమైన, యంత్రప్రాయమైన, నిర్జీవమైన కర్మకాండయందు కూరుకొనిపోవుచూ వచ్చినది.

ఉత్తమమిట్లు సంకరమై, దానినుండి అధమము పుట్టుకొని వచ్చినది. జీవనశక్తి యందలి ఒకానొక విచిత్ర రసాయన సంయోగ ప్రక్రియాఫలితమిది. ఇందు 'చెడు' నుండి 'మంచి' పుట్టుట కెట్లు వీలున్నదో, అట్లే 'మంచి' నుండి 'చెడు' పుట్టుటకునూ వీలున్నది. ఈ యధోగతినుండి రక్షించుకొనుటకు చేసిన వృథా ప్రయత్న ఫలితముగనే, మతధర్మము సత్తను రెండుగా చీల్చినది. వ్యావహారికమూ పారమార్థికము, ఐహికమూ ఆముష్మికము, మలినమూ శుద్ధము, అను ప్రతిద్వంద్వములుగా జ్ఞానమునూ, కర్మలనూ, కళనూ, జీవనమునూ విభజించినది. కాని, యీ రక్షణప్రక్రియ కృతకమై, ఆచారశృంఖలాబద్ధమై, వ్యాధిని మరింత ఎక్కువచేసినదే కాని బాగుచెయ్యలేదు.

ఇక, అపరావిద్యకు సంబంధించిన భౌతికదర్శనము, కళ, జీవనవిజ్ఞానము,— ఇవి ప్రారంభమున మతధర్మపు నీడలో మెలగి మతధర్మమును సేవించిననూ, తుదకు దానినుండి విడివడి, దానియెడ వైముఖ్యము వహించినవి. అంతేకాదు,— తత్త్వశాస్త్రిమూ మతధర్మమూ మిథ్యాభూతమైన కాల్పనిక జగత్తును లక్షించుచున్నవను తలపున వానియెడ నవి ఔదాసీన్యము, సంశయము, నిరసనము పూనుట సంభవించినది. పరాపర విద్య లొండొంటితో నిట్లు పూర్తిగ తెగతెంపులు చేసికొన్నట్లు కొంతకాలము తోచవచ్చును. వానికంటె ఉత్తమమైన ఆత్మజ్ఞానము కొరకై ప్రయత్నమనునది యిక పూర్తిగ సమసినట్లే యనిపించవచ్చును.

కాని, ఇహవిషయిక జీవనమునకుగూడ ఉత్తమజ్ఞాన మావశ్యకమే యగుచుండును. అది లేనియెడల, మన భౌతిక విషయములూ మన యన్వేషణలూ ఎంత ఫలవంతములూ సంపన్నములూ, స్వతంత్రములైననూ, వాటి పరిణామ కౌశల్య మెంత అత్యద్భుతమైయున్ననూ, అవన్నియూ అవిధిపూర్వకముగా క్షుద్రదేవతలకు సమర్పించినవే యగును. మానవ హృదయమును కర్కశముగావించి, మనోవీధులను ముకుళితము లొనర్చి, శిలావికారమైన ఐహిక కారాగారములో అవి మనలను బంధించినైనను బంధించును; లేదా, అనిశ్చితమై దిక్కు

తోచని యొకానొక చోటునకు జేర్చి కనువిప్పయిననూ కలిగించును. కనులు మిరుమిట్లుగొలిపే ఈ కించిజ్ఞత అజ్ఞానమునకు రూపాంతరమే. పంథ్యాప్రాయమైన అజ్ఞేయవాదము మనకొరకు కచట వేచియుండును.

సర్వమునూ తనలో నిముడ్చుకొనెడి పరమోపలబ్ధికై పాటుపడు యోగము కర్మలను నిరసింపదు. విశ్వాత్మ కనెడి కలలనేనియూ,- నిజమున కవి కలలు కావు- త్రోసిపుచ్చదు. మానవునియందా విశ్వాత్మ ఏ అద్భుత పరిశ్రమమునకు బూనుకొనినదో, ఏ అనంత విజయమును సాధింప సమకట్టినదో, దానియెడల వైముఖ్యము వహింపదు. కాని, ఈ విశాలత చేకూరుటకు మొట్టమొదటగా గావలసినది,- మన యైహిక కర్మలన్నియూ కేవలము పరాత్పరునికి, ఆతని దివ్య శక్తికి, సరియైన భావముతో, సరియైన జ్ఞానముతో, ఈ భౌతిక ప్రకృతియందవశముగ బద్ధుడైయున్న జీవునిచేగాక స్వతంత్రుడైన జీవునిచే సమర్పితమగు యజ్ఞములో భాగములై పోవలెను

కర్మల నొకవేళ విభాగించవలసియుండునేని, హోమాగ్నికి అత్యంత సన్నిహితముగనుండు కర్మలూ, దూరముగనుండు కర్మలూ అని విభజింపవచ్చును. చురచుర మండే ఎండుసమిధలవంటివీ, మంటను నిరోధించు పచ్చి మొద్దులవంటివీ, అని విభజింపవచ్చును. ఇట్టి విభాగమును వినాయించినచో, సత్యాన్వేషణపరములూ సత్యాభివ్యక్తి నిరతములూ నగు సకల జ్ఞానకర్మలునూ పూర్ణాహుతి కుపయుక్తమగు ద్రవ్యములే యగును. దివ్యజీవనపు విశాల చక్రము నుండి యే కర్మనూ వేరుచేయుటకు వీలులేదు.

వివిధవస్తువుల ధర్మములనూ, రూపములనూ, విధానములనూ పరిశీలించు మానసిక, భౌతికశాస్త్రజాలముగాని, ప్రాణికోటుల జీవనమునకు సంబంధించిన సాంఘిక, రాజనైతిక, భాషావిషయిక, చరిత్రాత్మక శాస్త్రజాలముగాని, తన పరిసరములను వశంవద మొనర్చుకొనగోరు మానవుని ప్రవృత్తి నియమములకు సంబంధించిన ఇతర గ్రంథజాలముగాని, ఏకకాలముననే కర్మగనూ జ్ఞానముగనూ గూడ భాసించు మహోదార లలితకళలుగాని,- సకల అన్వేషణలూ, సకల ఉపలబ్ధులూ, సకల అభివ్యక్తులూ- అన్నియూ ఆ యనంతుని లీలా విశేషముల

ననుభూతమొనర్చుకొను చేయగును; ఈశ్వర సాక్షాత్కారమునకు, దివ్యరూప సంసిద్ధికి సాధనభూతములే యగును.

చక్కగా, అర్థవంతముగా రచించబడిన ప్రతికావ్యమూ, ప్రతి చిత్రమూ, ప్రతి విగ్రహమూ, ప్రతి సౌధమూ ఒక నిర్మాణాత్మకమైన జ్ఞానచేష్ట. చైతన్యావిష్కారము, సత్యప్రతీక, ప్రాణిక మానసికాభివ్యక్తియొక్క ప్రగతిరూపము. కావుననే, కళలయందు కర్మజ్ఞానములు ఏకాకృతి దాల్చుకున్న వనుట యొప్పిద మగుచున్నది. కాని, ఈ సాధన అజ్ఞానమూలకమైన మానసిక జీవనములో చేరినది కాగూడదు. భావము వలననూ, సంస్మృతివలననూ, నివేదనము వలననూ మానసిక జీవనము ఆధ్యాత్మిక చైతన్య ప్రవృత్తిగా మారి, సువిశాల జ్ఞాన తేజస్సులో నంతర్భూతము గావలసియున్నది. అటువంటి మానసిక జీవనముమాత్రమే యోగికి పరిగ్రాహ్యము.

ఏలయన, సకలమూ యజ్ఞప్రాయమైపోవలెను. కేవలుడైన పరమేశ్వరుడే సకలకర్మలకునూ పరమలక్ష్యమూ పరమార్థమూ కావలెను. మానవులయందునూ సకలజీవరాసులయందునూ సమస్త వస్తుజాతమునందునూ పరమేశ్వరుని చిచ్ఛక్తి విలాసమును, దాని నిర్మాణ వైశిష్ట్యమును, దాని రహస్యప్రకారములను, దాని అభివ్యక్తి చిహ్నములను కనుగొని యవగత మొనర్చుకొనుటయే జ్ఞానప్రధానములైన వివిధ శాస్త్రముల వ్యాసంగమునందు యోగికి పరమలక్ష్యమై యుండవలెను. భౌతికములు కానిండు - ఆధ్యాత్మికములు కానిండు, కర్మప్రధానములైన వివిధ శాస్త్రముల వ్యాసంగమునందు యోగి లక్ష్యము, ఈశ్వరుని కార్యవిధానములందు ప్రవేశించి, తన కనుగ్రహించబడిన సాధనసంపత్తిని తెలిసికొని, ఆత్మయొక్క ప్రభుతనూ ఆనందమునూ సంసిద్ధినీ ఆ తెలివిద్వారా ఐచ్ఛికముగనూ నిర్దుష్టముగనూ అభివ్యక్త మొనర్చుకొనుటయై యుండవలెను.

ఇక వివిధకళలయొక్క వ్యాసంగమునందు కేవలసౌందర్య గ్రహణమే, ప్రాణిక మానసిక తృప్తియే యోగి లక్ష్యము కాజనదు. సర్వత్ర పరతత్త్వమును దర్శించుటయూ, దాని కార్యకలాపముల పరమార్థము నెరిగి భజించుటయూ, దేవ మానవ పశు పక్షి క్రిమి కీటకాది సకల భూతములలోనూ ఆ పరతత్త్వమునే అభివ్యక్త మొనరించుటయూ ఆతని లక్ష్యము కావలెను. మతధర్మాభిలాషకునూ

మహత్తరమైన కళకునూ ఆత్యంతిక సంబంధమున్నదను వాదము వస్తుతః సరియైనదే. కాని, సంశయాస్పదమగు మతధర్మాభినివేశమునకు మారుగా మనము, ఆధ్యాత్మికాభిలాషనూ, దర్శనమునూ, తత్వరహస్యప్రకాశకమైన అనుభూతినీ పెంపొందించుకొనుట నేర్చుకొనవలెను.

దర్శనము విశాల మగుచున్నకొలది, మానవునిలోనూ సకలవస్తువులలోనూ గర్భితమైయున్న పరతత్వరహస్య మెరుకపడుచుండును. లోతులు దరియనేరని పటి మతధర్మావేశము తలస్పర్శి కాగల ఆధ్యాత్మిక జీవనముగా మారును. అట్టి మహోన్నత స్థాయినుండి యుద్భూతమగు కళ మరింత గంభీరమూ, తేజోవంతమూ, శక్తిమంతమూ గాగలుగును. ఉన్నతతరమూ విశాలతరమూనైన ఆధ్యాత్మిక చేతనయందు యోగి నివసించుచుండును. కావున, ఆతని జ్ఞానక్రియా కలాపమంతయూ, ఆతని సృష్టికార్యమంతయూ, అచటనుండియే యుత్పన్నము గావలసియున్నది,- మనస్సులోనుండి యుత్పన్నము కాగూడదు. ఏలయన, ఆత డభివ్యక్తము చేయవలసియున్నది,- లేక, ఆతనిద్వారా తనను దాభివ్యక్త మొనరించుకొనుచూ నతని క్రియా కలాపములను అతని వ్యక్తిగత ప్రయోజనముకొరకుగాక ఒకానొక దైవకార్యముకొరకై తీర్చిదిద్దుటకు ఉరవడించుచున్నది,- మనోమయ పురుషుని దర్శనముకంటె మహత్తరమైన దర్శనము.

అంతియేకాక, పరతత్వజ్ఞానముగల యోగి ఒక నిర్బంధమునకు లోబడి గాని ఒక యక్కర తీర్చుకొనుటకుగాని యీ కార్యకలాపమునందు ప్రవేశించడు. ఒక విధ్యుక్తధర్మముగా నెంచిగాని, మనస్సున కత్యావశ్యకమైన ఒక వ్యాసంగముగా భావించిగాని, ఏదేనొక పెద్ద వినోదముకొరకుగాని, అత్యున్నతమైన మానవ ప్రయోజన మేదియో సాధింప గోరికాని యీ పనుల కతడు పూనుకొనుట లేదు. తన కీర్తిప్రతిష్ఠలకోసమూ వ్యక్తిగతమైన సంతృప్తికోసమూ కాదు, అతడీ కార్యముల నెరవేర్చుట. తనలోని యీశ్వరేచ్ఛనుబట్టి యతడు వీటిని వదలనూ వచ్చును, చేయనూవచ్చును. వదలుటయే ఈశ్వరేచ్ఛ కానంతవరకూ, తన పూర్ణజ్ఞానసాధనయం దతడు వీటిని వదలవలసిన పనిలేదు. సృష్టికార్యమునందు పరాశక్తి యేవిధముగా ప్రవర్తించుచున్నదో అట్లే, సృష్టియందలి,- అభివ్యక్తియందలి,- ఒకానొక ఆధ్యాత్మికానందముకొరకు,- జగత్తులో ఈశ్వర కార్యములను సక్రమముగా ప్రవర్తింపజేయుటకొరకు,- అతడీ కార్యములందు ప్రవృత్తుడగును.

జ్ఞానియైనవాడు తన యాచరణపద్ధతిచే, అజ్ఞానులకు కర్మాసక్తిని,— కేవలము మతధర్మ చోదితములుగా నెంచబడు కర్మలయందేకాక సకలకర్మలయందునూ ఆసక్తిని,— కలిగించవలెనని గీత బోధించుచున్నది. అతడు తన యాచరణముచే వారిని వారి యైహికకర్మ ప్రవృత్తినుండి చలింపజేయరాదు. ఏలయన, జగత్తు తన యూర్ధ్వ గమనమును గొనసాగించవలసియున్నది. మానవులుగాని మానవజాతులుగాని అజ్ఞానముతోనైననూ కర్మప్రవృత్తియం దుండవలెనేగాని. మరింత అజ్ఞానరూపమైన అకర్మలో,— విచ్ఛిత్తికీ వినాశమునకూ దారితీయు దుస్థితిలో,— బడిపోరాదు. భ్రమ ప్రమాదములకూ, తంద్రాలస్యములకూ ఆస్పదమైన తమోగుణము జనుల నావరించినప్పు డిట్టిపరిస్థితి దాపురించుచుండును.

'ముల్లోకములలోనూ నేను పొందనిదిగాని పొందవలసినదిగాని ఏదియూ లేకపోయిన కారణముచే, కర్మలు చేయవలసిన అగత్యము నాకు లేకపోయిననూ, కర్మలు నేను చేయుచునేయున్నాను. కర్మలు నేను చేయని యెడల, సకల ధర్మములూ నష్టమగును, లోకము లుత్పన్నమైపోవును. ప్రజలను నేను నాశనము చేసినవాడనగుదును' అనినాడు గీతలో భగవానుడు. ఆధ్యాత్మిక జీవనమునందు, విశుద్ధికోసమై, ఆ యనిర్వాచ్యునియందు దక్క ఇతరమునందు అభినివేశమును చంపుకోనక్కరలేదు, శాస్త్రములు, కళలు, ఐహికజీవనము— వీని పాదులను కుళ్ళగించివేయ నవసరములేదు. పూర్ణమైన ఆధ్యాత్మిక జ్ఞానమునకునూ, ఆధ్యాత్మిక కర్మప్రవృత్తికినీ పర్యవసానముగ, ఇవన్నియూ తమ సంకుచితత్వమునుండి యుద్ధరించబడును. వీనియందు ఇన్నాళ్ళునూ మనస్సునకున్న సంకుచితమైన— అజ్ఞానభూయిష్ఠమైన— అల్పసంతోషము, విశృంఖలమైన— ప్రగాఢమైన— ఉత్తారకమైన మహదానందముగా మారును. సృజనాత్మకమైన ఆధ్యాత్మిక శక్తికీ తేజస్సుకూ నిలయమైన నూతనాధారము దొరికి, తద్ద్వారమున నీ సకలమునూ నిజతేజస్సంసిద్ధిని మరింత త్వరితముగా, ప్రగాఢముగా సంపాదించుకొనగల్గును. సుప్తములైయున్న స్వకీయ భవితవ్యములనూ ప్రబల శక్తులనూ ఇతోధిక వేగముతో సాధించుకొనగల్గును. ఆవశ్యకమైనదానిని నిరంతరదీక్షతో ముందు సాధించునెడల, తక్కినదంతయూ తత్ఫలితముగ దానంతటదియే చేకూరు

చుండును. ఈ సంసిద్ధి మనకు, లేనిది క్రొత్తగా కలుగుటలేదు. ఉన్నదానినే క్రొత్తగా కనుగొని, స్వీయశక్తి ప్రకటనతో, స్వీయితేజస్సున ప్రతిదానినీ క్రొత్తగా తిరిగి రూపొందించుటగా దీనిని భావించవలసియుండును.

*　　　*　　　*

ఇదియే, దివ్యజ్ఞానమునకున్నూ మానవజ్ఞానమునకున్నూ గల యథార్థసంబంధము పారమార్థికమూ వ్యావహారికమూ అనెడి పరస్పర విభిన్నమైన తరగతుల క్రింద రెంటినీ వేరుచేయుట కాదిచట ముఖ్యవిషయము. ఎట్టి లక్షణము కలిగిన చేతనతో నీజ్ఞానవృత్తి బయలుదేరుచున్నదనునదియే ఇచట ప్రధానాంశము. ఏదేనొక బాహ్యప్రయోజన మాసించియో ఆసింపకయో బుద్ధివృత్తికిగల కుతూహలమును తీర్చుకొనుటకో, కామ సంబంధమైన ప్రాణిక మానసిక సంతృప్తి కొరకో, భూతజాలపు బాహ్య విషయములయం దభినివేశముగల సామాన్య మానసిక చేతననుండి యుద్భూత మగునదంతయూ మానవ జ్ఞానము. కాని, యీజ్ఞానవృత్తియే, తాను సమీక్షించు ప్రతిదానియందునూ, కాలాతీతమైన పరతత్వ సాన్నిధ్యమునూ, కాలగతిలో ఆ పరతత్వాభివ్యక్తి విధానమున్నూ అన్వేషించి తెలిసికొను ఆధ్యాత్మిక చేతననుండి బహిర్గత మగునప్పు డది పూర్ణయోగసాధనలో చేరినదే యగును.

అజ్ఞానమునుండి బయల్పడుటకు ఒక విధమైన యేకాగ్రత అత్యావశ్యకము గాన, సాధకుడు తన సకలశక్తులనూ కూడగట్టుకొని, అందుకు దోహదములుగాగల వానిపైననే వాటిని కేంద్రీకరింపజేయుచూ, ఆ యేకలక్ష్యమునకు సరాసరిగా అభిముఖమై యుండని ఇతరమునెల్లనూ తాత్కాలికముగ పరిహరించుటయో, లేక అప్రధానముగ పరిగణించుటయో చేయవలెను. ఏ మానవజ్ఞానాన్వేషణకు బాహ్య మనస్సు అలవాటు పడియున్నదో అది యీ అలవాటు వలన నతనిని లోపల నుండి వెలుపలికి, పై యంతస్తులనుండి క్రిందికి, లాగుచున్నట్లు తోచవచ్చును. అట్టియెడ, ఉన్నతతరమైన చేతనయం దాతనికి నిలుకడ కుదిరి, దాని శక్తులను తాను మానసిక క్షేత్రము లన్నింటిమీదనూ ప్రసరింపజేయగలుగువరకూ, ఈ ప్రవృత్తుల నతడు కట్టిపెట్టుటయే తప్పనిసరి కావచ్చును. ఆ నిలుకడ కుదిరి నంతనే, ఆ మహోన్నతచేతన కీ ప్రవృత్తులు వశంవదములై, దివ్యమైన ఆధ్యా

త్మిక పదము నందుకొనగల్గును. అటులా దివ్యచేతనలోనికి రూపాంతర మొందింప నలవి కానట్టియూ, రూపాంతరముపొంద నిరాకరించునట్టియూ సకలమునూ నిస్సంకోచముగ నతడు పరిహరించును. కాని, దాని శుష్కత్వమునుగాని నవజీవనా నర్హతనుగాని ముందే ఆలోచించి నిర్ణయించుకొని పరిహరించుటమాత్రము చేయడు.

ఈ విషయములను నిర్ణయించుటకు స్థిరమైన మానసిక నియమము లేవియూ లేవు. కావున నతడు, ఏ నియమమునకునూ పరమప్రాధాన్య మివ్వక, తనకు తోచిన విధమున, తన యనుభవమునుబట్టి, ఆయా మానసిక వృత్తులను పరిగ్రహించుటో, పరిత్యజించుటో చేయుచుండును. దివ్యచేతనయొక్క తేజశ్శక్తులాతనిలో ప్రబుద్ధమై, అవర ప్రకృతియందలి సకలమునూ అవి తమ ప్రమాద రహితదృష్టితో పరిశోధించి, దివ్యపరిశ్రమముకొరకు మానవవికాస మాయత్త పరచినదానిలో దేనిని గ్రహించవలెనో దేనిని త్యజించవలెనో తామే నిర్ణయించు వరకూ, అతడిట్లు చేయకతప్పదు.

ఈ పురోభివృద్ధి,— ఈ పరివర్తనము,— ఎంత కచ్చితముగ,— ఎట్టి దశా విశేషములచే కలుగు ననునది, ఆయా జీవుల ప్రకృతివిశేషము పైననూ అవసరము మీదనూ ఆధారపడి యుండును. ఆధ్యాత్మిక రాజ్యమున మూలశక్తి ఎప్పుడునూ ఒక్కటియేయైననూ, అనంతమైన వైవిధ్యము విరాజిల్లుచుండును. ఏది యెట్లున్ననూ పూర్ణయోగమున మాత్రము ఏ మానసిక నియమమునూ కచ్చితముగ వర్తిల్లి తీరవలెననుట పొసగదు. ఏలయన, ఏ రెండు ప్రకృతులునూ, ఒకేదిక్కుగ నడచుచున్నప్పటికినీ, ఒకే తీరున, ఒకేమాదిరిగ అడుగులు వేసికొనుచూ, ఒకేరకమైన మజిలీలతో పురోగమించవు. పురోగతి యందలి వివిధదశాపరంపర ఈ క్రిందివిధముగా నుండునని మాత్రము చెప్పవచ్చును.

ప్రప్రథమమున, జీవప్రకృతి యందలి స్వాభావికమైన మానసిక ప్రవృత్తులన్నియూ, నొక ఉన్నత దృక్పథము నందుకొని, మన యంతరాత్మచే,— ఈ యజ్ఞకలాపమునకు ఋత్విక్కయిన మన హృత్పురుషునిచే,— పరతత్వ సేవకు నివేదితములు కాగల స్థితిలోనికి వచ్చును. పిమ్మట, మన సత్త ఊర్ధ్వమునకారోహించి, అచటి నూత్నచేతనకు సహజమైన తేజశ్శక్తులను క్రిందికి, జ్ఞాన

కర్మక్షేత్రమునకు గొనివచ్చుటకు ప్రయత్నము సల్పును. ఈ సందర్భమున, చేతనయొక్క అంతఃకేంద్రమును పరివర్తనము నొందించుటయందే మనము విశేషముగ నేకాగ్రత వహించి, బహిర్ముఖమైన మానసిక జీవనములోని విశేష భాగమును త్యజించుటయో, లేక అప్రధానముగ పరిగణించుటయో, సంభవింప వచ్చును. వివిధ దశలయందా మానసిక జీవనమును,— అంతయూ గాకపోయిన కొంతయైననూ,— మరలమరల చేపట్టుచూ, నూతనమైన ఆధ్యాత్మికాంతశ్చేతనచే దానినెంతవరకు తీర్చిదిద్దుటకు వీలున్నదియూ కనుగొనుచుండవచ్చును.

కాని, ఒక విషయము మాత్రము గమనింప వలసియున్నది. మానవునియందలి ఏ ప్రకృతి భేదముల ప్రాబల్యము, ప్రారంభమున నా యా ప్రవృత్తి భేదములకు గారణభూతమగుచూ అనివార్యమై కన్పట్టుచున్నదో, అది క్రమక్రమముగా సన్న గిలి, తుదకు దాని సంసర్గమే లేకుండబోవును. అవరప్రకృతియొక్క నిర్బంధ మెచ్చటనూ కనిపించనే కనిపించదు. పరతత్త్వమే సకలసత్తకునూ గావలసిన వస్తువగును. కర్మప్రవృత్తికి నిర్బంధ మనునదియే యున్నచో, దానికి మూలము కామముగాదు; ప్రకృతిశక్తియూగాదు. మహత్తరమూ తేజోమయమూనగు చిచ్ఛక్తి యొక్క చోదనమే దానికి మూలమగును. సకల సత్తకునూ ఆ చిచ్ఛక్తియే ఏడ గడ యగును.

ఇట్లుగాక, సాధకు డాధ్యాత్మికాభివృద్ధిని గాంచునప్పు డేదశలోనైననూ, కర్మప్రవృత్తి సంకుచిత మగుటకు బదులు మరింత విస్తరిల్లుటయూ సంభవింప వచ్చును. యోగశక్తియొక్క దివ్యస్పర్శచే మానసిక సృష్టికి సంబంధించిన నూతన శక్తులు కొన్ని కలుగవచ్చును. నూతనమైన జ్ఞానక్షేత్రములలోనికి ప్రవేశము లభింపవచ్చును. పూర్వములేని సౌందర్యబోధ, కళాకౌశలము, వాగ్వైభవము, తత్త్వవిచారసంపద కలుగవచ్చును. కంటికిగాని, చెవికిగాని, చేతికిగాని, మనస్సుకు గాని ఇదివరకులేని యొక క్రొత్తశక్తి యిప్పుడు పుట్టుకొనిరావచ్చును. మనలో నున్న పరతత్త్వమే మన యంతరమున దాగియున్న ఈ సంపదనంతనూ ఇట్లు బయటికి విరజిమ్మవచ్చును. లేక, ఊర్ధ్వమునుండి ఒక దివ్యశక్తి తన వ్యాపార మున కుపకరణ మగునట్లుగా మన యుపాధిని యోగ్యమొనర్చుటకై మనపై తన శక్తులను వర్షించవచ్చును. అంతర్వర్తియగు యోగేశ్వరుడు సాధకుని యభివృద్ధికి

ఎట్టి విధానము నైననూ నిర్ణయించవచ్చునాక,- మన మానసిక వృత్తుల నన్నిటినీ, మన జ్ఞానకర్మల నన్నిటినీ, పైనుండి ప్రేరేపించి తీర్చిదిద్దుచున్నది ఆతడే యను జ్ఞానము మనలో వృద్ధిపొందుటయే సాధనక్రమములోని యీ దశకు పర్యవసానము.

సాధకుని జ్ఞానాంతఃకరణయూ జ్ఞానకర్మ ప్రవృత్తియూ అజ్ఞానస్థాయిని దాటి, ఆత్మ జ్యోతియందు ప్రవర్తిల్లు విముక్తచైతన్య స్థాయిని అందు కొనినదియూ లేనిదియూ రెండు గుర్తులనుబట్టి తెలియనగును. మొట్ట మొదట, చేతనయొక్క- కేంద్రములో మార్పు కానవచ్చును. జగదీశ్వరుల సాక్షిద్దర్శనము,- అపరోక్షానుభూతి,- అనగా పరాత్పరుని సర్వాతీత సర్వగత స్వరూపముల దర్శనానుభూతులు వృద్ధిపొందనారంభించును. మనస్సు దీనియం దంతకంత కధికముగా లగ్నమగుచూ, సకలమునకునూ మూలమైన దివ్యజ్ఞానము నభివ్యక్తముచేయు తేజోమయ సాధనమగుటకు తగిన ఉన్నతినీ విశాలతనూ గాంచ మొదలిడును. అంతియేకాక, కేంద్రచేతనకూడ జ్ఞానసంబంధమైన బాహ్య మనఃప్రవృత్తులను క్రమముగా స్వైవస మొనర్చుకొని, వాటిని తనలో భాగముగా మార్చుకొనుచూ తన రాజ్యమును విస్తరింప జేసికొనుచుండును. తన సత్యప్రవృత్తిని వాటికిగూడ నలవరచి, అంతరమున తన ఆధ్యాత్మిక సామ్రాజ్యముతో పాటు బాహ్యమున నీ నూతన రాజ్యపాలనకొరకై ఆధ్యాత్మికమూ తేజోవంతమూ నైన మనస్సును తన కుపకరణముగా జేసికొనును. ఇది రెండవ గుర్తు. ఒక విధమైన పూర్ణత్వము సిద్ధించినదని దీనివలన తెలియును.

సాధకునిలో దైవమే జ్ఞాతయై, ఆతని అంతఃప్రవృత్తులన్నియూ,- అచ్ఛమైన మానవ బుద్ధివృత్తిసహితముగా,- ఆ దివ్యజ్ఞానక్షేత్రములే యగును. తన యిష్టము, తన యభిప్రాయము అనునవి సాధకునిలో క్రమక్రమముగా వెనుకబట్టును. బుద్ధిచే పరిశ్రమించుటయూ మనస్సుతో అల్లిక లల్లుటయూ తగ్గిపోవును. అంతరమున సూక్ష్మ చైతన్యజ్యోతియే, చూడవలసినదంతయూ చూచి, తెలియవలసినదంతయూ తెలిసి, పెంపొందించి ప్రపంచించుటయేకాక, విశ్వజనీనతనూ విముక్తినీ సాధించిన సాధకుని మనస్సునందు సర్వంకష జ్ఞానక్రియా కలాపమును నిర్వర్తించును.

ఈ రెండు మార్పులకునూ పర్యవసానముగా, మానసిక ప్రకృతి వ్యాపారములు ఉన్నతస్థాయిని బొంది, విశాలతనూ, ఆధ్యాత్మికతనూ, విశ్వజనీనతనూ, విముక్తినీ సాధించి, ఐహికప్రపంచమున తనను దా నభివ్యక్త మొనరించుకొను చున్న దైవము చేతిలో తాము కేవలము ఉపకరణములని తెలిసికొనగల్గు స్థితికి వచ్చును. కాని, ఇంతమాత్రముతో, రూపాంతరప్రాప్తి సమాప్తముకాదు. పూర్ణ యోగసాధకుడు తన యారోహణము నింతటితో నిలిపివేయజాలడు. తన ప్రకృతి బొందవలసిన విశాలతకు హద్దు ఇదియే యని యూరకుండజాలడు. అట్లూరకున్న యెడల, అతని జ్ఞానమింకనూ మనోవ్యాపారమునకు సంబంధించినదే యగును.

ఆ మనస్సు విముక్తినీ, విశ్వజనీనతనూ, ఆధ్యాత్మికతనూ సాధించి యుండవచ్చు. కాని, ఎంతచేసిననూ మనస్సుయొక్క మూలశక్తి అసమగ్రమై, సంకుచితమై, సాపేక్షికమై యుండకతప్పదు. పరమసత్యపు మహనీయ సృష్టి కార్యముల నయ్యది ప్రకాశవంతముగ ప్రతిబింబించగలుగునేకాని, ఆ పరమ సత్య మెచట యథార్థమై, ప్రత్యక్షమై, ప్రాభవోపేతమై, సహజమై విరాజిల్లు చుండునో ఆ భూమికయందు విహరింపజాలదు. ఈ యున్నతస్థానమును దాటి యింకనూ పైకి బోవలసియున్నది. ఆధ్యాత్మికతను సాధించిన మనస్సు తన్నుదా నతిక్రమంచి అతిమానస జ్ఞానశక్తిగా రూపొందవలసియున్నది. ఆధ్యాత్మికతను సాధించు సందర్భములో నది, మానవబుద్ధికిగల దారిద్ర్యస్థితిని,— కలిమివలె భ్రమింపజేయు లేమిని,— అతిక్రమించి, క్రమముగా విశుద్ధమూ, విశాలమూనైన ఉన్నతతర మానసవీధులలోనికినీ, పిమ్మట అంతకంటెనూ మహత్తరమైన,— ఊర్ధ్వమునుండి ప్రసరించు దివ్యతేజముచే ప్రకాశితమైన,— బుద్ధిప్రాకారములలోనికినీ ప్రవేశించును.

ఈ స్థితిలో, స్వయంప్రకాశమానమైన యొక మహనీయాంతస్స్ఫురణకు మనస్సు అభిముఖము కానారంభించును. ఇది కేవలము మానసికముకాదు కావున, ప్రమాదజుష్టమై యుండదు. కాని, ప్రయాణమిక్కడితో అంతముకాదు. ఇంకనూ పైకి, సరాసరి ఆ యంతస్స్ఫురణమున కాలవాలమైన స్థానమును జేరవలసి యున్నది. సచ్చిదాత్మకమైన వస్తువునుండి సరాసరిగా బయల్వెడలు తొలివెలుగ

యంతస్స్ఫురణము. సాధకుడీ యంతస్స్ఫురణావస్థనుగూడ దాటి, ఈ వెలుగున కేది మూలస్థానమో దానిని సైత మందుకొనవలెను.

ఏలయన, మనస్సున కావల "అధిమన" స్సనునది (Overmind) ఉన్నది. మనస్సుకంటె శక్తిమంతమై మనస్సుకు ఆధారభూతమైయున్న శక్తి యది. దాని నుండి ప్రసరించిన వెలుగే సంకుచితమై మనస్సునందు ప్రకట మగుచున్నది. ఆ యధిమనస్సే, తన వెలుగును క్రిందికి ప్రసరింపజేసికొనుటకు మార్గముగనో, అజ్ఞాన సృష్టికి ఉపకరణముగనో ఈ మనస్సు నుపయోగించుకొనుచుండును. సాధకుని యారోహణ క్రమములో తుది మెట్టు, ఈ యధిమనస్సునుగూడ దాటి, దానికి గూడ మూలమైన విజ్ఞానస్థానము (Supermind) నందుకొనుట. ఈ విజ్ఞానమే దివ్యసత్యచేతనకు ఉనికిపట్టు. విశ్వమునందుగల అచేతనాజ్ఞానముల సంపర్కముచే కళంకితముగాని దివ్యసత్య కర్మలను నిర్వర్తింపజేయగల శక్తి ఆ విజ్ఞానమునకుమాత్రమే కలదు దిగువనున్న ఇంకే చేతనకునూ లేదు. ఆ విజ్ఞానస్థానమును చేరుకొని, అందలిశక్తిని, ఈ యజ్ఞానమును రూపాంతర మొందించుటకై క్రిందికి గొనివచ్చుటయే పూర్ణయోగపు పరమ లక్ష్యము. సుదూరమయ్యునూ విధాయకముగ చేరవలసిన స్థానమిది.

పైనచెప్పిన యీ ఉన్నతశక్తు లొక్కొక్కటే మానవజ్ఞానవృత్తులమీదికి ప్రసరింప నారంభించినప్పుడు, ఇది పవిత్రము ఇది అపవిత్రము, ఇది మానవము ఇది దివ్యము, అనెడి భేదము క్రమముగా సన్నగిలి, తుదకు అవలీలగ అంతరించిపోవును. ఏలయన, విజ్ఞానస్పర్శకలిగి, విజ్ఞానముచే భేదించబడిన సకలమూ ఆ విజ్ఞానతేజోవృత్తిగనే రూపాంతరము నొందిపోవును. అవరచేతనయందుండెడి కల్మషములూ లోపములూ అందుండవు. కావున, కొన్ని కర్మలను వేరు చేయుట ద్వారమునగాక, చేతనయొక్క మార్పుచే వాటిని రూపాంతర మొందించుట ద్వారముననే, మనము విముక్తిని సాధించవలసియున్నది. అదియే జ్ఞానయజ్ఞారోహణము.

ప్రథమమున, మనోబుద్ధుల చేష్టలకు ఒక విధమైన ఉన్నతినీ విశాలతనూ సాధించవలెను. పిమ్మట, వాటిని ప్రకాశవంత మొనర్చి, ఉన్నతతరబుద్ధి

స్థానమునకు (Higher Intelligence) లేవనెత్తవలెను. అటుతర్వాత, అంతకంటె మహత్తరమై, మనో లక్షణ విహీనమై యొప్పు అంతస్స్ఫురణ (Intuition) వృత్తులుగా వాటిని పరివర్తింపజేయవలెను. అనంతరము, అధిమనస్సు (Overmind) యొక్క వెలుగులోనికి వాటిని మార్చుకొనవలెను. తుదకు, విజ్ఞానస్థాయికి (Supermind) జేర్చి, దాని పూర్ణతేజఃప్రాభవములు వాటి కొనగూడునట్లు రూపాంతర మొందించవలెను. ఈ పరిణామమే జగత్తునందలి చైతన్యవికాస క్రమమునందు బీజప్రాయముగ దాగియున్నది. ఇదియే దాని కఠిన పరిశ్రమమునకు లక్ష్యము. పరమాత్మయొక్క అభివ్యక్తి పరికరములిప్పుడు దోషభూయిష్ఠములై యున్నవి. అవి నిర్దుష్టమైన యుపకరణలుగా రూపాంతర మొందువరకూ ఈ చైతన్య వికాస క్రమమిట్లు కొనసాగవలసినదే.

*　　　*　　　*

చేతనయొక్క విశాలశక్తి జ్ఞానము. బంధవిముక్తి కలిగించుటయూ, వెలుగును ప్రసాదించుటయూ దాని విధి. ప్రేమ అనునదియో, చేతనయొక్క అగాధశక్తి. దివ్యరహస్యపు లోతులలోనికి, గుప్తతలములలోనికి అయ్యది ప్రవేశము కల్పించును. మానవుడు మనోమయ పురుషుడగుటచే, మననాత్మకమైన మనస్సునకూ, హేతువాదబుద్ధికీ, సంకల్పశక్తికీ. విశేషప్రాధాన్యము నిచ్చుచుండును. సత్యమును మనస్సుతో చూచు చూపునకే అగ్రతాంబూల మిచ్చుచుండును. హృదయమూ, అందలి భావావేశములూ, లెక్కింపనలవికాని ప్రవృత్తులూ మానవబుద్ధికి గ్రుడ్డివిగనూ, పెడమార్గమున బెట్టునవిగనూ, ప్రమాదకరమైనవిగనూ దోచుచుండును. కావుననే, హేతువాదబుద్ధిచేతనూ, సంకల్పశక్తిచేతనూ వాటిని అదుపులో బెట్టవలసియున్నదని మానవుడు తలంచుచుండును.

కాని, ఈ హృదయములోపలనే, ఈ హృదయము వెనుకనే, గంభీరమైన యొక రహస్యజ్యోతి యున్నది. అంతస్స్ఫురణము (Intuition) అని మనము పిలుచుదానికంటె ఇది భిన్నమైనది. ఏలయన, ఈ యంతస్స్ఫురణము మనస్సంబంధమైనది కాకపోయిననూ మనస్సుద్వారా క్రిందికి దిగును. హృదయములోని వెలుగు అట్టిదికాదు. పరమసత్యముతో దానికి సాక్షాత్సంబంధమున్నది. జ్ఞానగర్వపర్వతాధిరూఢమైన మానవబుద్ధికంటె దైవమున కది అత్యంతసన్నిహితము.

అంతర్యామియైన దివ్యపురుషుడుండు స్థానము హృదయగుహ యని మన పూర్వీకులు చెప్పియున్నారు. 'హృదయే గుహాయాం' అని వక్కుచ్చినవి ఉపనిషత్తులు. దీని లోతులనుండియే అంతర్వాణి వినిపించునని పెక్కుమంది యోగుల అనుభవము.

పరస్పర విరుద్ధములైతోచు ఈ గ్రుడ్డితనమూ ఈలోతూ హృదయమున కెట్లు కలిగినవి ? మానవుని భావాత్మక సత్తకుగల ద్వంద్వస్వరూప లక్షణమే దీనికి గారణము. ఏలయన, మానవుని హృదయమునందు రెండంతరువు లున్నవి. ముందరి యంతరువు, పశువు నందువలె, ప్రాణసంబంధమైన భావములకు స్థానము కాని, పశుభావములకంటె అవి అనేక విధములుగా పెంపొందియుండును. అహంకార ప్రవృత్తిచేతనూ, అంధప్రాయములైన సహజాపేక్షలచేతనూ, విపరీతములైన ప్రాణస్పందనలచేతనూ దానిభావములు నియతము లగుచుండును. అధఃపతితమైన ప్రాణశక్తికి సహజములగు కామక్రోధాదులిందు మల్లడిగొని యుండును. వాటికది వశంవదమై వర్తించుచుండును. ప్రాణతృష్ణలయూ భావావేశములయూ ఈ కలయిక మానవునిలో నొక విపరీతమైన కామాత్మను సృష్టి చేయును. సంస్కార శూన్యమైన,- ప్రమాదకరమైన;- యీ హృదయ లక్షణమునే, బుద్ధి విశ్వసింపక, అదుపులో బెట్టవలె ననుకొనుచున్నది. అది యుక్తమే కాని, దాని యదుపు ఎంతమాత్రమూ స్థిరమైనదికాదు.

అది యట్లుండ. మానవుని నిజమైన ఆత్మ యీ కామపూరిత హృదయములో లేదు. దీని వెనుక, కానరాక దాగియున్న అసలుహృదయములో,- తేజోమయ గుహాభ్యంతరములో నున్నది. పరాత్పరుని దివ్యతేజః ప్రసార రూపమై, మన యాత్మ అచట నెలకొనియున్నది. చాలమందికి అది యచట నున్నట్లు తెలియనే తెలియదు. ఏలయన, ఆత్మ లందరికినీ కలవు; కాని, దాని నెరిగినవారూనూ, దాని సాక్షాత్ప్రేరణానుభవము కలిగినవారును అరుదు. ఆ దివ్యజ్యోతిస్ఫులింగమే మన ప్రకృతియందలి అజ్ఞానపదార్థజాతమున కంతకునూ ఆధారముగా నున్నది. దాని నాశ్రయించుకొనియే మనలో నిజమైన మానవుడు, హృత్పురుషు డేర్పడుచున్నాడు. ఈ హృత్పురుష డంతకంతకు వృద్ధిబొంది, హృదయమాతని దివ్యప్రేరణలతో స్పందించుమన్నకొలది, మానవుడు తనయాత్మను

క్రమముగా నెరుంగుచూ, పశుస్వభావమును వీడి, అంతర్యామియగు పరాత్పరుని వెలుగు నందుకొనుచూ, గంభీరమైన జీవనచేతనల జాడలను గ్రహించుచూ, దివ్యప్రేరణతో వర్తించ నారంభించును. ఈ హృత్పురుషుడిట్లు విముక్తుడై, తెర మరుగునుండి బయటికివచ్చి, మానవుల దేహ ప్రాణ మనములపై తన యను భూతులను వెల్లిగొల్పుచూ, పృథ్వియందు దివ్యత్వమును ప్రతిష్ఠించుట కెప్పుడు మొదలిడునో, అప్పుడు పూర్ణయోగమునకొక పెద్ద మెట్టెక్కితిమని చెప్పవచ్చును.

జ్ఞానచేష్టలవిషయమున నెట్లో, అట్లే హృదయ ప్రవృత్తుల విషయమున గూడ, ప్రారంభములో, రెండురకముల వృత్తులకు మనము భేదము చేయవలసి వచ్చుచుండును. యథార్థమైన ఆత్మచే ప్రేరేపింపబడునవియూ ఆయాత్మయొక్క విమోచనకూ, ప్రకృతియందు దాని యాధిపత్యమునకూ దోహదము చేయునవియూ నొక రకము. ప్రాణమయమైన మలినప్రకృతియొక్క సంతృప్తికై ప్రవృత్తము లగునవి రెండవ రకము. కాని, పూర్ణయోగసాధన యొక్క ముఖ్యార్థమున మాత్రము, ఈవిధమైన భేదములకు ఏమంత ప్రయోజనము లేదు. ఎట్లన, ధార్మిక (Religious) భావములకునూ ఐహికభావములకునూ మనము భేదము చేసి, ఆధ్యాత్మిక జీవనమునకు ధార్మిక భావములనే పెంపొందింపవలెననియూ, ఐహికభావములను పూర్తిగా త్రోసిపుచ్చి మనస్సుత్తనుండి వాటిని జార్చివేయవలె ననియూ తలచుటకవకాశములకలదు. ఇదియే భక్తులయూ సాధులయూ ధార్మికజీవన పద్ధతి.

ఇందు భక్తుడు దైవమును ఏకాంతభక్తితో భజించును. లేక, తనవలెనే దైవభక్తిగల ఇతరులతో మాత్రము సంబంధము కల్గియుండును. లేక, బాహ్య ప్రపంచముపై పవిత్రమైన ధార్మికప్రేమను వర్షించును. కాని, ధార్మికభావావేశముసైతమూ నిరంతరముగ ప్రాణతృష్ణాకల్లోలమున కగ్గమగుచుండును. ఆత్మ విశుద్ధిలక్షణమునకు దూరమైన చేష్టలతో మిశ్రితమైయుండును. కర్కశమైన శాస్త్ర సంప్రదాయములో బిగిసిన సాధుత్వసిద్ధియూ పూర్ణయోగ లక్ష్యము గానేరదు. ఈశ్వరునితోడనూ జగత్తుతోడనూ విశాలతరమైన హార్దసంబంధమును పెంపొం దించుకొనుట పూర్ణయోగసాధనకు అత్యావశ్యకము. అయ్యది అగాధమై, విశాలమై, సకలజీవనమునూ అంతర్భుక్తము చేసికొనజాలినదిగ నుండవలెను.

నైతికదృష్టిని మూలముగా జేసికొన్న యైహిక మానవుని మనఃప్రవృత్తి ఫలితమగు విశాలతరమైన పద్ధతి యొకటి కలదు. వట్టి యహంకారముతోడనూ స్వార్థముతోడనూ గూడిన భావములకునూ, నైతికదృష్టికి సమ్మతములైన భావములకునూ ఇందు భేదము చేయబడును. పరోపకారబుద్ధి, భూతదయ, మానవసేవ– ఇవియే మనకు లక్ష్యముగా నిరూపింపబడును అహంకార బంధమును తొలగించుకొని, కేవలముగా, లేక ప్రధానముగా, ఇతరులకొరకు, లేక మొత్తముమీద మానవలోకముకొరకు, బ్రతుకజూచు నిస్స్వార్థతను సాధించుటయే మానవుని యంతర్వికాసమునకు మార్గమని యీ సిద్ధాంతము బోధించును. మన లోలోపల విహితమైయున్న ధార్మిక, ఆధ్యాత్మిక ప్రవృత్తి కీ భూతదయాపరత్వము వట్టి యైహికముగా దోచుటవలన, మనకిది తృప్తిని గూర్చకపోవుటకలదు. అప్పుడు, దీనికొక విధమైన ధార్మిక ప్రవృత్తితోగూడిన నైతికాశ్రయమును కల్పించుట కవకాశము లేకపోలేదు. నిజమున కదియే ఈ మానవసేవాబుద్ధికి ఆదిమూలము.

భగవానుని భక్తితో భజించగోరు హృదయప్రవృత్తికిదోడు, వాచామగోచరమైన తత్వమును తెలిసికొన నుద్యమించు జ్ఞానప్రవృత్తికిదోడు, మన ఇరుగు పొరుగు వారినీ, మానవలోకమునూ సేవించుటద్వారా, దయాసహితమైనట్టియూ పరోపకార నిరతమైనట్టియూ కర్మలద్వారా ఈశ్వరుని భజించుటయూ కలదు. యథార్థమున కీ ధార్మికప్రవృత్తితోగూడిన నైతికదృష్టివలననే విశ్వమైత్రీ ధర్మము, ఇరుగు పొరుగును ప్రేమించి సేవించు ధర్మము పుట్టినది. వేదాంత మతములోనూ, బౌద్ధమతములోనూ, క్రైస్తవమతములోనూగూడ ఈ లక్ష్యము కాననగును. ఒక విధమైన యైహికభావ పూరణచే అందలి ధార్మిక భావతీవ్రత చల్లారిపోయినప్పుడే, భూతదయాపరత్వము ధార్మికభావశూన్యమై, వట్టి యైహిక పద్ధతిలోని ఉత్తమోత్తమ ప్రవృత్తిగా మాత్రము నిలిచిపోవును.

ధార్మికపద్ధతియందీ కర్మప్రవృత్తి ఒక లక్ష్యసిద్ధికి సాధనము మాత్రమే. ఆ లక్ష్యము సిద్ధించుటతోడనే దానిపని తీరిపోవును. పరతత్వము నన్వేషించు సాధనలో నొక భాగమది. లేక, నిర్వాణ ప్రాప్తిచే ఆత్మోత్సర్జనము గావించుకొను యత్నమునకు పూర్వరంగము. ఐహికపద్ధతియం దట్లుగాక, ఆ మానవ

సేవయే పరమలక్ష్యమైపోవును. మానవుని నైతికసంసిద్ధి కది చిహ్నముగా నెంచ బడును. ఈ భూలోకమున మానవుడు సుఖియై మనుటకు, మానవ సమాజము చక్కగా వర్ధిల్లుటకు, అయ్యది ముఖ్యావసరముగా భావించబడును. కాని, ఇవే వియోగూడ పూర్ణయోగ సాధనకు తృప్తిని గూర్పజాలవు.

పరోపకారశీలత, భూతదయాపరత్వము, మానవసేవానిరతి,- ఇవి మానసిక చేతనలోనుండి పుట్టినవి. ఉత్తమ పక్షమున, విశ్వజనీనమైన దివ్యప్రేమ కివి కుంటి యనుకరణములు. అహంకారమునుండి మన కివి విముక్తినియ్యవు. దాని నింకనూ విస్తరింపజేసి, దాని కధికతర సంతృప్తిని సాధించును. మానవుని ప్రాణమయ జీవనమునూ ప్రవృత్తినీ మార్చివేయజాలక, దాని దోషమును మాత్రము కొంత విరిచి, దాని యహంకారలక్షణమును కనుపడనీకుండ పైపూతలు పెట్టజాలను. ఒకవేళ, సమగ్రమైన సంకల్పశుద్ధితో వాటి ననుష్ఠించినను, వాటి వలన మన ప్రకృతి విపరీతమైన పాక్షికాభివృద్ధి గాంచినదగును, మన జీవాత్మ విశ్వగత విశ్వాతీత తత్వములోనికి సర్వతోముఖముగా దివ్యపరిణతి గాంచగల లక్షణ మేమాత్రమూ గానరాదు.

అంతియేకాక, ధార్మిక ప్రవృత్తిపూర్వకమైన యీ నైతిక లక్ష్యము సాధకునకు తగిన మార్గదర్శికూడ కానేరదు. ఏలయన, సామాన్య మానవప్రకృతి యందలి ఉత్తమ ప్రవృత్తులను భుక్తపరచుకొనుచూ వృద్ధిని చేబట్టజూచు ధార్మికప్రవృత్తికినీ, ఏదేనొక ధార్మికభావ స్పర్శవలన తన మానసిక కర్కశత్వమునుండి బయటపడగోరు నైతికప్రవృత్తినీ పరస్పర సహకారమును సాధించుటకు ఒక విధమైన రాజీగా ఏర్పడిన లక్ష్యమది. ఈ రాజీలో ధర్మము (religion) మానసిక భూమికలోనికి దిగి, మనస్సునకు సహజమైన దోషములను తానుగూడపొంది, దానివలెనే, జీవితమును పరివర్తన మొందించుట కశక్తమైపోవును. మనస్సనునది ద్వంద్వభూయిష్ఠము. సాపేక్షిక సత్యములనేగాని నిరపేక్షిక సత్యమును దెలిసికొనుట దానికెట్లసాధ్యమో, అట్లే నిరపేక్షికమైన శివమును సాధించుటయూ దాని కసాధ్యమే. ఏలయన, నైతికదృష్టిపూర్వకమైన శివము ('మంచి') అశివము ('చెడు') నకు ప్రతిరూపము. ఆ'మంచి' నీ 'చెడు'

నీడగా అనుసరించుచునే యుండును. ఈ 'చెడు' లేని యెడల ఆ 'మంచి' యుండు టకు వీలులేదు.

కాని, ఆధ్యాత్మికచేతన మనోభూమిక కంటె అతీతమైన భూమికకు సంబంధించినది. అచ్చట, ఈ ద్వంద్వములుండవు. సత్యసమ్ముఖమున అసత్యము, శివసమ్ముఖమున అశివము అచట ఆధారములేక నశించిపోవును. ఏలయన, సత్యముయొక్క విపరీతరూపమే అసత్యము. అట్లే, శివముయొక్క విపరీత రూపమే అశివము. పూర్ణయోగము మానసిక, నైతిక లక్ష్యముల రూపమైన దుర్బల సాధనలపై నెన్నడునూ ఆధారపడక, ప్రబలమైన మూడు ముఖ్యవిధానము లకు ప్రాధాన్యమిచ్చును. ఒకటి, అయథార్థమైన కామాత్మకు బదులుగా నిజమైన యాత్మను, హృత్పురుషుని వికసింపజేయుట; రెండు, మానవప్రేమను దివ్య ప్రేమలోనికి పర్యవసింపజేయుట; మూడు, మానసిక భూమికనుండి ఆధ్యాత్మిక, అతిమానస భూమికలోనికి చేతన నుద్ధరించుట. ఇట్లు ఉద్ధరించబడిన చైతన్య శక్తి వలననే, అజ్ఞాన శృంఖలములనుండి ఆత్మయూ, ప్రాణశక్తియూ, సంపూర్ణ ముగ విముక్తిని సాధించగల్గును.

ప్రొద్దుతిరుగుడు పుష్పం సూర్యునివైపు తిరుగునట్లు, దివ్యసత్యమువైపు తిరుగుట మన యంతరాత్మకు, లేక మన హృత్పురుషునికి, సహజస్వభావము. దివ్యమగుదానిని ఆమోదించి గ్రహించుచూ, దివ్యము దెసకు పురోగమించుచూ, తద్విరుద్ధమైన అదివ్యమునుండి తనను దానుపసంహరించుకొనుటయే దాని సహజ ప్రకృతి. తొలుదొల్త నీ యంతరాత్మ ఈశ్వరజ్యోతినుండి వెల్వడిన యొక చిన్న విస్ఫులింగము. అనంతరమది గాఢాంధకారమునడుమ వెలుగొందు నొక చిన్న అగ్నిజ్వాలిక. విశేషభాగమది తన గర్భగృహమందు తాను మరుగుపడియుండును. తనను దానభివ్యక్తము చేసికొనుటకది దేహ మనః ప్రాణ చేతనల నధిగమించవలసియుండును. తమకు శక్తియున్నంతలో తనను అభివ్యక్తము చేయుటకు వానిని ప్రేరేపించవలసియుండును.

సామాన్యముగా నది, వాటి బహిర్ముఖస్వభావముపై తనలో వెలుగును ప్రసరింపజేసి, వాటి చీకటులను గొంత పారద్రోల గలుగుచుండును. జీవితము

నందు కొంత సాక్షాత్తుగా తనను దా నభివ్యక్తము చేసికొనగల హృత్పురుషుడై వెలసిన సందర్భములోగూడ, ఈ యంతరాత్మ చాలమందిలో ఈషత్ప్రదేశమును మాత్రమే ఆక్రమించియుండును. శరీరమంతటిలోనూ ఈ హృత్పురుషుడు అంగుష్ఠమాత్రుడై యున్నాడని మన పూర్వఋషులు వర్ణించిరి. దేహచేతనపు అంధతమస్సునుగాని: మానసిక చేతనపు ప్రమాదలక్షణమునుగాని, ప్రాణచేతనపు దుడుకుతనమునుగాని ఈ యంతరాత్మ ఎల్లవేళలా పూర్తిగ నపనయింప జాలదు. మానవబుద్ధికీ, హృదయమునకూ, ఇంద్రియములకూ సంబంధించిన వివిధ జీవనప్రవృత్తుల నయ్యది ఉన్నవున్నట్లు తప్పనిసరిగ నామోదించవలసి వచ్చుచుండును. ప్రమాదములతో కలగాపులగమై యున్న యీ సాపేక్షిక సత్యము నుండి దివ్యత్వమును వెలికిదీసి పెంపొందించుటకది విశేషముగ శ్రమించవలసి యున్నది.

అట్లే, శారీరికవాంఛలూ ప్రాణతృష్ణలూ తీర్చుకొనజూచు నీ తుచ్ఛప్రేమ నుండియూ, విశేషభాగము పశుప్రవృత్తులతోనూ రాక్షసప్రవృత్తులతోనూ నిండి యున్న యీ సామాన్య మానవజీవనమునుండియూగూడ దివ్యత్వము నుద్ధరించి అభివృద్ధి నొందింపవలసియున్నది. వస్తుతః ఈ యంతరాత్మ సంకల్పమునకు పొరపాటునది లేదు. కాని, పరికరముల యొత్తిడినిబట్టి, తరచుగ నది క్రియలో, భావములో, సంకల్ప ప్రభేదములో, అంతరమునందలి ప్రమాదరహిత లక్ష్యమును వ్యక్తము చేయుటలో, పొరపాటులకు లోనగుచుండును. అయినమా, దాని యంతరమున నొక దివ్యజ్ఞాన మున్నది. సరియైన మార్గమును చూపుటయందది బుద్ధికంటె మహత్తరము. పొరపాటుల మధ్యనుండి మనలను ముందునకు నడుపుటలో దానికిగల సామర్థ్యము బుద్ధికి లేదు.

ఈ యంతర్వాణి 'మనస్సాక్షి' (Conscience) యనబడునది కాదు. మనస్సాక్షి మనోమయము, తరచుగ ప్రమాదభూయిష్ఠము. ఈ యంతర్వాణి యంతకంటె లోతైనది. అంతంటె కడు నరిదిగ వినవచ్చుచుండును. వినబడినప్పుడు దాని ననుసరించుటయే శ్రేయస్కరము. బుద్ధినీ నైతికదృష్టినీ ఏకటుగడగా జేసికొని తిన్నగా గనుపించుమార్గమున బోవుటకంటె, ఈ యాత్మవాణి పిలుపు ననుసరించి చెదరువాటుగ పరిభ్రమించిననూ మేలేయగును. కాని, జీవ

తము దైవముదెస కభిముఖము కాగల్గినప్పుడే, ఇట్లంతరాత్మ యథార్థముగ వెలుపలికి వచ్చి, బాహ్యోపకరణములపై తన ప్రభావమును ప్రసరింపజేయగల్గును. ఏలయన, ఈ యంతరాత్మ పరమాత్మజ్యోతియం దుద్భవించిన విస్ఫులింగమే కావున, ఆ పరమాత్మదెసకు జ్వాలగా కొనలు సాగుటయే దాని యథార్థజీవనము, దాని మనుగడకు పరమార్థము.

లోపల దాగియున్న అంతరాత్మ వెలుపలి కెప్పుడు వచ్చును? యోగసాధనయం దొకానొక దశలో మనస్సు అడుగడుగునకునూ తన వినిశ్చయముల కాధిక్యమిచ్చుటమాని, కొంత యుపరతిని బొందుట సంభవించును. ప్రాణము తన తృష్ణా సంకల్పముల తొందరపాటును నిలువరించుకొని, కొంత స్థాయిని బొందుట తటస్థించును. దేహము తన బహిర్ముఖత్వమువలననూ జడత్వమువలననూ అంతర్జ్యోతి అణగారకుండునట్టి మార్పును కొంత సాధింపగల్గును, అట్టి సమయములలోనే అంతరాత్మ వెలుపలికి వచ్చి, ఇతరమున కంతకునూ వెలుగునిచ్చి, యోగసాధనను తానే నిర్వహింపబూనుకొనును.

పరాత్పరునియెడ ఏకాగ్రమగుటయే దాని లక్షణము. ఈ ఏకాగ్రప్రవృత్తిలో మృదుత్వమున్నది. బుద్ధియొక్క ఏకాగ్రప్రవృత్తిలో నున్నటుల కఠిన ధోరణి యిందుండదు. ప్రాణశక్తియొక్క యేకాగ్రతలో నున్నటుల మూర్ఖ సముద్వేగముండదు. అడుగడుగునా మృదులమైన వినిశ్చయముతో నయ్యది సత్యమార్గమును నిర్దేశించుచుండును. ఏది సరియైన అడుగో, ఏది తప్పటడుగో, అప్రయత్నముగ గనబరచుచుండును. ఆదివ్యప్రవృత్తిని వేరుచేసి చూపుచుండును. మన ప్రకృతియందు మార్పుచెందవలసియున్న సమస్తమునూ 'సర్చిలైటు'వేసి చూపినట్లు చూపును. బాహ్యాభ్యంతర సత్తనంతనూ వరుసవేదితోవలె రూపాంతరమొందింపగల సంకల్పజ్వాల దానియందు జ్వలించుచుండును, సర్వత్రా అయ్యది దివ్యమూలమును దర్శించుచూ మాయముసుగులను త్రోసిపుచ్చుచుండును.

సత్యము, ఆనందము, ప్రేమ, సౌందర్యము, బలము, ప్రాభవము. ఇచ్ఛాశక్తి,— ఇవీ ఈ యంతరాత్మ లక్ష్యములు. అజ్ఞానరూపాంతరమైన వ్యావహారిక సత్యముకాదు,— దాని కతీతమైవెలయు శాశ్వతజ్ఞానరూపమైన సత్యము; కేవలమూ ప్రాణమునకు సుఖమునిచ్చు ఆనందముకాదు,— దాని కావల భాసించు

అంతరానందము; అహంకారిక వృత్తితో బంధించబడిన ప్రేమకాదు,- ఆ కట్టు త్రాళ్ళను త్రెంచుకొని పైకెగయజాలిన ప్రేమ; లౌకికమైన శుష్కసౌందర్యము కాదు,- అనంతుని స్వరూప సాక్షాత్కారము ననుసంధింపజేయు సౌందర్యము; అహంకృతి విధేయములైన బలప్రాభవములు కావు.- ఆత్మవస్తువుకు వశంవదము లైన బలప్రాభవములు; ఇక నా ఇచ్ఛాశక్తియో,- జీవనమునకు దివ్యత్వమును సంపాదించి, దివ్య సత్యమును తద్ద్వారా వ్యక్తముచేయుచూ, తత్సకలమునూ దైవమున కంకితము చేయనెంచు ఇచ్ఛాశక్తి యది.

కాని, ఈ యంతరాత్మకుగల అత్యంత సహజ లక్షణముమాత్రము, పరమపవిత్రమైన ప్రేమతో, ఆనందముతో దైవముదెస కురవడించుట. అన్నిటి కంటె ముఖ్యముగ దివ్యప్రేమనే అయ్యది అభిలషించును. దైవమునెడ ప్రేమయే దాని కుద్దీపనము, లక్ష్యము. మన యంతరమున, క్రొత్తగా పుట్టువునొంది, ఇంకనూ నొకవిధమైన చీకటితొట్టెలోనే ఊగుచున్న దివ్యశిశువున కెట్టయెదుట, తేజోవంతమైన హృదయగుహకు పైగా వెలుగుచున్న సత్యజ్యోతి యది. ప్రారంభదశలో నీ శిశువు చాలకాలము. కేవలము ఐహిక ప్రేమకారుణ్యాదుల పైననే, మానవ ప్రకృతియొక్క కర్కశత్వమును కొంత సంస్కరించగల రస జ్ఞత, సాధుత్వము, తేజోబల స్థైర్యములు, మున్నగువానిపైననే, ఆధారపడి యెదుగుచుండును. కాని, ఈ మానవ ప్రవృత్తు లెంత యుత్కృష్టస్థితియందునూ నిర్దుష్టములు కానేరవనియూ, నికృష్టస్థితియం దివి అహంకారభూయిష్ఠములై, ఆత్మవంచకమైన అసత్యముచే ముద్రితములై యుండుననియూ దానికి తెలియును. వెంటనే అది, వీటినుండి బయటపడగోరి, పురాతన బంధనముల నన్నింటినీ, దోషజుష్టములైన భావోద్వేగముల నన్నింటినీ ఛేదింప నుత్సహించి, వాటి స్థాన మున మహత్తరమైన ప్రేమయొక్కయూ ఏకత్వముయొక్కయూ ఆధ్యాత్మిక సత్యమును ప్రతిష్ఠింప నుద్యుక్తమగును.

మానవ ప్రవృత్తుల కది ఇంకనూ అవకాశమిచ్చిన నీయవచ్చుగాక, కాని, ఆ అద్వయుని కవి అభిముఖమైయుండు పక్షముననే వాటి కా యవకాశ మీయబడును. తన సాధనకు దోహదము కాగల బంధములనుమాత్రమే అయ్యది స్వీకరించును. గురువునెడల భక్తి, భాగవతశ్రేష్ఠులతో సాంగత్యము, అజ్ఞాన

ములో మునిగియున్న లోకమునెడ ఆధ్యాత్మిక కారుణ్యము, సర్వత్ర ఈశ్వర దర్శనముచే గలుగు సుఖసంతృప్తులు, ఇవన్నియూ నిట్లు దోహదము కాగలిగిన బంధనములే. హృదయ గుహాంతర్వర్తియగు దైవముతో సమాగమము చెందుట కీ యంతరాత్మ మన ప్రకృతిని అంతర్ముఖమొనర్చి లోనికి దుమికించును. ఆ పిలుపు వినవచ్చునంతవరకూ, ఏ అహంకార కళంకమూ, లోకసేవారూపమైన ఏ బాహ్యప్రేరణమూ దానిని వంచించి, అంతర్వర్తియగు పరమాత్మదెసగల ఆకర్షణనుండి చలింపచేయజాలదు.

అంతేకాక, ఈ యంతరాత్మ మన సత్తను ఒకానొక అతీత ఆనందము లోని కుద్ధరించును, అద్వయుడైన సర్వోన్నతునికడ కెగయజూచు దాని రెక్క లకు ఈ యధోలోకపు టాకర్షణ లేకుండ తొలగించును, స్పర్ధాసంకులమూ, ద్వేషపూరితమూ అజ్ఞాన తిమిరావృతమూనైన యీ లోకమునకు విముక్తి కలి గించి రూపాంతర మొందించుట కీ అతీత ప్రేమానందములను క్రింది కాహ్వా నించును. విశ్వవ్యాప్తమైన దివ్యప్రేమను, అపారకృపను, లోకకళ్యాణార్థమైన బృహత్సంకల్పమును, తన సంతానమును చేరదీసికొను జగన్మాత యొడిలోనికి చేరగోరు వృధులేచ్చును, జగత్తును అజ్ఞానాంధకారమునుండి యుద్ధరించుటకు అంధతమస్సులోనికి దుమికిన దివ్యావేశమును తనలోనికి ప్రవహింపజేసికొనును, మూలస్థానీయములైన ఈ మహాసత్యములను మనోవృత్తులచే ననుకరించుటయూ, ప్రాణవృత్తులచే దుర్వినియోగము చేయుటయూ జరుగుచుండును, కాని, అంత రాత్మ వీటిచే వంచింపబడదు, తన నిశితకిరణ ప్రసారముచే వీటిని బట్టబయ లొనర్చి, ఈ వైపరీత్యములను చక్కజేయుటకు, దేహ ప్రాణ మనస్సంబంధ మైన ప్రేమను తద్వికారలక్షణములనుండి సముద్ధరించుటకు, ఆరోహణానందము లోనూ అవరోహణానందములోనూ వాటికిగల భాగస్వామ్యమును వాటి కెరుకపడ జేయుటకు, సాక్షాత్తుగ దివ్యప్రేమయొక్క సమగ్ర సత్యమును క్రిందికి ఆహ్వా నించును.

దివ్యప్రేమయొక్కయూ, దివ్యప్రేమ కర్మలయొక్కయూ మూలసత్య ముల నన్నింటినీ అంతరాత్మ వాటి వాటి యుచితస్థానమున మన్నించును. కాని, దాని జ్వాలమాత్రము నిరంతరమూ ఊర్ధ్వముఖముగనే యుండి, సత్యముయొక్క

# యజ్ఞారోహణము-1

క్రింది మజిలీలనుండి పై మజిలీలకు ఆరోహణ మవిచ్ఛిన్నముగ కొనసాగునట్లు ప్రేరేపించుచుండును. ఏలయన, అత్యంత సమున్నతమైన సత్యశిఖరమునకు ఆరోహణము, తోడ్తోడనే ఆ సత్యముయొక్క అవరోహణము,—ఈ రెండునూ జరిగినగాని, ప్రేమను శిలువపైనుండి తప్పించి సింహాసనముపై నధిష్ఠింపజేయుటకు వీలులేదు. శిలువ యనునది, జీవితమును దుఃఖమయమొనర్చు విశ్వవికృతి రూప తిర్యక్ప్రసారరేఖచే నిరుద్ధమైన దివ్యావరోహణమునకు చిహ్నము. మూల సత్యముకడకు ఆరోహించుటవలననే ఈ వికృతిని సరిచేయుటకు వీలగును. అప్పుడే, జ్ఞానకర్మ లన్నిటితోపాటు, ప్రాణకర్మ లన్నిటితోపాటు, ప్రేమకర్మ లన్నియూగూడ నిజపరమార్థము నందుకొని, సమగ్రమైన ఆధ్యాత్మిక జీవనమున నంతర్భాగమై విలసిల్లును.

—o—

## అధ్యాయము 6

# యజ్ఞారోహణము 2

## ప్రేమకర్మలు - ప్రాణకర్మలు

కావున, అంతరాత్మయే,—హృత్పురుషుడే,—అధ్వర్యుడుగనూ, ఋత్విక్కుగనూ భక్తి, జ్ఞాన, కర్మ యజ్ఞమును నిర్వర్తించుటవలన, ప్రాణము సైతమూ, రూపాంతరము నొంది తన యాధ్యాత్మిక స్వస్వరూపసిద్ధిని గాంచగల్గును. సరిగా నిర్వర్తించినచో, ఇతర యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞమే అత్యంత విశుద్ధమూ, విశాలమూ ననుమాట నిజము. కాని, మన యాధ్యాత్మిక విశుద్ధికి భక్తియజ్ఞము కూడ, - ప్రేమయజ్ఞముకూడ ముఖ్యముగా గావలసినదే. ఏకాగ్రతయందిది జ్ఞానయజ్ఞముకంటె అత్యంత ప్రగాఢమూ సుసంపన్నమూనని చెప్పనొప్పును. ఆ జ్ఞానయజ్ఞ మెంత విశాలమూ విశుద్ధమో అంతగానూ దీనినీ చేయవచ్చును,

ఒక దివ్యమైన నిరవధికానంద శక్తిప్రవాహము మన ప్రవృత్తు లన్నిటిలోనికినీ పొర్లుకొనివచ్చి, మన జీవనాకాశమంతయూ సర్వమూ సర్వోన్నతమూనైన ఏకము నెడగల అనన్యభక్తితో నిండియుండునెడల, ప్రేమయజ్ఞమునందలి ప్రగాఢత ఈ విశుద్ధవిశాలతను గూడ అందుకొనగల్గును. ప్రేమయజ్ఞమున కదియే చరమసంసిద్ధి. సర్వాత్ముడైన పరమునికి సమర్పించినప్పు డా ప్రేమయజ్ఞము సమగ్రమూ, సర్వంకషమూ, నిరవధికమూ నగును. సర్వోన్నతుడైన పరాత్పరుని స్థాయికి ఉద్ధరించబడినప్పు డది, 'ప్రేమ' యని సామాన్యముగా మానవులు వాకొను దుర్బల తాత్కాలిక ప్రవృత్తిస్వరూపమును విడిచి, సర్వమునూ ఏకము చేయు ప్రగాఢ, విశుద్ధ, మహనీయానందముగా మారిపోవును.

సర్వోన్నతుడూ, సర్వగతుడూనైన పరమునియెడ నిట్లు దివ్యప్రేమ గలిగి యుండుటయే మన యాధ్యాత్మిక జీవనమునకు ఏకుగడగా నుండవలయుననుట

నిజమే. కాని, అంతమాత్రమున, వ్యక్తజగత్తులోని వ్యక్తిప్రేమవిశేషములను గాని, ఆత్మనూ ఆత్మను సన్నిహితపరచు అనుబంధములనుగాని త్రోసిపుచ్చవల సిన పనిలేదు. కావలసినదెల్ల, ఆంతరంగికమైన మార్పు; అజ్ఞానపు ముసుగుల తొలగింపు; పూర్వపు అవరచేతనకే ఇంకనూ దోహదముచేయు అహంకారిక దేహ మనః ప్రాణవృత్తుల పరిమార్జనము. ప్రతి ప్రేమవృత్తియూ ఆధ్యాత్మిక తనుగాంచి, దేహవాంఛపైగాని ప్రాణోద్వేగముపైగాని మానసికాభిరుచిపైగాని ఆధారపడక యుండవలెను. మహత్తరమైన యేకత్వమునకు దేహ మనః ప్రాణ ములు వ్యక్తపరికరములు కాగా, ప్రేమ తన ఆంతరంగిక ఆధ్యాత్మిక మూల స్వరూపసంసిద్ధి గాంచవలెను. ఈ పరివర్తనమునందు, వ్యక్తిప్రేమ సైతము స్వాభావికముగ, వ్యష్టిదేహాత్మమనస్సులం దధివసించియున్న దివ్యాంతర్వర్తి యెడగల దివ్యప్రేమగనే మారిపోవును.

సమర్చనరూపమైన సకలప్రేమయూ ఆధ్యాత్మిక శక్తిసంపన్నము. అజ్ఞాన పూర్వకముగా, పరిమితలక్ష్యము నుద్దేశించి యది ప్రవర్తిల్లిననూ, అర్చనవిధి సుసంపన్నమైనది కాకపోయిననూ, దాని యాధ్యాత్మిక ప్రభావము కొంత కాన వచ్చుచునేయుండును. ఏలయన, అర్చనరూపమైన ప్రేమ కేవల మొక అభిలా షయే కాదు, ఒక సన్నాహముకూడ. అజ్ఞానమునకు లోబడియున్న తన స్వల్ప పరిమితిలోనే అయ్యది, పాక్షికమూ ఇంకనూ ఇంచుమించు అంధత్వలక్షణోపేత మూనయ్యూనూ అద్భుతావహమై వెలయు అనుభూతి రేఖలను మనకు తోపింప జేయును. ఏలయన : మనలో ప్రేమించి ప్రేమించబడునట్టి ఆ యేకరూపుడే మన ముగా దోచుమహార్తము లవి. ఈ యనంతప్రేమనూ ప్రేమికునీ కొలదిమాత్ర ముగనైన దర్శింతుమేని, సామాన్య మానవోద్వేగములు సైతమూ ఉన్నతినీ మహనీయతనూ గాంచును.

ఈ కారణమువలననే, దేవతనుగాని, ప్రతిమనుగాని, ఆకర్షణ ప్రభావము గల మానవునిగాని లక్ష్యమునుగాని ఆర్చించుట నిరసింపదగినదికాదు. అనంతుని యెడ ఆనందోద్వేగముతో మానవజాతిని ముందుకు దీసికొనిపోవు సోపానములివి. ఒకవైపున పరిమిత మొనర్చుచుండియూ అవి యా యనంతుని మనకు మసక మసకగానైన పొడగట్టజేయుచుండును. మనకొరకై ప్రకృతి తయారుచేసిన

సోపానము లివి. అవరములయ్యునూ వీటిని మన ముపయోగించుకొనవలసియే యుండును. కొన్ని రకముల ప్రతిమారాధనలు మన రసాత్మయొక్క అభివృద్ధి కొరకు అనివార్యము లగుచుండును. ప్రతిమ యే సత్యస్వరూపమునకు ప్రతీకయో, అద్దానిని హృదయమునందు ప్రతిమాస్థానమున ప్రతిష్ఠించుకొనగలిగిననే కాని, తెలిసినవాడెవ్వడునూ ప్రతిమను భగ్నము చేయుటకు తొందరపడడు.

అదియునూగాక, ఈ ప్రతిమారాధనలలో, వీటి బాహ్యస్వరూపముకంటె మహత్తరమైన దొక కేదయో యున్నది. అర్చనయొక్క పరాకాష్ఠను సాధించిన పిమ్మటగూడ, ఈ మహత్వ మట్లే నిలిచియుండి, దాని సర్వసమగ్రతయం దంతర్భాగమగును. సకలరూపములకునూ సకల అభివ్యక్తులకునూ అతీతమైన దానిని మనము తెలిసికొనినప్పటికినీ, ఆ దైవమును ప్రతిప్రాణిలో, ప్రతి వస్తువులో,– మనుష్యునిలో, మృగములో, జాతిలో, చెట్టులో, పూవులో, మన చెయిదములలో, ప్రకృతిశక్తిలో,– అన్నిటిలోగూడ మనము గ్రహించనేరనియెడల, మన జ్ఞానమింకనూ అసంపూర్ణమే యగును, మన ప్రేమ యింకనూ అసమగ్రమే యగును. పైన చెప్పినరీతిగా మనమెప్పుడు గ్రహించగలుగుదుమో, అప్పుడు, ప్రకృతిశక్తి మనకు వట్టి జడయంత్రముయొక్క గ్రుడ్డిచేష్టగాగాక, సచేతనమైన విశ్వశక్తియొక్క ఒక ముఖముగా, ఒక విన్యాసముగా గోచరించును. ఏలయన, ఆ యనంతుడే ఈ యఖిలవస్తువులయందునూ సన్నిధిచేసియున్నాడు.

వాచామగోచరుడైన సర్వాతీతునియెడ, అవర్ణనీయమైన పరంభావమును గలిగియున్న మాత్రమున ఆతని యర్చనము పరిసమాప్తి కానేరదు. ఆత డెక్కడెక్కడ వ్యక్తమైన, నర మృగ పశు పక్ష్యాదులలో నెక్కడెక్కడ దాగియున్న, అక్కడక్కడ నెల్ల నతనికి భావసమర్పణము చేయవలెను. హృదయమును బంధించి, దాని భావములను తారుమారుచేయుచూ, దాని నివేదనల పరమార్థమును కప్పిపుచ్చు నజ్ఞాన మిచట నున్నమాట నిజము. కాని, పాక్షికమైన సకల సమర్చనయూ, ఒక మానసిక ప్రతిమనో ఒక భౌతిక ప్రతిమనో సృష్టిచేయు సకల మతపక్షయూ, నొకవిధమైన అజ్ఞానపుముసుగుచే నా ప్రతిమయందలి సత్యమును మరుగుపరచి కాపాడుకొన యత్నించుచూ, తద్ద్వారమున నా సత్యమును అవలీలగా కోలుపోవుట సంభవించుచుండును. కాని, యొకదాని ప్రత్యేకజ్ఞాన మొక

విఘ్నముగా గోప్పదేయైననూ, అది యొకవిధమైన యవరోధమని కూడ తెలియ నగును.

వ్యక్తిప్రేమ యనుదాని వెనుక, అజ్ఞానయుతమైన దాని మానవరూపవిశే షము వెనుక, మనస్సున కందని యొక పరమరహస్యము దాగియున్నది. అయ్యది పరమాత్మని యుపాధిరహస్యము, అనంతుని నిగూఢరూపరహస్యము. హృదయా నందము ద్వారముననే,- విశుద్ధిని గాంచిన భావోద్వేగము ద్వారముననే,— ఆ రహస్యమును మనము చేరజాలుదుము. దివ్యమురళీధరుని ఆ యాహ్వానము నందుకొనవలెనని, నిగూఢ ప్రేమద్వారముననే అయ్యది సాధ్యము. ఈ ప్రేమ సాధనయందు తుదకు రూపారూపము లొక్కటియైపోవును. చిజ్జడము లైక్యము చెందును. ప్రేమయందలి సహజతత్వ మిచటి యీ యజ్ఞానాంధకారములో దీనినే యన్వేషించుచున్నది. వ్యక్తిగతమైన మానవప్రేమ భౌతికజగత్తునం దవతరించి యున్న సర్వాంతర్వర్తి యెడల ప్రేమగా మారినప్పుడు ఈ సంసిద్ధివే పొంద గలుగుచున్నది.

వ్యక్తిప్రేమ విషయమునవెట్లో అట్లే విశ్వప్రేమ విషయమునగూడ, సాను భూతి, సద్భావము, సర్వమానవప్రేమ, సర్వభూతదయ, మనచుట్టునూగల వివిధ రూపముల యాకర్షణము,- ఈ యన్నింటివలననూ సాధకుడు ఏ విశాలతను సంపాదించి, బుద్ధియందునూ చిత్తమునందునూ అహంకారపు మొదటి పొలిమేరలు నతిక్రమించునో, దానిని సర్వగతుడైన పరమాత్మనియెడ గల్గు దివ్యప్రేమలోనికి పర్యవసింపజేసికొనవలెను. సమర్పనము ప్రేమగా మారి, ప్రేమ ఆనందముగా,- భక్తిమార్గమునకు చరమగమ్యమైన సర్వాతీతునియందలి అతీతానందముగా పరిణతి నొందినప్పుడు, విశ్వప్రేమ, విశ్వానందము సిద్ధించును. ప్రతి ముసుగు వెనుకనూ పరమాత్మయే సాక్షాత్కరించును. అన్ని రూపములలోనూ ఆ విశ్వమోహనునే ఆధ్యాత్మికముగా నాలింగనము చేసికొందుము. అతని యనంతాభివ్యక్తి యందలి విశ్వానందము మనలో ప్రవహించుచూ, ప్రతి రూపమునూ, ప్రతి వ్యాపార మునూ గైవసమొనర్చుకొని, దేనిచేతనూ బంధించబడక, దేనియందునూ నిలిచి పోక, ఉత్తమోత్తమాభివ్యక్తికై నిత్యమూ ప్రేప్సురుకుచుండును.

ఈ విశ్వప్రేమ బంధవిమోచకమేకాక, రూపాంతర ప్రాప్తిని సాధించగల శక్తి సమన్వితముకూడ. సకలరూపములకునూ వెనుకనున్న పరమ సత్య స్ఫురణమును పొంది, వాటి పరమార్థమును గ్రహించిన దగుటచే, హృదయమిక రూపములను నిరసించి త్రోసిపుచ్చదు. స్వార్థరహితుడైన కర్మనిష్ఠునియొక్కయూ, జ్ఞానియొక్కయూ సమత్వబుద్ధి, దివ్యప్రేమయొక్క అద్భుతస్పర్శచే, సర్వంకషమైన సంతోషపారవశ్యముగా, శతసహస్రముఖమైన మహదానందముగా రూపాంతరము చెందును సకలవస్తువులూ ఆ విశ్వమోహనుని యుపాధులగును. సకల వ్యాపారములూ తన లీలా సౌధమునం దతడుచేయు క్రీడలుగా గోచరించును. దుఃఖము సైతమూ దుఃఖముగా నుండదు. దుఃఖముల నిజతత్వమే మారిపోవును. దుఃఖ రూపవిశేషములన్నియూ నశించి, వానిస్థానమున ఆనందరూపవిశేషము లవతరించును.

జీవితమును దివ్యప్రేమానందక్షేత్రముగా మార్చివేయు చైతన్య పరివర్తనపు స్వరూప లక్షణమిది. సాధకుడు సామాన్యస్థితినిదాటి ఆధ్యాత్మికస్థితి నందుకొని, తేజోమయదృష్టి గల నూత్న హృదయముతో తననూ, ఇతరులనూ, సమస్త జగత్తునూ వీక్షింప మొదలిడినప్పుడే, పరివర్తనము ప్రారంభమగును. ఆధ్యాత్మికస్థితి విజ్ఞానస్థాయినిగూడ అందుకొన్నప్పుడది తన సహజ పరమోన్నతిని గాంచును. బాహ్యాభ్యంతర జీవనమునంతనూ రూపాంతరము నొందించు మహాశక్తి కాలవాలము కాగల స్థానమది.

* * *

ప్రేమస్వభావము నిట్లు పరిమితమూ సంకరమూనైన మానవభావోద్వేగమునుండి, మహోన్నతమూ సర్వసమగ్రమూనైన దివ్యభావోద్వేగములోనికి రూపాంతరము నొందించుట యనునది, ఐహికబంధము లమితముగా గల్గిన మానవేచ్ఛకు సమ్మతమగుట దుష్కరమే కావచ్చునుగాని, మానవబుద్ధికిమాత్రము దానినూహించుట అంత కష్టసాధ్యము కాదు. ప్రేమకర్మల సందర్భము వచ్చినప్పుడు మాత్రమే ఒక విధమైన అయోమయస్థితి యేర్పడుచుండును.

జ్ఞానమార్గ సాధనయం దొకవిధమైన 'అతి'లో బడుటకు వీలున్నట్లే, ఇక్కడకూడ, ప్రేమను కర్కశములైన ఐహికకర్మలతో సమన్వయపరచు చిక్కునుండి తప్పించుకొనుటకు, అసలాకర్మలనే పరిహరించవచ్చును. బాహ్యకర్మక్షేత్రమునుండి విరమించి, హృదయగుహయందు పరమేశ్వరు నర్చించుచూ ఏకాంతవాసమున కాలక్షేపము చేయవచ్చును. భగవద్భక్తిని వెల్లడిచేయు ప్రార్థనలు, స్తోత్రములు, పూజలు మున్నగునవి కాని, వీటికి సంబంధించిన ఇతరములు గావి మాత్రమే చేయుచూ, తక్కిన సకలమునూ వర్జింపవచ్చును. భాగవత జీవనమున నిమగ్నము కావలెనను తన యాంతరంగికాభిలాషలు తీర్చుకొనుటకు మన యాత్మ అంతర్ముఖత్వమునే భజింపవచ్చును లేదా, జీవనద్వారములను కొంచె మెక్కువగా తెరచి, మన భగవద్భక్తిని మన చుట్టునున్నవారికి మన జాతికి సేవ చేయుటలో వినియోగించుటయూ కలదు. సకల ప్రాణులకునూ హితకరమైన పనులు సేయుచూ, ఒక విధమైన ఆధ్యాత్మిక భావపూరణచే వాటికి కొంగ్రొత్త రూపు దిద్దుటకు ప్రయత్నించవచ్చును. అథమపక్షమున, కేవలము నైతికములై కనుపట్టు నా చేష్టలకు ఆధ్యాత్మికలక్ష్యపూర్వకమైన శక్తిని జోడించుట జరుగవచ్చును.

నేటి మతధర్మపరాయణుల మనస్సు సామాన్యముగా నిటువంటి పరిష్కారమునే కోరుచున్నది. దైవభక్తినీ దివ్యజ్ఞానమునూ ఆధారముచేసికొని జీవితము నడపువాని కిదియే ఉచితమైన కర్మక్షేత్రమను వాదన యిప్పుడెల్లెడల వినవచ్చుచున్నది. కాని, దివ్యజీవనమును ఐహికజీవనముతో నేకముచేయ నుత్సహించు పూర్ణయోగము, పరోపకారరూప నైతిక నియమముల సంకుచిత క్షేత్రమున నిమిడి యుండజాలదు. సకల కర్మలునూ ఆ యోగమునందు దివ్యజీవనమున నంతర్భాగమై విలసిల్లవలెను. కేవలము మన ప్రేమవృత్తులూ పరోపకారవృత్తులేకాక, మన జ్ఞానవృత్తులూ, రసికవృత్తులూ, సృజనవృత్తులూ, ఆత్మానందవృత్తులూ అన్నియూ గూడ దివ్యజీవనములోని భాగములే కావలెను. ఈ పనులను బహిర్ముఖముగనూ మానసికముగనూ గాకుండ, అంతర్ముఖముగనూ ఆధ్యాత్మికముగనూ నిర్వర్తించుట దాని పద్ధతి. ఈ లక్ష్యముతోనే అయ్యది, సకల వ్యాపారములనూ దివ్యప్రేమతో, దివ్యసమర్చనముగా, దివ్యరసానందమున నెరవేర్చు

కౌశలము నలవరచును. జీవనమంతయూ నప్పుడు, పరమాత్మ నుద్దేశించి జీవాత్మ చేయు ప్రేమకర్మయజ్ఞముగా మారిపోవును.

కావున, కర్మలద్వారా జీవనము ఈశ్వరార్చనముగా మార్చివేయుటకు వీలున్నది. 'భక్తిపూరిత హృదయముతో ఎవడు ఏ పత్రమునుగాని, పుష్పమును గాని; ఫలమునుగాని, తోయమునుగాని నాకు సమర్పించిననూ, నేను దాని నందు కొని భోగించెదను.' అన్నాడు గీతలో భగవానుడు. అట్లు భక్తితో బాహ్యవస్తువు లను సమర్పించుటయే కాదు. మన బుద్ధులు, మన చింతనలు మన యింద్రియ జ్ఞానము, మన బాహ్య ప్రవృత్తులు,—అన్నియూ ఆ యనంతునికి నివేదితములు గావచ్చును ఆయా ప్రత్యేక కర్మలకూ కర్మస్వరూపములకూ నొకవిశేష ప్రాము ఖ్యమే యున్నమాట నిజము. కాని, యే దృష్టితో ఆకర్మలు చేయబడుచున్న వను నదిఅన్నిటికంటె ముఖ్యమైన విషయము. ఆ దృష్టియొక్క సంకేతములే,— భౌతిక రూపములే ఆ కర్మలు. దానిని బట్టియే ఆ కర్మలకు రావలసిన సంపూర్ణమైన విలువవచ్చును.

లేక, ఇక్కడ నింకొకసంగతి చెప్పవచ్చును. భగవద్భక్తియొక్క పూర్ణ వ్యాపారమునకు మూడంగములున్నవి. మూడును ఒకే వ్యాపారము నభివ్యక్తము చేయును. ఒకటి, ఆ వ్యాపారములోని ఈశ్వరార్చన విధి. రెండు, ఆ వ్యాపార విశేషమునందు ఈశ్వరునితోడి సంబంధమునూ, లేక యొక దర్శనమునూ తదన్వే షణమునూ వ్యక్తముచేయుట కేర్పడిన సంకేతము. మూడు, హృదయములో, ఆత్మలో, ఏకత్వభావనాభిలాష, అంతరంగికభక్తి. కావున, జీవనము ఈశ్వరా ర్చనముగా మారిపోవుటకు మూడు పనులు జరుగుట యవసరము. ఒకటి, విశ్వా తీత విశ్వజనీన ప్రేమదృష్టినీ, ఏకత్వభావననూ జీవనమున కేడుగడ గావించుట. రెండు, ప్రతివ్యాపారమూ భగవద్భక్తికినీ భగవంతునితోడి సంబంధమునకూ సంకేతమై వరలునట్లు చేయుట. మూడు, మనము చేయు సమస్తమూ నొక అర్చన విధి యగునట్లు చేయుట; ప్రాణమును విధేయమొనర్చి, హృదయమును సమర్ప ణము గావించి, బుద్ధికి గ్రహణశక్తి నలవరచి, ఆత్మతో అనుసంధానముచేయు క్రియాకలాపముగా మార్చుట.

వివిధ సంప్రదాయముల యందలి ప్రతీకలూ, క్రియాకలాపములూ, రూపకల్పనలూ కేవలము సౌందర్య విశిష్టములుమాత్రమే కావు. సాధకుని హృదయాభిలాషనూ భావావేశమునూ బయటికి ప్రస్ఫుట మొనర్చి శక్తిపూరితముగావించు భౌతికసాధనలుకూడ. ఏలయన, ఆధ్యాత్మికాభిలాషచే ప్రేరితము కాని యర్చన మెట్లు వ్యర్థమూ అర్థరహితమూ ననిపించుకొనునో. అట్లే రూపకల్పనము చేతనూ క్రియాకలాపము చేతనూ పరిపుష్టము కాని యాధ్యాత్మికాభిలాష యుపాధిశూన్యమై, జీవితమున సమగ్రశక్తిని పూరించలేనిదగును. మానవ జీవితమున సకలరూపకల్పనలూ సర్వసామాన్యముగా చిట్టెము గట్టిపోయి కేవలము లాంఛనప్రాయముగ నయారగుట సంభవించుచుండును. రూపకల్పనలయూ సంప్రదాయములయూ అంతర్యములోనికి జొరగలవారికవి యెప్పుడునూ శక్తిపూరితములుగనే తోచును. కాని, సామాన్యముగా మాత్రము, క్రియను యంత్రప్రాయముగ నిర్వర్తించుటయూ. ప్రతీకను నిర్జీవవస్తువుగ నుపయోగించుటయూ జరిగి, తన్మూలమున మతధర్మముయొక్క ఆత్మకే హాని ఘటిల్లుచుండును గాన. సంప్రదాయములనూ రూపకల్పనలనూ తుట్టతుదకు మార్చుకొనుటయో, లేక పూర్తిగపరిహరించుటయో చేయవలసివచ్చుచుండును.

ఈ కారణము చేతనే, సకల సంప్రదాయములనూ సకల రూపకల్పనలనూ సంశయదృష్టితో తిలకించుచూ, వాటియెడ వైముఖ్యభావము కలిగియుండువారు కలరు. కాని, బాహ్యప్రతీకల సాహాయ్యము నెవరునూ సామాన్యముగ నపేక్షింపకుండ నుండజాలరు. మానవ ప్రకృతిలో ఒకానొక దివ్యాంశ తన యాధ్యాత్మిక సంతృప్తి కొరకు నిరంతరమూ వాటిని కోయుచుండును. సత్యమై, హృదయపూర్వకమై, సుందరమై, ఆనందసంధాయకమై యున్నంతవరకు, ప్రతీక యెప్పుడునూ అపేక్షింప దగినదే. రసావేశముగాని భావావేశముగాని ఏమాత్రమూలేవి ఆధ్యాత్మికచేతన సమగ్రమైన యాధ్యాత్మిక చేతన కానేరదు. ఆధ్యాత్మికజీవనమున, సంతతధారగా ప్రవహించు ఆధ్యాత్మికచేతనయే సాధకుని చేష్టల కాధారమై యుండి, క్రొంగ్రొత్త రూపములలో తనను దా నభివ్యక్తపరచుకొన జూచుచుండును. ప్రాతరూపముల సత్యమును ఆత్మచైతన్య ప్రవాహముచే క్రొంగ్రొత్తగా ప్రకాశింపజేయుచుండును. అట్లది తనను దా నభివ్యక్తయొనర్చు కొనుచూ, ప్రతి

చేష్టనూ ఆత్మవస్తువునందలి ఒకానొక సత్యవిశేషమునకు సజీవ ప్రతీకగా విలసిల్లు నట్లు చేయుట దాని సృజనాత్మక దర్శనప్రేరణముల సహజ ధర్మము. కావుననే ఆధ్యాత్మిక సాధకుడు జీవనమును విడనాడకయే, దానిని రూపాంతర మొందించి, దాని నిజతత్వమును ప్రకాశింప జేయవలసి యున్నది.

పరమదివ్యప్రేమ సృజనాత్మకమైన యొక దివ్యశక్తి. అయ్యది తనలో తానే నిశ్శబ్ద నిర్వికార స్థితిలో నుండిపోగల్గియూ, బాహ్యరూపములలో తనను దా నభివ్యక్త మొనరించుకొనుట కుత్సహించుచుండును. ఉపాధిరహితమైన మూక దైవముగ నుండిపోవలసిన దురవస్థ లేదు దానికి. అసలు, సృష్టియే సాక్షాత్తుగ నొక ప్రేమకర్మయని చెప్పబడినది. దివ్యప్రేమ తన ప్రతీకలను సృష్టించుకొని, పరస్పర సంభావనములచేతనూ, ఆత్మ ప్రదానముచేతనూ ఆత్మసాఫల్యమును సాధించుటకీ సృష్టి యొక క్షేత్రమనియైననూ చెప్పదగును. ప్రారంభములో సృష్టియందీ ధర్మము గోచరించక పోవచ్చును. కాని, దాని చరమలక్ష్యము మాత్ర మదియే యని చెప్పుట కాక్షేపములేదు. అది యిప్పుడే ఎందుకు గోచరించదనిన, ప్రపంచ మున దివ్యప్రేమయే ఈ సకల జీవుల పరిణామక్రమమునకునూ ఆధారముగ నున్ననూ, జీవన ప్రవృత్తి అహంకారభూయిష్ఠమై విభేదపూరితమై యున్నది. బయటికి ఉదాసీనముగా, లేక ప్రతికూలముగా కానవచ్చు ప్రాణశూన్య జడపదార్థ ప్రపంచమునం దీ తమ ఉనికిని ప్రతిష్ఠించుకొనుటకై జీవనచేతనల పోరాటము జరుగుచున్నది.

ఈ పోరాటపు గందరగోళములో, సకలమూ నొండొంటితో ఢీకొను చున్నవి. ప్రతిదియూ ముఖ్యముగా తన యునికినే ప్రతిష్ఠించుకొన గోరుచున్నది. ఇతరులలో తనను ప్రకటించుకొనుటను అప్రధానముగ పరిగణించుచున్నది. ఏలయన, మానవుని భూతదయా పరత్వమునకు సైతమూ అహంకారమే మూలము. జీవాత్మ అద్వైతరహస్యము నెరుగువరకూ అది యట్లు కాకతప్పదు. దాని పరమమూలస్థానమున దానిని కనుగొని, లోపలినుండి వెలుపలికి గొనివచ్చి జీవనముయొక్క కడపటి యంచులవరకూ దాని వెలుగును ప్రసరింపజేయుటయే మన యోగలక్ష్యము. సకల కర్మయూ, సకల సృష్టియూ నీ సంప్రదాయము యొక్క, ఈ పూజావిధియొక్క, ఈ యజ్ఞానుష్ఠానముయొక్క రూపవిశేషముగా,

ప్రతీకగా మారిపోవలెను, ఆత్మనివేదనము, దివ్యచైతన్య గ్రహణము, దాని పరావర్తనము, జగద్వల్లభుని సేవ, ఆత్మప్రదానము, సర్వసమర్పణము,—ఈ లక్షణములచే నయ్యది ముద్రితము గావలెను. బాహ్యకర్మలలో నియ్యది వీలైనప్పుడెల్ల ప్రస్ఫుటము గావలెను. అంతఃప్రవృత్తియందునూ, భక్త్యావేగమునందునూ అన్నివేళలా గోచరించవలెను.

ఈ కర్మకలాపములోని పూజాభావమే స్వయముగా ఒక గొప్ప యజ్ఞము. తనంతటతానే ఎన్నిరెట్లుగనో వృద్ధిచెందు దాని స్వభావమే అద్వైత సాక్షాత్కారమునకు దోడ్పడి, దివ్యత్వకాంతిప్రసారమును సుసాధ్యమొనర్చును. పూజాభావము కర్మలో రూపొందినప్పుడు అది తన మార్గమును సువిశాలమొనర్చుకొనుటయేగాక, జగత్తులోని కఠినతరమైన కర్మమార్గమును సైతమూ దివ్యప్రేమానంద భావావేశముతో నింపును.

ప్రారంభదశలో సామాన్యముగా నీ భావావేశముండదు. కఠోరమైన ఆధ్యాత్మిక సంకల్పము మాత్రమే శ్రమాకులమైన బిగివితో కడు నిర్త్రయైన మార్గమున పైకెగబ్రాకుచుండును. హృదయమింకనూ సుప్తమై యుండునే కాని మేల్కొనదు. దివ్యప్రేమ ఉదయించుటతోడనే, మార్గముయొక్క కాఠిన్యము తగ్గును. శ్రమ బిగివి సడలి కొంత తేలికయిచ్చును. కష్టములలోపలనే ఒక విధమైన మాధుర్యము, ఆనందము ద్యోతకమగును. మన సంకల్పశక్తి, మనకర్మలు, మన ప్రవృత్తులు,—ఇవన్నియూ మనము పరాత్పరునికి సమర్పణము చేయవలసినదే. కాని ప్రేమయొక్క సమర్పణముతోగాని యీ సమర్పణము నిర్దుష్టమూ సర్వసమగ్రమూ కానేరదు. సకల జీవనమూ ఈ సంప్రదాయముగ మారిపోవలెను. సకల కర్మలూ ఈశ్వర ప్రేమతో, ఈశ్వరుని మారువేషములుగా సకల భూతములనూ దర్శించు విశ్వప్రేమతో నిర్వర్తింపవలెను. అప్పుడే అయ్యది పూర్ణయోగములో నంతర్భాగ మగును.

హృదయపూర్వకమైన పూజాభావమును అంతరమున సమర్పించుచూ, ప్రతీకయందునూ క్రియయందునూ దాని యాత్మను పూరించగలుగుటయే యజ్ఞముయొక్క ఆయువుపట్టు. యజ్ఞహవిర్దానము సర్వసమగ్రము కావలెననిన, మన భావావేశములన్నియూ పరమాత్మ దెసకు మరలుట యత్యవసరము. మానవ

హృదయమును విశుద్ధ మొనర్చుట కింతకంటె ఉత్కృష్ట మార్గమింకొకటి లేదు. నైతిక, రసాత్మక భావోత్కర్షకంటె గూడ శక్తిపూరితమైనదిది. అంతరాత్మ వేదికయం దగ్నిని ప్రజ్వలింపజేసి, భగవన్నామ పురస్సరముగా సమస్తమునూ ఆ యగ్నియందు హోమము చేయవలెను.

అప్పుడా కాకకు సకల భావావేశములునూ తమ స్థూలతనువులను విసర్జించును. దివ్యములుకాని వికార రూపములన్నియూ దగ్ధమైపోవును. లోపములు పరిహరించబడును. ఆ యగ్నిలోనుండియూ ధూమములో నుండియూ గంధములో నుండియూ సువిశాలమైన దివ్యప్రేమ, సునిర్మలమైన దివ్యానందము ఉదయించును. అట్లుదయించిన దివ్యప్రేమయే, మానవుని యందునూ సకల భూతముల యందునూ క్రియాత్మక సమత్వమున వ్యాపించియున్న పరమేశ్వరుని యెడ అంతర్భావుకతను పూరించుకొని, జీవనమునకు పూర్ణత్వము సంపాదించుటకెక్కువ శక్తిమంత మగును. పట్టి మానసికమైన విశ్వసౌభ్రాత్ర లక్ష్యమింత శక్తిమంతము కానేరదు. ఈ దివ్యప్రేమనే కర్మలలో పూరించినప్పుడు, విశ్వమంతయూ ఏక శ్రుతిలో మేళనముపొంది, సకల భూతములయందునూ నిజమైన యేకత్వము అనుభూతమగును. ఈ యైహిక ప్రకృతియందు విముక్తాభివ్యక్తియొక్క ముఖ్య కేంద్రముగా దివ్యప్రేమ ఆవిష్కారము కానంతకాలమూ, తదితర శ్రమలు లక్ష్యసిద్ధిని చేకూర్పజాలవు.

యజ్ఞమున కధ్వర్యుడుగా, మన యంతరముననున్న హృత్పురుషుడావిష్కరించవలసిన యవసర మిచ్చటనే యున్నది. ఏలయన, క్రియయొక్కయూ, ప్రతీకయొక్కయూ నిజతత్వమును సంపూర్ణముగ వెలికి దీసికొని రాగలిగినవాడీ హృత్పురుషుడే. ఆధ్యాత్మిక చేతన యింకనూ పరిపక్వము కాని స్థితిలో కూడ, ఈ హృత్పురుషుడే ప్రతీకకు నిత్య నూతనత్వమునూ సౌందర్యదీప్తినీ సంపాదించి, అది యొక నిర్జీవవస్తువై పోకుండ, పాపిష్ఠిగారడీగ మారకుండ కాపాడును. క్రియకు శక్తినీ విశిష్టతనూ చేకూర్చునదియూ నతడే. మన సత్తయందలి ఇతర భాగములు_ అనగా దేహ మనః ప్రాణములు_ విశేషముగా అజ్ఞానమునకు లోబడి యుండును గాన, సరియైన యుపకరణములు కాగల శక్తియే వాటికి కొరవడియున్నప్పుడవి ప్రమాదరహితమైన ప్రేరణకు తావలము లెట్లు కాగలవు? మనకు సరియైన మార్గము నెట్లు చూపగలవు?

యజ్ఞారోహణము-2

ఈ దేహ మనః ప్రాణముల సంకల్ప ప్రవృత్తులు చాలవరకు తమ పూర్వపుటలవాటులనే పట్టుకొని వ్రేలాడుచుండును. మనలను మహత్తర సత్త లోనికినీ విశాలతర ప్రకృతిలోనికినీ పరివర్తన మొందింప ప్రేరేపించు శక్తులనూ అంతర్వాణులనూ అయ్యవి తమ జడత్వముతో ప్రతిఘటించుచుండును. వాటియెడ అనిష్టమునుజూపుచూ, వాటిపై తిరుగుబాటు చేయుచుండును. ప్రతిఘటించుటయో, లేక సందిగ్ధముగ నామోదించుటయో చాలవరకు వాటి స్వభావము. ఏలయన, ఒక వేళ అంతర్వాణి పిలుపు నవి అందుకొనినన్నూ, తెలిసి బుద్ధిపూర్వకముగా గాని, తెలియక అలవాటు చొప్పునగాని, ఆధ్యాత్మిక ప్రవృత్తిలోనికి సైతమూ తమ సహజ దౌర్బల్య ప్రమాదములనే ప్రవేశపెట్టుచుండును. ఆధ్యాత్మిక ఫలితములను అహంకారిక ప్రయోజనములకై వినియోగించుకొనుట కనుక్షణమూ ప్రవర్తించు చుండును. ఆశక్తినీ, ఆ ఆనందమునూ, ఆ వెలుతురునూ అవరజీవనోద్దేశ్యముల నెరవేర్చుకొనుట కుపయోగపరచుకొనుచుండును.

సాధకుడు సర్వాతీత దివ్యప్రేమలోనికిగాని సర్వగత దివ్యప్రేమలోనికి గాని అడుగిడ నేర్చినపుడు కూడ, ఆ దివ్యప్రేమను సాధారణ జీవనమునందు నింపుటకతడు ప్రయత్నించిన యెడల, ఈ యవర ప్రకృతిశక్తుల విపరీత ధోరణులే ఆతని కడ్డుతగులుచుండును. వాని నెల్లప్పుడునూ గోతులలోనికి వడలాగు చుండును. ఆ మహనీయతలో తమ సంకుచితత్వమును నింపజూచుచుండును. క్రిందికి దిగివచ్చుచున్న ఆ దివ్యశక్తిని తమకొరకూ తమప్రయోజనముల కొరకూ కైవసమొనర్చుకొన గోరుచుండును. కామము కొరకునూ అహంకారముకొరకునూ పెంపొందిన అన్నమయ, ప్రాణమయ, మనోమయ సాధనవిశేషముగా దానిని సంకుచితపరుప జూచుచుండును. దివ్యతేజోమయమైన నూతన దివినీ నూతన భువినీ సృష్టిచేయవలసియున్న దివ్యప్రేమకు సంకెళ్ళువైచి, ప్రాత భువికి చెందిన మట్టికే బంగారు మలామా చేయుటకు, వెనుకటి ప్రాణమయ, మనోమాయా కాశములనే రంగులతో మెరయించుటకు బ్రయత్నించుచుండును.

ఈ కృత్రిమ ప్రయత్నమును కొనసాగనిచ్చినయెడల, ఆ దివ్యతేజమూ, దివ్యశక్తీ, దివ్యానందమూ తిరోహితమై, సాధకుడు పూర్వపు టధఃస్థితిలోనికే తిరిగి పడిపోవుట తటస్థించును. లేక, ఆ యుపలబ్ధి, కుదురుబాటులేని సాంకర్య

స్థితితో పెనగొనియుండుట సంభవించును. లేక, యథార్థమైన ఆనందము కానేరని యవరోల్లాసముచే కప్పువడిపోవు స్థితి సంప్రాప్తించును. ఈ కారణముచేతనే, సకల శక్తికినీ మూలకేంద్రమైనదివ్యప్రేమ-బంధవిమోచకమూ, నిర్మాణాత్మకమూ నైన శక్తులలోకెల్ల అత్యంత శక్తిమంతమైన దివ్యప్రేమ,- ఈ యైహిక జీవన మున నింతవరకునూ ఇతర శక్తులకంటె మరుగుననే యుండిపోవుటయూ, బంధ విమోచనము సాధించుటలో నేమి నూతన నిర్మాణమును గొనసాగించుటలో నేమి ఇతర శక్తులంత విజయవంతము గాకపోవుటయూ జరుగుచున్నది.

దివ్యశక్తులన్నిటిలోనూ అయ్యది అత్యంత ప్రబలము, విశుద్ధము, అపురూపము. ప్రగాఢము నైనందువలననే, మానవ ప్రకృతి దానిని విశుద్ధరూపమున భరించలేకపోవుచున్నది. ఆ దివ్యప్రేమలో ఏమాత్రము లభించిననూ అది వెంటనే ప్రాణసంబంధమైన ధార్మికోద్వేగముగనో, నైతికమైన భావవిస్ఫూర్తిగనో, ఇంద్రియసంబంధమైన శృంగార భక్తిగనో సంకరముచెందును. తన యజ్ఞజ్వాలి కలచే ప్రపంచమును పునర్నిర్మించగల ఆ దివ్యాగ్నికి వేదికకాలేని కారణముచే, మానవ ప్రకృతి ఈ మాయ వెలుగులతో తృప్తిపడుచుండును. ఈ ప్రమాదము లలో పడిపోకుండ యజ్ఞపరిసమాప్తి చేయించవలెనన్న, లోన దాగియున్న హృత్పురుషుడే తన సంపూర్ణశక్తితో బయటికి రావలెను. అట్లు వచ్చినపుడతడు అనుక్షణమూ, ప్రాణసంబంధమైనట్టియూ మనస్సంబంధమైనట్టియూ అసత్య వృత్తుల నన్నింటినీ పట్టుకొని బట్టబయలొనర్చి తూలగొట్టుచూ, దివ్య ప్రేమా నందముల నిజతత్వమును గైవసమొనర్చుకొని. అపమార్గములలోనికి లాగుకొని పోవు ప్రాణిక మానసికోద్వేగములనుండి దానిని వేరుచేసివైచును. దేహ మనః ప్రాణములలో నిహితమైయున్న సత్యవిషయములను మాత్రము పరిహరించక, అసత్య విషయములనుండి వాటిని విడదీసి, ఈ మహాయాత్రలో దనవెంట గొని పోవుచూ, అవి చేరవలసిన ఉన్నత శిఖరములకు వాటిని జేర్చును.

కాని, హృత్పురుషుడీ యవరప్రకృతి సంఘాతమునుండి తన్నుదా నుద్ధ రించుకొని అత్యున్నత ఆధ్యాత్మిక భూమికల నందుకొనినగాని, ఇచటి కవరో హించిన యాదివ్యవిస్ఫులింగము, ఆ దివ్యజ్వాలిక తన మూలస్థానమైన దివ్య తేజోగగనమును చేరుకొనినగాని, అతని అధినేతృత్వము మనకి మహాయాత్రలో

సరిగ నుపయోగపడజాలదు. హృత్పురుష డెప్పుడట్టి యున్నత స్థాయిని గాంచునో అప్పుడు, ఆధ్యాత్మికచేతన దేహ ప్రాణ మనోమయకోశములందు జిక్కువడిన యపరిపూర్ణస్థితినుండి తప్పించుకొని, స్వతంత్రమూ, విశుద్ధమూ, సువిశాలమూ నైన పూర్ణస్థితిని బడయగల్గును. అచట, జ్ఞానమయుడైన ఆ యనంతుడే మనలో జ్ఞాతయై, మన సకల జ్ఞానమునూ ఎట్లు ఉద్దీపింపజేసి వినియోగించునో, అట్లే, ఆనందమయుడైన ఆ యనంతుడే మనలో మోహనమూర్తియై, ఈ విశ్వలీలలో నికి జారబడిన తన దివ్యాంశలను తనదెస కాకర్షించుకొనుచూ, అనేకముగా అభి వ్యక్తమైన తన యాత్మలనే ఆనందమయైక్యమున దోగాడజేయును. ఈ లోకము లోని సకల సౌందర్యమూ నచట ఆ ప్రియతముని సౌందర్యమే. ఆ దివ్యసుంద రుని వెలుగుక్రిందనే సకల సుందరరూపములునూ నిలిచి, తమకు రూపాంతర ప్రాప్తిని ప్రసాదించగల దాని దివ్యశక్తి కధీనములు గావలసియున్నది.

అచట సకలానందమూ ఆ ఆనందమయునికిసంబంధించినదిగనేయుండును. ఈ యవర సుఖభోగాదు లన్నియూ నచట ఆ దివ్యశక్తి ప్రవాహవేగమునకు వశంవదములై పోవును. దాని యాఘాతమునవి తట్టుకొనలేక తుత్తునియలై పోవు టయో, లేక, దివ్యానందరూపభేదములుగా రూపాంతరము నొందుటయో జరుగక తప్పదు. ఇట్లు వ్యష్టిచేతనయందు, అజ్ఞాన వికారములను ప్రాభవముతో సంబా ళించగల దివ్యశక్తి యొకటి అభివ్యక్తమగును. తుట్టతుదకు, అనంతుని దివ్య ప్రేమానందముల అపార వాస్తవికస్వరూపమును ఈ యైహిక జీవనములోనికి గొనితెచ్చుటకు అవకాశమేర్పడ నారంభించును. లేక, మన యాధ్యాత్మికచేతన, మనోభూమిక నతిక్రమించి, విజ్ఞాన భూమికయందలి తేజస్సునూ, శక్తినీ, విశాల తనూ అందుకొనుటకు మొదలిడును. మనస్సున కతీతమైన ఆ విజ్ఞానముయొక్క ఓజస్తేజములలో దివ్యమైన ఆత్మాభివ్యక్తి యొక్కయూ, ఆత్మవ్యవస్థయొక్కయూ వైభవానందము లిమిడియున్నవి. ఆ వైభవానందములే ఈ ప్రపంచమును అజ్ఞా నమునుండి ఉద్ధరించుటయేకాదు, ఆత్మవస్తువుయొక్క సత్యస్వరూప విశేషముగ దానిని పునస్సృష్టి యొనర్చును.

మనస్సున కతీతమైన ఆ విజ్ఞానము సంసిద్ధికినీ, అత్యంత మహోన్నతికినీ, సర్వంకషమైన అంతరంగిక భక్తి విశాలతకునూ, సుస్నిగ్ధమూ సమగ్రమూనైన

ఐక్యానుభూతికినీ ఆలవాలము. అందు దివ్యప్రేమ దివ్యజ్ఞానముయొక్క శక్త్యా నందములను తన వెలుగు రెక్కలపై మోసికొని యెగురుచుండును. విజ్ఞాన భూమికయందలి దివ్యప్రేమ, ముక్త మనస్సునకు స్వర్గతుల్యముగదోచు శూన్య శాంతినీ తటస్థనిశ్చలతనూ అతిక్రమించిన తీవ్రానందోపలబ్ధిని గలుగజేయును. ప్రేమ సాధించు సమైక్యము విజ్ఞానభూమికయందు తన యావచ్ఛక్తినీ వికసింప జేసికొనును. సకల విభేదములనూ తనయందంతర్భుక్త మొనర్చుకొనియూ, వాటి లోపములచేగాని యపశ్రుతులచేగాని విక్షేపము చెందని సమైక్యమది. జీవాత్మ పరమాత్మల ఐక్యమే పునాదిగా, సకలభూతములతోడనూ గాఢ సమైక్యాను భూతిని కలిగించునది యగుటచే, అందు సకల సంబంధ బాంధవ్యములునూ చక్కగ సమ్మేళనముబొంది, ఐక్యమును మరింత పరమోత్కృష్టమూ పరి పూర్ణమూ నొనర్చును.

అతిమానసవిజ్ఞాన విశిష్టమైన ప్రేమయొక్క శక్తి సకల సంబంధ విశేషము లనూ నిస్సంకోచముగ, నిరుపద్రవముగ చేబట్టి, సంకుచితములైన మానవ సన్ని వేశముల నడుమనుండి వాటిని తప్పించి, దైవమున కభిముఖమొనర్చి, దివ్యజీవ నమునకు యోగ్యమైన వస్తువుగ సంస్కరించుటకు సమర్థమైయుండును. దివ్య సమైక్యమునకుగాని పరిపూర్ణ ఏకత్వమునకుగాని భంగపాటు లేకుండ భేదలీలను కొనసాగించు శక్తి విజ్ఞానభూమికానుభూతికి స్వతస్సిద్ధము. విజ్ఞానచేతన మానవు లతోగాని ఇతరజగత్తుతోగాని సకలవిధ సంబంధములనూ విశుద్ధ తేజస్స్ఫూర్తితో నిర్వహింపగలిగియుండును. ఏలయన, జీవాత్మ యప్పుడు సకల భావస్ఫూర్తికీ, సకల సౌందర్య రసాన్వేషణకూ లక్ష్యముగా, నిత్యమూ, అద్వయుడైన ఆ యనం తునే దర్శించుచుండును. సకల ప్రాణులయందునూ సకల భూతములయందునూ, అద్వయుడైన యా పరమేశ్వరునితో కలయికను సాధించుటకొరకే, విశాలమూ విముక్తమూనైన ఐహికజీవనశక్తి నంతనూ ఆధ్యాత్మికముగా వినియోగింప గల్గును.

## యజ్ఞారోహణము-2

మూడు తెరగుల యజ్ఞకర్మలలోనూ మూడవదియూ కడపటిదియూ నగు ప్రాణకర్మలను గూర్చి యిక ప్రస్తావించవలసియున్నది. కర్మయోగమునకు ప్రత్యక్షముగా సంబంధించి యున్నదంతయూ నీ ప్రాణకర్మల క్రిందికి జేర్చ వచ్చును. ఏలయన, ఈ ప్రాణకర్మలే దాని ప్రధానక్షేత్రము. జీవితముయొక్క బాహ్యప్రవృత్తులన్నియూ వీటిక్రిందికి వచ్చును. భౌతిక జీవితానుభవమునకై బాహ్యప్రవృత్తిలోనికి చొరబడు జీవితేచ్ఛయొక్క నానావిధ శక్తి విశేషములునూ వీటికి సంబంధించినవే పరమును సాధించగోరిన ఆధ్యాత్మిక సాధకులు కొంద రీ ప్రాణకర్మలు పరమసత్యమునకు కేవలము విరుద్ధములని యెంచి, తొలగద్రోయ రాని యజ్ఞాన తిమిరమున కీ యైహిక జీవనము నిలయమనెడి భావముతో, దానిని తప్పనిసరిగ త్రోసిపుచ్చుట కలదు. కాని, ఈ ప్రాణకర్మలపై ఆధ్యాత్మిక విజయము సాధించి, దివ్యలీలలుగా వాటిని పరివర్తన మొందింపవలెనని పూర్ణయోగ మాసించుచున్నది.

వైరాగ్యపద్ధతి నెక్కువగా అభిమానించు సాధకులు కొంద రీ యైహిక జీవనమును పూర్తిగ త్యజించిన త్యజించవచ్చుగాక. మరికొందరు ఆ విధమున త్యజించకపోయిననూ, గుప్తచేతనయొక్క తాత్కాలిక క్రీడారంగముగా దానిని ఆమోదించిన ఆమోదించవచ్చుగాక. పూర్ణయోగ సాధకుడుమాత్ర మట్లుగాక, గుప్తచేతనయొక్క పూర్ణావిష్కృతికినీ, పూర్ణసంసిద్ధికినీ, దివ్యకర్మ ప్రవృత్తికినీ, ఈ యిహజీవనము రంగభూమియని గుర్తించి, దానిని సంపూర్ణముగా జేపట్టి నిర్వహించును. దైవమును తనలో కనుగొనుట యతని మొదటి లక్ష్యము. కాని, ఆ దైవమునే, పైకి తద్విరుద్ధముగా గన్పడు ఈ ప్రపంచమునందు సైతమూ అతడు సమగ్రముగా కనుగొనవలసియున్నది. తుదకు, సర్వాతీతుడైన ఆ యనంతుని దివ్యశక్తి విజృంభణమును సర్వత్ర కనుగొనవలసియున్నది. అట్లా దివ్యత్వ మీ ప్రపంచములోనికినీ, ఈ జీవాత్మలోనికినీ అవతరించినప్పుడే, ఇవి తమ ముసుగులను భేదించుకొని, దివ్యరూపముతో, దివ్య ప్రవృత్తితో ప్రకాశించ గల్గును.— ఇప్పుడా దివ్యత్వము వాటియందు గుప్తమై అణగియున్నది.

పూర్ణయోగము ననుసరింపగోరు సాధకు లీ పూర్ణయోగ లక్ష్యమును సంపూర్ణముగ నామోదించుట అత్యవసరము. మార్గమున గల తీవ్రావరోధములను తెలిసికొనకయే ఆమోదించుట పనికిరాదు. ఈ సంసిద్ధి చేకూరితీరునని కాకపోయిననూ,

చేకూర్చుటకు అవకాశమున్నదనియైన, ఇతర యోగసాధనము లే కారణముచే అంగీకరింప విచ్చగింపకున్నవో, అద్దానిని పూర్ణయోగ సాధకుడు పూర్తిగా తెలిసికొనియుండవలెను. ఏలయన, అన్నమయ ప్రకృతిలోని ఈ ప్రాణకర్మల నిర్వహణమునందే,— ఈ నిత్యజీవిత కర్మల యనుష్ఠానమునందే,— ఉన్న కష్టమంతయూ నున్నది. ఈ కష్టమును జూచి వెరచియే, తత్వశాస్త్రము ప్రపంచమునకు దూరమైన ఏకాంతశిఖరముల కెగిరిపోవుట సంభవించినది. మతధర్మముల దృష్టి ఈ భౌతిక శరీరధారణమనెడి వ్యాధినుండి తప్పించుకొనుటకు ఎచ్చటనో గల పరలోకముపైననో, నీరవ శాంతిసమన్వితమైన నిర్వాణముపైననో లగ్నమగుట తటస్థించినది.

కేవల జ్ఞానమార్గము,— అజ్ఞాన సంబంధమైన ప్రతిబంధకము లెన్ని యున్ననూ, కర్మమార్గము కంటె సరళమూ, సుగమమూ అనియే చెప్పవచ్చును. అట్లే, కేవల ప్రేమమార్గము గూడ, విషమపరీక్షలూ కష్టములూ ఎన్నియున్ననూ, స్వేచ్ఛాకాశమున నెగురుట పక్షికెంత సులభమో అంత సులభగమ్యమని చెప్పవచ్చును. ఏలయన, జ్ఞానముయొక్కయూ ప్రేమయొక్కయూ మూల స్వరూపము స్వాభావికముగ కరువిశుద్ధము. ప్రాణశక్తుల సందిగ్ధ ప్రవృత్తిలోని క్రిద్వబడిన బాహ్యజీవనపు మోటునడకల కొరకునూ, నీచోద్దేశ్యముల కొరకునూ వినియోగించబడినప్పుడు మాత్రమే అయ్యవి మలినములు సంకరములునై, అధోగతికి పాల్పడును.

ప్రాణశక్తి అటులగాదు. అయ్యది మూలములోనే కొంత మలినమై యున్నట్లు గోచరించును. దానిస్పర్శచే, దాని మాంద్యపు ముసుగులందు కప్పబడుటచే, దివ్యవిషయములుసైతమూ సామాన్యములూ పంకిలములూనై, దాని వైపరీత్యములనే తాముగూడ బొందుచూ, ఆసురికములై పోవుచుండును. తమోమయమైన జడత్వమే దానికి మూలము. దేహవాంఛలచే సకలమూ క్షుద్రమనస్సునకూ క్షుద్రావేశములకూ కట్టుబడిపోవుట సంభవించును. కొరమాలిన చిన్నచిన్న వృత్తులూ, వ్యాపారములూ, అక్కరలూ, ఆత్రతలూ, సుఖములూ, దుఃఖములూ మొదలగునవియే పునఃపునః ప్రవర్తమానము లగుచుండును. వాటివలన ఏ యుత్కృష్ట ప్రయోజనమూ సాధించబడదు. దిక్కుతోచని యజ్ఞానముచే అయ్యది ముద్రితమైయుండును.

## యజ్ఞారోహణము-2

జడత్వలక్షణోపేతమైన యీ భౌతిక మానసము క్షుద్రములైన భౌతిక దేవతలనుతప్ప ఏ దివ్యత్వమునూ విశ్వసింపదు. కొంత సుఖమునూ, హాయినీ, క్రమగతినీ ఒకవేళ అభిలషించిననూ, ఆత్మోన్నతినీ, ఆధ్యాత్మిక విమోచనమునూ మాత్ర మభిలషింపదు. కేంద్రస్థానమున బలవత్తరమైన జీవితేచ్ఛ కాన వచ్చుననుట నిజమే కాని, అయ్యది అంధప్రాయమైన అసురశక్తి, జీవితమును శ్రమాకుల మొనర్చి, గందరగోళమున బడద్రోయుట కుత్సహించుశక్తి. మంచి చెడుగులు, సుఖదుఃఖములు, వెలుగుచీకటులు,— ఈ ద్వంద్వములతో కలగా పులగమైయున్న యుద్రేకములను విడనాడనొల్లని మానవ, లేక రాక్షసవాంఛా స్వరూప విశేషమది. అది యీ ద్వంద్వములనే ప్రేమించుచూ, వాటినే అంత కంత కెక్కువగా అనుభవింప గోరుచుండును. వాటివలన బాధలుపడి యాక్రోశించునప్పుడుగూడ వాటినే పట్టుకొని వ్రేలాడుచుండునుగాని తదితరము నొల్లదు.

ఇంకొక విధమైన జీవితేచ్ఛ యున్నది. ఆదర్శ మానసము ననుసరించుట దాని పద్ధతి. జీవితములోనుండి కొంత సామరస్యమునూ, సౌందర్యమునూ, ఉదాత్తతనూ, వెలుగునూ, సాధించుటకై యాదర్శమానసము చేయు ప్రయత్నము దెసకీ జీవితేచ్ఛ యాకర్షించబడును. కాని, ప్రాణమయ ప్రకృతిలో నిది యొక స్వల్పాంశము మాత్రమే. ప్రాణమయ ప్రకృతిలోని తీవ్రతరములైన యితర శక్తులు దీనిని కడు తేలికగా నణచివైచుచుండును. ప్రాణమయ ప్రకృతికి అందుబాటుకాగల విధముగా దిగి వినిపించిననే తప్ప, మనోమయప్రకృతి కతీతమైన పిలుపునది యందుకొనజాలదు. మతధర్మము సామాన్యముగా నిట్లే సంకుచితమగుచుండును. యోగసాధకుడు తనలో ఈ శక్తులన్నియు నిట్లు తనను చుట్టుముట్టుచుండుట నానాటి కధికతరముగ గురుతింప గలుగుచుండును. వీటి పట్టునుండి తప్పించుకొని బయటపడుటకే యతడు హోరాహోరి పోరాడవలసియున్నది. ఇది చాలా కష్టమైన పని.

ఏలయన, మానవ ప్రకృతిని కుక్కతోకతో పోల్చుట ఎంతయూ సమంజస మనిపించునంతటి బలవత్తరమైన ప్రాభవ మీ శక్తులకు గలదు. నీతిచేగాని, ధర్మముచేగాని, తర్కముచేగాని, మరి యే ఇతర ప్రయత్నముచేగాని, ఈ మానవ ప్రకృతిని ఎంత సరిచేయ ప్రయత్నించిననూ అది తుదకు ఎప్పటివలె

తిరిగి వంకరయగుచునేయుండును. ఎంత విశుద్ధినీ, ఎంత స్వతంత్రతనూ సంపాదించిన యోగులకుగూడ, దీని కుతంత్రమునుండియూ దురాక్రమణము నుండియూ తప్పించుకొన గలుగుదుమను ధైర్యముండదు. ఈ జీవితేచ్ఛకు గల గ్రాహకశక్తి అట్టిది. దాని యుద్వేగములూ ప్రమాదములూ అంత విపరీతభయము కలిగించును. కడు సూక్ష్మరూపమున నెడతెగని దాడులు సల్పుచూ, అయ్యది స్వర్గద్వారము పర్యంతమూ వెన్నాడును. శ్రమాకులమైన సంకల్పవృత్తికి, ఈ ప్రాణ ప్రకృతియందలి వంకరను దీర్ప యత్నించుట వృథాపరిశ్రమయని తోచును. ఆనందదాయకమైన పరంధామమునకు చేరుకొనుటో, శాంతిసంధాయకమైన నిర్వాణము నందుకొనుటో, ఇదే వివేకమనిపించును. భౌతికజీవనపు బంధమునుండియూ ఉన్మాదము నుండియూ, అస్థిర సుఖమునుండియూ విడుమర గాంచుటకు జన్మరాహిత్యమే ఉపాయమనెడి భావము మనలో తిరిగి పొడుకొనును.

దీని కిక మార్గాంతరము లేదా? ఉండితీరవలెను. ఉన్నది. కష్టభాజనమైన యీ ప్రాణమయ ప్రకృతిని రూపాంతర మొందించగల మార్గాంతర మది. కాని, ఇందుకు మనలను పెడదారిని పట్టించే మూలకారణ మేదియో కనుగొని, ప్రాణమునకు గల మూలకేంద్రములోనే దానిని నిర్మూలించవలసియున్నది. ఏలయన, ప్రాణముకూడ నొక దైవశక్తియే. బయటికది ఎంత తమోమయముగా, ఎంత వికృతముగా గన్పట్టినను, అయ్యది ఆసుర ప్రవృత్తివలన జనించినదికాదు. ప్రాణముయొక్క తరణోపాయము ప్రాణములోనే యున్నది. ప్రాణశక్తినుండియే మన విమోచనోపాయమును సాధించవలసి యున్నది. జ్ఞానప్రేమలు విముక్తి దాయకములే కాని, ప్రాణము యొక్క ఒప్పుదలను గూడ అవి సంపాదించి, ఆ ప్రాణకేంద్రమున విముక్తమైన యొకానొక శక్తివిశేషముచే నద్దానికి దివ్యత్వము ఘటింపగల్గినగాని, అవి యీ ఇహమునందు శక్తిసమన్వితములు గానేరవు.

యజ్ఞకర్మలయందు విభాగములు చేసి, వానిలో జ్ఞానకర్మలనూ ప్రేమ కర్మలనూ మాత్రమే నిర్వర్తించుచూ ప్రాణకర్మలను విసర్జించుటచే నీ చిక్కు

తీరదు. * ప్రాణకర్మలు కేవలమూ కామమునుండియూ అహంకారమునుండియూ పుట్టువు నొందినట్లు కన్పట్టుచూ, శాశ్వత సంఘర్షణకు తావలములైనట్లు తోఁటచే నీ విభాగము చేయుట సంభవించుచున్నది. నిజమునకు ఇట్టి విభాగము చేయుటకు వీలులేదు. ఒకవేళ చేయుటకు ప్రయత్నించిననూ, అయ్యది తన ముఖ్యప్రయోజనమును కోల్పోయి విఫలము కాకతప్పదు. ఏలయన, అట్టి విభాగము విశ్వశక్తి యొక్క సమగ్రస్వరూపమునుండి మనలను వేరుచేయును. పూర్ణప్రకృతి యందలి ఒకముఖ్యభాగమును, విశ్వసృష్టి కార్యసాధన కత్యావశ్యకమైన యొక శక్తి విశేషమును, శక్తివిహీనముగ జేసివైచును.

ప్రాణశక్తియనునది ప్రకృతియందిచట తదితర శక్తులతోఁడి యనుసంధానమున కేర్పడిన యొక ముఖ్యశక్తి. మనో వ్యాపారములు ఉపాధిశూన్యములైన వట్టి యంతర్వృత్తి విశేషములు గాకుండ నుండవలెనవిన, మనస్సునకు ప్రాణశక్తి తోడ్పాటు అత్యవసరము. అట్లే ఆత్మకు గూడ, ప్రాణశక్తి తోడ్పాటు అత్యవసరము,- తన అభివ్యక్తిని బయటికి చక్కగ రూపొందించుకొని, జడమునందు సంపూర్ణమైన ఆత్మప్రకటనము గావించుకొనుటకు. ఆత్మ వ్యాపారముల కిట్లు ప్రాణశక్తి తోడ్పాటు లేకపోయినయెడల, ఇహమునందా వ్యాపారములు శక్తిప్రసారము లేని యేకాంతికత్వమున గూడుకట్టుకొనిపోవును. ఒకవేళ ఇహమునందవి యేమేని సాధించిననూ, అయ్యది జీవనమునకు గొంత తళుకు గూర్చగలదేకాని, దానిని పూర్తిగ పరివర్తన మొందింపజాలదు. ఆధ్యాత్మికత కనుగుణముగా పరివర్తనము చెందకయే ప్రాణశక్తి ఆత్మవ్యాపారములకు తోడయ్యేనేవి,

---

* మనుజుని యందలి జ్ఞానమయ సత్తచే నిర్వర్తించబడునవి జ్ఞానకర్మలు; భావమయసత్తచే నిర్వర్తించబడునవి ప్రేమకర్మలు; ప్రాణమయసత్తచే నిర్వర్తించబడునవి ప్రాణకర్మలు, అనగా నిత్యజీవితకర్మలు. కేవలము జ్ఞానకర్మలనూ ప్రేమకర్మలనూ నిర్వర్తించినంత మాత్రమున యోగసాధనకు పూర్ణత్వము సిద్ధింపనేరదనియూ, ప్రాణమయసత్తను గూడ రూపాంతర మొందింపగలిగినప్పుడే జ్ఞాన ప్రేమ కర్మలు ఇహమునందు శక్తిమంతము లగుననియూ భావము—అను.

మరింత ప్రమాదముగలదు. ఆధ్యాత్మికమైన జ్ఞానవ్యాపారములూ ప్రేమ వ్యాపారములూ దానివలన సంకుచితములై సాంకర్యము చెందును, లేక, జ్ఞానమునూ ప్రేమనూ ప్రాణశక్తి తన యవర ప్రయోజనముల కుపయోగించుకొనుట సంభవించును.

ప్రాణశక్తి తోడ్పాటు లేనియెడల, సృజనాత్మకమైన ఆధ్యాత్మికానుభూతికి పరిపూర్ణతలేదు. కాని, ఆ ప్రాణశక్తి విముక్తినీ; ఉన్నతినీ. రూపాంతర ప్రాప్తినీ సాధించుకొనినదై యుండవలెను. సామాన్య మానవ-పశుజీవన సంబంధమైన ప్రాణశక్తివలనగాని, అసుర జీవనసంబంధమైన ప్రాణశక్తివలనగాని ఈ పని నెరవేరదు. దివ్యాదివ్యముల మిశ్రజీవనసంబంధమైన ప్రాణశక్తియూ నిందుకు పనికిరాదు. ఇహమును నిరసించి పరము నన్వేషించు ఇతర సాధనలమాట యెట్లున్ననూ, పూర్ణయోగముమాత్ర మీకష్టకార్యమును తప్పనిసరిగ సాధించవలసియే యున్నది. నిత్యజీవిత బాహ్యకర్మల సమస్యనది పరిష్కరించకుండ విడనాడుటకు వీలులేదు. అందు సహజముగ నిహితమైన దివ్యత్వమును కనుగొని జ్ఞానప్రేమల దివ్యత్వముతో దానికి సుస్థిరమూ శాశ్వతమూనైన మైత్రిని ఒనగూర్పవలసి యున్నది.

జ్ఞానప్రేమలు ప్రాణశక్తిని నిరాఘాటముగనూ నిరుపద్రవముగనూ నైవసమొనర్చుకొని కొంగ్రొత్తగ రూపాంతరమొందించువరకునూ ప్రాణకర్మల తోడి ప్రసక్తిని పరిహరించు పద్ధతికూడ సరియైనది కానేరదు. ఏలయన: జ్ఞాన ప్రేమలెంతో మహోన్నతశిఖరముల నందుకొనగలిగినగాని తమ విమోచకశక్తి నవరోధించు ప్రాణవృత్తి విపర్యాసముల నవి తట్టుకొని నిలువజాలవు. మనోమయ ప్రకృతికతీతమైన విజ్ఞానశిఖరమును మన చేతన యేనాడు చేరగల్గునో ఆ నాడీ ప్రతిబంధకములన్నియూ దొలగిపోవును. కాని, ఇచట నొక విషమ సమస్య యున్నది. ప్రాణశక్తిని రూపాంతర మొందించకుండ విజ్ఞాన శిఖరమును జేరుట యసాధ్యము. విజ్ఞాన భూమికయందలి తేజశ్శక్తులను క్రిందికి గొనిరాకుండ ప్రాణశక్తిని రూపాంతర మొందించుట యసాధ్యము.

మానసాతీతమైన విజ్ఞాన చేతన కేవలము జ్ఞానమయము, ఆనందమయము, ప్రేమమయము మాత్రమే కాదు. అయ్యది ఇచ్ఛామయము, శక్తిమయముకూడ,

ఆ విజ్ఞాన చేతనను ధరించి భరించగల వికాసమీ వ్యక్తప్రకృతియందలి యిచ్ఛా, శక్తితత్వములకుగూడ కలిగిననగాని, అయ్యది క్రింది కవతరింపజాలదు. కాని, ఇచ్ఛయూ శక్తియూ ప్రాణశక్తికి మూలద్రవ్యములు. కావుననే ప్రాణశక్తి కేవల జ్ఞానప్రేమల యాధిక్యమును నిరసించుచూ, ప్రమాదములను లక్ష్యపెట్ట కుండ, మొండిపట్టుదలతో, అవిచారితముగ నుద్వేగించుచుండుట జరుగుచున్నది. అయిననూ, అయ్యది విశిష్టమైన తన సాహసప్రవృత్తితో తాననూ దైవము దెసకు పురోగమించుట కవకాశము లేకపోలేదు. దైవమునకు జ్ఞానప్రేమలెట్లో అట్లే శక్తియూ నొక స్వరూప విశేషము. జ్ఞానముకొరకు బుద్ధియూ, ప్రేమ కొరకు హృదయమునూ ప్రాకులాడునట్లే, శక్తికొరకు ప్రాణము తడుములాడు చున్నది. నైతికబుద్ధి కాని, ధార్మికబుద్ధి కాని, శక్తిని త్యాజ్యముగా దలచుట పొరపాటు. పెక్కు నిదర్శనములను బట్టి అట్టి యభిప్రాయము సముచితమైనది గనే పైకి గన్పట్టిననూ, యథార్థమున కది వట్టి యపోహయే.

జ్ఞానప్రేమలవలెనే శక్తియూ దోషములపాలు చేయబడి, ఎంత దుర్వి నియోగమగుట కవకాశమున్ననూ, వస్తుతః అయ్యది దివ్యమే. ఒక దివ్య ప్రయోజ నముకొరకే అది యిచట నెలకొల్పబడినది. శక్తియే సకల జగత్తులనూ నడపు చున్నది. అయ్యది జ్ఞానశక్తి కానిండు, ప్రేమశక్తి కానిండు, దేహశక్తి కానిండు,- ఏదైననూ శక్తి వస్తుతః దివ్యము, ఆధ్యాత్మికము. అజ్ఞానవశములై, పశుత్వ, మానవత్వ, రాక్షసత్వములు దానిని దుర్వినియోగ పరచుచున్నవి. అట్లు కాకుండ జేసి, నిత్యమూ అనంతమూ నగు పరతత్వముతో మేళపెంచిన అంతరాత్మచైతన్య ప్రవృత్తిచే దానిని సద్వినియోగ పరచవలసియున్నది. ప్రాణకర్మలను పరిత్య జించి కేవల మాంతరంగికానుభూతితో పూర్ణయోగము తృప్తిపడి యుండజాలదు. బాహ్యపరివర్తనమును సాధించుకొరకే అయ్యది అంతర్ముఖత్వమును భజింప వలెను. దైవముతో నిత్యస్పర్శ కలిగి దైవమే అధినేతగా ప్రవర్తిల్లు యోగ శక్తివిశేషముగా ప్రాణశక్తినిగూడ రూపొందించుట పూర్ణయోగలక్ష్యము.

ప్రాణకర్మలను ఆధ్యాత్మికముగా నిర్వర్తించుట సులభము కాదనుమాట నిజము. అజ్ఞానఘూయిష్ఠమైన తన ప్రయోజనముల నెరవేర్చుకొనుటకై మనలో

జీవనేచ్ఛయనునది ఒక అయథార్థమైన కామాత్మను సృష్టిచేసి, యథార్థమైన అంతరాత్మజ్యోతిస్స్ఫులింగముయొక్క స్థానమున దానిని నెలకొల్పినది. అదియే, ఈ చిక్కున కంతకునూ మూలకారణము. ఈ కామాత్మయే మన ప్రాణకర్మలనన్నింటినీ ప్రేరేపించి వక్రింపజేయుచు ంభవించుచున్నది. నైతికవర్తనులూ ధార్మికవర్తనులూ నైనవారినిగూడ—త్యాగశీలురుగనూ, భూతదయాపరులుగనూ చెలామణి యగువారినిగూడ—ఈ కామాత్మయే అల్లిబిల్లిగ పెనవైచికొని నడుపుచుండును.

పృథగ్భావనచేయుచుండు అహంకారాత్మయిది, పృధగ్భావముతో స్వోత్కర్షను ప్రకటింపజేసికొనుట కది యెల్లప్పుడునూ ప్రేరేపించుచుండును. బట్టబయలుగనో, లేక తళుకు లీనెడి ముసుగుల చాటుననో, తన స్వత్వమును, తన భోగమును, తన విజయమును, తన సామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకే మనలనుద్వేగపరచుచుండును ప్రాణమయ ప్రకృతియందలి ఈ యశాంతిని, అపశ్రుతిని, వైపరీత్యమును తొలగించవలెనన్న, మనలోని యంతరాత్మకు—హృత్పురుషునికి నాయకత్వము లభింపవలెను, అహంకారపూరితమైన కామాత్మను విచ్ఛిన్నము చేయవలెను.

ఇట్లనుటచే, జీవనమునే విరోధించి, దాని సహజసంసిద్ధి దానికి కలుగకుండ చేయవలెనని కాదు. మనలో, బయటికి గోచరించు నీ కామాత్మ వెనుక, అంతరమున, యథార్థమైన ప్రాణసత్త కలదు. దానిని విచ్ఛిన్నముచేయక, పరిస్ఫుటమొనర్చి, దివ్యప్రకృతిశక్తిగా దాని నిజప్రవృత్తిని వెలికిదెచ్చి విడుదల చేయవలసియున్నది. మన యంతరాత్మ ఆధిపత్యమున నిట్టి యథార్థ ప్రాణసత్తను ప్రబలమొనర్చినగాని, ప్రాణశక్తియొక్క ఆశయములకు దివ్యసంసిద్ధి చేకూరదు. వస్తుతః ఈ యాశయము లెప్పటివలెనే యున్ననూ, వాని యంతర్లక్ష్యమూ, బాహ్యలక్షణమూ మాత్రము రూపాంతరము చెందును. సాధారణ ప్రాణశక్తివలె దివ్యప్రాణశక్తికూడ అభివృద్ధికొరకూ ప్రతిష్ఠకొరకూ ప్రవర్తిల్లుననుమాట నిజము. కాని, ఆ ప్రతిష్ఠ బాహ్యస్థమైన క్షుద్రవ్యక్తిది కాదు. అంతర్గతుడైయున్న పరమపురుషునిది. ఆ యభివృద్ధి యథార్థమైన పరమపురుషత్వములోని కభివృద్ధి.

# యజ్ఞారోహణము-2

అహంకారమును వశంవద మొనర్చుకొని విచ్ఛిన్నము చేసినగాని యీ పరమపురుషావిష్కారము జరుగదు. ఇదియే జీవితముయొక్క యథార్థలక్ష్యము. ఇందు అభివృద్ధికి స్థానమున్నది. కాని, ఆ యభివృద్ధి, ప్రకృతియందు —దేహ మనఃప్రాణములయందు—అంతరాత్మ సాధించెడి యభివృద్ధి. అట్లే, ఇందు సకలమునూ తనదిగా ఆకట్టుకొనుట యున్నది. కాని, అది అహంకార కామనతో ఆయావస్తువులను వస్తువులుగా గ్రహించి ఆకట్టుకొనుట కాదు. వానియందలి దివ్యత్వమును దివ్యానుభూతిచే గ్రహించి యాకట్టుకొనుట. అదేవిధముగ, భోగము, సంగరము, విజయము, సామ్రాజ్యాధిపత్యము—ఈ లక్షణము లన్నియు నిందు గోచరించును. కాని, ఆ భోగము విశ్వములో దివ్యానందభోగము. ఆ సంగరము తమశ్శక్తులతోడి సంగరము. ఆ విజయసాధన ఇచ్ఛాజ్ఞాన ప్రేమశక్తులచే అజ్ఞాన క్షేత్రములపై విజయసాధన. ఆ సామ్రాజ్యాధిపత్యము ఆత్మసామ్రాజ్యాధిపత్యము. బాహ్యాభ్యంతర ప్రకృతులపై అడ్డులేని ప్రభుత్వాధికారము.

ఈ నియమముల ప్రకారము, ఈ లక్ష్యములతో, ప్రాణకర్మలు దివ్యత్వములోనికి రూపాంతరము చెందవలసియున్నది. ఇదియే త్రివిధ యజ్ఞానుష్ఠానములోని తృతీయవిధ స్వరూపము. ఈ యోగలక్ష్యము జీవితమును బుద్ధితో సమన్వయించుట కాదు, బుద్ధి కతీతమైన విజ్ఞానముతో సమన్వయించుట; నైతిక ధర్మ విశిష్టము చేయుటకాదు, ఆధ్యాత్మిక ధర్మనిష్ఠ మొనర్చుట, మానసికములైన బాహ్యసంకల్పములను సంబాళించుట కాదిచట ప్రధానము, గుప్తమైయున్న దివ్యేచ్ఛపై జీవనవిధానమును పునఃప్రతిష్ఠించుట. అట్టి పునఃప్రతిష్ఠ జరిగిననాడే, జీవితము సాక్షాత్తుగ పరాశక్తి యేలుబడిలోనికి వచ్చి, పరతత్త్వముయొక్క ప్రత్యక్షాభివ్యక్తిగ రూపాంతరము చెందును. ఇప్పుడన్ననో, అది జగన్మహానటుని మారువేసము, మాయముసుగు. బుద్ధిప్రేరితమైన బాహ్యసంస్కారము వలనగాక, చేతనయొక్క ఆధ్యాత్మిక పరివర్తనమువలన మాత్రమే, జీవితమిప్పటి సందిగ్ధావస్థనుండి బయటపడి, రూపాంతర ప్రాప్తిచే శోభించగలుగును.

* * *

కావున, జీవితమును బాహ్యసంస్కారముచేగాక, సమూల పరివర్తనముచే, స్పర్ధాసంకులమైన తమోమయ ప్రకృతినుండి సామరస్యపూర్వకమైన తేజోమయ ప్రకృతిలోనికి రూపాంతర మొందించుటయే పూర్ణయోగ లక్ష్యము. ఈ యంతః పరివర్తనము,—ఈ రూపాంతర ప్రాప్తి,—ముఖ్యముగా మూడు సందర్భముల వలనగాని చేకూరనేరదు. మూడింటిలో ఏ ఒక్కటి లోపించిననూ పరివర్తనము సంపూర్ణము కానేరదు, మూడు శక్తులునూ ఏకమైనప్పుడే సంపూర్ణపరివర్తనము సాధ్యము. మొదటిసందర్భ మేమన ; కామమే జీవితమునకు ప్రస్తుతము ఏడు గడగా నున్నది, కామచేతనయే జీవితకేంద్రముగా నేర్పడి సకల జీవనప్రవృత్తు లనూ ప్రేరేపించుచూ వాటికి తన విపరీతపు రంగువేసి నడిపించుచున్నది. దివ్య జీవన ప్రాప్తికి ఈ కామము పూర్తిగ నంతరించి, దాని స్థానమున స్వచ్ఛతరమూ స్థిరతరమూ నైన ప్రచోదనశక్తి వాదుకొనవలెను. కామచేతన నిర్మూలించబడి, దానిబదులుగా మనలో ప్రకృతమున దాగియున్న యథార్థ ప్రాణమయ పురుషుని శాంతి సౌఖ్య బల సమృద్ధి బయటి కావిష్కరించవలెను.

ఇక రెండవ సందర్భ మేమన, మనజీవితమిప్పుడు ప్రాణశక్తిచే గొంతయూ మనశ్శక్తిచే గొంతయూ నడపబడుచున్నది. విశేషభాగ మీ మనశ్శక్తి, అజ్ఞాన భూయిష్ఠమైన ప్రాణశక్తి ప్రేరణకు లోబడియుండుటయో అనుకూలమైయుండుట యో సంభవించుచుండును. ఒక్కొక్కప్పుడు తానే తన కొద్దిపాటి వెలుగుతో దానిని నడుపుచుండును. దివ్యజీవనమునందు, ఈ ప్రాణమనశ్శక్తులు రెండునూ కేవల ముపకరణములై పోవలెను. అంతర్వర్తియగు హృత్పురుషుడే వాటిస్థానమును నాక్రమించి, మార్గదర్శకుడై, పరాత్పరుడే మార్గదర్శకు డగుచున్నాడనుటకు చిహ్నమై వెలయవలెను.

కాగా, ఇక మూడవ సందర్భము : జీవిత మిప్పుడు పృథగ్భావ లక్షణము లతో గూడిన అహంకార పరితృప్తి కభిముఖమై యున్నది. ఈ యహంకార మంతరించి యథార్థమైన ఆధ్యాత్మిక పురుషుడే దాని స్థానమున నిలుపవలెను. ఇహమునందు పరమును సిద్ధింపజేసికొనుటకే జీవిత మభిముఖము గావలెను. తనలో దివ్యశక్తి యొకటి ప్రబుద్ధమగుచున్నట్లు గురుతించి, దానికి తాను విధే యమై పోవలెను.

రూపాంతర ప్రాప్తిని గలిగించు ఈ మూడు అంతఃప్రవృత్తులలో మొదటిది ప్రాచీనకాలము నుండియూ సుపరిచితమైనదే. ఆధ్యాత్మిక సాధనయొక్క ముఖ్యలక్ష్యములలో నది యొకటిగా సర్వదా పరిగణింపబడుచునే యున్నది. భగవద్గీతయం దిదియే కడు విశిష్టముగనూ విస్పష్టముగనూ నిరూపితమైయున్నది. ఫలాపేక్షను వదలి కర్మలు చేయుటయూ, సమూలముగ కామమును నిర్మూలించుటయూ, సంపూర్ణమైన సమత్వమును సాధించుటయూ ఆధ్యాత్మిక జీవికి సహజలక్షణమని గీతా ప్రతిపాదనము, సంపూర్ణమైన ఆధ్యాత్మిక సమత్వమే కామము నశించినదనుటకు సరియైన గుర్తు.

సకల భూతములయెడలనూ సమభావము కలిగియుండుట, సుఖదుఃఖములకూ, శుభాశుభములకూ, జయాపజయములకూ చలించకుండుట, నీచులు ఉన్నతులు, శత్రులు మిత్రులు, పాపవర్తనులు పుణ్యవర్తనులు, అను భేదములేక ఎల్లరినీ సమదృష్టితో జూచుట, సకల జీవులయందునూ ఒకే పరమపురుషుని బహువిధాభివ్యక్తిని గాంచుట, సకలవస్తువుల యందునూ ఒకే ఆత్మవస్తువు సోపాధికమై బహుప్రకారముల వర్తించుచున్నదనియూ, పెక్కుముసుగుల చాటున క్రమక్రమముగా వికాసము నందుచున్నదనియూ కనుగొనుట,-యిదియే సంపూర్ణమైన ఆధ్యాత్మిక సమత్వము.

మానసికమైన ఔదాసీన్యాదికము గాదిచట గావలసినది. ప్రాణమయ ప్రకృతికి స్తబ్ధత్వమును గూర్చుటయుగాదు. ఏకదలికయూలేక జడమై పడియుండగోరు అన్నమయచేతనా పరిస్థితి యంతకంటెనూ గాదు. ఇవియే ఉత్కృష్టమైన ఆధ్యాత్మికస్థితి లక్షణములుగా నొక్కొక్కప్పుడు భ్రమించుట కలదు. కాని, ఇచట గావలసినవి ఇవి కావు, ప్రకృతికి ఆవలనున్న సాక్షిచైతన్యపు సుస్థిర సువిశాల సర్వాత్మభావస్థితి కావలసియున్నది. ఏలయన, ఈ ప్రకృతిస్థమైయున్న సమస్తమూ వివిధశక్తుల వ్యత్యస్త వ్యవస్థతో కలగాపులగమై కన్పట్టుచుండును. దీవికవతల దీని కాధారభూతముగా, ఒకానొక శాంతి గలదు, విశాలత కలదు. అది జడత్వరహితము. అందు సర్వశక్తులునూ గర్భితములై యుండును, విశ్వవ్యాపారమునంతనూ ధరించుటకు సమర్థమైన అచలాయతనమది.

ఇందలి చేతన సకల భూతములయెడలనూ సమభావము కలిగియుండును ఇందలి శక్తి ఏ క్రియను నిర్వర్తించుటకైననూ సమర్థమైయుండును. సాక్షి చైతన్యమునందీశక్తిని క్రియకై ప్రేరేపించునది కామము కాదు. క్రియకంటె మహత్తరమై, దేహ మనః ప్రాణములకంటె అతీతమై వెలయు ఒకానొక మహా సత్యమే ఈ ప్రేరణకు మూలము. ఒక సన్నిహిత ప్రయోజనమును సాధించుటకై అయ్యది దేహమనఃప్రాణముల నుపాధిగా చేసికొనిన చేసికొనవచ్చుగాక. ఇట్లు కామము నిర్మూలితమై, చేతనయందీ విశాల సర్వసమత్వము నెలకొని నప్పుడే, మనలోని యథార్థ ప్రాణమయ పురుషుడు మఱుగువెడలి బయటికివచ్చి, శాంతిసంధాయకమైన—శక్తిపూరితమైన—సన్నిధిని మనకు గల్పించును.

అదియే ప్రాణమయ పురుషుని నిజరూపము. పరమ పురుషుని దివ్యేచ్ఛకది విధేయమై, తేజోమయమై, సత్వసంపన్నమై, అహంకార రహితమై, కావు వనే అత్యంత మహోన్నత కార్యసాధకమై యొప్పారుచుండును. బాధాసంకులమూ, భేదలక్షణోపేతమూ, ప్రయాసబహుళమూనైన యీ బాహ్యప్రాణ శక్తి కాదా యథార్థప్రాణశక్తి. అయ్యది శాంత్యానందమయమూ తేజోబల సమన్వితమూనైన దివ్యశక్తి, విశ్వమునంతనూ తన రెక్కలలో నిముడ్చుకొని, విశాల దివ్యవిహాయసపథమున విశృంఖల విహారముచేయు దివ్యవిహంగము.

కాని, ప్రాణశక్తి యిట్లు మహాబల సమన్వితమూ సమత్వభావ సంపన్నమూ అయినంత మాత్రమున చాలదు. ఏలయన, తన్మూలమున దివ్యజీవనమున కొక సాధన మమరినట్లయినదేకాని, దాని నియమనమూ పరిపాలనమూ ప్రారంభమైనట్లు కాలేదు. ఇచటనే మన అంతరాత్మకు—హృత్పురుషునికి పని తగులుచున్నది. అత్యంత పరమమైన నియమన పరిపాలనము లీహృత్పురుషుడే చేయుననుటకు వీలులేదు. అది యాతని పనికాదు. అజ్ఞానములోనుండి దివ్యజ్ఞానములోనికి పరివర్తముచెందు సంధిదశలో, బాహ్యాభ్యంతర జీవన కర్మలను క్రమక్రమముగ ప్రేరేపించుచూ దారి చూపుట మాత్రమే అతని పని. పరాశక్తి ప్రేరితములగు దివ్యప్రాణవృత్తులతో శోభించెడి ఆ యాధ్యాత్మిక సంసిద్ధికి ఏ పద్ధతి త్రొక్కవలెనో, ఏ మార్గము ననుసరించవలెనో, ఏనడక నడవవలెనో అనుక్షణమూ ఆ హృత్పురుషుడే నిర్దేశించుచుండును.

ప్రకృతియందలి వివిధ భాగములు,—అజ్ఞాన వశమున దారితెలియక తడబడుచూ పరిభ్రమించు వివిధ భాగములు,—అతని వెలుగుచే తేజోవంతములగును. మనస్సు తన వృత్తుల నిజస్వరూపమును కనుగొననేర్చును. ప్రాణము తన వ్యాపారములయం దేవి సత్ప్రేరితములో, ఏవి అసత్ప్రేరితములో తెలిసికొనగల్గును. ఒకవిధమైన జ్ఞాననేత్రము మనలో విచ్చుకొని, మనముచేయు పొరపాటుల మూలకారణములను మన కెరుకపడజేయుచుండును. తిరిగి ఆ పొరపాటులనే చేయకుండ సకాలమున హెచ్చరించుచుండును అనుభవము వలననూ అంతస్స్ఫురణము వలననూ సరియైన నడక నడచుటయెట్లో నేర్పుచుండును.

అసత్యాన్వేషణలో తప్పుదారిని బడిపోనీయక, సత్యముయొక్క క్రమవికాసమున కనుగుణముగ విలసిల్లు ఇచ్ఛయొకటి మనలో నూతనముగా రూపొందును. బాహ్యమునకు మాత్రమే నిశితములుగ దోచు మనోనిశ్చయములకూ ప్రాణ చాలనములకూ మారుగ, ఆధ్యాత్మిక దర్శనము నంతకంతకు సన్నిహితమొనర్చు ఆత్మస్ఫురణము,—భూతజాలపు నిజతత్త్వమునూ గతినీ లక్ష్యమునూ ఎరుకపడజేయు అంతర్దృష్టి.—ప్రస్ఫుటమగుట కారంభించును. మహత్తర దివ్యజ్ఞానానుభూతివైపున కొక సునిశ్చితమైన క్రొత్తనడక ప్రారంభమగును. నిత్యజీవిత సంబంధమైన ప్రాణకర్మలు గందరగోళపు స్థితినుండి బయటపడి, సక్రమప్రవర్తనమునకు గడంగును. బుద్ధియొక్క కృతకావేశము నుండియూ కామముయొక్క నిరంకుశ పరిపాలనమునుండియూ తప్పించుకొని, ఆత్మయొక్క అంతర్వీక్షణ ప్రేరణమున ఆత్మసామ్రాజ్యవీధులలో ప్రవేశించును. అన్నిటికంటె ముఖ్యముగ, హృత్పురుషుని యనుశాసనముచే ప్రాణము తన కర్మలనన్నిటినీ ఒక యజ్ఞవిధిగా, పరాత్పరునికి బలిసమర్పణముగా నిర్వర్తింప నేర్చుకొనును. ఇహజీవనము పరజీవనమునకొక పిలుపుగా మారిపోవును. అందలి ప్రతి అల్పకార్యమూ అనంతునితో మేళవించి అనల్పమై విరాజిల్లును.

అంతరమున సమత్వ మతిశయించి, యథార్థప్రాణము తాను నిర్వహించవలసియున్న మహత్తర కార్యమునకు సన్నద్ధమై, మన ప్రకృతి విభాగములన్నిటియందునూ అంతరాత్మ పిలుపు ప్రస్ఫుటమగుచున్నకొలది, ఆ పిలుపునకు లక్ష్యభూతమైన పరతత్త్వము క్రిందికి దిగి, ప్రాణమునూ దాని శక్తులనూ గైకొన

మొనర్చుకొని, తన యున్నతినీ స్నిగ్ధత్వమునూ విశాలతనూ వాటికి చేకూర్ప నారంభించును. అత్యధిక సంఖ్యాకులలో గాకపోయిననూ చాలమందిలో, సమత్వ మింకనూ అలవడకముందే, అంతరాత్మ ప్రేరణ మింకనూ గలుగకపూర్వమే, అయ్యది కొంత అభివ్యక్తమగుట కలదు.

బాహ్యజ్ఞాన సమూహమున చిక్కువడి విడుమరకై యాక్రోశించు నంత రాత్మ పిలుపుచే గానిండు, జ్ఞానోపలబ్ధికై వేగిరపడు బుద్ధివృత్తిరూపమైన ధ్యాన సంవేగముచే గానిండు, భావమయమైన హృదయాభిలాషచే గానిండు, అజ్ఞానయుత మయ్యూ నార్జవోపేతమైన తీవ్రసంకల్పబలముచే గానిండు, పరాప్రకృతికినీ అపరాప్రకృతికినీ మధ్యనున్న కవాటము విచ్ఛిన్నమై, పైనుండి దివ్యప్రవాహ మొక్కుమ్మడిగ క్రిందికి తోసుకొనిరావచ్చును. దివ్యపురుషుని స్వరూప సాక్షాత్కార మొకింతగా కలుగవచ్చును, అనంతుని దివ్యజ్ఞానము, దివ్య శక్తి, దివ్యప్రేమ, దివ్యానందము కొంత యనుభూతము కావచ్చును. ఉత్తరక్షణముననే అది మరల తిరోహితమై, తగినరీతిగా ప్రకృతి సన్నద్ధమగువరకూ నిరీక్షణ చేయుటయూ కలదు. లేక ఎడనెడ తానే అవిష్క రించుచూ అభివృద్ధి గాంచుటయూ కలదు. తీవ్ర, మందగతిభేదములు కలిగియూ, సమగ్రమూ పృథులమూనైన కార్యసమారంభమున కయ్యది తార్కాణము.

దివ్యశక్తి యొకటి కొన్నివేళలలో ముందుకు వచ్చి మనకు వెలుగు లందిచ్చుచూ, అనుశాసనపూర్వకముగ మనలను ముందుకు నడిపించును. మరికొన్ని వేళలలో, అది వెనుకకు మరలిపోయి, మనలను మన కర్మమునకు వదలివేసినట్లు కన్పట్టును. మనలో ఏ యసంపూర్ణత, ఏ యజ్ఞానము, ఏ తమస్సు, ఏ నికృష్టత, ఏ వైపరీత్యము కలదో, దానినెల్ల వెలికిదెచ్చి, దానిచే తన దొసగులను తానే తెలిసికొనునట్లు, తన విచ్ఛిత్తినో పరివర్తనమునో తానే కోరుకొనునట్లు చేయ బడును. లేదా, వట్టి పనికిమాలినదిగనో, దిద్దుబాటు చేయరానిదిగనో భావించి, దానిని ప్రకృతినుండి బయటికి పారద్రోలుట జరుగును.

కాని, యీ పని కొన్ని ఒడుదొడుకులతోగాని కొనసాగనేరదు. ఒకప్పుడు వెలుగు మరొకప్పుడు చీకటి. ఒకప్పుడు స్థాయి మరొకప్పుడు సంఘర్షణ, ఒక ప్పుడు దివ్యచేతనాభివృద్ధి మరొకప్పుడు తదభావము, ఒకప్పుడు ప్రియుతమునిని

యాశ్లేషసుఖము మరియొకప్పుడు తద్వియోగదుఃఖము. ఒకప్పు డాశాశిఖరమున విహారము మరియొకప్పుడు నిరాశాఖాతమున పతనము, ఒకప్పుడు అసురశక్తుల వికటాట్ట హాసము మరియొకప్పుడు దైవీశక్తుల సాహాయ్యసంపద,— ఈ మార్పు లకు గురికావలసివచ్చుచుండును, అమృతముతో పాటు హాలాహలముకూడ బుస బుస పొంగులు వారునట్లు, జీవిత మహోదధి మథనము జరుగును. మన జీవాత్మయూ ప్రకృతియూ దివ్యావతరణమున కభిముఖమై, దివ్యసన్నిధి కలవడి. దివ్యాధికారమునకు లోబడుట నేర్చుకొనువరకూ ఈ ద్వంద్వానుభవము తప్పదు.

కాని, సమత్వమూ, అంతరాత్మ తేజఃశక్తులూ ముందుగనే తోడైనచో, ఈ విధానమునం దింత కష్టముండదు. పెక్కు భీకర ప్రమాదము లవలీలగ తొలగి పోవును. ఎంతటి కష్టములలో నైననూ, ఎట్టి పరీక్షాసమయములలో నైననూ, ఒక విధమైన స్థాయి, సుఖము, ఆత్మప్రత్యయము మన నడకకు బలము చేకూర్చును. మనలో నెదుగుచున్న దివ్యశక్తి మన ప్రకృతియొక్క అమోదముచే బలవత్తరమై, ప్రతికూల శక్తుల యౌద్ధత్యమును త్వరలో పటాపంచలొనర్చును. సర్వకాల సర్వావస్థలలోనూ ఒక దివ్యసన్నిధి మనకు రక్షకమై. మార్గదర్శకమై వెలయుచుండును. ఒకొక్కప్పుడది మన ముందర నిలచి మనల నడపించును. వేరొకప్పుడు మనవెనుక తెరచాటున దాగి మనల ప్రేరేపించును.

సాధనయొక్క చరమ సంసిద్ధిలోని శక్తి, ప్రారంభదశనుండియే అభివ్యక్తము కాజొచ్చును. పరమేశ్వరుడే తనకు రక్షకుడుగా, మార్గదర్శకుడుగా నున్నాడని, జగన్మాతయే తనలో పనిచేయుచున్నదని, సాధకునకు సర్వదా తెలియనగుచుండును, ఏది జరిగినను అంతయూ మంచికొరకేనని, అభ్యుదయము నిశ్చయమని, జయము అనివార్యమని యతడు గ్రహించుచుండును. మొత్తముమీద ఉభయ సందర్భములయందునూ కొనసాగు విధానముమాత్ర మొక్కటే,— బాహ్యాభ్యంతర ప్రకృతినంతనూ, జీవితమునంతనూ, సమగ్ర గ్రహణ మొనర్చుకొని, ఊర్ధ్వమునుండి యవతరించిన దివ్యజీవన శక్తిప్రాబల్యముచే దాని శక్తిప్రవృత్తులను మలచి రూపాంతర మొందించుట. అవరప్రకృతిలో దంతయూ మహత్తరమైన ఆధ్యాత్మికశక్తికి వశంవదమై, ఒక దివ్యప్రకృ

నముకొఱకొక దివ్యప్రవృత్తి సాధనముగ పరివర్తనము చెందువరకూ, ఈ విధాన మిట్లు కొనసాగవలసియుండును.

ఈ విధానమునందు, ప్రారంభదశలోనే, మనలనుగూర్చి మనకేమి తెలియునో అదంతయూ వట్టి బాహ్యప్రవృత్తియని, మఱుగునున్న యొక విశాలసత్త స్థూలకార్య ప్రవాహమని తెలియవచ్చును. మనకు గోచరమగుచున్న యీ జీవన ప్రవృత్తి యంతయూ ప్రవాహరూపమైన యొక అభివ్యక్తి మాత్రమే. కాని, దేనిని అభివ్యక్తము చేయుటకది ప్రయత్నించుచున్నదో అది మాత్రము బయటికి గనుపడదు. మన నిజసత్త యీ బాహ్యసత్తకంటె ఎంతో విశాలతరము. అది తెలియక ఈ బాహ్యసత్తయే మన మనుకొని భ్రమించుచుందుము. దేహప్రాణ మనః ప్రవృత్తుల కలగాపులగ మీ బాహ్యసత్త. దీని యంగప్రత్యంగ పరిశీలన మెంత క్షుణ్ణముగా చేసిననూ మూలతత్వ మవగతము కాదు. దీని వెనుకకూ,పైకీ, క్రిందికీ పోయి, యచటి గుప్తతలములలో విహరించ నేర్చునప్పుడే, దానిని మనము పూర్తిగ తెలిసికొనగలుగుదుము. బాహ్యతలముల నెంత సూక్ష్మముగ పరిశీలించి సంభాళించిననూ మన జీవిత ప్రవృత్తులపై మనకు సరియైన ఆధిపత్యము సిద్ధింపనేరదు.

కావుననే మానవజాతియొక్క జీవనమును సక్రమమార్గమున నియమించి బంధవిముక్తము గావించి సుసంపన్న మొనరించుటకు బుద్ధిబలము, నైతికబలము తదితర బాహ్యప్రవృత్తుల బలము అసమర్థమగుచున్నవి. ఏలయన, మన అన్నమయచేతనలోని స్థూలతమ తమోమయ భాగపు అట్టడుగున సైతమూ, దానికాధారముగా నొక అవచైతన్య సత్త (Sub_consious being) కలదు. నేలలో నానావిధ బీజములు దాగియున్నట్లు, ఈ యవచైతన్య సత్తయందు నానావిధ ప్రవృత్తి బీజములు దాగియుండి, మనకు తెలియకుండగనే పైకి మొలకెత్తుచుండును. గతమును విస్తరింపజేసి, అనాగతముపై తన ప్రభావమును ప్రసరింపజేయు కొత్తబీజముల నెన్నింటినో అనుక్షణమూ ఈ యవచైతన్యక్షేత్రమున మనము చల్లుచుందుము. ఈ యవచేతనము కూడ తమోమయమే. దాని ప్రవృత్తులు మిక్కిలి యల్పములూ, చాలవర కసంగతములూ ననుమాట నిజము. కాని, స్థూలజీవనముపై దానికిగల ప్రాభవ మపారము,

అట్లే మన మనోమయచేతనకూ, మన ప్రాణమయ చేతనకూ, మన అన్నమయచేతనలోని సూక్ష్మభాగమునకూ వెనుకగూడ నింకొక విశాలమైన ప్రచ్ఛన్న చేతన (Subliminal consciousness)— కలదు. అన్న, ప్రాణ, మనోమయ సత్తల సూక్ష్మతలము లచట కానవగును. వీటన్నిటికిని ఆధారముగా, అనుబంధ ప్రాయముగా, అంతరాత్మసత్త విరాజిల్లుచుండును. ఈ ప్రచ్ఛన్నతలములయందు గూడ మన బాహ్యజీవనమునకు ప్రేరకములైన వ్యక్తివిశేషము (Personalities) లెన్నియో దాగియున్నవి. మనలో ప్రతి ఒక్కరిలోనూ ప్రధానముగ నొక కేంద్రవ్యక్తి (Central person) ఏర్పడియుండు ననుమాట నిజము. కాని, అప్రధానముగా ఇతర ఉపవ్యక్తులుగూడ అనేకముగలవు. కేంద్రవ్యక్తి ఆయా అంతర్యామికలయందు తనను దా నభివ్యక్తము చేసికొనుటలో ఉద్భవ మొందిన వ్యక్తివిశేషములివి. ఈ యంతర్యామికల తోడ్పాటుననే కేంద్రవ్యక్తి తన బాహ్య జగత్క్రీడ సల్పుచుండును.

బాహ్యమునందు మనము వేరు, మన చుట్టునున్నది వేరుగనే కనిపించ వచ్చును. బాహ్యప్రవృత్తిగల మనస్సున ఇంద్రియములు సమకూర్చిన సంబంధమే ఇతర జగత్తుతో మనకుగల సంబంధము. కాని ఈ మనస్సు, ఈ ఇంద్రియములు బాహ్యజగత్తునుండి మనకు చేరవేయునది అత్యల్పము; అట్లే మననుండి బాహ్యజగత్తునకు చేరవేయునదియూ అత్యల్పము. పైన చెప్పిన ప్రచ్ఛన్నతలములలో మాత్రము, మనకునూ ఇతర జగత్తునకునూ ఇంత వేర్పాటు లేదు. అడ్డుగోడ యేదైన నున్ననూ అది కడు పలుచన. దానిని సులభముగా పడగొట్ట వచ్చును. ఆ ప్రచ్ఛన్నతలములలో, వ్యష్టి సమష్టి జీవనమున కాధారభూతములైన దివ్యశక్తులయూ, మనోమయ, ప్రాణమయ, సూక్ష్మాన్నమయ శక్తులయూ ప్రవృత్తిని సద్యఃకాలముననే తెలిసికొనగల్గుచుందుము. తగినశిక్షణ నలవరచుకొందుమేని, మనల బైకొనునట్టి ఈ విశ్వశక్తులను చేపట్టి నియమబద్ధముగ నడిపించగలము. అధమ పక్షమున, మనమీదనూ ఇతరులమీదనూ వాని ప్రభావమును కొంత మార్పుచేయగలము.

ఇదే విధముగ, మనస్సుకు ఊర్ధ్వమున గూడ, మనోమయ చేతన కతీతమైన (Superconscient) మహాతలములు గలవు. ఈ ఇహమునందలి సకల

మునూ నిర్ణయించు మూలస్థానమది. అచటినుండియే రహస్యముగా వివిధశక్తులు, ప్రభావములు, సంస్పర్శలు క్రిందికి దిగుచుండును. వాటి నన్నింటినీ సమగ్రముగ క్రిందికి గొనిరాగలిగితిమేని, ఈ భౌతిక విశ్వమునందు జీవనస్వరూపమే పూర్తిగ మారిపోవును. అంతరమున గర్భితమైయున్న ఈ యనుభూతినే, పూర్ణయోగమునందు మనలో పనిచేయు దివ్యశక్తి క్రమక్రమముగా సాక్షాత్కరింపజేసి మన సకల సత్తనూ, సకల ప్రకృతినీ రూపాంతర మొందించు సాధనవిధానములను చేకూర్చును. మన జీవితమప్పుడు బాహ్యతలమున దొరలిపడు తరంగప్రాయమై యుండక, విశ్వజీవనముతో పెనవైచికొనిపోవును. తాను విశ్వజీవనమున చొరబారి, తనయందు విశ్వజీవనమును చొరబారజేసికొనును. అట్లే మన ఆత్మయూ, అంతరమున విశ్వాత్మతో తాదాత్మ్యమును బొందనేర్చును, అంతే కాదు, విశ్వవ్యాపారము నెరుకతో నిర్వహించుచుండియూ విశ్వాత్మకంటె అతీతమైనదానితో కొంత సాంగత్యమును సాధించగల్గును.

ఇట్లు మన విభిన్నసత్తకు సమగ్రతను చేకూర్చుట మూలముననే ఈ పూర్ణయోగమునందు దివ్యశక్తి తన లక్ష్యసాధనకు గడంగును. విముక్తి, పూర్ణత్వము, ప్రభుత.— ఇవి యీ సమగ్రత్వ సిద్ధిపైననే ఆధారపడి యున్నవి. ఏలయన, బాహ్యతలమున లేచిపడు క్షుద్రతరంగము, తన గతినే తాను నియమించుకొనలేకున్నప్పుడు, చుట్టునున్న విశాలజీవనము నెట్లు నియమించగలదు? అనంతుడు, నిత్యుడునైన పరాత్పరుని దివ్యశక్తి మనలోని కవతరించి పనిచేయునప్పుడది మనలో ముడివేసికొనియున్న ఇప్పటి మానసిక గ్రంధుల నన్నింటినీ విచ్ఛిన్నమొనర్చును. అడ్డుగోడలను పగులగొట్టి, విశాలతనూ, విముక్తినీ చేకూర్చి, ఎప్పటికప్పుడు మహత్తరమైన క్రొంగ్రొత్త దృష్టివిశేషమునూ, భావశబలతనూ, జీవనాశయములనూ, ప్రసాదించును. మన ఆత్మనూ తత్పరికరములనూ విపులమొనర్చి సరిక్రొత్త సంతరించును. మనలోని లోపముల నన్నింటినీ ఎదుర్కొని, నిరసించి, నిర్మూలించి, లోపరహితమైన పూర్ణత్వమునకు మార్గము చూపి తీసికొనిపోవును.

ఎన్నో జన్మలలో, ఎన్నో యుగములలో నయ్యెడి పనిని, చాల కొద్ది కాలములో సాధింపగల శక్తి దానికున్నది. కావుననే, మనలో అనవరతమూ క్రొత్త

క్రొత్త జన్మలు పొడముచుండును. క్రొత్త క్రొత్త వీధులు తెరచుకొనుచుండును. దాని క్రియావిస్తృతిచే మన చేతన దేహబంధవిముక్తమై, సమాధ్యవస్థయందు గాని, నిద్రావస్థ యందుగాని,—అంతేగాదు జాగ్రదవస్థయందు సైతమూ,— లోకాంతరములలోనూ స్థలాంతరములలోనూ తిరుగాడి, అచటి యనుభూతి నిచటికి గొనిరానేర్చును. దేహమును తనలో అల్పాంశముగా గురుతించునంతటి విశాలతను పొంది, తానదివరకు దేనియందిమిడియుంటి ననుకొనెనో అది తనయందిమిడియున్నదని తెలిసికొన నారంభించును. విశ్వచేతనను సంపాదించి విశ్వవ్యాపృతమై ప్రకాశించును.

బాహ్యసమీక్షచే మాత్రమే కాక, అంతర్వీక్షణముచే, అపరోక్షానుభూతిచే సకలము నెరుంగుచూ, విశ్వమున ఖేలన మొనరించు వివిధశక్తుల సాంగత్యము సంపాదించి, భౌతికవైజ్ఞానికుడు భౌతికశక్తులను సంబాళించు విధమున వాటిని సంబాళించుచూ, దేహ మనః ప్రాణములపై వాటి ప్రభావము నవసరమునుబట్టి యామోదించును, తిరస్కరించును. పరివర్తన మొందించి క్రొత్తదారులుత్రొక్కునట్లు చేయును. విశ్వమానసపు శక్తివిశేషము లెట్లు పనిచేయుచున్నవో, మన మనోవృత్తుల నెట్లు నిర్మించుచున్నవో, మనము గుర్తెరుగ నారంభింతుము. అంతరమున నుండియే మన మానసిక బోధల సత్యాసత్యములను శోధించి, వాని వ్యాపారక్షేత్రమును విస్తృతపరచి, వాని యాంతర్యమునకు వెలుగుగూర్చి, మన మనస్సుపై మన మధిపతులమై, విశ్వమునందు మన చుట్టునున్న మనఃప్రవృత్తులను సైతమూ తీర్చిదిద్దగలుగుదుము. అట్లే విశ్వమునందు ప్రాణశక్తుల యురవడిని గమనించి,—మన యావేశములయూ, ఉద్వేగములయూ, సంస్పర్శలయూ, మూలకారణములనూ, ముఖ్యధర్మములనూ కనుగొని, అవసరమునుబట్టి వాటిని ఆమోదించుటయో, తిరస్కరించుటయో, రూపాంతర మొందించి ప్రాణశక్తి యొక్క మహోన్నత పథముల కెత్తుటయో చేయగలుగుదుము.

ఆదే విధమున, జడమునందు దాగియున్న రహస్యమును కనుగొని, దాని యందు మనఃప్రాణచేతనల క్రీడ యెట్లు జరుగుచున్నదో గమనించి, జడమును జడశక్తియొక్క రూపవిశేషముగనే కాక, అంతర్గర్భితమైన చేతనయొక్క రూపవిశేషముగా తెలిసికొని, మహోన్నత దివ్యశక్తి ప్రకటనమున కనువుగా అయ్యది

విముక్తిగాంచి పరివర్తనము చెందజాలియున్నదని ప్రత్యక్షముగ దర్శింప నారంభింతుము. ఆత్మయొక్క అవతరణము గాని అభివ్యక్తిగాని జడమునందు పూర్ణ ప్రజ్ఞతో జరుగుట కవకాశము గలదని తెలియగలుగుదుము. దివ్యశక్తి క్రియా కలాపము మనలో వృద్ధినందిన కొలది, ఈపైన చెప్పినదంతయూ,- ఇంకనూ హెచ్చుగనే కూడ మనకు అవలీలగ సాధ్యపడుచుండును. తమోమయచేతన దీని నెంతయిన ప్రతిఘటింపవచ్చును. కాని, దాని నెంతమాత్రమూ లెక్కచేయక, ఈషదచేతనస్థితిలో నుండి పూర్ణచేతన స్థితిలోనికి పరివర్తనము చెందుసపు దని వార్యములగు పురోగమన, తిరోగమన, పునఃపురోగమనములను పొందుచూ, ఒక మహత్తర విశుద్ధినీ, ఉన్నతినీ, విశాలతనూ, సత్యమునూ మనము సాధింప గల్గుదుము. మనలో అంతరాత్మ మేలుగాంచి, దాని పిలుపును మనమందుకొని, దానికి వశంవదులము కానేర్చుటపై నిదియంతయూ నాధారపడియున్నది.

కాని, ఇది మహత్తర బాహ్యప్రవృత్తికి దారి తీయగల యొక మహత్తర మైన ఆంతర జీవనవిశేషము మాత్రమే. ఇది యొక అవాంతర సిద్ధియే కాని చరమ సిద్ధికాదు— సంపూర్ణ రూపాంతరమును ఘటింపజేయు చరమసిద్ధి యజ్ఞముయొక్క సంపూర్ణారోహణము వలన మాత్రమే కలుగును. యజ్ఞము అత్యున్నతశిఖరముల కెగియనేర్చి, మనస్సున కతీతమైన దివ్యవిజ్ఞానపు తేజస్సు తోడనూ శక్తితోడనూ ఆనందముతోడనూ నిత్యజీవితమున ప్రవర్తించినప్పుడే సంపూర్ణ రూపాంతరప్రాప్తి సిద్ధించును. అట్టి సిద్ధి కలిగిననాడే, జీవితములో అసమగ్రముగ నభివ్యక్తమగుచున్న నానావిధ భిన్నశక్తులు తమ మూలసత్య మును పొడగాంచి, ఏకత్వమును బడసి, పరస్పర మేళనమున నిజాంతర్యమును ప్రతిష్ఠించుకొనగల్గును.

అక్కడ జ్ఞానము, ఇచ్ఛ వేర్వేరు వస్తువులు కావు. ప్రేమకూ శక్తికీ భేదములేదు. ఇహమునందు మనలను బాధించు ద్వంద్వము లచ్చట ఏకత్వమును బొందును. శివము తన పరమస్వరూపమున విరాజిల్లును. అశివము తన ప్రమాద ప్రవృత్తినుండి విడివడి తనకు మూలమై వెనుకనున్న శివములో నైక్యమగును. పాపపుణ్యములు దివ్యవిశుద్ధిలోనికి, ప్రమాదమెరుగని సత్యప్రవృత్తిలోనికి అంతర్ధానమగును. క్షణికానుభూతి శాశ్వతమైన దివ్యానందముగ మారిపోవును. దుఃఖము

తనకు మూల మా యానందమే యని, అచేతనమునందలి ఒకానొక వక్రత మూలమున ఆ యానందము విపరీతముగ పర్యవసించినదని, తెలిసికొని నశించును. మనస్సునకు కేవలమూ భావకల్పనగనూ గుహ్యావిషయముగనూ దోచు ఈ విషయములన్నియూ, పరిచ్ఛిన్నమైన జడ మనస్సు నతిక్రమించి, మన చేతన స్వతంత్రమై పరాబుద్ధి స్థానమునందలి నిండుదనమును పొందగలుగుచున్నకొలది, సుస్పష్టమై అనుభవ గమ్యములగును. కాని, అవి పూర్ణసత్యములై స్వతస్సిద్ధములుగ మారిపోవలెననిన, మనస్సున కతీతమైన విజ్ఞానమే ప్రకృతి ధర్మమై విలసిల్లవలెను.

కావున, యజ్ఞారోహణ మిట్లు కొనసాగి ఆ మహోన్నత శిఖరములనుండి పూర్ణశక్తి క్రిందికి పృథ్వీచేతనలోనికి అవతరించిన గాని, జీవితమునకు సార్థక్యము లేదు, మోక్షములేదు. అప్పుడుగాని, ఐహిక ప్రకృతిని రూపాంతరమొందించుకొని జీవితము దివ్యజీవితమై విరాజిల్లనేరదు.

* * *

ఈ విధమైన లక్షణములు కలిగి, ఇట్టి యాధ్యాత్మిక సాధనలచే నభివృద్ధిగాంచుచూ, మన ప్రకృతినిట్లు సమగ్రముగ రూపాంతరము నొందింపజూచు పూర్ణయోగపు స్వరూప స్వభావములనుబట్టి, ఈ యోగమునందు సామాన్య నిత్యజీవిత కర్మములకు ఎట్టి స్థానమీయదగినదియు సుస్పష్టమే.

విరాగముచే గానిండు, ధ్యానపరతచే గానిండు, ఏకాంతభక్తిచే గానిండు, నిత్యజీవిత కర్మలను పూర్తిగ త్యజించుట యనునది ఇందుండదు, ఉండుట కాస్కారము లేదు. ధ్యానములో నిమగ్నులై నిష్క్రియులై యుండవలెననిగాని, ప్రాణశక్తినీ దాని వ్యాపారములనూ నిరసించి త్రెంచుకొని పోవలెననిగాని, పృథ్వీప్రకృతియందలి అభివ్యక్తిని త్రోసిపుచ్చవలెనని గాని యీ యోగము చెప్పదు, చెప్పజాలదు. ఒక్కొక్కప్పు డెప్పుడైననూ సాధకుడు తనలోనికి దన్ను దా నుపసంహరించుకొని, తన యంతరాత్మయందు తాను నిమగ్నుడై, అజ్ఞాన భూయిష్ఠమైన జీవితపు గందరగోళమునుండి తిరోహితుడు కావచ్చును. కాని,

అది ఒకవిధమైన అంతఃపరివర్తనము కలుగనంతవరకు మాత్రమే. జీవితరంగమున శక్తిమంతముగ వ్యవహరింపగలుగుట కత్యవసరమైన యంతఃపరివర్తన మది. తాత్కాలికమైన అవసరమునుబట్టియో, ఒక విధమైన ఆధ్యాత్మిక సన్నాహము కొరకో, సాధకుడిట్లు నిత్యజీవిత వ్యవహారమునకు పరాఙ్ముఖుడగునే కాని, తన యోగసాధన కది ముఖ్యలక్షణ మనెడి యుద్దేశ్యముతో గాదు.

మానవజీవిత వ్యవహారములను మతవిషయికములనియో నైతికములనియో విభాగముచేసి, ఏవేవో పూజావిధులను గాని మానవసేవా కృత్యములను గాని నిర్వర్తించుటతో గిరిగీసుకొని కూర్చుండుట పూర్ణయోగాంతర్యమునకు పూర్తిగ విరుద్ధము. మానసికములైన నియమములూ విధినిషేధములూ పూర్ణయోగసాధనకు పూర్తిగ విజాతీయములు. ఈ సాధనయందు సకలమునూ మానసిక స్థాయి నుండి ఆధ్యాత్మిక స్థాయికి పైకెత్తవలెను. జీవితము పాక్షికముగ గాక సమగ్రముగ బాహ్యాభ్యంతర పరివర్తనము చెందునట్లు చూడవలెను. ఇట్టి పరివర్తనమునకు దోహదము చేయగలదాని నెల్ల ఆమోదింపుచూ దానికి కలిసిరానిదాని నెల్ల త్రోసివుచ్చుచుండవలెను.

ఏ వస్తురూపముతోగాని, ఏ జీవితపద్ధతితోగాని, ఏ ప్రవృత్తి విశేషముతో గాని బంధించుకొనరాదు. అవసరమైనచో సకలమునూ త్యజించుటకు సిద్ధముగ నుండవలెను. దివ్యజీవనమున కుపకరణముగా పరమేశ్వరుడు దేనిని నిర్దేశించునో దానినెల్ల గ్రహించుట కాయుత్తమై యుండవలెను. ఈ త్యజించుటగాని గ్రహించుటగాని మనస్సుతో చేయుపనికాదు. కామవిశిష్టమైన ప్రాణప్రవృత్తితోడనూ నైతికబుద్ధితోడనూ చేయునదియు కాదు. అంతరాత్మ ప్రేరణచే, యోగేశ్వరుడగు జగద్గురువి ఆదేశముచే, ఉన్నతాత్మ స్వరూపపు దర్శనభాగ్యముచే, పరమేశ్వరుని మార్గదర్శకత్వముచే జరుగవలసిన పనులవి. ఆత్మప్రవృత్తిమార్గము మనఃప్రవృత్తి మార్గముకంటె భిన్నమైనది. ఆత్మమార్గమును మానసిక చేతన నిర్దేశింపజాలదు. దానియందు మనలను నడిపింపనూ జాలదు.

అట్లే, ఆధ్యాత్మిక చేతననూ మానసిక చేతననూ, లేక ఆధ్యాత్మిక చేతననూ ప్రాణికచేతననూ జోడించుటగాని, రెండింటికినీ ఏదోవిధముగ పొత్తుగూర్చ

టగాని, బాహ్యజీవనము మారకుండ కేవలము ఆంతరజీవనము మార్చుటగాని ఈ యోగలక్ష్యము గానేరదు. రూపాంతరప్రాప్తి సకలజీవనమునకును గలుగవలెను. మనోమయప్రకృతి కతీతమైన విజ్ఞానమయ ప్రకృతియందు సకలమూ ఆత్మాభివ్యక్తివిశేషముగా మారిపోవలెను. భౌతికజగత్తున అభివ్యక్తము కావలసియున్న ఆత్మ వికాసమునకిది శిఖరప్రాయము. ప్రాణమయమైన జంతుస్థితినుండి మనోమయమైన మానవస్థితిలోనికి మార్పు జీవనముయొక్క స్వరూపమునే ఎట్లు మార్చివైచినదో, అట్లే భౌతికశరీరధారియగు మనోమయ జీవుడు విజ్ఞానమయ ఆధ్యాత్మిక పురుషుడుగా మార్పుచెందునపుడు,—జడమునకు వశంవదుడుగాక జడమునే వశంవదము చేసికొను ఆధ్యాత్మిక పురుషుడుగా మార్పుచెందునపుడు,—జీవితమున కిప్పుడున్న లోపభూయిష్ఠమైన పరిచ్ఛిన్నస్వరూపము పోయి, కేవలమొక క్రొంగ్రొత్త రూపము దాల్చకతప్పదు.

ఈ మార్పునకు తట్టుకొనలేని జీవితవిశేషము అంతరించి, దానిని తట్టుకొనజాలినవి మాత్రమే నిలువద్రొక్కుకొనినవై ఆత్మసామ్రాజ్యమున ప్రవేశించును. దివ్యశక్తియొకటి మనలో పనిచేయుచూ, ఏ క్షణమున ఏది చేయవలెనో ఏది చేయగూడదో, తాత్కాలికముగగాని శాశ్వతముగగాని దేనిని స్వీకరించవలెనో దేనిని త్రోసిపుచ్చవలెనో నిర్దేశించుచుండును. మన కామప్రవృత్తికిగాని మన అహంకారమునకు గాని తావివ్వక, దివ్యశక్తినే మనలో పనిచేయనిత్తుమేని, అదియే సర్వసమర్థమై, మనసున కందరాని, మనస్సుచే నిర్ణీతములు కాని సాధన విధానములతో మనలను నడిపించుకొనిపోవును. ఇందులకు మన అంతరాత్మ నిత్యమూ జాగరితమై, జాగరూకమైయుండి, మనలను బయటనుండిగాని లోపలనుండిగాని అపమార్గమున బెట్టజూచు ఆసురప్రవృత్తిని ప్రతిఘటించుచుండవలెను. ఈ మార్గము చాల కష్టబహుళము, ప్రమాద భరితము నను మాట నిజమే కాని, ఇంతకంటె మార్గాంతరము లేదు.

ఇందలి కష్టమునుగాని ప్రమాదమునుగాని తగ్గించుకోవలెనని, రెండు ముఖ్యవిషయములను పాటించవలెను. ఒకటి,—అహంకారమునుండియూ, ప్రాణమయకామచేతన నుండియూ, కేవల మనోమయ చేతనమండియూ, దాని యసమర్థపు హేతువాదము నుండియూ,—ఈ యజ్ఞాన రూపవిశేషము లన్నిటినుం

దీయూ బయల్వెడలుదానినెల్ల మనము నిరాకరించుచుండవలెను. రెండు,-మన అంతరాత్మ పిలుపును, మన యంతరమునందలి జగద్గురుని యుపదేశమును, జగదీశ్వరుని యాజ్ఞను, జగన్మాత నిర్దేశమును ఆలకించి అనుసరించు నేర్పు నలవరచుకొనవలెను.

శారీరికములైన వాంఛలనూ దౌర్బల్యములనూ, అజ్ఞానసంక్షుభితమైన ప్రాణికోద్వేగములనూ, ఉత్తమజ్ఞానసందీప్తముగాక కలుగుచుండువడు వ్యక్తిగత మానసికాదేశములనూ ఎవడు విడువలేకయుండునో, అట్టివానికి యథార్థమైన ఆంతరజీవన ధర్మసాక్షాత్కారము కలుగనేరదు. దివ్యజీవనసిద్ధి కతనిని దూరము చేయు ప్రతిబంధకము లెన్నియో అడ్డుతగులుచుండును. ఎవడీ యజ్ఞానోపకరణములను బరిహరించి, వివేకముతో బహిరంతర్వర్తియగు జగద్గురు ననుసరించునో, అతనికే ఆధ్యాత్మిక ధర్మసాక్షాత్కారము, అతనికే పూర్ణయోగ లక్ష్యసిద్ధి.

చేతనను సమూలముగనూ సమగ్రముగనూ పరివర్తనము నొందించుటయే పూర్ణయోగ సాధన ముఖ్యలక్ష్యము. అంతేకాదు, నానాటి కధికతరశక్తితో, అభ్యుదయసూచకములైన వివిధ దశలతో, అట్టి పరివర్తనమును గొనసాగించుటయే దాని ముఖ్యవిధానముగూడ.

# అధ్యాయము 7

# కర్మాచరణ ప్రమాణములు

## ఆధ్యాత్మిక స్వాతంత్ర్యము

పూర్ణయోగసాధకుని కర్మాచరణమునకు నిరంతరాభివృద్ధి గాంచుచుండెడి విస్పష్టమైన ఏకత్వదర్శనము ఏదుగడగా వెలయవలసియున్నది. అంతటనూ నిండియున్నది ఒక్కటియే అనెడి భావము అతనియందు నిత్యమూ వెలుగొందు చుండవలెను. ఉన్నదెల్ల ఒకే అవిభాజ్యమైన పూర్ణసత్తయను జ్ఞానవికాసముతో నతడు సంచరించుచుండును. సకల కర్మయు, దివ్యమైన యీ పూర్ణసత్తలో అంత ర్భాగముగనే అతనికి తోచుచుండును. తా నొనరించు కర్మయు, కర్మఫలిత మును ఒక వ్యక్తియొక్క అహంకారిక 'స్వతంత్ర' సంకల్పముచే నిర్ణీతమైన ప్రత్యేక ప్రవృత్తి విశేషములుగా నతనికి చూపట్టనేరవు. సమష్టియందు తాను వేరనియెడి భావముసైతం మాతనిలో మృగ్యమగును. మనముచేయు కర్మలెల్ల అవి భాజ్యమై నెగడు విశ్వవ్యాపారములో నంతర్భాగములు. సమష్టినుండియే అవి ఉద్భూతమగును. సమష్టియందే యథోచితస్థానము నాక్రమించియుండును.

మనకంటె అతీతమైన శక్తులచేత నిర్ణయించబడు కర్మలవి. ఆ విశ్వవ్యా పారము, దాని విస్తృత సమష్టి స్వరూపమునందును, అందలి ప్రతి స్వల్ప గతి విశేషమునందునుగూడ విశ్వమున క్రమాధికముగా తనను దా నభివ్యక్తమొనర్చు కొనెడు అద్వయతత్వపు అవిభాజ్య వ్యాపారమే. మానవుడుకూడ, తన లోపలను వెలుపలను నిండియున్న ఆ అద్వయతత్వపు ప్రకృతివ్యాపారములో ద్యోతకమగు అద్దానిఅద్భుత నిగూఢవిశిష్టవిధానము తెలియనేర్చిన కొలదియు నతనికి తనయాథా ర్థ్యము, విశ్వగత సకల వస్తువుల యథార్థ్యము అంతకంత కధికముగా తెలియ నగుచుండును. మనయందు, మన చుట్టునున్నవారియందు సైతమూ ఈ వ్యాపా

రము, ఈ గతివిశేషము, విశ్వప్రవృత్తులలో మన బాహ్యచేతనకు తెలియనైన పరిచ్ఛిన్నమగు అల్పాంశమునకు మాత్రమే పరిమితమై లేదు.

మన మనస్సునకు, అవచేతనకు వెనుక దాగియున్న అపార పరిసర సత్త ఈ వ్యాపారమున కాధారమై నిలిచియున్నది. అంతేకాక, మన ప్రకృతి కతీతమై వెలయు నపార సర్వాతీత సత్తచే సమాకర్షింపబడుచున్నదికూడ. మనకు తెలియని ఒక మహాసమష్టినుండి మనము బయలువెడలినట్లే మన కర్మప్రవృత్తియు బయలువెడలుచున్నది. మన వ్యక్తిగత గుణమునుబట్టియు, వ్యక్తిగత మానసిక సంకల్పము, అభిలాషలను బట్టియు ఆ ప్రవృత్తికి మన మొక రూపము నిచ్చుచుందుము. కాని, ప్రవృత్తి నిజధర్మము, వస్తుయాథార్థ్యము ఈ వ్యక్తిగత మానవరూపకల్పనల నతిక్రమించియుండును. విశ్వవ్యాపారపు అవిభాజ్య సమష్టి స్వరూపమును గుర్తింపనేరని మానవకృతమైన ప్రతిప్రవృత్తి నియమము, దృక్పథము బాహ్యాచరణమున నెంత ఉపయోగకారియైనను ఆధ్యాత్మిక సత్యదృష్టికి అసమగ్రభావనము, అవిద్యావిధానమే యగును.

ఈ భావస్ఫూర్తి మనకు కొంత కలిగి, దానిని మానసికమైన జ్ఞానముగా మన యెరుకయందు పాదుకొల్పుకొని, తత్పర్యవసానముగ హృదయపూర్వక భావనిష్ఠ యలవరచుకోగలిగిన సందర్భములో కూడ, మన బాహ్యవ్యాపారసరణిలో ఈ సమష్టిదృక్పథమునకును, మన వ్యక్తిగత ఇచ్ఛాజ్ఞాన క్రియాభిలాషలకును పొత్తుగూర్చుట మనకు చిక్కులి కష్టమే యగును. అవిభాజ్యమైన యీ విశ్వవ్యాపారమును పురుషకర్తృకము గానట్టి యొక మహారాశిగా భావించి, ఆ రాశినుండి మనము,—అనగా పురుషకర్తృత్వాభిమానముతో మన అహంకారము,— మన సంకల్పము, మన మానసికాభిలాషల ప్రకారము వలయుదానిని పేరదీసి మలచుకోవలసియుండునని తలంచుచు, ఆరీతిగనే యింకనూ అవశముగ వ్యవహరింపవలసినవార మగుచుందుము. తనపరిసరమునెడ మానవుని సామాన్యప్రవృత్తి ఇదియే.

యథార్థమునకిది అవాస్తవికము. ఏలయన, మన అహంకారము, దాని ఇచ్ఛాప్రవృత్తి విశ్వశక్తులచే సృజింపబడి వాటిచే నాడింపబడు కీలుబొమ్మ

అహంకారమునుండి మనము విడివడి, ఆ విశ్వశక్తులందు వ్యవహరించెడి విత్యుడైన పరముని దివ్యజ్ఞానచేతనయం దధివసింపనేర్చినప్పుడే, పైనుండి సంక్రమించిన ఒక విధమైన ప్రాతినిధ్యాధికారముతో వాటి కధినేతలము కాగలుగుదుము. కాని, తన వ్యక్తిత్వము నంటిపెట్టుకొనియుండి, దాని నింకనూ పూర్ణముగ వికసింపజేసికొని యుండనంతకాలము మానవుడీ వ్యక్తిగతవైఖరి నవలంబించియుండుటయే యుక్తము. ఏలయన, ఈ దృక్పథము, ఈ సంకల్పప్రవృత్తి లేవిచో నతడు తన అహంతయం దభివృద్ధిగాంచి, అవచేతనా విశిష్టము, అర్ధచేతనావిశిష్టములైన విశ్వజీవన సమష్టినుండి తనను దాను వేర్పరించుకొని తగినరీతిగా వికాసము గాంచనేరడు.

కాని, వ్యక్తిత్వ సహితము, పృథగ్భావోపేతము, స్వకీయౌద్ధత్య ప్రకటనాసక్తమునైన యీ వికాసదశతో మన కవసరము తీరి, ఈ అల్పాత్మత నుండి ఏకత్వభావపూరితమైన విశ్వాత్మతవైపునకు, దాని కతీతముగా మన సర్వాతీత ఆత్మసంస్థితి వైపునకు మనము ప్రయాణించవలసి యున్నప్పుడు, మన జీవనాభ్యాససరళి యంతటిపైనను ఈ అహంకారచేతనకుగల భల్లూకపు పట్టువదలించుకొనుట మిక్కిలి కష్టమే యగును. ఏ అహంకారచేతనయైనను తన శక్తి సామర్థ్యముల ననుసరించి తన యిచ్ఛవచ్చినట్లుగా మలచుకొనుట కవకాశమిచ్చెడి పురుషకర్తృకము గానట్టి యొక మహారాశిగా ఈ విశ్వవ్యాపారమును పరిగణింపవీలులేదను విషయము మన తలపునందేగాక మన అనుభవమునందు, ఆచరణయందు గూడ గుర్తించుట అత్యంతావశ్యకమై యున్నది.

అయ్యది స్వకీయక్షేత్రజ్ఞుడైన విశ్వపురుషుని వ్యాపారము; స్వకీయ క్రియాశక్తి వికాసమున కధినేత యగు నీశ్వరుని పదవిన్యాసము. ఆ వ్యాపార మెట్లు ఏకము, అవిభాజ్యమో, ఆ వ్యాపారమున సన్నిధిచేసియున్న విశ్వపురుషుకును అద్వయుడు, అవిభాజ్యుడే. అతడు సమస్తకర్మఫల నిర్ణేతమాత్రమే కాదు. సమస్త కర్మారంభము, కర్మాచరణము, కర్మవిధానము,— అన్నియు నాతని విశ్వశక్తి వ్యాపారముమీదనే ఆధారపడియున్నవి. జీవి అప్రధానుడు. జీవికి చెందినది కర్మల బాహ్యరూపము మాత్రమే.

అట్లయినచో, కర్మల నాచరించెడి వ్యక్తి ఆధ్యాత్మిక వైఖరి ఎట్టిదిగా నుండవలెను? అద్వయుడగు నీ విశ్వపురుషునితోడను, ఏకమైన యీ విశ్వవ్యాపారముతోడను అతనికిగల యథార్థ సంబంధ మెటువంటిది? అతడొక కేంద్రము వంటివాడు మాత్రమే,- ఒకే పురుషచేతనయందలి ఒకానొక పార్థక్యమును సూచించెడి కేంద్రము; ఒకే సమగ్రవ్యాపారమునందలి ఒకానొక నిర్ణయము నను వర్తించెడి కేంద్రము. ఎడతెగని ఒకానొక వ్యక్తిత్వతరంగ రూపమున నాతని వ్యక్తివిశేషము శాశ్వతుడు, సర్వాతీతుడు, అద్వయుడునగు విశ్వపురుషుని ప్రతిబింబించు నట్టిదియే. ఆవిద్యయందా ప్రతిబింబము సదా విచ్ఛిత్తిని పొంది తారుమారై యుండును. ఏలయన, ఆ వ్యక్తిత్వతరంగమునకు కొప్పువంటిదగు మన జాగ్రచ్చేతన తనయందా పరమాత్ముని అసమగ్రముగను, వ్యత్యస్తముగను మాత్రమే ప్రతిబింబించుకొనగల్గును.

మన అభిప్రాయములు, ప్రమాణములు, కల్పనలు, ధర్మసూత్రములు,- అన్నియు ప్రతిబింబములను తారుమారుగా జూపెడి యీ విచ్ఛిన్న దర్పణమునందు పరమేశ్వరుని ఆత్మాభివ్యక్తియొక్క చరమ లక్ష్యము వైపునకు కొనసాగు బహుముఖ సమగ్ర విశ్వవ్యాపారములోని ఒకానొక భాగమును వ్యక్తీకరింపనెంచు ప్రయత్నములే. మన మనస్సు దానిని తనకు సాధ్యపడినంతలో రమారమిగా కొంతవరకు మాత్రము వ్యక్తీకరించుచుండును. మనోభావన విశాలతను, తేజస్సును, శక్తిని సంతరించుకొననేర్చిన కొలది ఈ వ్యక్తీకరణము నందలి లోపము కొంత తగ్గుచుండు ననుమాట నిజమే. కాని, ఎంతచేసినను అయ్యది రమారమి వ్యక్తీకరణమే యగునుగాని, పాక్షికముగానైన యథార్థ ప్రతిరూపముగానేరదు. ఏకమైన విస్తృతవిశ్వమునందేకాక, ప్రాణమయ, మనోమయ జీవకోటుల సమష్టియందేగాక, వ్యష్టిగా ప్రతిజీవియొక్క ఆత్మయందును దాగియున్న దివ్యరహస్యమును, గర్భితమైయున్న దివ్యసత్యమును క్రమక్రమముగా ఆవిష్కరింపజేయుటకై ఈశ్వరేచ్ఛ యుగయుగాలుగా పనిచేయుచున్నది.

కావుననే విశ్వమందును, సమష్టియందును వ్యష్టియందును గూడ, గర్భిత వస్తుతత్వమునకు సన్నిహిత మగునట్లుగా సామరస్యపూర్వకమగు ఆత్మవికాసము అంతకంత కధికముగా బడయగలుగుటకై నిరంతర చోదనావృత్తియు,

స్వకీయ సంపూర్ణత్వసిద్ధియెడ దృఢవిశ్వాసస్ఫూర్తియు నిక్షిప్తములై యున్నవి, నిర్మాణాత్మకమైన మానవుని మానసమునందీ ప్రయత్నము వివిధ ప్రమాణముల రూపములో అభివ్యక్తమగుచున్నది. జ్ఞానప్రవృత్తి, భావావేశము, శీలసంపద, రసగ్రహణము, కర్మాచరణము— వీటికి సంబంధించిన ప్రమాణము లివి. నియమములు, ఆదర్శములు, న్యాయములు, విధులు మొదలగు రూపములలోని యీ ప్రమాణములనే మానవుడు విశ్వజనీన ధర్మములుగా మలచ యత్నించుచుండును.

* * *

ఆత్మతత్వమునందు మనము స్వతంత్రులమై మెలగగోరునెడల,—పరమ సత్యమునకు దక్క మరి దేనికిని మనము విధేయులము కాకుండుట కిచ్చగింతుమేని,—అనంతుడగు పరమేశ్వరుని మన మానసిక నియమములకు, నైతికవిధులకు బద్ధుని చేయజూచు తలంపును విసర్జింపవలెను. కర్మాచరణకు మనము నిర్ణయించుకొను ప్రమాణములు ఎంతటి ఉచ్చతమములైన నగుగాక, అవి పరమ పవిత్రములనీ, పరమ ప్రమాణములనీ, పరమ శాశ్వతములనీ ఎంచుటకు వీలులేదు. అంతకంతకు ఉన్నతోన్నతములైన ప్రమాణములను వాటి అవసర మున్నంతవరకు తాత్కాలికముగా ఏర్పాటుచేసికొనుట పరమేశ్వరుని విశ్వయాత్రకు తోడ్పడుటయే.

కాని, అనుల్లంఘనీయమగు పరమ ప్రమాణము నొకదానిని సృష్టిచేసికొన యత్నించుట మాత్రము నిత్యమైన దివ్యగంగా ప్రవాహమున కడ్డుకట్టలు కటుకొన జూచుటే యగును. ప్రకృతిబద్ధమైన యాత్మ యీ సత్యమును సాక్షాత్కరించుకొనిననాడు పుణ్యపాపద్వంద్వమునుండి విముక్తమగును. జీవులను, లోకమును వారి వారి దివ్యసంసిద్ధివైపునకు నడిపించుకొని పోవుటలో తోడ్పడునదియే పుణ్యము. ఆ క్రమాధికసంసిద్ధిని అవరోధించి తునుగగొట్టునదంతయు పాపము. కాని, యీ సంసిద్ధి యనునది క్రమాధికముగ కాలగతిలో వికాసము చెందునది కావున, పుణ్యపాపములు గూడ మార్పుచెందునవై, కాలానుసారముగ తమ విలువలను మార్చుకొనుచుండును. ఇప్పుడు మనకు పాపముగా, చెడ్డదిగా గోచరించి ఇప్పటి రూపమున త్యాజ్యము కావలసియున్నది ఒకప్పుడు సహాయకమై వ్యష్టి

సమష్టి పురోగతికి అవశ్యకమగుచు తోడ్పడియే యుండెను. అట్లే ఇప్పుడు పాప ముగా, చెడ్డదిగా గోచరించెడి మరియొకటి ముందుకాలములో మరియొక రూప మున మరియొక సన్నివేశములో మన సంసిద్ధికి సహాయకమై వెలయునది కావచ్చును. ఆధ్యాత్మికస్థాయిలో ఈ భేదమునకు సైతము మన మతీతుల మగుదుము.

ఏలయన, మంచి, చెడుగు, పుణ్యము, పాపము అని మనము పేర్కొను వానికి ఈశ్వరవిధానములోగల ప్రయోజనమును మనమప్పుడు గుర్తింపనేర్తుము. అట్టి సందర్భములో, పాప మనబడుదానియందువలెనే పుణ్యమనబడుదానియందు సైతముగల అనృతమును,-వక్రీభూతము, అజ్ఞానయుతము, తమోభూయిష్ఠము నగుదానినెల్ల మనము త్రోసిపుచ్చవలసియుండును. ఏలయన, అప్పుడు మన మామోదించవలసినది సత్యము, దివ్యము నైనదానిని మాత్రమే. సనాతనము లైన విధానములందు ఇతర భేదకల్పనము చేయుట కవకాశములేదు.

మారని యొకానొక కఠినప్రమాణము ననుసరించి మాత్రమే ప్రవర్తించు వారికి,-మానవత్వపు విలువలేతప్ప దివ్యత్వపు విలువలు గ్రహింపనేరనివారికి,- ఈ సత్యము నైతికధర్మపు పునాదిని కుళ్ళగించివేసి సకల ప్రవర్తనను చిందర వందర గావింపుచు, వట్టి అయోమయావస్థను సృష్టిచేయగల ఒక మహాప్రమాద కర పరిస్థితికి అవకాశమిచ్చునదిగా కనుపట్టవచ్చును. ఎన్నటికీ మార్పులేని యొక నైతిక ధర్మము నవలంబించుటయూ, లేక ఏ నైతిక ధర్మమునూ ఆమోదించక ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించుటయూ,-రెంటిలో నేదో యొక్కటిమాత్రమే అనుస రించక తప్పని పరిస్థితియందు, అజ్ఞానావస్థలోని మానవున కది మహాప్రమాద కరమై పరిణమించెడిమాట వాస్తవమే.

కాని, మానవస్థాయిలోనైనను ఏదైన నొక ధర్మమును తాత్కాలికోప యోగిగా గుర్తింపుచు, అంతకంటె మేలుతరమైన ధర్మమును దానికి బదులుగా అవలంబింప గలుగు పర్యంతమూ, అద్దానిని శ్రద్ధతో అనుష్ఠించగల జ్ఞానము, పేశలత్వము మన కలవడునేని, అపుడు మనకు అట్టి నష్టమేదియు వాటిల్లబోదు. అసమగ్రమై అసహానపూర్వకమైన యొక ధర్మముపట్ల మూర్ఖాభినివేశమును మాత్రమే పోగొట్టుకొనినవార మయ్యెదము. దానికి బదులుగా, మనలో నొక విధ మైన ఉన్మీలనము కలిగి, అవిచ్ఛిన్న నైతిక పురోగతి పూర్వకముగా, తొలుత

సమష్టి పురోగతికి అవశ్యకమగుచు తోడ్పడియే యుండెను. అట్లే ఇప్పుడు పాప ముగా, చెడ్డదిగా గోచరించెడి మరియొకటి ముందుకాలములో మరియొక రూప మున మరియొక సన్నివేశములో మన సంసిద్ధికి సహాయకమై వెలయునది కావ చ్చును. ఆధ్యాత్మికస్థాయిలో ఈ భేదమునకు సైతము మన మతీతుల మగుదుము.

ఏలయన, మంచి, చెడుగు, పుణ్యము, పాపము అని మనము పేర్కొను వానికి ఈశ్వరవిధానములోగల ప్రయోజనమును మనమప్పుడు గుర్తింపనేర్తుము. అట్టి సందర్భములో, పాప మనబడుదానియందువలెనే పుణ్యమనబడుదానియందు సైతముగల అనృతమును,-వక్రీభూతము, అజ్ఞానయుతము, తమోభూయిష్టము నగుదానినెల్ల మనము త్రోసిపుచ్చవలసియుండును. ఏలయన, అప్పుడు మన మామోదించవలసినది సత్యము, దివ్యము నైనదానిని మాత్రమే. సనాతనము లైన విధానములందు ఇతర భేదకల్పనము చేయుట కవకాశములేదు.

మారని యొకానొక కఠినప్రమాణము ననుసరించి మాత్రమే ప్రవర్తించు వారికి,-మానవత్వపు విలువలేతప్ప దివ్యత్వపు విలువలు గ్రహింపనేరనివారికి,- ఈ సత్యము నైతికధర్మపు పునాదిని కుళ్ళగించివేసి సకల ప్రవర్తనను చిందర వందర గావింపుచు, వట్టి అయోమయావస్థను సృష్టిచేయగల ఒక మహాప్రమాద కర పరిస్థితికి అవకాశమిచ్చునదిగా కనుపట్టవచ్చును. ఎన్నటికీ మార్పులేని యొక నైతిక ధర్మము నవలంబించుటయూ, లేక ఏ నైతిక ధర్మమునూ ఆమోదించక ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించుటయూ,-రెంటిలో నేదో యొక్కటిమాత్రమే అనుస రించక తప్పని పరిస్థితియందు, అజ్ఞానావస్థలోని మానవున కది మహాప్రమాద కరమై పరిణమించెడిమాట వాస్తవమే.

కాని, మానవస్థాయిలోనైనను ఏదైన నొక ధర్మమును తాత్కాలికోప యోగిగా గుర్తింపుచు, అంతకంటె మేలుతరమైన ధర్మమును దానికి బదులుగా అవలంబింప గలుగు పర్యంతమూ, అద్దానిని శ్రద్ధతో అనుష్ఠించగల జ్ఞానమూ, పేశలత్వము మన కలవడునేని, అపుడు మనకు అట్టి నష్టమేదియు వాటిల్లబోదు. అసమగ్రమై అసహనపూర్వకమైన యొక ధర్మముపట్ల మూర్ఖాభినివేశమును మాత్రమే పెంపొందించుకొనినవార మయ్యెదము. దానికి బదులుగా, మనలో నొక విధ మైన ఉన్మీలనము కలిగి, అవిచ్ఛిన్న నైతిక పురోగతి పూర్వకముగా, తొట్రు

ణముద్వారా, శక్తియుక్తుడగు నిత్యునితో ఒకవిధమైన ఏకత్వమును ఘటింపజేయు ఘనతర దివ్యచైతన్యములోనికి ఆరోహించుట మూలమున పూర్ణయోగమీ అతిమానస కర్మాచరణ పద్ధతి నధిగమింప లక్షించుచున్నది.

*　　　　　*

మానవుని కర్మాచరణ ప్రవృత్తికి ఆరోహణక్రమములో నాలుగు ప్రధానమైన ప్రమాణములున్నవి. మొదటిది వ్యక్తిగత కామితము, అభీష్టము, అవసరమునకు సంబంధించినది. రెండవది సమష్టినియతి, సమష్టిశ్రేయస్సుకు సంబంధించినది మూడవది నైతికాదర్శము. కడపటిది స్వభావనియతమగు సర్వోత్తమ దివ్యధర్మము.

మానవుడు తన క్రమవికాసపు సుదీర్ఘజీవిత క్రమమునందు తనకు దారిచూపి నడపుటకు పై నాలుగు ప్రమాణములలో మొదటి రెండింటితోనే ఉపక్రమించును. ఏలయన, అవి యాతని ప్రాణమయ, జంతు జీవన ధర్మమునకు సంబంధించినవి. జంతుప్రవృత్తిప్రధానమైన ప్రాణమయ భౌతిక మానవుడుగనే అతడు తన పురోగమనమును ప్రారంభించును. మానవ వ్యక్తివిశేషమునందు ఈశ్వర ప్రతిరూపమును అంతకంత కధికముగా వ్యక్తము చేయుటయే పృథ్విపై మానవున కేర్పడియున్న కర్తవ్యము. జ్ఞాతముగనో అజ్ఞాతముగనో, ఈ లక్ష్య సాధనకే ప్రకృతి తన బాహ్యాభ్యంతర విధానముల దట్టపుముసుగు మాటున అతనిలో పనిచేయుచున్నది.

కాని, భౌతిక మానవుడు జీవితపు ఆంతరికలక్ష్య మెరుగడు. అత డెరిగినది జీవితపు అవసరములు, కామితములు మాత్రమే. తనకు ఏది అవసరమై చూపట్టుచున్నది, తనలో ఎట్టి కామితము కదలాడుచున్నది, అనునది తప్ప, తన కర్తవ్యము తా నెరిగి ప్రవర్తించుట కతనికి ఇతర సాధనము లేమియు లేవు. ఇతర ధర్మము లన్నిటికంటె ముఖ్యముగా దేహ ప్రాణ వాంఛితములను, అవసరములను దీర్చుకొనుటయు, ఆ తరువాతి శ్రేణిలో, తనయందు పొటమరించెడి హృదయావేశములు, మనోవాంఛలు, భావనలు, గాఢాభిప్రాయములు,—వీటిని నెరవేర్చుకొనుటయు,—ఇదియే అతని కర్మాచరణమునకు సహజముగా మొట్టమొదటి

ప్రమాణ సూత్రము కాకతప్పదు. తన కుటుంబము,తన కులము,తన సంఘము,- వీటికి సంబంధించిన భావములు, అవసరములు, వాంఛితములు అతనిని ఒత్తిడి పెట్టుట జరిగినప్పుడు మాత్రమే ఈ ప్రబలమైన సహజ ప్రవృత్తి కొంతవరకు మారుట గాని, లేక త్రోసిపుచ్చబడుటగాని సంభవించుచుండును.

మానవుడు కేవలము తనకు తానే జీవించగలిగియుండిన పక్షమున, ఈ తొలి ప్రమాణసూత్రమునకు విఘాతము కల్పించు రెండవ ప్రమాణ సూత్ర మాచరణములోనికి రానవసరము లేదు. జగత్తున ఈశ్వరవిధాన లక్ష్యము కేవలము వ్యక్తివికాసమైనప్పుడు మాత్రమే అతడట్లు తనకు తానే జీవించుట సాధ్యమగును. కాని, వ్యష్టి సమష్టుల అన్యోన్యక్రియా ప్రతిక్రియలద్వారముననే సమస్త జీవితము కొనసాగుచున్నది. వ్యష్టుల అవసరము సమష్టికి, సమష్టి అవసరము వ్యష్టులకు కలదు. సముదాయము, సముదాయమందలి వ్యక్తులు ఒండొరులపై నాధారపడియున్నారు. వ్యష్టి సమష్టులపేరిటి ద్వంద్వ రూపమున ఈశ్వరుడు తనను దా నభివ్యక్త మొనర్చుకొనుచున్నాడని భారతీయ తత్త్వశాస్త్రమున వక్కాణించబడియున్నది. తన ప్రత్యేకవ్యక్తిత్వ వికాసమును, పూర్ణత్వమును, స్వాతంత్ర్యమును అభిలషించు మానవుడు ఇతర మానవులతోడి సహకారముతో తప్ప తన వ్యక్తిగతకామితములను, అవసరములనైననూ తీర్చుకొనలేకున్నాడు.

తనకు తా నొక సమగ్రవ్యక్తియైనను ఇతరులతో ప్రసక్తిలేకున్న నత డసంపూర్ణుడు. ఈ బాధ్యత కారణముననే అతని వ్యక్తిగత కర్మాచరణ ప్రవృత్తిధర్మము సాముదాయిక ప్రవృత్తిధర్మమున నంతర్భూతమగుచున్నది. ప్రత్యేకమగు సాముదాయిక మనస్సు, సాముదాయిక జీవనము గల స్థిరమైన సాముదాయిక వ్యవస్థ యేర్పడుటతో ఈ సాముదాయిక ప్రవృత్తిధర్మము రూపొందుచున్నది. అతని వ్యక్తిగత మానసము, వ్యక్తిగత జీవితము అస్థిరములుగా పరిగణింపబడి యీ సాముదాయిక ప్రవృత్తిధర్మమునకు విధేయములు గావింపబడుచున్నవి. కాని, అతనిలో ఈ సాముదాయిక శరీరమునకు బద్ధముగాక అమరమై స్వతంత్రమై విలసిల్లున దొకటి కలదు, ఈ సాముదాయిక శరీర మాతని భౌతిక శరీర పతనానంతరము మనగలిగియుండునదే కాని, అతనిలోని అమరము,నిత్యము

నగు ఆత్మతత్వము నతిక్రమించి దానిని తన ప్రవృత్తిధర్మముచే బంధింపజాలు నది కానేరదు.

వ్యక్తిగత ప్రవృత్తిధర్మముకంటె విశాలతరము, ప్రబలతరముగా చూపట్టు నీ సాముదాయిక ప్రవృత్తిధర్మము వాస్తవమునకు ప్రాథమిక మానవవ్యక్తి నను శాసించెడి ప్రాణమయ జంతుప్రవృత్తిధర్మపు విస్తరణమే యగునుగాని వేరు కాజాలదు. అది ఒక గుంపునకు, సముదాయమునకు సంబంధించినది. జన్మచేగాని, స్వచ్ఛందవృత్తిచేగాని, పరిస్థితి ప్రాబల్యముచేగాని, తనకు సంబంధ మేర్పడిన కొంతమంది ఇతర వ్యక్తుల జీవితముతో తన జీవితమున కొక వ్యక్తి పాక్షిక ముగా తాదాత్మ్యము కల్పించుకొనుట సంభవించును. మొదటినుండియు కాకపోయి నను, కాలక్రమములో, తన ఉనికికి, తన తృప్తికి సముదాయపు ఉనికిగూడ ఆవశ్యకముగాన, ఆ సముదాయమును రక్షణచేయుటయు, దాని అవసరముల తీర్చుటయు, దానిని సంఘటితపరచి యుంచెడి దాని సమష్టిభావములను, కామితము లను, అభ్యాసములను నెరవేర్చుటయు విశేషప్రాధాన్యము వహించుట అనివార్య మగుచున్నది. వ్యక్తిగతభావము, అభిప్రాయము, అవసరము, కామితము, అభి రుచి, అభ్యాసము, ఇవన్నియు సముదాయములోని ఏ ఒకరో, లేక కొందరో వ్యక్తుల భావములు, అభిప్రాయములు, అవసరములు, కామితములు, అభిరుచులు, అభ్యాసములకుగాక మొత్తము సముదాయపు భావములు వగైరాలకు ఏదియో నైతికధర్మదృష్టితోగాక పరిస్థితుల అవసరమును బట్టి లోబడి వర్తించునట్లు చేయ వలసివచ్చుచుండును. ఈ సాముదాయికావసరమే నైతికధర్మ మనుదానికి, మాన వుని నైతికప్రవృత్తికిని నిగూఢమైన ఉత్పత్తిస్థాన మనదగియున్నది.

ప్రాచీనకాలములం దెప్పుడైనను మానవుడు తనకు తానే ఒంటరిగాగాని, లేక కొన్ని జంతువుల మాదిరిగ తన జంటతో మాత్రమేగాని జీవించియుండె నేమో నిశ్చయముగా తెలియదు. అతనిని గురించి మనకు తెలియజేయు సంద ర్భములన్నియు నతడొక వివిక్తజీవిగాక సంఘజీవియని మాత్రమే తెలుపు చున్నవి, సంఘధర్మమే అతని స్వీయాభివృద్ధికి సంబంధించిన వ్యక్తిధర్మము నతి క్రమించి పాలింపుచు వచ్చినది. అత డెల్లప్పుడును ఒక సంఘములో పుట్టి పెరిగి అందు అంతర్భాగమైన ఒక వ్యక్తిగా నేర్పడినట్లే కనుపించును. కాని, మన స్తత్వ

దృష్ట్యా వీక్షించినప్పుడు, వ్యక్తిగతకామనకు, అవసరమునకు సంబంధించిన ధర్మమే ముఖ్యమైనదనియు, అముఖ్యమగు సాంఘికధర్మము దానిని త్రోసిరాజు చేసి ప్రవర్తించుచున్నదనియు తోచుట సహజము, యుక్తముకూడ.

మానవునిలో ప్రధానమైన ప్రవృత్తులు రెండు వేర్వేరుగా కన్పట్టుచున్నవి. ఒకటి వైయక్తికము, రెండవది సాంఘికము. వైయక్తికజీవిత మొకటి, సాంఘిక జీవితము వేరొకటి. ఒకదానియందు వైయక్తిక దృష్టితో కర్మాచరణము; వేరొక దానియందు సాంఘికదృష్టితో కర్మాచరణము. వీటికి పరస్పరవైరుధ్యమేర్పడుట కవకాశముండుటచే వీటికి సామరస్యము ఘటింపజేయు యత్నమే మానవ నాగరికత కంతకును మూలమై యొప్పారుచున్నది. దేహప్రాణవృత్తి ప్రధానమైన జీవితము నతిక్రమించి అతడు కడు ఉన్నతస్థాయిలో వైయక్తికనుగు మానసిక, ఆధ్యాత్మిక వికాసము నందగోరు సందర్భములోకూడ ఈ వైరుధ్యము, ఈ సామరస్యసాధనప్రయత్నము తప్పవు.

వైయక్తిక ధర్మమునకు బాహ్యముగా సాంఘికధర్మ మొకటి యుండుట మానవునిలోని దివ్యత్వ వికాసమునకు వేర్వేరు కాలములలో మిక్కిలి అనుకూలము, ప్రతికూలముగూడ నగును. ప్రారంభదశలో మానవుడసంస్కారియై తనను దా నెరుగుటకుగాని, నిగ్రహించుకొనుటకుగాని అసమర్థుడై యుండునప్పు డది అనుకూలము ఏలయన, అతని వైయక్తికాహంకారముకంటె వేరైన శక్తి నొకదానిని అయ్యది ప్రతిష్ఠించుటయు, తన్మూలమున నాతని యహంకార మా శక్తికి తప్పనిసరిగ విధేయమై తన యాటవికవాంఛలను పరిమిత మొనర్చుకొనుట కును, అసంబద్ధమైనట్టియు తరచుగా హింసాత్మకమైనట్టియు తన ప్రవృత్తుల నదుపులో పెట్టుకొనుటకును, మీదుమిక్కిలి యొకొక్కప్పుడు వైయక్తిక లక్షణము తక్కువగాగల విస్తృతతరాహంకారమునకు తనను దా నర్పణము చేసికొనుట కును గూడ ప్రవృత్తమగుటయు సంభవించును.

అతీత మానవస్థాయి నధిగమించుటకు సిద్ధముగనున్న పరిణతాత్మునికి మాత్ర మది ప్రతికూలము. ఏలయన, అయ్యది బయటినుండి అతని నధిశాసింప నెంచు బాహ్య ప్రమాణము. అంతకంత కధికతరమైన స్వాతంత్ర్యముతో అంతరములో నుండి వికాసము చెందినగాని యతనికి సంసిద్ధి యనునది చేకూరదు.

అతని వ్యక్తిత్వమును అణచివేయుటవలనగాక అతీతస్థాయిలో దానికి పూర్ణత్వము చేకూర్చుటవలనను, అతనియందలి విభాగములను బాహ్యశాసనముచే కట్టడిచేసి అదుపులో పెట్టుటవలనగాక అంతరమునందలి యాత్మతేజముచే గతమునెల్ల అతిక్రమించి యా విభాగములను రూపాంతరము చెందించుట మూలమునను ఈ సంసిద్ధి చేకూరవలసియున్నది

*　　　　*　　　　*

స్వకీయాధికార ప్రకటనము విషయమున సంఘమునకు, వ్యక్తికి నడుమ నేర్పడు సంఘర్షణ సందర్భములో, స్వతంత్రములగు రెండు ఆదర్శ పరిష్కారములు ఒకదాని కొకటి ప్రతిద్వంద్వులై నిలబడుచున్నవి. వ్యక్తి ఇంచుమించు పూర్తిగా తనకు విధేయుడై పోయి, తనయందే అతని స్వతంత్రసత్త విలీనమై పోవలెననునది సంఘము కోరుచున్న పరిష్కారము. పెద్దదైన సముదాయమునకు చిన్నదైన వ్యక్తి ఆత్మాహుతిగావించుకొని సమర్పితమై పోవలెను. సముదాయము నకుగల యవసరమే తన యవసరముగాను, సముదాయపు వాంఛితమే తన వాంఛితముగాను అతడు భావింపవలెను. అతడు జీవింపవలసినది తనకొరకుగాదు,— తన తెగ, తన కులము, తన సంఘము, తన జాతికొరకు అతడు జీవింపవలెను. కాని, వ్యక్తిదృష్టినుండి స్వతంత్రమైన ఆదర్శపరిష్కారము వ్యక్తిశ్రేయస్సు, వ్యక్తి చరితార్థత కొరకే సంఘము మనవలెనుగాని, తనకొరకు, తన సాముదాయిక ప్రయోజనముకొరకు గాదనునది.

తనలో నంతర్భాగముగానున్న వ్యక్తుల ఘనతర, సమగ్రతర జీవనసంసిద్ధి కొరకు సంఘజీవన ముపయోగపడవలెను. వ్యక్తుల ఉత్తమోత్తమ సంస్థితికి ప్రాతినిధ్యము వహించుచు. ఆ స్థితిని వారు అందుకొనుటకు తోడ్పడుచు, ప్రతి ఒక్కరి స్వాతంత్ర్యమును మన్నించుచు, శాసించుటచేతను, బలాత్కరించుటచేతనుగాక వ్యక్తుల స్వచ్ఛందామోదముతో మాత్రమే సంఘము ప్రవర్తించునది కావలెను. ఈ ఉభయవిధ ఆదర్శసంఘములలో ఏదియ్యును ఎచ్చోటనూ గానరాదు. అట్టిదానిని సృష్టిచేయుటయు అత్యంతకష్టమే. ఒకవేళ సృష్టించబడినచో అహంకార ప్రేరణతోనే మానవవ్యక్తి జీవించుచు అహంతను విడువకున్నంతకాలము ఏక్షణమున

నైనను తిరిగి భగ్నమైపోగల అట్టి సంఘమును నిలువబెట్టుట మరింత కష్టము. వ్యక్తిపై పూర్ణాధిపత్యముగాక ఒక విధమగు సామాన్యాధిపత్యము సంఘమున కుండునట్లు చేయుట కొంత సుకరము. కఠినమగు శాసనము మూలమునను, ప్రబల మైన ఆచారము మూలమునను, వికాసము తగినంతగా లేక యింకనూ విధేయమై యుండిన మానవబుద్ధిని నేర్పుతో మలపుకొనుట మూలమునను ప్రకృతి మొదటి నుండియు సహజప్రేరణతో అనుసరించి సమష్ఠాయిలో కొనసాగించుచు వచ్చిన పద్ధతి ఇదియే.

ప్రాచీనకాలపు ప్రాథమిక సమాజములందు వ్యక్తి జీవితము కఠిన, కర్కశ సంఘాచార విధులకే విధేయము గావింపబడినది. ఏషధర్మ స్సనాతనః-అక్షరుడగు పరమేశ్వరుని నిత్యానుశాసనము పేరట ముసుగువైచుకొని ఎల్లప్పుడును చలా మణి కాజూచు ప్రాచీన సార్వకాలిక మానవధర్మ మిదియే. మానవబుద్ధియం దీ యాదర్శమింకనూ లుప్తము కాలేదు. సామూహిక జీవితములో మానవాత్మకు దాస్యము కల్పింపజూచునీ ప్రాచీన ధోరణిని విస్తృతము, పుష్కలమునైన పద్ధ తిలో రూపొందించి ప్రతిష్ఠింపజేయు లక్షణము మానవాభ్యుదయ సాధనకై జరుగు నిటీవలి ప్రయత్న విధానములో చూపట్టుచున్నది పృథ్విపై నొక ఘనతరసత్యము, ఘనతర జీవితము సమగ్రవికాసముచెందుట కవరోధకమగు మహాప్రమాద మిందు కలదు. ఏలయనిన, వ్యక్తికిచెందిన కామనలు,సచ్ఛందాన్వేషణలు ఎంతటి అహం కారికములైనను, వాని నద్యోరూప మెంత అనృతమై వికృతమైయున్నను, వాని నిగూఢతలములయందు సమష్టివికాసమున కావశ్యకమైన బీజము దాగియున్నది. అతని అన్వేషణలకు, తొట్రుపాటులకు వెనుక మరుగైయుండిన శక్తిని పోషణ చేసి దివ్యభావప్రతిరూపముగా దానిని పరివర్తింపజేయవలసిన యవసరమున్నది.

తగిన పద్ధతిలో ఆ శక్తికి వెలుగు చేకూర్చి, సుశిక్షణ పూర్వకముగా దానిని పెంపొందింపజేయవలెనేగాని, అణగద్రొక్కివైచుటయు, సమాజపుపృథుల రథచక్రసమాకర్షణకు ప్రత్యేకముగా పూన్చుటయు చేయరాదు. చరమసంసిద్ధికి సాముదాయిక తత్వము వెనుకగల శక్తి ఎంత అవశ్యకమో, వ్యక్తిత్వము నైత మంత ఆవశ్యకమే. వ్యక్తిని అణచివేయుట మానవునిలోని భగవంతుని అణచి

వేయుటే యగును. మానవజాతి ఇపుడు చేరుకొనుయున్న పరిణామదశలో, వ్యక్తిత్వము పెచ్చుమీరి సమాజమును భగ్నము చేయునని భయపడవలసినది ఏమంతగా లేదు. మీదుమిక్కిలి, పెచ్చుమీరిన సామాజిక తత్వప్రాబల్యమే అజ్ఞానపూర్వకము, యంత్రప్రాయమునగు తన మహాభారముక్రింద వ్యక్తిత్వపు స్వచ్ఛంద వికాసమును నిరోధించి అణచివేయగల ప్రమాద మవిరతమై కన్పట్టుచున్నది. ఏలయన, వ్యక్తిలోని మానవుడు సులభతరముగ జ్ఞానము నందిపుచ్చుకొని, ఎరుకతో, స్వచ్ఛమైన ప్రభావముల కుస్మీలితుడు కాగలిగి యుండవలెను. సమష్టియందలి మానవు డట్లుకాదు. అతడింకను అజ్ఞానావృతుడుగనే యుండి సరియగు ఎరుకలేక, ఆ సమష్టికి వశము కానివియు, తెలియరానివియునైన విశ్వ శక్తులచే పరిపాలింపబడుచున్నాడు.

వ్యక్తిత్వము నిట్లు అణగద్రొక్కి అశక్తము గావించు ప్రమాదము నెదుర్కొనుటకు వ్యక్తియందలి ప్రకృతి సిద్ధమగుచున్నది. ఈ ప్రతిఘటన మనేక రూపములు ధరించవచ్చును. అణచివేతను సహింపనొల్లక, స్వాభావికముగా పశుబలముతో తిరుగుబాటు చేయు నేరగాని ప్రతిఘటనము మొదలుకొని సంఘమును పూర్తిగా వర్జించి ఏకాంతవాసముచేయు సన్యాసి ప్రతిఘటనమువరకూ గలయట్టివి విడివిడిగా చేయబడు ప్రతిఘటనలు. ఇవిగాక, సాంఘికధర్మమునందు వ్యక్తివైశిష్ట్యమున కెక్కుడు ప్రాబల్యము కల్పింపబూని, అందుకు సామాజిక చేతన తప్పనిసరిగా తలయొగ్గునట్లు చేయగోరుచు, వైయక్తిక, సాంఘిక కామనల కొక విధమైన రాజీ పొసగింపజేయు రూపములో ప్రవర్తిల్లునట్టిది మరొక రకమైన ప్రతిఘటనము.

కాని, రాజీ అనునది ఎప్పటికిని పరిష్కార మనిపించుకొనజాలదు. ఉన్న చిక్కును అది విడదీయుటకుబదులు, దానిని ప్రక్కకు నెట్టియుంచును. తుదకా సమస్య మరింతగా చిక్కులపాలగుటయే సంభవించును. పరిష్కారము కుదరవలెనన్న, పరస్పరము సంఘర్షించుకొనెడు ఈ సహజ ప్రవృత్తులకంటె వేరై, అతీతమై, వాటి నధిశాసించి ఒండొంటికి సామరస్యము చేకూర్పజాలు వినూత్న శక్తి నొకదానిని ఈ సందర్భములో ఆవాహన మొనర్పవలసియున్నది. మన వైయక్తికావసరములు, అ ప్సలు, వాంఛితములు తీరుటయే మన కర్మప్రవృత్తికి

ప్రమాణమై వెలయవలెనని విధింపజూచు ప్రకృతిసిద్ధమగు వైయక్తిక ధర్మము కంటెను, సంఘమునకు మొత్తముమీద గల అవసరములు, అభీప్సలు, వాంఛిత ములు తీరుటయే కర్మప్రవృత్తి కొక ఉన్నత ప్రమాణముగా విధింపగోరు ప్రకృతిసిద్ధమగు సాంఘికధర్మముకంటెను అతీతమగు నైతికధర్మరూప ధర్మ మును గురించిన భావన యొకటి వాటిస్థానే తలయెత్తు టావశ్యక మగుచున్నది.

అవసరములు, కామితములు నెరవేయుటకాదు ఈ నైతికధర్మలక్ష్యము. పాశవికము, దేహప్రాణవృత్తి ప్రధానముగాక, తేజస్సు కొరకు, జ్ఞానముకొరకు, సమ్యక్పరిపాలన, సమ్యక్ప్రవృత్తి, సమ్యగ్వ్యవస్థకొరకు అన్వేషణలో మనస్సుచే సృష్టిచేయబడు నొక ఆదర్శవ్యవస్థకోసము ఆ అవసరములను, కామితములను నిగ్రహించి, అవసరమగునేని త్రోసిపుచ్చుటకు సైతము ఈ నైతిక ధర్మభావన సంసిద్ధమగును. మానవునిలో ఈ భావన ప్రబలమైన క్షణమునుండి అతడు తనను అప్పటివరకూ బంధించియుంచిన దేహప్రాణవృత్తి ప్రధానమగు జీవితమునుండి క్రమముగా తప్పించుకొని మానసిక జీవితములోనికి ప్రవేశించును. అనగా, ప్రకృతి లక్షించు నారోహణక్రమములోని మూడు సోపానములలో మొదటిదాని నుండి రెండవదాని కెక్కనేర్చును. అతని అవసరములు, అతని కామితములు సైతమీ సందర్భములో ఉచ్చతర లక్ష్యమును, మానసిక ప్రయోజనమును సంత రించుకొనుట సంభవించును. దేహప్రాణ ప్రకృతివాంఛల నతిక్రమించి, రసానం దము, బుద్ధిపటిమ. హృదయావేశములకు సంబంధించిన కామన అతనిలో ప్రాబ ల్యమువహింప మొదలిడును.

* * *

స్వాభావికమైన కర్మాచరణ ప్రవృత్తిధర్మము వివిధశక్తులయు, ప్రేరణ లయు, కామనలయు సంఘర్షణనుండి సామరస్యమువైపునకు పురోగమించుచుం డును ఉచ్చతరమైన నైతిక ప్రవృత్తి ధర్మము మానసిక, నైతిక ప్రకృతి వికా సము నూతగాజేకొని ఒక స్థిరమైన ఆంతరంగిక ప్రమాణముదెసకు.—న్యాయము, ధర్మము, ప్రేమ, ఋజుబుద్ధి, ఋజుశక్తి, సౌందర్యము, తేజస్సు మొదలైన మహో న్నత గుణములతో రూపొందించుకొనిన యొక పరమాదర్శముదెసకు ప్రయాణము

సాగించును. కావున నీ నైతికధర్మ మనునది ముఖ్యముగా వైయక్తికమే కాని సామూహిక మనస్సువలన సృష్టింపబడునది కాదు. మనస్సుతో ఆలోచన చేయునది వ్యక్తి. వ్యక్తియే నానావిభాగ సంకీర్ణమైన మానవ స్వరూపమందలి అవచేతనా విభాగమున అన్యథా మరుగుపడి పోవుదానిని వెలికి దీసికొనివచ్చి వివిధ రూపములలో వెలయింవజూచును. నైతికప్రయత్నశీలియు వ్యక్తియే బాహ్యవిధికి లొంగుటమూలమునగాక, అంతరికమైన యొక వెలుగు ననుసరించి ఆత్మశిక్షణము గావించుకొనుట యనునది ప్రధానముగా చాటుచు. ఆ యాదర్శమును భావనచేసిన మానవుడు దానిని తా ననుసరింపగోరుచేగాక, దానిని వినుట తటస్థించిన యితరులు సైత మనుసరింపవలెనని కోరును.

ఆచరణ మనునది సరిగా లేకున్నను, లేక అసలే లేకున్నను, భావమునందీ యాదర్శమును వ్యక్తులసమూహ మంతకంతకు ఎక్కువగా ఆమోదించుట సంభవించినప్పుడు, ఈ నూతన విధానమును తప్పనిసరిగ ఆమోదించుటకు సంఘముపైగూడ ఒత్తిడి యేర్పడుట జరుగును. అట్టి సన్నివేశములో సంఘము మా యాదర్శప్రభావమునకు లోనగుచు, ఆ యాదర్శస్పర్శగల నూతన రూపములలోనికి తన సంస్థలను మలచుకొనుటకు ప్రయత్నము సల్పును. కాని, ఆ ప్రయత్నము చెప్పుకోదగినంతగా విజయము సాధించుట మాత్రము జరుగదు. ఆ విషయ మెట్లున్నను, ఆ ఉన్నతాదర్శమును విధాయకమగు శాసనములోనికి, వరవడియై యొప్పారగల రూపములోనికి, యంత్రప్రాయమగు నాచారపద్ధతిలోనికి, సచేతనులగు వ్యక్తులను అధిశాసింపజూచు సాంఘికమైన బాహ్యవిధులలోనికి మలచుటయే సంఘమునకుగల సహజప్రవృత్తి.

ఏలయన, మానవవ్యక్తి, ఆధ్యాత్మికపురోగతికై ఆతురత చెందుచు, అంతరంగిక జీవితమును గురించిన యెరుక గలిగి, ఎరుకతో అభివృద్ధిని సాధింపగల నైతికజీవిగా ఒక విధమగు పాక్షిక స్వాతంత్ర్యమును పొందిన చాలకాలము వరకు గూడ, సంఘము భౌతికమూ ఆర్థికమూనైన వ్యవస్థగా యంత్రప్రాయమైన ధోరణిలో పురోగతికి, ఆత్మసంసిద్ధికి, స్వీయఘనతకు, స్వీయసంరక్షణకే విశేషప్రాధాన్య మొసగుచు. బాహ్యప్రవృత్తిపూర్వక విధానములనే ఇంకమూ అనుసరించుచుండును. బుద్ధివృత్తి ప్రధానుడై ప్రగతిశీలుడైనవ్యక్తి సహజ

ప్రేరణావృత్తిప్రధానమై ప్రగతి నొల్లకుండు సంఘముపై నేడు సాధించిన అత్యంత ఘనవిజయ మేమన, బుద్ధివృత్తి పూర్వకమైన తన సంకల్పబలముచే నతడు సంఘమునుగూడ తప్పనిసరిగ బుద్ధితో ఆలోచించునట్లు చేయగలిగి, సాంఘికన్యాయము, ధర్మవర్తనము, లోకమునెడ సానుభూతి, కనికరము అను వానిని గుర్తింపజేయుచు, గ్రుడ్డియాచారముగాక హేతువాదనియతి సాంఘికవ్యవస్థలకు ప్రమాణమై వరలవలెననియు, సాంఘికధర్మములు ఒప్పిదములై చలామణి కావలెననిన సంఘములోని వ్యక్తుల మానసిక, నైతికామోదమును గూడ అవి బడయగలిగియుండవలెననునది కనీస మొక ముఖ్యలక్షణమై నెగడవలెననియు సంఘమునకు ద్యోతకమగునట్లుగా చేయగలిగినాడు.

బలాత్కారముచే గాక జ్ఞానదీప్తిచే తన అధికారమును చలామణి చేసుకోవలసియున్నదనియు, అపరాధమునకై చర్యగైకొను సందర్భములో కూడ, నిర్బంధపరచుటయు కసిదీర్చుకొనుటయుగాక నైతికాభివృద్ధి సాధించుట ఆ చర్యకు లక్ష్యము కావలెననియు కనీసము ఆదర్శభావనలోనైనను గుర్తించుట సాంఘిక మానసమునకు ప్రకృతమున సాధ్యమగుచున్నది, వ్యక్తి, సంఘము,— ఉభయులూ తమ అన్యోన్యసంబంధమును స్వచ్ఛందము, సామరస్యోపేతమునైన సమ్మతి పూర్వకముగ తీర్చి దిద్దుకొని, సమైక్యమును స్థిరత్వమును అద్దానికి ఘటింపజేయుచు, బాహ్యచట్రపు కఠిన నిర్బంధముచే అంతరికసత్య మవరోధింపబడుటకు బదులు ఆంతరిక సత్యముచేతనే బాహ్యవ్యవస్థ రూపొంది పరిపాలించబడునట్లు చేయగలిగిననాడు. భవిష్యత్తులో దీనికి మించిన ఘనవిజయమును బుద్ధివృత్తి ప్రధానుడగు మానవవ్యక్తి సాధించినవాడగును.

కాని, ఇప్పుడతడు సాధించినట్లుగానున్న విజయమైనను గర్భితావస్థలో నున్నదేకాని వాస్తవికసిద్ధి నింకనూ గాంచుటలేదు. వ్యక్తిలోని నైతికధర్మమునకును, అతని అవసరములు, కామితములకు సంబంధించిన నియతికి, విసంవాదము, వైరస్యము సర్వదా కానవచ్చుచునేయున్నది. అట్లే, సంఘమునకు ప్రతిపాదితమైన నైతికధర్మమునకును, కులము, తెగ, మతశాఖ, సమాజము జాతి,— వీటి అన్నమయ, ప్రాణమయావసరములు, ప్రయోజనములు, ఉద్వేగములకు సంబంధించిన నియతికిని విసంవాదము, వైరస్యము కలదు. నైతికధర్మపరాయ

ఋడు సర్వస్వతంత్రమగు తన నైతికధర్మప్రమాణప్రతిష్ఠకై, వృథాప్రయత్నము సల్పుచు, ఫలితము లెట్లున్ననూ సరే ఎల్లరునూ దానికి బద్ధులైయుండవలెనని కోరు చుండును. వ్యక్తుల అవసరములు, కామితములు నైతికధర్మమునకు విరుద్ధము లైనచో అవి యతని దృష్టిలో చెల్లగూడనివి.

అట్లే, సాంఘిక నియతికూడ సద్ధర్మమును గురించిన వ్యక్తిభావనకు విరుద్ధమై, అతని అంతస్సాక్షికి ఒప్పిదము కాకుండునేని, అతని నధిశాసించు అధికారమూ సాంఘికనియతి కుండరాదు. ప్రేమ, సత్యము, న్యాయము అనువానికి అనుగుణముగా లేని ఏ కామితములయెడ, ఏ అవసరములయెడ, వ్యక్తి ఆసక్తుడు కారాదనునదియే అతడు వ్యక్తికి నిర్దేశించు పరమపరిష్కారము. సత్యము, న్యాయము, మానవత, ప్రజల పరమశ్రేయస్సు,- ఇవియే మిక్కిలి విలువ గలిగినవనియు, వీటితో పోల్చినచో తక్కినవెల్ల విలువలేనివిగనే సంఘముగాని జాతిగాని పరిగణించవలెననియు, సంఘముయొక్కగాని జాతియొక్కగాని భద్రత, అత్యవసర ప్రయోజనములు సైతము విలువలో వీటికి సాటిరావని సంఘముగాని జాతిగాని గుర్తించవలెననియు నత డపేక్షించును.

తీవ్రోద్వేగ పూరితక్షణములలో దక్క, ఏ వ్యక్తియు నీ ఉన్నత శిఖరముల కధిరోహింపనేరడు. ఇప్పటివరకును సృష్టిచేయబడిన ఏ సంఘవ్యవస్థయు ఈ ఆదర్శమున కనురూపమైనది కాదు. నేటి నైతికధర్మ పరిస్థితియందేమి, మానవజాతి వికాసపరిస్థితియందేమి, అట్టిది అనురూపమై నెగడుట బహుశః సాధ్యమునూ గాదు, అపేక్షణీయమునూ గాదు. ప్రకృతి అందుల కంగీకరించదు. అది యట్లు కాగూడదని ప్రకృతికి తెలియును. అందుకు మొదటి కారణమేమన, మన నైతికాదర్శములింకనూ చాలవరకు అపరిణతములు, అజ్ఞానపూర్వకములు, నిరంకుశములు నైన మానసిక కల్పనలేకాని, ఆత్మసంబంధమైన నిత్యసత్యముల ప్రతికృతులు కావు. పిడివాదధోరణిలో అధికారపురస్సరముగ నవి సిద్ధాంతరీత్యా కొన్ని నిరంకుశధర్మసూత్రముల నుద్ఘాటించును. కాని, ఆచరణకు వచ్చుపరికి, ఈనాటి ప్రతినైతికపద్ధతియు ఆచరణయోగ్యము కాదని నిరూపితమగుటయో, లేక తాను ప్రతిబింబించుచున్నట్లు చెప్పుకొను పరమప్రమాణస్థాయికి తానింకనూ చేరలేదని నిత్యమూ రుజువు చేసుకొనుటయో జరుగుచున్నది.

మన నైతికధర్మపద్ధతి కేవల మొక తాత్కాలికోపయోగియగు రాజీవిధానమే యగునేని, దానితో కొరమాలిన రాజీలు మరింతగా పొసగించుకొనుటకు వ్యక్తికి, సంఘమునకుగూడ అయ్యది విశేషావకాశమును కల్పించినదేయగును. అట్లుగాక, అయ్యది రాజీపద్ధతి కెంతమాత్రమూ సందీయ నొల్లనిదై, పరమమైన ప్రేమ, న్యాయము, సద్ధర్మములకే విశేషప్రాధాన్య మిచ్చునేని, దాని స్థాయి మానవాచరణకు అందరానిదగుచు, నోటమాత్రము కీర్తింపబడుచుండగా, ఆచరణమునందది విస్మరింపబడుటయే సంప్రాప్తమగును. మానవజాతియందు నైతిక చట్రములోనికి రానొల్లకయే విలువద్రొక్కుకొని చలామణికాగోరు ఇతర తత్వములను నైతికాదర్శము విస్మరించుచున్నదను సంగతియు గమనార్హము. ఏలయన, వ్యక్తికామనకు సంబంధించిన వైయక్తిక ధర్మమునందు సాంఘికభావ నిరంకుశత్వమునుండి కాపాడవలసిన అనంతపరిపూర్ణతత్వపు అమూల్య విశేషములు కొన్ని యే రీతిగా కలవో, అట్లే వ్యక్తికీ సంఘమునకూ సంబంధించిన నిసర్గ ప్రవృత్తులందు సైతమూ, ఏ నైతికధర్మముచేతనూ ఇప్పటివరకు గుర్తించబడక క్రమవికాసగతిలో చేకూరవలసియున్న దివ్యసంసిద్ధికి పూర్ణత్వము, సామరస్యము ఘటింపచేయుట కవసరమైన అమూల్య విశేషములును కొన్ని కలవు.

అదియునుగాక, సర్వస్వతంత్రమగు ప్రేమ, న్యాయము, సక్రమ హేతువాదము అనువాటిని నేడు దిగ్భ్రాంతము, దోషజుష్టమునైన మానవజాతి అమలు జరిపెడి తీరునుబట్టి చూచినచో, అయ్యవి అన్యోన్యసంఘర్షణకు దారితీయు సూత్రములుగా పరిణమించుటకు ఎంతేని అవకాశమున్నది. న్యాయము తరచుగా ప్రేమకు జుగుప్సాకరమైనదాని నపేక్షించుచుండును. ప్రకృతిసందర్భములను, మానవుల అన్యోన్యసంబంధములను నిష్పక్షపాతముగ పరిశీలించుచు తృప్తిదాయకమైన యొక నియమపద్ధతిని కనుగొననెంచు సక్రమహేతువాదము అటు సర్వతంత్ర న్యాయాధికారమునుగాని, ఇటు సర్వస్వతంత్ర ప్రేమాధికారమునుగాని మార్పు లేకుండ ఆమోదింపలేని స్థితిలో నుండును. వాస్తవమునకు, మానవుడూహించు సర్వస్వతంత్ర న్యాయము ఆచరణలో నొక మహత్తరమైన అన్యాయముగా పరిణమించుటకే ఎక్కువ అవకాశమున్నది. ఏలయన, అతని మనస్సు తన ఊహాకల్పనల సందర్భమున కఠిన ధోరణిలో ఒకవైపే చూచుచు, ఒకవైపే నిరూపించెడి పాక్షిక, కఠిన ప్రణాళికను ప్రతిపాదించును, దానినే సమగ్రమైన పరమ

పరిష్కారముగా చాటుకొని, జీవితమందలి పేశలత్వమును, వస్తుజాతమందలి సూక్ష్మతర సత్యమును విస్మరించు ఆచరణపద్ధతిని చలామణి చేయజూచును.

కావుననే, ఆచరణమునందు మన ప్రవృత్తిప్రమాణము లన్నియు రాజీ విధానముల ప్రవాహగతిలో పడి విచలితములగుచుండుటయో, లేక యీ విధమైన పాక్షిక, కర్కశధోరణులవలన తప్పుదారిలో బడుటయో సంభవించుచుండును. మానవజాతి ఒక భావస్థితిలోనుండి ఇంకొక భావస్థితిలోనికి ఊగుచు ప్రయాణించుచున్నది. పరస్పర విరుద్ధధోరణులచే సమాకర్షింపబడుటవలన దాని మార్గము కడు వంకరటింకరగ నున్నదనియే చెప్పవలెను. కాని, మొత్తముమీద, ప్రకృతి లక్షించినదానిని కార్యరూపమున బెట్టుటకే అయ్యది సహజప్రేరణతో, ఎంతయో ప్రయాసతోడను, ఎంతయో వృథావ్యయముతోడను ప్రయత్నమును కొనసాగించుచున్నది అంతియేకాని, కేవలము తన కామితము ప్రకారముగాని, తనకు ఏది సరియైనదని తోచునో దాని ప్రకారముగాని, ఊర్ధ్వమునుండి పరమజ్యోతి శరీరధారిని ఆదేశించు ప్రకారముగాని దాని కార్యాచరణ పద్ధతి కొనసాగుచుండుట లేదు.

అసలువిషయ మేమనగా, సర్వస్వతంత్ర నైతికలక్షణముల ప్రతిపాదించు సిద్ధాంతము నొకదానిని మనము కనుగొని, అవశ్యాచరణీయమగు ఆదర్శ ధర్మము నొకదానిని ప్రతిష్ఠించుట సంభవించినపుడు, మన యన్వేషణము ముగిసినదని గాని, విముక్తిసాధకమైన సత్యమును అందుకొనగలిగితిమనిగాని అనుకొనుటకు వీలులేదు. మనలోనున్న అన్నమయ, ప్రాణమయ మానవునిచే కల్పితమైన పరిచ్ఛిన్నస్థితికి అతీతులము కాగలుగుటకు తోడ్పడు విశేష మొకటి ఇచట మనకు లభ్యమగుచున్నమాట నిజమే. సప్రాణమైన జడపదార్థమునుండి ఉత్పన్నమైనదానికే ఇంకనూ బద్ధమై యున్న మానవజాతి వ్యష్టిసమష్టి అవసరములను, కామితములను అతిక్రమించుటకు ప్రేరణ మొనర్చెడి విశేషమది; మనలోనున్న మానసిక, నైతికసత్తను వికాసము నొందించుకొనుటకై మనకు సాయపడునట్టి యాకాంక్ష.

కావున, ఉన్నతిసాధకమైన యీ నూతనవస్తు సముపార్జనము కడు ముఖ్యమైనదే. పృథ్విపైన ప్రకృతి కడు కష్టముతో సాధింపబూనిన క్రమవికాసమునందు దీని కార్యసరణి చెప్పుకోదగిన ముందంజగనే గణతింపదగియున్నది. ఈ నైతిక

భావన లసమగ్రములే యైనను వీని వెనుక ఒకానొక పరమసత్యమునకు సంబంధించిన విశేష మేదియో దాగియున్నది. అందుబాటున కింకనూ రాని ఒకానొక దివ్యప్రకృతిలో అంతర్భాగములగు తేజశ్శక్తి విశేషముల ఈషత్ప్రకాశ స్ఫూర్తి అచట మనకు కానవచ్చుచున్నది. కాని, యీ విషయముల మానసిక భావన ఆ తేజస్సుకాదు; వీని నైతికరూపకల్పనము ఆ శక్తిగాదు. దివ్యమైన ఆత్మతత్వమును తమయందు ధారణచేయజాలక, తమ నిరంకుశ సూత్రములలో దానిని బంధించుటకు వ్యర్థప్రయత్నము సల్పు మానసికకల్పనలు మాత్రమేయవి. మనలోని మానసిక, నైతిక సత్త కావల, ఆధ్యాత్మికము, అతీత మానసమునైన యొక మహత్తర దివ్యసత్త యున్నది. మానసిక కల్పనలన్నియు అపరోక్షమైన ఆంతరికానుభూతి రూపమగు శుభ్రజ్యోతిలో కరగిపోవునట్లు చేయగల సువిస్తృతమైన ఒకానొక ఆధ్యాత్మిక భూమికద్వారా మాత్రమే మనము మనస్సు నతిక్రమించి, దాని కల్పనలలోనుండి అతిమానససత్యముల విస్తృతిలోనికి, స్వాతంత్ర్యములోనికి చేరుకొనగలుగుదుము.

మన మనస్సునకు కడు అసమగ్రమైన రూపములో వ్యత్యస్తముగ దోచునట్టియు, పరస్పర విరుద్ధ విక్షేపలక్షణములతో కూడిన నైతిక ధర్మముచే వికృతినిబొందింపబడినట్టియు దివ్యశక్తుల సామరస్యము మనకు అనుభూతమగునది అచ్చోటనే. ఆ అతీతమానసపు ఆధ్యాత్మికస్థితియందే, రూపాంతరము చెందిన అన్నమయ, ప్రాణమయ మానవునికి, జ్ఞానదీప్తమైన మనోమయ మానవునికి ఐక్యసంసిద్ధి ఘటిల్లవలసియున్నది. మన మనః ప్రాణ దేహముల విగూఢ మూలము, పరమగమ్యము ఆ అతిమానసాధ్యాత్మ తత్వమేకదా. అచ్చోటనే, మన మూహించినదానికంటె పూర్తిగా వేరైన సర్వస్వతంత్ర న్యాయము, ప్రేమ, సద్ధర్మము ఆ పరమ దివ్యజ్ఞానపు వెలుగునందు అన్యోన్యసమ్మేళనమున ఏకమై విరాజిల్లుటకు వీలగును. మన అంతర్విభాగములమధ్య ఎట్టి సంఘర్షణకు తావులేని సామరస్యసిద్ధి చేకూరునదియు నచ్చోటనే.

అనగా, సంఘము అమలు జరుపగోరు బాహ్యధర్మమునకు, వ్యక్తి అమలు జరుపగోరు నైతికధర్మమునకు ఆవల, వాటి కతీతముగా,వాటియందలి దేవిచేతనో అజ్ఞాతముగనూ అతి దుర్బలముగనూ లక్షింపబడుచు, అపరిచ్ఛిన్నమైన విస్తృత

చేతనకు చెందినదగు నొక విస్తృత సత్యము దివ్యధర్మము కలదు. ఈ దివ్య ధర్మము దెసకే, స్థూలములు, అంధప్రాయములు నైన యీ ఉభయ ధర్మములును తడబాటు నడకలతో ముందడుగులు వేయుచు, జంతుస్వభావ ధర్మమునుండి ఉదాత్తమైన తేజస్సులోనికి, సార్వజనీన నియతిలోనికి ప్రవేశింప యత్నించు చున్నవి. మనలోనున్న దైవము నిగూఢమైయున్న స్వీయసంసిద్ధి దెసకు ప్రయాణించు మన ఆత్మయే కావున, ఆ దివ్యధర్మము మన స్వభావనిష్ఠమగు పరమ ధర్మము, పరమసత్యమే కావలసియున్నది.

ప్రపంచములో మనము ఇతరులతోపాటుగా సర్వసామాన్యజీవనము, స్వభావము గలవారమయ్యును సర్వాతీతమగు పరమాత్మసాక్షాత్కారస్పర్శ బొంద గల ప్రత్యేకాత్మలము కూడ అయినందున, మనలోని యీ పరమసత్యము ద్వివిధ లక్షణములతో నొప్పారవలసియున్నది. ఆధ్యాత్మికతను సంతరించుకొన్న ఒక మహత్తర సమష్టిజీవనపు సామరస్యపూర్వక లయవిన్యాసమును కనుగొని, ప్రకృతియందు బహురూపశోభితమైన ఏకత్వములో ప్రతి జీవితోడను, ఎల్లజీవుల తోడను మనకుగల సంబంధమును నిర్ణయించునట్టిదిగా ఆ సత్యము, ఆ ధర్మము పరిఢవిల్లవలెను. అంతియేకాక, ఆ ధర్మము, ఆ సత్యము జీవియొక్క మనః ప్రాణ దేహములలో, ఆత్మలో, పరమేశ్వరుని సాక్షాదభివ్యక్తికి సంబంధించిన గతులను అనుక్షణమూ మనకు గోచరింపజేయునదిగ గూడ విరాజిల్లవలెను. *

ఈ విధమైన పరమజ్యోతియు, క్రియాశక్తియు ఉచ్చతమస్థాయిలో అభివ్యక్తమగునపుడు, అనుల్లంఘ్యమైన ధర్మనియతి పరమస్వాతంత్ర్యము,— రెండునూ అందు మిళితములై యుండునని అనుభవములో మనకు తెలియుచున్నది. మనయందలి ప్రతి బాహ్యాభ్యంతర ప్రవృత్తిని అవ్యయమైన పరమసత్యముతో అనుశాసించును గావున నయ్యది అనుల్లంఘ్యమైన ధర్మము. అట్లయ్యును ప్రతి క్షణమునందును, ప్రతివృత్తియందును ఎరుకతోకూడి సంపూర్ణ పేశలత్వమున

---

* కావుననే గీత, మతము అనుదానికంటెను, నీతి అనుదానికంటెను విస్తృతార్థము నిచ్చెడి 'ధర్మము' ను నిర్వచించుచు మన స్వభావనియతమగు కర్మయే ధర్మమని వక్కాణించినది.

నొప్పారు మన విముక్త ప్రకృతిని సంభాళించునది పరమేశ్వరుని అఖండ స్వాతంత్ర్యమే.

నైతికధర్మ పరాయణుడగు నాదర్శవాది ఈ పరమధర్మమును తన నైతిక మూలసిద్ధాంతముల ద్వారమునను, మానసిక, నైతిక సూత్రములకు సంబంధించిన అవరశక్తి విశేషముల ద్వారమునను కనుగొన యత్నించును. వాటిని బలపరచి వ్యవస్థీకరించుట కాతడు బుద్ధి, ప్రయోజనాత్మకదృష్టి, సుఖావాప్తి, హేతువాదము, సహజప్రేరణము, తదితర సామాన్య ధర్మప్రమాణములచే రూపొందించబడి వస్తుతః అనంగతమైన యొక మూలసూత్రము నెన్నికచేసికొనును, కాని, అట్టి ప్రయత్నములన్నియు విఫలములు కాకతప్పనివే. మన అంతః ప్రకృతి నిత్యుడైన పరముని క్రమవికాసపూర్వక అభివ్యక్తిరూపము, అత్యంత సంకీర్ణ శక్తిసమన్విత మగుటచే నయ్యది ఏ ఒక మానసిక, నైతిక సూత్రప్రాబల్యమునకును కట్టువడియుండునది కాదు. విభేదములతో కూడి ఒండొంటితో సంఘర్షించుకొనుచుండెడి అద్దాని శక్తివిశేషములకు వాని ఆధ్యాత్మిక తత్స్వరూపమును సాక్షాత్కరింపజేసి వాని విభేదములకు సామరస్యము ఘటింపజేయజాలినది అతిమానస విజ్ఞానచేతన ఒక్కటియే.

ఉత్తరయుగమున నుద్భవించిన మతములు కర్మప్రవృత్తి కొక పరమ ప్రమాణమును స్థిరపరచగోరి, అవతారపురుషుని ముఖముననో, ప్రవక్తముఖముననో భగవదనుశాసనము ప్రకటించుచు తద్ద్వారమున నొక ధర్మపద్ధతిని ప్రతిష్ఠింప యత్నించినవి. శుష్కమైన నైతికభావనకంటె ఎక్కుడు శక్తిమంతములయ్యును ఈ పద్ధతులు చాలవరకు మహోత్కర్ష కల్పింపబడిన నైతిక సూత్ర రూపాంతరములే యగునుగాని వేరుకాదు. మానవాతీత స్థాయినుండి ఆవిర్భావము పొందినదను పేరున మతావేశ పూర్వకముగా పరమ పావనతను సంతరించుకొను నైతిక సూత్ర మిట్లు మహోత్కర్షను పొందుట సంభవించును. 'అతి' లోనికి పోయిన క్రైస్తవ మతపు నైతికచట్రమును బోలిన పద్ధతులు కొన్ని ఆచరణ సాధ్యముకాని యొక పరమనియతిని అమలుజరుపుటకై పట్టుదల వహించుచుండుటచే అట్టివాటిని ప్రకృతి తిరస్కరించుచున్నది. ఇతరములు కొన్ని క్రమవికాస

గతిలో రాజీపద్ధతులుగ కడకు రూపొంది కాలగతిలో ప్రాతవడి చెల్లనివై పోవుచున్నవి.

మన జీవిత ప్రవృత్తులనన్నింటిని తన యినుప పడియచ్చులలో పోతపోయజూచెడి కఠిన నైతిక విధానమువంటిది కానేరదు నిక్కమైన పరమధర్మము. ఆ దివ్యధర్మము మన జీవిత యాథార్థ్యము, ఆత్మ యాథార్థ్యము నగుటచే, మన కర్మాచరణములోని ప్రతి గతివిశేషమును, మన జీవితసమస్యలలోని సకల సంకీర్ణతలను స్వతంత్రము సజీవమునైన పద్ధతిలో చేపట్టి, తన దివ్యప్రకాశపు సాక్షాత్స్ఫూర్తితో వాటినెల్ల ఉద్దీప్తములు గావింపవలసియున్నది. ఒక నియతిప్రకారము, ఒక సూత్రముప్రకారము కాదు దాని గతివిశేషము కొనసాగవలసినది. మన ఆలోచనలను, కర్మప్రవృత్తులను, భావనలను, సంకల్పములను,—అన్నింటినీ నిర్ణయించి నడపు సువిశాల, సునిశిత దివ్యచైతన్య సన్నిధియై వెలుగొందుచు అది మనలో పనిచేయవలసియున్నది.

ప్రాచీనకాలములోని మతములు, మనువు, కన్‌ఫ్యూషియస్ మున్నగువారి యాదేశములపేరట, జ్ఞానసంపన్నులగువారు ప్రబోధించిన నియతి రూపములో నొక సంపూర్ణశాస్త్రమును వెలయింపజేసి, మన పరమప్రకృతికి చెందిన నిత్యసత్యముల ప్రకటనతో సాంఘిక నియతిని, నైతిక ధర్మమును ఒక విధముగ మేళవించి వాటికి కలయిక గూర్ప యత్నించినవి. మూడునూ సమానముగ సనాతన ధర్మపు వ్యక్తరూపములే యని, సమానస్థాయిలోనే మూడింటినీ పరిగణించుట జరిగినది. కాని, వానిలో రెండు ప్రకృతి క్రమవికాసగతికి సంబంధించినవి; నిత్యుడైన పరమేశ్వరుని యిచ్ఛను గురించి మానవు డొనర్చిన కల్పనలు. వీని చలామణి తాత్కాలికము మాత్రమేకాగా, మూడవది కొన్ని సాంఘిక సూత్రములతో ముడిపెట్టబడి వాటికి అనుగుణము గావింపబడుటచే దాని గతివిశేషములు దాని బాహ్యరూపము ననుసరించియే యుండును. అట్టి సందర్భములో, శాస్త్రము ప్రాతవడి ప్రకృతమునకు పనికిరాకపోవుటచే, కాలానుగుణ్యముగ దానిని మార్చుటపోవుటగాని కట్టకడకు త్యజించుటగాని చేయవలసియుండును. అట్లు జరగనియెడల, వ్యక్తివికాసమునకు అయ్యది ఒక బలమైన అవరోధముగా పరిణమించును.

శాస్త్రము సృష్టిచేయునది సామూహికమైన బాహ్యప్రమాణము. వ్యక్తి యందలి అంతఃప్రకృతిని, అతనిలో నిగూఢముగ దాగియున్న అనిర్దేశ్య ఆధ్యాత్మిక శక్తివిశేషములను అయ్యది విస్మరించును. కాని, వ్యక్తియొక్క ప్రకృతి అట్లు విస్మృతము కానోపదు. అతని బాహ్యప్రవృత్తులను విశృంఖలముగా కొనసాగనిచ్చుటవలన నది అరాజకమునకు, వినాశమునకు దారితీయగా, యంత్రప్రాయమైన స్థిరనియతి ద్వారమున అతని ఆత్మస్వాతంత్ర్యమును బలాత్కారముగా అణగద్రొక్కుటవలన వికాసస్తంభనము, లేక ఆంతరంగిక మరణము సంప్రాప్తించును. బయటినుంచి యీ బలాత్కారమునకు, ఈ అనుశాసనమునకు స్వస్తిచెప్పి, పరమోన్నతమైన తన ఆత్మతత్వముయొక్కయు, సనాతన సత్యధర్మప్రవృత్తియొక్కయు స్వచ్ఛందావిష్కృతిని సాధించుటయే అతనికిగల పరమ కర్తవ్యము.

ఉన్నతమైన నైతిక ధర్మము తొలుత వ్యక్తిచేతనే కనుగొనబడి పిమ్మట జాతికి విస్తరింపజేయబడుచున్నది. వ్యక్తి యా ధర్మమును తన బుద్ధియందును ఇచ్ఛాప్రవృత్తియందును కనుగొనును. సర్వోన్నతమైన పరమధర్మముగూడ నట్లే వ్యక్తిచేతనే కనుగొనబడవలసియున్నది. కాని, అతడు దానిని కనుగొనవలసినది తన ఆత్మయందు, అట్లు కనుగొనబడినప్పుడు మాత్రమే అయ్యది మానసికవృత్తి పూర్వకముగా గాక ఆధ్యాత్మిక ప్రభావపూర్వకముగా ఇతరులకు విస్తరింపజేయబడుట పొసగును. నైతికధర్మము నొక సజీవధర్మముగా పొదగట్టజేయగల బుద్ధి నైశిత్యము, ఇచ్ఛాబలము, చైత్యభావన లేని మానవులకు గూడ నైతిక ధర్మమును ఒక నియతి రూపమునను ఆదర్శరూపమునను విధించుటకు వీలున్నది. ఆదర్శ రూపముగా విధించబడు నైతికధర్మము ఆచరణతో నిమిత్తము లేకయే పూజ్యతను మాత్రము పొందుచుండవచ్చును, నియతి రూపమున విధించబడిన నైతిక ధర్మమునకు బాహ్యాచరణము మాత్రము కొనసాగుచు, ఆంతర్యశుద్ధి పూర్తిగా లోపించవచ్చును.

అతిమానస – ఆధ్యాత్మిక జీవితము నీరీతిగా యంత్రప్రాయ మొనర్చుటకు వీలులేదు. ఒక మానసికాదర్శముగా గాని, బాహ్యనియతిగా గాని దానిని మార్చుటకు వలనుపడదు. దాని ప్రవృత్తికినీ మహనీయములగు కొన్ని తీరు

తెన్నులు లేకపోలేదు. కాని యవి వాస్తవిక రూపమును సంతరించుకొని, స్వీయ చేతనయందు జీవునిచే గుర్తించబడిన దివ్యశక్తి కార్యకలాపములుగను, మనః ప్రాణదేహములను రూపాంతరము చెందింప సమర్థమగు నిత్యసత్యపు రచనా విశేషములుగను విరాజిల్లవలసియున్నది. అట్టిది వాస్తవికము, శక్తిమంతము, అనుల్లంఘ్యమునైన హేతువుచేతనే, అతిమానసచేతనోపలబ్ధి పూర్వకమైన ఆధ్యాత్మిక జీవితవిస్తరణము పృథ్వియందు మానవజాతిలో వైయక్తిక, సామూహిక సంసిద్ధి సాధకమగు ఏకైకశక్తిగా విరాజిల్ల సమర్థమగుచున్నది. ఆ దివ్యచేతనతోడను, అద్దాని పరమసత్యముతోడను, నిత్యసంస్పర్శను మనసు పొందనేర్చుటద్వారా మాత్రమే శక్తియుక్తమైన పరముని దివ్యచైతన్య మేదోయొక రూపములో మన ఐహికజీవితమును చేపట్టి దాని అలజడులను, తడబాటులను, బాధలను, మాయలను దివ్యతేజశ్శక్త్యానందముల ప్రతిరూపముగ రూపాంతరము చెందించుటకు వీలగును.

ఈశ్వరేచ్ఛకు సర్వసమర్పణ మొనర్చుకొని, సకలమూ తానేయైన ఆ అద్వయునియందు పృథక్త్వలక్షణోపేతమైన అహంకారమును విలీనము గావించుటయే పరమునితో మన యాత్మ అనుభవించు నిత్యస్పర్శకు పరాకాష్ఠయై వెలయవలసియున్నది. ఆత్మయందు విస్తృతతరమైన విశ్వజనీనత, సకలముతోడను ఘనిష్ఠ ఏకత్వానుభూతి, ఇదియే అతిమానసమైన ఆధ్యాత్మిక జీవనమునకు తప్పనిసరిగా నేర్పడవలసిన పునాది. ఆ విశ్వజనీనతయందును, ఆ ఏకత్వమునందును మాత్రమే శరీరధారియగు నాత్మయొక్క జీవితమునందు ఈశ్వరాభివ్యక్తిని ఘటింపజేయు పరమధర్మమును మనము సాక్షాత్కరింపగలుగుదుము. మన జీవప్రకృతియొక్క పరమగతిని, సత్యలీలను మనసు కనుగొనగలుగునదియు నచ్చోటనే. అచ్చోటనే అవరప్రకృతికి చెందిన యీ అపశ్రుతులన్నియు సమసి, ఒకే పరమేశ్వరుని అంశలును, ఒకే జగజ్జనని బిడ్డలును అయిన వ్యక్త జీవకోటుల నడుమ నిక్కమైన సంబంధముల రూపములో సామరస్య పూర్వకమైన యొక మహాస్వరసమ్మేళనము సాక్షాత్తుగా అనుభూతమగును.

*　　　*　　　*

సకల కర్మప్రవృత్తులును నిగూఢ సంకల్పతలమున అనంతము దివ్యము నైన యొక మహాశక్తివ్యాపారములో నంతర్భాగములే. మనకు దృగ్గోచరమగు అద్దాని రూపవిశేషములు అసంగతములుగను, అజ్ఞానభూయిష్ఠములుగను, అన్న ప్రాణ మనోమయములుగను పరిచ్ఛిన్నములుగను, చూపట్టవచ్చును. కాని, వ్యష్టి సమష్ట్యాత్మకమైన ప్రకృతి గర్భతలములోనుండి దివ్యము అనంతమునైన వస్తు తత్వమునకు సంబంధించిన యే విశేషమునో క్రమాధికముగ వెలికి దీసికొని వచ్చుటకే ఆ మహాశక్తి ప్రయత్నించుచున్నది. తేజస్సువైపునకు నడిపించుకొని పోవుటయే అద్దాని లక్ష్యమయ్యును, అవిద్యాద్వారముననే ఇంకనూ అది ఆ పనిని నిర్వహించుచున్నది.

తొలుత అది మానవుని, ఆతనికి గల అవసరములు, కామితములద్వారా నడపుచున్నది. పిమ్మట నొక మానసిక నైతికాదర్శముచే నుద్దీప్తములై సంస్కరించబడిన విస్తృతావసరములు, కామితములద్వారా అతనిని నడిపించుచున్నది. అటు తరువాత వీటి నన్నింటినీ అతిక్రమించుచు, వీని యాంతర్యమున దివ్య సత్యమై నెగడుదానియందు వీనినెల్ల సమన్వయపరచి సాఫల్యము చేకూర్చగల ఆధ్యాత్మికోపలబ్ధిద్వారా అతనిని నడిపించుకొనిపోవుటకు సన్నాహ మొనర్చుచున్నది. అవసరములను, కామితములను అయ్యది దివ్యేచ్ఛానందములలోనికి రూపాంతరము చెందించును. వ్యష్టిస్వభావపు విక్షిప్త పరిశ్రమములకు, వ్యష్ట్యహంకారపు ఉద్వేగములకు సంఘర్షణలకు బదులుగా, పరమాత్మని యంశమై వెలసి విశ్వజనీనత సంతరించుకొన్న మనలోని జీవాత్మచైతన్యపు ప్రశాంత, ప్రగాఢ, సామరస్యపూర్వక ధర్మోల్లాసమును ప్రతిష్ఠించును.

మనలోనున్న యీ యథార్థపురుషుడు విశ్వజనీన లక్షణోపేతుడగుటచే, తన ప్రత్యేకవాంఛా పరితృప్తికొరకు కాదాతడు ప్రయత్నము సల్పునది. ప్రకృతి యందు తనను దా నభివ్యక్తము గావించుకొనుటలో తన యథార్థస్థాయికి తాను వికాసము చెందవలెననియు, తన ఆంతరిక దివ్య స్వరూపమును తా నభివ్యక్త పరచుకోవలెననియు నభిలషించును. అతీతమైన ఆధ్యాత్మికశక్తి సాన్నిధ్యములను వెలార్చుకొన్న దివ్యస్వరూపమది. ప్రతిప్రాణియెడ, ప్రతివస్తువునెడ, అట్లే సమష్టిచైతన్యమునెడ, శక్తులయెడ సానుభూతి కలిగి ప్రవర్తించుచుండును. అట్ల

య్యాను నది వాటి కతీతముగగూడ మెలగును, ఏ ప్రాణియొక్కగాని, సమష్టి చైతన్యముయొక్కగాని అహంకారముచే గట్టుపడక, అహంకార పూర్వకములగు వాని యపర ప్రకృతి యధికావనసుల కేమాత్రమూ లోబడక విలసిల్లుచుండును. మనము చేయు సకలాన్వేషణములకు, ప్రయత్నములకు చరమ సాఫల్య మీ మహానీయోపలబ్ధియే మన ప్రకృతియందలి సకల విభాగములను పరిపూర్ణసామరస్యపూర్వకముగ రూపాంతరము చెందించునది యీ దివ్యోపలబ్ధియే. ఇది మనకు చేకూరి, మనలో నిగూఢమైయున్న పరమపురుషుని ఉన్నతస్థాయిని మనము అందుకొన నేర్చినప్పుడే, విశుద్ధము, సమగ్రము, నిర్దుష్టమునైన కర్మాచరణము సాధ్యమగును.

విశుద్ధమైన అతిమానసకర్మప్రవృత్తి ఏ ఒక సూత్రమును, లేక సంకుచిత నియతిని అనుసరించదు. వ్యష్ట్యహంకారముగాని సమష్టిమానసముగాని ఏర్పరచు కొను ప్రమాణానుసారముగా నుండదు దాని ఆచరణపద్ధతి. వ్యావహారికదృష్టి ప్రధానుడైన లౌకికుడు, నైతిక సూత్రముల నవలంబించగోరు నీతివాది, మాతృ దేశౌన్నత్యము ముఖ్యముగా నెంచు దేశభక్తుడు, కారుణ్యభావ ప్రేరితుడైన పరోప కారపరాయణుడు, తాత్వికాదర్శ చింతనాసక్తుడగు తత్వజిజ్ఞాసువు,- వీరిలో నెవరి యభీష్టమునకును అయ్యది కట్టుపడదు. హేతువాదము ననుసరించు బుద్ధియు. నైతికభావానురక్తమగు విచ్ఛాప్రవృత్తియు గణనచేసి యొక ప్రమాణనిర్ణయ పూర్వకముగా ఎన్నిక చేసికొన్న కార్యపద్ధతి ప్రకారముగాక, మహోన్నత స్థాయి నందుకొని తేజోవంతమై పరిఢవిల్లు అంతస్సత్త సమగ్ర స్వరూపపు ఉన్నత శిఖరాలనుండి పొరలుకొనుచు వచ్చెడి స్వచ్ఛంద ప్రవాహముగా దాని ప్రవృత్తి విధానము కొనసాగును.

మనలోనున్న దివ్యత్వము నభివ్యక్తముగా వించుచు, భవిష్యత్తులో సిద్ధింప వలసియున్న దివ్యాభివ్యక్తి దెసకు ప్రపంచ పురోగతిని కొనసాగించుటయే దాని పరమలక్ష్యము. నిజమునకు దీనికొక లక్ష్యముగను, ప్రయోజనముగను పేర్కొను టకు వీలులేదు. ఇయ్యది స్వచ్ఛందమై ప్రవర్తిల్లు పురుషుని నిజధర్మము; దివ్య సత్యపు తేజస్సుచేతను, దాని నిసర్గప్రభావముచేతను అంతఃస్ఫురణముతో నిర్ణీత మగు కార్యాచరణము. ప్రకృతికార్యము ప్రకృతి వెనుకనున్న సమగ్రేచ్ఛాజ్ఞాన ములనుండి ప్రసరించినట్లే ఇది మును ప్రసరించునుగాని, ఇచ్ఛాజ్ఞానము లిచట నీ

అజ్ఞ ప్రకృతిలోవలె మరుగువడి తెలియరానిదై యుండక, ఎరుకగల పరాప్రకృతి వెలుగున ప్రకాశమానములై యుండును. అయ్యది ద్వంద్వాతీత జీవనానందమున సమగ్రము, విస్తృతమునై యొప్పారు కర్మాచరణము. కష్టములకులోనై ప్రవర్తిల్లు అజ్ఞాహంకారపు దిగ్భ్రమలకు, తడబాటులకు బదులుగా, మనలను ప్రేరేపించి నడపు నొకానొక దివ్యజ్ఞానముయొక్కయు, దివ్యశక్తియొక్కయు అంశఃస్ఫూర్తితోకూడిన ఆనంద ప్రపూర్ణ వృత్తిప్రసారణ మిచట కొనసాగును.

భగవత్సంకల్ప ఫలితమగు ఏ అప్రాకృత సంఘటనమువలననో మానవ జాతియెల్ల ఒక్కసారిగా ఈ స్థాయినందుకొనుట జరిగెనేని, పురాణములలో వర్ణిత మైన సత్యయుగము వంటిది పృథ్విపై విలసిల్లుననుట నిశ్చయము ప్రతిప్రాణియు ధర్మమును ఎరుకతో స్వచ్ఛందముగా గుర్తించి, సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యములతో తన కర్మలను నిర్వర్తించుట సత్యయుగ లక్షణము. అట్టి స్థితి యందు, భేద ప్రవృత్తికి బదులుగా, ఏకత్వము సార్వజనీనత్వము మానవజాతి యెరుకలో సుప్రతిష్ఠితములై యుండును. ప్రేమ సర్వస్వతంత్రమై పరిఢవిల్లును. సమతఅధికారిక వ్యవస్థతో సమన్వితమై భేదమునందు పూర్ణత్వము నందుకొనును. పురుషుని స్వచ్ఛందప్రవృత్తిలోని యథార్థ్యము, ఇతరులలోని యాథార్థ్యము, సకల వస్తుజాతములోని యాథార్థ్యములతో సామరస్యము పొందుట మూలముగా సర్వస్వతంత్రమైన న్యాయమును సాధించినదై యథార్థమైన సత్ఫలాప్తి గాంచ నేర్చును. హేతువాదము మానసికముగాక అతిమానసస్థాయి నందుకొన్నదై, కృతక ప్రమాణముల పరిశీలనతో తృప్తిచెందక, యథార్థసంబంధముల స్వచ్ఛంద దర్శనము పొందనేర్చి, క్రియారూపములో దాని అప్రతిహత నిర్వహణము నీక్షింప సమర్థమగును. వ్యక్తికి సంఘమునకు నడుమ పోరాటముగాని, ఒక సముదాయమునకు ఇంకొక సముదాయమునకు నడుమ విపత్కర సంఘర్షణముగాని ఇక ఉండ నేరదు. దేహధారులయందు నిహితమైయున్న విశ్వచేతన సామరస్యపూర్వకమైన అనేకత్వమును ఏకత్వమునందు విలసిల్లజేయును.

మానవజాతి ఇపుడున్న పరిస్థితిలో వ్యక్తియే ఈ ఉన్నతస్థాయినందుకొని అగ్రగామియై దారిచేయవలసియున్నది. ఇతరులతో కలియనొల్లని అతని వివిక్త జీవనము అతని బాహ్య ప్రవృత్తులకు సునిశ్చితమైన ఒకానొక విశిష్టరూపమును సంతరించును. ఈ బాహ్యప్రవృత్తులు ఎరుకతోకూడిన సామూహిక దివ్యజీవన

ప్రవృత్తులకంటె భిన్నధోరణిలో నుండుట సహజము. ఆ ప్రవృత్తులకు మూలమైన అతని ఆంతరంగిక స్థితిలో ఎట్టి భిన్నత్వమూ నుండదు. కాని, అతని బాహ్యప్రవృత్తులు మాత్రము అజ్ఞానవిముక్తమైన వృథ్విపై అవి విలసిల్లు తీరుకంటె భిన్నమై యుండవచ్చును. అయినను అతని అంతశ్చేతనగాని, దివ్యప్రవృత్తి సంవిధానముగాని లోగడ వర్ణితమైన పద్ధతిలోనే యుండును. అందు పాపమని మనము పేర్కొను ప్రాణకోశ సంబంధమైన ఏ దోషమునకు, కామనకు, అసత్ప్రవృత్తికిని లొంగిపోవుట యుండదు. అట్లే పుణ్యప్రవృత్తిగా మనము వాకొనునట్టి ఏ నిర్దిష్ట నైతికసూత్ర నియతికినీ బద్ధమైపోవుట యునుండదు.

మనోమయచేతన కంటె గొప్పదైన చేతనయందు సునివిష్టమై ఆ ప్రవృత్తి లక్షణము కడుస్వచ్ఛము, స్వచ్ఛందము, సుదృఢము సుసమగ్రమునై యలరారును. దివ్యాత్మయందలి సత్యజ్యోతులచే దానిసకలవిన్యాసములును పరిపాలితము లగుచుండును. కాని, అతిమానస సంసిద్ధి గాంచిన యిట్టివారితో నొక మండలి యేర్పాటగుట సంభవించునేని, నిజముగా నచట నొక దివ్యసృష్టి రూపుగాంచుటకును, నూతన స్వర్గమై విరాజిల్లగల నూతనపృథ్వి యవతరించుటకును ఎంతేని అవకాశమున్నది. పృథ్వీతలముపై నేడు రాజ్యము చేయుచున్న అజ్ఞానతమస్సు అంతకంతకు తిరోహితమగుచుండగా, అతిమానస విజ్ఞానతేజోమయమైన నూతన ప్రపంచ సృష్టికి దారిచేయు సన్నివేశమది.

—o—

# అధ్యాయము 8

# పరమ సంకల్పము

మొదట అజ్ఞానబద్ధమైనట్లు కానవచ్చుచు. పిమ్మట అనంతుడైన పరమ పురుషుని శక్తిజ్ఞానములయందు ముక్త ఖేలనముతో నొప్పారు నీ క్రమవికాస పూర్వక ఆత్మాభివ్యక్తిని మనము దృష్టిలో నిడుకొని చూతుమేని, "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,"—"సకల ధర్మములను,—కర్మాచరణకు సంబంధించిన సకల సూత్రములను, నియమములను, నిబంధనలను వదలిపెట్టి నాయందే శరణుగైకొనుము,"—అని కర్మయోగికి గీత యొసగిన మకుటాయ మానమగు మహనీయాదేశము. మనకు మరింత బాగుగా అవగాహన మగును. సకల కర్మాచరణ ప్రమాణములు, నిబంధనలు జడపదార్థములోనుండి ఆత్మపదార్థములోనికి ప్రయాణ సందర్భములో అహంకారపు అవసరముల ననుసరించి చేయబడిన తాత్కాలిక కల్పనలే. ప్రయాణములోని మజిలీలతో మనము సంతృప్తి చెందుచు, అన్నమయ ప్రాణమయ మనోమయ జీవనాసక్తులమై యుండునంత కాలము, లేక ఆధ్యాత్మిక తేజస్స్పర్శగల మనోమయ భూమికా విశేషములయందే స్థిరముగా పాదుకొనియుండునంతకాలము, ఈ కల్పనలు ఒక విధముగా అనివార్యములే యగుచుండును.

కాని, వీటికి ఆవల, ఎల్లలులేని విశాలతతో, అతిమానస – అనంత చేతన యొకటి కలదు. తాత్కాలిక కల్పన లన్నియు నచట అంతరించిపోవలసినవే. సంకుచితమైన మన మానసిక వ్యాపారముల నన్నిటినీ పూర్తిగా వదలివైచి, నిఖిలమునకు ప్రభువు, సకల ప్రాణులకు సుహృత్తు అయిన పరమేశ్వరుని చేతులలోనికి నిశ్చింతగా మనలను మనము సమర్పించుకోగల శ్రద్ధ, ధైర్యము మనకు లేనిచో, నిత్యము, అనంతమునైన ఆ ఆధ్యాత్మిక సత్యములోనికి పూర్ణ ప్రవేశము సాధ్యము కానేరదు. ముక్తము, అనంతమునైన ఆ పరతత్వమహోదధిలోనికి

ఎట్టి సంకోచము, ధర్మసందేహము, స్వప్రయోజనాపేక్ష లేకుండ ఒక్కక్షణములో మనము లంఘించవలెను. ధర్మమును గడచిన పిమ్మటనే నిక్కమైన స్వాతంత్ర్య సిద్ధి, వైయక్తిక ధర్మము, సామూహిక ధర్మము, సార్వజనీన ధర్మము.—ఈ ధర్మములను గడచిన పిమ్మటనే వాటికంటె ఘనతరమై యొప్పారు దివ్యస్వాతంత్ర్యోపేత సర్వాతీత శక్తివిలసనము. సూటిమార్గమున ఆరోహణము సాగిన పిమ్మటనే, సువిశాలమైన శిఖర ప్రదేశములలోనికి ప్రవేశము.

ఆరోహణమునందు మూడు దశలు కలవు. అట్టడుగు దశ శారీరిక జీవనమనకు, దాని అవసరములకు, కామితములకు సంబంధించినది. మధ్యదశ మానసిక, హార్దిక, చైత్యభావ నియతములైన ఉన్నత ప్రయోజనములు, ఆకాంక్షలు, అనుభూతులు, ఆశయములకు సంబంధించినవి. శిఖరస్థాయిలో మొదట గంభీరమైన చైత్యానుభూతులు, ఆధ్యాత్మికానుభూతులకు సంబంధించిన దశ, అటుపిమ్మట మన సకలాకాంక్షలు, సకలాన్వేషణలు తమ అంతర్యసిద్ధిని పొందగలిగే అతిమానస నిత్యచైతన్యసాక్షాత్కార దశ.

శారీరిక జీవనదశయందు మొదట వైయక్తిక, సామూహిక కామితములు, అవసరములు, పిమ్మట ఆ వ్యక్తికి, సమూహమునకు గూడ మేలొనగూర్చు ప్రయోజనములు ప్రాధాన్యము వహించును. మానసిక జీవనమునందు పూర్ణసత్యవేషముతో చలామణి కాజూచెడి అర్ధసత్యము లనదగు భావములను, వికాసదశయందుండియూ నింకనూ అపరిపక్వములైన అంతఃస్ఫురణానుభూతులను అనుసరించి మనస్సుచే కల్పితమైన ఆదర్శములను ప్రాధాన్యము వహించును. మానసిక జీవన ప్రాబల్యము హెచ్చి, శారీరిక జీవన ప్రాబల్యము తగ్గినప్పుడెల్ల, మనోమయ పురుషుడగు మానవుడు వైయక్తిక జీవనమును తన ఆదర్శానుసారము తీర్చిదిద్దుటకు మనోమయప్రకృతి ప్రేరణను పొందినటుల భావించుచుండును. జటిలతరమైన సంఘజీవనము సైతము కడకు ఆ సూక్ష్మవిధానము ననుసరించునట్లుగా ప్రేరేపించబడును.

ఆధ్యాత్మిక జీవనమున, అనగా మనస్సుకంటె ఉచ్చతరమైన శక్తియొకటి అభివ్యక్తమై ప్రకృతిని కైవసమొనర్చుకొనుట సంభవించినపుడు, ఈ సంకుచిత ప్రేరణలు వెనుకకు తగ్గి క్షీణగతినొంది కడకు అంతరించిపోవును. మనస్సున

తీతమైన ఆత్మస్వరూపుడై, సర్వగత, సర్వాతీత తత్వమగు పరమపురుషుడే మనలో ప్రభువై దీపించుచు, మన ప్రకృతి ధర్మపు ఉచ్చతమ, విస్తృతతమ, పూర్ణతమాభివ్యక్తి కనుగుణముగా మన సుస్వరూప వికాస పారమ్యమును యథేచ్ఛగా రూపొందించవలసియున్నది. కడకు ఆ ప్రకృతియే పూర్ణసత్యమున సుప్రతిష్ఠిత మగుచు, పూర్ణసత్యపు సహజ స్వాతంత్ర్యముతో మనసో వ్యవహరింప నేర్చును. అయ్యది విధేయమగునది నిత్యుడగు పరముని దివ్యశక్తికి మాత్రమే. ఇకపైన వ్యక్తి పొందదగినది వేరేమియు లేదు. నెంవేరవలసిన కామితమును ఏదియునుండదు. నిత్యుడైన పరముని అక్షరస్వరూపమునందు, లేక విరాట్పురుష స్వరూపమునందు అత డంతర్భాగమైనాడు.

జీవితములో పరమాత్ముని ఖేలనను, అభివ్యక్తిని కొనసాగించుటయు, ప్రపంచగతిని దాని దివ్యగమ్యము దెసకు నడిపించుకొని పోవుటయు, నివిదక్కా కార్యాచరణ కాతనిని ప్రేరేపించునది ఇతర మేదియు నుండదు. మానసిక భావనలు, అభిప్రాయములు, కల్పనలు ఇక అతనివి కావు. ఏలయన, అతని మనస్సు నీరవస్థితిని పొందినది. ఇప్పుడది దివ్యజ్ఞానపు సత్యతేజః ప్రసారణకు వాహకము మాత్రమే. అతని ఆత్మవిస్తృతియందు ఆదర్శముల సంకుచితికి అవకాశము లేదు. పరమ పురుషుని అనంత మహాసాగర తరంగము లతనియందంతటనూ లేచి పడుచు, అతని సకల ప్రవృత్తులనూ సదా ప్రేరేపించుచుండును.

*　　　*　　　*

కర్మమార్గమున త్రికరణశుద్ధిగా ప్రవేశించువా రెవరైనను, తమ యవసరము, కామితము తమ కర్మప్రవృత్తికి ఏడుగడగా నుండు దశను దాటిపోవలెను. మహోన్నతమైన యీ యోగలక్ష్యము నత డామోదించుచో, ఏ కామితము లతని సత్తను బంధించుచు ఇంకనూ మిగిలియున్ననూ వాటి నెల్ల నతడు మనలో అంతర్వర్తియైయున్న పరమేశ్వరుని హస్తగత మొనర్చివైచుట నేర్చుకొనవలెను. సాధకుని మేలుకొరకు, ఎల్లరి మేలుకొరకు ఆ పరమేశ్వరశక్తియే అటుపై వాటితో వ్యవహరించును కామితముల నిరాకరణము త్రికరణశుద్ధిపూర్వకమై ఎప్పుడీ సమర్పణము జరుగునో అప్పుడు వెనుకటి స్వభావములోని అలవాటు

చొప్పున కొంతకాలమువరకు కామితపు అహంకారికానుభ లోలత్వ మెడనెడ తలయెత్తుచునే యున్నను అది తన పూర్వార్జిత శక్తిని క్రమక్రమముగా క్షయింప జేసికొనుటకే యగును.

అంతియేకాక, కామితానుభవాసక్తి యిట్లు ఎడనెడ తలయెత్తుట సర్వసాధారణముగా ఎట్టి బోధలను ఒక పట్టున వినిపించుకోనొల్లని శరీరధారియందలి నాడీమయ, ప్రాణమయ, భావావేశమయ ప్రకృతికి ఒక చక్కని బోధ గరపుటకు స్వత ముపయోగపడును. కామిత ఫలితములు, కామితముచే కలుగు దుఃఖము, అశాంతి,— వీటిని మహోదాత్తమైన శాంతి ననుభవించెడి సమయములతోను, అద్భుతావహమైన దివ్యానందము ననుభవించెడి సందర్భములతోనూ పోల్చి చూచి భేదము గ్రహించుటవలన, అహంకారికమైన కామితము మోక్షాసక్తమై తన మూలస్వరూపమగు దివ్యత్వోపలబ్ధి నాకాంక్షించెడి యాత్మకు సహజధర్మము కానేరదని బాగుగా తెలియబడుటకు వీలైన సన్నివేశమది. అటు తరువాత, అట్టి ప్రవృత్తులలోగల కామము, నిరంతర నిరాకరణ పూర్వకముగా అద్దానిని రూపాంతరము చెందించుటకై కలిగెడి ఒత్తిడి ఫలితముగా త్రోసిపుచ్చబడి తొలగించి వేయబడుట సంభవించును ఆ ప్రవృత్తులయందు గల విశుద్ధక్రియాశక్తి మాత్రము, ఊర్ధ్వమునుండి కలిగిన ఒత్తిడి ఫలితముగ జరిగెడి సకల కర్మలలోను, కర్మఫలితములలోను సమానముగా ద్యోతకమగు ఆనందానుభవస్ఫూర్తిచే సమర్థనీయమగుచు, చరమసంసిద్ధియందలి సామరస్యసోఫరకమై నిలిచియుండును.

కర్మయందు ప్రవర్తించుటయు భోగించుటయు నాడీమయపురుషుని సామాన్యధర్మము, అధికారము నై యున్నది. కాని, వైయక్తిక కామనచే ఆ కర్మను భోగమును ఎన్నిక చేయుట నాడీమయ పురుషుని అజ్ఞాన భూయిష్ఠమైన యిచ్ఛామాత్రమేకాని అధికారము కాదు. కర్మ భోగముల నెన్నికచేయవలసినది విశ్వాతీతము విశ్వగతమునైన పరమసంకల్పము మాత్రమే. కర్మ ఆ పరమ సంకల్పపు ప్రబలప్రవృత్తి విశేషముగా మార్పు చెందవలెను. భోగము విశుద్ధమైన ఆధ్యాత్మికానందముగా పరివర్తనము గాంచవలెను. వైయక్తిక సంకల్పమనునదెల్ల ఊర్ధ్వమునుండి తాత్కాలికముగా చేకూరిన అధికార సంక్రమణమో, లేక అజ్ఞానియగు అసురుని అధికార దురాక్రమణమో యగును.

మానవ పురోగతియందు కర్మాచరణకు ద్వితీయప్రమాణమగు సాంఘిక ధర్మము వ్యష్ట్యహంకారమునకు విస్తృత సామూహికాహంకారమునెడ విధేయత నలవడజేయునట్టి యొక సాధనము. ఈ ధర్మము నైతికలక్షణము బొత్తుగాలేనిదై, సంఘము భావించిన ప్రకారము సంఘముయొక్క అవసరములను, వ్యావహారిక శ్రేయస్సును ప్రతిబింబించునది కావచ్చును. లేక, అయ్యది ఆ అవసరములు, ఆ శ్రేయస్సునే అంతకంటె ఉన్నతమైన యొక నైతిక ధర్మమును, ఆదర్శధర్మమును దానికి కొంత జోడించి మార్పుచేసి సాధింపజూచునదియు గావచ్చును. పూర్ణవికాస మింకనూ చెందక నడిమిస్థితిలోనున్న వ్యక్తిని సాంఘికవిధి, కుటుంబ బాధ్యత, జాతీయావసరముల పేరిట నియ్యది బంధించి అనుశాసించుచుండును. వ్యక్తియందు క్రమముగా వికాసము చెందుచుండెడి మహోన్నత పరమధర్మభావనతో నద్దానికి సంఘర్షణ రాకుండునంతకాల మిది యిట్లు సాగుచుండును.

కాని, కర్మయోగ సాధకుడు దీనినిసైతము సకల కర్మలకు ప్రభువైన యీశ్వరునికే సమర్పించివేయును. ఈ సమర్పణము నతడు గావించిన పిమ్మట, అతని వైయక్తిక కామనలవలెనే అతని సాంఘిక ప్రేరణలూ నిర్ణయములు కూడ వానియంతటనవి క్రమముగా క్షయించిపోవునటుల చేయబడును. లేక, వాటి యవసరమింకనూ ఉండునంతకాలము, మొత్తముమీద మానవజాతి యంతటితోడను, లేక అందలి ఏ యొక విభాగముతోనైనను అద్దాని ఆశయములు, క్రియా కలాపముల సందర్భమున తన అవర మానసిక ప్రకృతికి తాదాత్మ్యము ఘటిల్లజేయు నిమిత్తమతడీ సాంఘిక ప్రేరణలను వినియోగించుట జరుగవచ్చును. కాని, ఆ కొలదికాలముసైతము గడచిన పిమ్మట, ఆ ప్రేరణలన్నియు ఉపసంహృతములై తుదకు ఈశ్వరపరిపాలన మొక్కటియే మిగులును. ఈశ్వరునితోడ అతనికి సంపూర్ణైక్యము ఘటిల్లగా, ఆ దివ్య చైతన్య సాక్షాత్కారద్వారముననే ఇతరులతో గూడ నతడు ఏకత్వమును పొందియుండునుగాని, మానసిక ప్రకృతిద్వారమున గాదు.

ఏలయన, విముక్తి సాధించిన పిమ్మటసైతము సాధకుడు ప్రపంచములోనే మనవలసియుండును. ప్రపంచమున మనుట యనగా కర్మల నాచరించుచుండు

టయే. కాని, కామన లేకుండ కర్మలుచేయుట యన, మొత్తముమీద ప్రపంచ శ్రేయస్సుకొరకు కర్మలు చేయుటో, లేక ప్రపంచమున నావిష్కారము పొంద వలసియున్న ఒకానొక నూతన సృష్టికొరకు కర్మలుచేయుటో, లేక యంతరము నందున్న ఈశ్వరసంకల్పముచే విధించబడిన ఏదియోకర్మను చేయుటో యగును. ఈ పని నతడు తన పరిసరములచే కల్పితమైన పరిస్థితులయందుగాని, తాను పుట్టి పెరిగిన సంఘమధ్యమున నుండిగాని, లేక ఈశ్వర నిర్దేశముచే తనకొరకు సృష్టించబడిన సన్నివేశమునందుగాని చేయవచ్చును.

కావున, మనము సాధించు సంసిద్ధియందు, దైవనిర్దేశానుసారముగా మనము నడపవలసియున్నట్టియు, తోడ్పడవలసియున్నట్టియు, లేక సేవించవలసియున్న ట్టియు ఏ జాతి, వర్గము, సముదాయముతోనైనను మనము సానుభూతితో ఆత్మ తాదాత్మ్యముచెంది వ్యవహరించుటకు అవరోధకమై యుండునదేదియు లేశమైన మన మనోమయసత్తలో నిలిచియుండరాదు. కాని, తుట్టతుదకు ఇదంతయు పరమే శ్వరునితో ఏకత్వానుభూతిద్వారమున సాధించబడిన స్వతంత్రమైన ఆత్మ తాదా త్మ్యమై విలసిల్లవలెనేకాని, అందెట్టి మానసిక, నైతిక నిబంధనగాని, వైయక్తిక, సాంఘిక, మతవిషయిక, జాతీయాహంకారపూర్వక, ప్రాణమయకోశ ప్రాబ ల్యముగాని ఉండరాదు. ఏ సాంఘిక ధర్మమునకైనను విధేయత చూపవలసి యున్నచో, అయ్యది భౌతిక పరిస్థితుల ఒత్తిడిచేతను, వైయక్తిక, సామూహిక ప్రయోజన దృష్టిచేతను, తాత్కాలికావసరమునుబట్టియు, పరిసరముల ప్రాబల్య మునుబట్టియు, కర్తవ్యభావనచేతను గాక, కేవలము యజ్ఞేశ్వరుడగు నీశ్వరుని కొరకును, మానవుల యాంతరంగిక జీవితములో ఆ సాంఘిక ధర్మముతో పని యున్నది కావున దాని నుల్లంఘింప జేయుటద్వారా మానవబుద్ధికి విక్షేపము కలి గింపరాదనునది ఈశ్వరేచ్ఛగా గుర్తింపబడుటచేతను మాత్రమే అట్టి విధేయ తను చూపవలసియుండును.

అట్లుగాక, ఒకవేళ ఆ సాంఘిక ధర్మము పాటింపబడకుండుటే జరుగుచో, అదియును వైయక్తిక కామన, సంకల్పము, అభిప్రాయానుసారముగా గాక, ఆత్మ ధర్మము నభివ్యక్తముచేయు మహత్తరధర్మ మింకొకటి ద్యోతమానమైనందువలన

సంభవించవచ్చును. లేక, పరమేశ్వరుని పరమ సంకల్ప గతివిన్యాసములో, ప్రపంచపురోగతి కావశ్యకమైన విస్తృతతర స్వతంత్ర జీవన సంస్థితికొరకై ఇప్పటి ధర్మమును, పద్ధతులను, మార్చుటకు, అతిక్రమించుటకు, లేక రద్దుచేయుటకు ప్రేరణ కలదనెడి గుర్తింపువలన కూడ ఈ సాంఘికధర్మోల్లంఘనము జరుగుట కవకాశమున్నది.

నైతిక ధర్మము, నైతికాదర్శము అనునవి ఇంకనూ మిగిలియుండవచ్చుననుమాట నిజమే. తాము విముక్తులమని భావించుకొను పెక్కుమందికి ఇవి స్వాపరమ పవిత్రములు అగ్రాహ్యములుగానే తోచుచుండుట కలదు. కాని, ఉన్నత శిఖరాల వైపునకే సదా దృష్టిని మరల్చుకొనియుండు సాధకుడు వీటినిగూడ ఆ పరమేశ్వరునికే సమర్పించివేయును. సకలాదర్శములును అసమగ్రముగను పరిచ్ఛిన్నముగను ఆ పరమేశ్వరు నభివ్యక్త మొనర్చుటకై తంటాలుపడుచుండునట్టివే. సకల నైతిక గుణములు స్వతస్సిద్ధమగు నాతని పూర్ణత్వమును వికటరూపమున కడు పేలవముగను పెడసరముగను ప్రదర్శించునవి మాత్రమే. వాటి మండల సంబంధియగు కామన తొలగిపోవుటతోడనే పాపబంధముకూడా తొలగిపోవును. ఏలయనిన, ఆ కామన ప్రాణకోశపు రజోగుణోద్రేకమునకు సంబంధించినది. ఆ ప్రకృతిగుణము రూపాంతరము చెందింపబడుటతోడనే అది అంతరించిపోవును. మన యాకాంక్ష ఏ సంప్రదాయము, ఏ అభ్యాసము, ఏ మానసిక కల్పన,—కడకు ఏ విశుద్ధ సత్వగుణరూపములోని బంగారుపంకెలకును కట్టువడిపోరాదు.

ఏలయనిన, సద్గుణమని మానవులు పేర్కొను నొక అల్పవస్తు విశేషముకంటె ఎంతయో గంభీరము, సారభూతము నగునదేదియో దాని స్థానము నాక్రమించవలసియున్నది. అద్దానిని "ఆత్మస్థాయి" అని పేర్కొనవచ్చును. గుణము మానవస్థాయిలోనిది. మానవస్థాయి కంటె ఆత్మస్థాయి గొప్పది. కర్మయోగ పరమావధి యీ పరమగంభీర మహోన్నత స్థాయియే. పరమమైన సత్యప్రేమల కార్యకలాపరూపములో ఈ ఆత్మస్థాయి స్వచ్ఛందముగా నావిష్కారము చెందును. కాని, వ్యావహారికదృష్టిప్రధానమగు హేతువాదముచే నిర్మితమైన అల్పతి కట్టడములయందు బలాత్కారముగా ఈ పరమ సత్యమును నివసింపజేయుట

సాధ్యముగానిపని. ఆదర్శభావయుక్తమైన విస్తృతతర హేతువాదముచే నిర్మితములై విశుద్ధసత్య మిదియేయని మానవబుద్ధిని భ్రమింపజేసి లోగొనజూచెడి ఘనతర నిర్మాణములందు అద్దానిని బంధింప జూచుటయు అలవిగాని పనియే.

అట్లే పరమప్రేమ మానవస్థాయిలోని ఆకర్షణ, సానుభూతి, దయ, అను వాని రూపమున ప్రవర్తిల్లు దుర్బల, పాక్షిక, అజ్ఞానభూయిష్ఠ, భావావేశపూరిత ప్రవృత్తుల కనుగుణమైనదని చెప్పుట కెంతమాత్రమునూ వీలులేదు. ఈ ప్రవృత్తుల రూపాంతరమే ఆ పరమప్రేమయని వక్కాణించుటకు అంతకంటెనూ అవకాశములేదు. ఆ విస్తృత గతివిశేషమును ఈ క్షుద్రనియతి బంధింపజాలదు. మనస్సు సాధించిన పాక్షికోపలబ్ధి పరమమైన ఆత్మసంసిద్ధిని అనుశాసింపగలుగుట యసంభవము.

పరమమైన సత్యప్రేమల క్రియాకలాపము సాధకునియందు తొలుత అతని ప్రకృతిధర్మము ననుసరించియే స్వీయసంసిద్ధిని పొందజూచును. ఏలయన, ఈ ప్రకృతి ధర్మము ఈశ్వరప్రకృతియందలి ఒకానొక ప్రత్యేకాంశము. పరాశక్తియందలి ఒకానొక ప్రత్యేక గతివిశేషము మాత్రమే. దానినుండియే అతని యాత్మ యీ జగల్లీలలోనికి ఆవిర్భావము పొందినది. ఆత్మ యనంతముగావున ఈ ప్రకృతిధర్మస్వరూపముచేత పరిచ్ఛిన్నతను మాత్రము పొందదు. అయినను ఈ ప్రకృతిధర్మమా శక్తిప్రాభవమునే నెలార్చుకొనుచు, తత్ప్రభావప్రాబల్యాను సారముగనే యథేచ్ఛగా ఉత్తరోత్తరాభ్యున్నతి సూచకమైన క్రమవికాసమును సాధించుచుండును. అంతఃప్రేరణచే సాధకుని సత్తకు ఎట్టి గుణసంపుటి యేర్పడునో అద్దాని ననుసరించి యతడు ఒక మహాజ్ఞాని, ఒక మహాశూరుడు, ఒక మహాప్రేమికుడు, భోక్త, ఒక మహాకర్మిష్ఠి, సేవాపరాయణుడు మున్నగువాని స్వభావవిశేషములందు ఆ దివ్యసత్యధర్మ క్రియాకలాపములను తనయందభివ్యక్తము గావింపుచుండును. అతని చర్యలో లోకము గాంచునది అతని స్వభావము నుండి యీ రీతిలో సముద్భూతమైన క్రియాకలాప క్రీడావిశేషము మాత్రమే. ఇయ్యది బయటనుండి విధించబడిన ఏ ధర్మముచేగాని, ఏ యవరనియతిచేగాని కృతకముగా రూపొందించబడిన కార్యాచరణపద్ధతి ఎంతమాత్రమును గాదు.

కాని, యీ ఉపలబ్ధికంటెను ఉచ్చతరమైనది వేరొకటి కలదు. అయ్యది యీ కట్టకడపటి పరిమితిని సైతము అతిక్రమించెడి ఒకానొక అనంత్యసిద్ధి. ఏల యన, ప్రకృతిలక్ష్యము నెరవేరుటతో దాని యెల్లలును పూర్తిగా అంతర్ధానమై పోవును. ఎట్టి ఎల్లలునులేని స్థితియందు ఆత్మ కావాస మేర్పడును. అట్టి స్థితిలో నది తనయందలి ఈశ్వరేచ్ఛానుసారముగా సకలరూపములను, సకలోపాధులను వినియోగించుకొనుట జరుగును. కాని, అట్లు వినియోగించుకొనినవానిచే దేని చేతను అయ్యది బద్ధమగుటయు, అవరోధింపబడుటయు సంభవింపనేరదు. ఇదియే కర్మమార్గము కట్టకడకు చేర్చెడి శిఖరస్థానము. ఇచ్చటనే యాత్మ తన కర్మల యందు సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందును. వాస్తవమునకు అచట దానికి ఏ కర్మలును లేవు. ఏలయన, దాని సకల ప్రవృత్తులును పరతత్వములోని లయ విన్యాసములే. అనంతునినుండి స్వచ్ఛందముగ నావిర్భూతమగు సంగీతమువోల్కి-నవి పరమ స్వాతంత్ర్యముతో ఆ పరతత్వమునుండియే ఆవిర్భావము పొందుట సంభవించును.

* * *

కావున. పరమము, సర్వాంతరము నగు నొక దివ్యసంకల్పమునకు మన కర్మప్రవృత్తుల నన్నింటినీ పూర్ణసమర్పణము గావించుటయే కర్మయోగ మార్గమును, గమ్యమును గూడ. అహంకారిక ప్రకృతికి సంబంధించిన సామాన్య కార్యకలాపమునకు బదులుగా, మనలో నిత్యమై విలసిల్లు ఒకానొక దివ్యతత్వపు ఏలుబడి కొనసాగు నిమిత్తమె చేయవలసిన యీ సమర్పణము ఎట్టి నియమ నిబంధనల చేతను సంకుచితి పొందరాదు. కాని, పరమమైన యీ దివ్యసంకల్ప స్వరూపమేమిటి? మోహనిమగ్నములగు మన యీ ఉపకరణముల చేతను, బద్ధావస్థలో అంధప్రాయమైయున్న యీ బుద్ధిచేతను దానిని గుర్తించుట సాధ్యమగునా?

సర్వసాధారణముగా మనలను మనము ఈ జగత్తునందు ఒక ప్రత్యేకమైన 'అహము' గా భావించుకొనుచుందుము. ఈ 'అహము, ఒక ప్రత్యేక శరీరమును, మానసిక, నైతిక ప్రకృతిని పరిపాలన చేయుచు, స్వేచ్ఛగా తాను స్వయముగ

నిర్ణయించుకొనిన కర్మలను తానే ఎన్నిక చేసికొనుచు, స్వతంత్రమై తత్కారణముగ తన కర్మలకు తానే అధినేతగా బాధ్యత వహించి యుండునని మన తలంపు. తన స్వరూపవ్యవస్థను గురించి లోతుగా ఆలోచించుకొనని సామాన్య మనస్సుకు,-ఒకవేళ ఆలోచింప గలిగినను ఆధ్యాత్మిక దర్శనానుభూతులను పొందజాలని మనస్సులకు సైతము,—ఈ 'అహము' కంటెను. దీని సామ్రాజ్యము కంటెను నిక్కమైనది, లోతైనది, బలవత్తరమైనది వేరొకటేదియో మనలో కలదని యూహించుట సులభమైన పనికాదు. కాని, ఆత్మస్వరూపజ్ఞానము పొందవలెనన్నను, ఈ దృశ్యవస్తుజాతపు యథార్థస్వరూపమును పొందవలెనన్నను, అందుకు మొట్టమొదటగా చేయవలసినది వస్తుజాతపు బాహ్యస్వరూపము వెనుకకు బోయి అద్దాని ముసుగులో మరుగుపడియున్నదాని యథార్థ స్వరూపమును గుర్తించుటయే.

ఈ 'అహం' కారము శాశ్వతమైన తత్త్వము కాదు; మన స్వరూపము నందలి ముఖ్యాంశమునూ గాదు. ఇయ్యది ప్రకృతి కల్పన మొనర్చిన యొక కల్పన. మన మనస్సునందలి యోచనల కేంద్రీకరణ నిమిత్తమగు మానసిక కల్పనయు, మన ప్రాణమయ విభాగపు సంవేదనల కేంద్రీకరణ నిమిత్తమగు ప్రాణమయ కల్పనయు, మన శరీరములోని భౌతిక ప్రవృత్తుల కేంద్రీకరణ నిమిత్తమగు భౌతికచేతనా కల్పనయు చేరి యిట్టి అహంకార రూపమును గైకొన్నది. ఆంతరికముగా మన స్వరూపస్థితి ఆత్మచైతన్య మగునుగాని అహంకారము గాదు. అట్లే బాహ్యముగా మన స్వరూపము, మన చేష్ట ప్రకృతి యగునుగాని అహంకారము గాదు. సకల విశ్వమును నడుపుచున్న కార్యశక్తి యొకటి మనకొక రూపమునిచ్చి, అట్లు రూపింప జేయబడిన మన స్వభావము, పరిసరము, మానసిక తత్వములద్వారమునను, మనలో ప్రత్యేకరూపము దాల్చిన విశ్వశక్తులద్వారమునను మన కర్మ ప్రవృత్తులను, వాటి ఫలితములను అనుశాసించుచున్నది.

నిజమునకు, ఆలోచించునది, సంకల్పించునది, కర్మచేయునది మనము కాదు. ఆలోచన మనలో కలుగుచున్నది. సంకల్పము మనలో కలుగుచున్నది. కర్మప్రవృత్తి మనలో కలుగుచున్నది. మన అహంభావము తనకు తానొక

చేడి కట్టుకొని, ఈ సహజ వృత్తుల ప్రవాహమంతయు తన కృతముగనే భావించుచుండును, వాస్తవమునకు, ఆలోచనను కల్పించునది, ఇచ్ఛను విధించునది, ప్రేరణను కలిగించునది ప్రకృతియే, విశ్వశక్తియే. మన శరీరము, మనస్సు, అహంకారము ఆ సచలశక్తి మహాసముద్రమధ్యమున లేచిన ఒక తరంగము. అవి దానిని శాసించుటకాదు, దానిచేతనే అవి శాసించబడుచున్నవి. సత్యోపలబ్ధికిని, ఆత్మజ్ఞానమునకును సాధకుడు పురోగతి సాధించు సందర్భమున, అతని యాత్మ కనులు విచ్చి చూడనేర్చి అహంకారమునకు, కర్మములకు సంబంధించిన యీ యథార్థమును గుర్తించు స్థితికి వచ్చుట అత్యంతావశ్యకము, మనః ప్రాణ శరీర సంబంధమైన అహంకారమే కర్మను చేయుచున్నదని గాని, నడుపుచున్నదని గాని తలపోయు నలవాటు నతడు పూర్తిగా విడిచిపుచ్చవలసియున్నది. తనలోను, సకల ప్రాణులలోను, సకల వస్తువులలోను తన నియత గుణానుసారముగా పని చేయు విశ్వప్రకృతియొక్కటే కర్తయని యతడు గుర్తింపవలెను.

కాని, యీ ప్రకృతి గుణములను విశ్చయించినది యెవరు? ప్రకృతి కార్యములకు మూలకారణమైనవాటిని నడిపించువారెవరు? ప్రకృతి వెనుక నొక చైతన్యమున్నది. ప్రకృతి కార్యముల ప్రభువు, సాక్షి, జ్ఞాత, భోక్త, భర్త, అనుమంత ఆ చైతన్యమే. అదియే ఆత్మయని, లేక పురుషుడని పేర్కొనబడు చున్నది. కార్యమును ప్రకృతి మనలో రూపొందించును, పురుషుడు ఆమె లోపల, లేక వెనుక నిలిచి ఆ కార్యమునకు సాక్షి, అనుమంత, భర్తయునై విరాజిల్లును. ప్రకృతి మన మనస్సులో ఆలోచనను రూపొందించును, పురుషుడు ఆమె లోపలను, లేక వెనుకను, ఉండి ఆ యాలోచనను, దాని నిజతత్వమును తెలిసి కొనును. ప్రకృతి కార్యఫలితమును నిర్ణయించును, పురుషుడు భోక్తయై ఆ ఫలితము ననుభవించును. ప్రకృతి మనస్సును శరీరమును రూపొందించి వాటికై శ్రమించుచు, వాటిని వికాసము నొందించును. పురుషుడు ఆ రూప కల్పనకు, క్రమవికాసమునకు ఆధారమై నిలిచి ఆయా కార్యములందామె వేయు ప్రతి అడుగును అనుమతించుచుండును.

వస్తుజాతమునందును మానవులందును పనిచేయు సంకల్పశక్తికి ప్రకృతి కార్యరూప మిచ్చును. ఏమి జరుగవలసియున్నదో దానినిగురించిన దర్శన

సామర్థ్యముచే పురుషుడా సంకల్పశక్తికి ప్రేరణ యొసగును. ఈ పురుషుడు బాహ్యతలములోని అహంకారము గాదు; అహంకారము వెనుక, జ్ఞానోత్పత్తి కారణుడు, జ్ఞానగ్రహీతయునై, శక్తికి మూలకందమై వెలయునాత్మస్వరూపము. మన మానసికాహంకారమీ ఆత్మకు, ఈ శక్తికి, ఈ జ్ఞానమునకు అసత్ప్రతి బింబముమాత్రమే. కావున, ఆధార చైతన్యమగు ఈపురుషుడే ప్రకృతి కార్యముల కన్నిటికి మూలకారణము, ఆలంబనమునై వెలయుచున్నవాడు. కాని, తాను మాత్రము కర్త కాడు. బాహ్యమందు ప్రకృతి, అంతరమందు శక్తి (చైతన్య శక్తి, ఆత్మశక్తి) — జగజ్జనని వెలిమోము, లోమోమునై విలసిల్లు నీ శక్తి ద్వయము ద్వారముననే విశ్వమునందలి సకల కార్యకలాపము కొనసాగు చున్నది. ప్రకృతి - శక్తి ద్వంద్వరూపమైన జగజ్జనని ఒక్కతెయే కార్యకర్త్రి.

పురుషుడు-ప్రకృతి, చైతన్యము-శక్తి, ఆత్మ-దానిపై ఆధారపడిన ప్రకృతి,-ఈ యుగళములు వేర్వేరుగ దోచు సందర్భములో గూడ ఒక్కటియే, ఒకదానినుండి యొకటి వేరుపరచరానివే. ఏక కాలముననే సర్వగతము, సర్వాతీతమునైన శక్తి యది. కాని, ఈ మహత్తర సత్యముతో వస్తుతః ఏకమై విల సిల్లినట్టియు, మానసికాహంకారము కంటె వేరైనదియునగు నొక విశేషము వ్యక్తియందు సైతము కలదు. అయ్యది అద్వయుడగు పరమపురుషుని స్వచ్ఛప్రతి బింబము, లేక అంశమునై విరాజిల్లు జీవాత్మ. విశ్వాతీత విశ్వగత ప్రకృతి యొక్క వ్యష్టిక్రీడ నొకదానిని బలపఱచునిమిత్తమై తనశక్తిని, జ్ఞానమును సంకో చింపజేసికొనినట్లుగా గానుపించు పరమాత్మయే ఈ జీవాత్మ. అనంతమైన ఏక వస్తువుగా వర్ణింపబడుదాని నిగూఢతమ, సత్యస్వరూపమును పరిశీలించి చూతు మేని, అయ్యది అనంతమైన అనేకవస్తువుకూడ. మనమా వస్తువుయొక్క ప్రతి బింబ స్వరూపులము మాత్రమే కాదు; అదియు మనము ఒక్కటే.

మన అహంకారమువలెగాక, మన ఆధ్యాత్మికవ్యక్తిత్వము సర్వగత, సర్వాతీత లక్షణోపేతముగూడ నైయున్నది. కాని, ప్రకృతమున మనలోనున్న ఆత్మ ప్రకృతియందు వ్యష్టికల్పనము సందర్భమున అహంభావనయే తానుగా భ్రమనుపొందుట కవకాశ మిచ్చుచున్నది. ఈ యజ్ఞానమునది వదలించుకొని,

•ను సర్వగతము, సర్వాతీతమునైన పరమాత్మయొక్క ప్రతిబింబము, అంశము, ేక సత్తావిశేషము ననియు, జగద్వ్యాపారములో తాను కేవలము ఆ పరచైతన్య మునకు చెందిన ఒకానొక కేంద్రముననియు అయ్యది తనను తాను గుర్తించుకో ంలసియున్నది. కాని, అహంకారము, జ్ఞాతయైన సాక్షిచైతన్యము, ఎట్లు కార్య ర్తలు కారో, అట్లే జీవపురుషుడును కార్యకర్త కాదు. సర్వాతీతము, సర్వగతము నైన మహాశక్తి ఒక్కతెయే కార్యకర్త్రి. కాని, అద్వయుడగు పరమాత్మ ఆమె వెనుక నిలిచియుండి, 'పురుష-ప్రకృతి,' 'ఈశ్వర-శక్తి' అను యుగళశక్తిగా ఆమెద్వారమున అభివ్యక్తమగుచున్నాడు. * శక్తిరూపమున పరమాత్మ క్రియా సమర్థుడగుచు. ఆమె ద్వారముననే విశ్వమునందలి సకల కర్మలకు మూలకార ణుడు, ప్రభువుగూడ నగుచున్నాడు.

* * *

కర్మల యథార్థ పరిస్థితి ఇదియే యైనచో, అహంకారికమైన సకల కర్మ ప్రవృత్తి విశేషములనుండియు విరమించి, 'నేను చేయుచున్నా'ననెడి భావమును పూర్తిగా నశింపజేసికొనుటయే సాధకుడు చేయవలసిన మొట్టమొదటి పని. తనలో జరుగుచున్న ప్రతిదియు చేతనాయుక్తము, అవచేతనా యుక్తము, ఒక్కొక్క ప్పుడు అతీత చేతనాయుక్తమునైన తన మానసికోపకరణరూప యంత్రాంగము

---

* ఈశ్వర-శక్తి యుగళమునకు, పురుష-ప్రకృతి యుగళమునకు భేద మున్నది. ఏలయన, పురుష ప్రకృతులు వేర్వేరు శక్తులు. ఈశ్వర శక్తు లట్లుగాదు, ఉభయులు ఒకరియందొకరు అంతర్వ్యాప్తులు. ప్రకృతి నంత ర్వ్యాప్త మొనర్చుకొన్న పురుషుడై ఈశ్వరుడు తనయందలి శక్తిచేత పరిపాలనమొనర్చును. పురుషుని తన ఆత్మగా వెలయించుకొన్న ప్రకృ తియై శక్తి ఈశ్వరేచ్ఛయే తన యిచ్ఛగా ప్రవర్తింపుచు ఈశ్వర సాన్ని ధ్యము నేమరక యుండును. దివ్యకర్మయోగ సాధకుడు మొట్టమొదటగా పొందవలసినది పురుష-ప్రకృతి తత్వ సాక్షాత్కారము. ఏలయన, ప్రకృతి నుండి పురుషుని వేరుపరచి, యంత్రాంగమునకు పురుషుని బద్ధుని గావిం

మూలమున జరుగుచున్నదనియు, ఆధ్యాత్మిక, మానసిక, ప్రాణిక, శారీరిక ప్రకృతి శక్తులచే ఆ యంత్రాంగము నడపబడుచున్నదనియు,-ఈ విధమైనచూపు, అనుభవము అతనికి గుదురవలెను. బాహ్యతలమున నొక వ్యక్తిత్వ మాతనియం దుండి, ఏమేమియో సంకల్పించుచు, ఎన్నికచేయుచు తలయొగ్గుచు, ఘర్షణపడుచు, ప్రకృతియం దెట్లో నెగ్గుకొని వచ్చుటకు, ప్రకృతిని జయించుటకు, ప్రయత్నించు చుండు ననుమాట నిజము.

కాని, యీ వ్యక్తిత్వము కూడ ప్రకృతి చేసిన యొక కల్పనయే. ప్రకృతియే దానిపై నాధిపత్యము వహించి దాని నడకను నిర్ణయించి నడుపుచుండును గాన, దానికి స్వతంత్రత లేదు. అయ్యది ప్రకృతియందలి ఆత్మకు అభివ్యక్తి రూపమైన కల్పన. అనగా, అయ్యది ప్రకృతికి సంబంధించిన ఆత్మగాని, ఆత్మకు సంబంధించిన ఆత్మకాదు. అది యతని ప్రాకృత సత్త; ఆధ్యాత్మికమైన నిత్య సత్త కాదు; తాత్కాలికముగా కల్పింపబడిన వ్యక్తిరూపముగాని నిత్యసత్యమైన పురుషస్వరూపముగాదు. ఆ నిత్య సత్య పురుష స్వరూపుడుగ తా నగుటకే సాధకుడు ప్రయత్నింపవలసియున్నది. ఆంతరంగికముగా తానొక నిశ్చలస్థితిని సాధించి, బాహ్యవ్యక్తిత్వమునుండి వేరుపడి దానిని తిలకించుచు, తనలో కొనసాగు విశ్వశక్తుల క్రీడాగతివిశేషములందు గుడ్డిగా నిమగ్నుడై పోకుండ వేరై నిలిచి ఆ క్రీడ నవగాహన మొనర్చుకోవలెను. ఇట్లు స్థిరత్వముతో తన ప్రకృతి కంటె వేరై నిలిచి దానిని తిలకించుచు తనను దా నవగాహన మొనర్చుకొనుటకు ప్రయత్నించుటలో నతడు ప్రకృతి కార్యముల తిలకించుచుండునట్టియు, వాటి ఫలితములను ప్రశాంతముగ నామోదించుచుండునట్టియు, ఆ కార్యప్రేరణకు అను

---

o చుటే మన అజ్ఞానమునకు, అసంపూర్ణతకు ప్రధాన కారణము. ఈ సాక్షాత్కారము మూలముగా పురుషుడు యంత్రప్రాయమగు ప్రకృతి కార్య బంధమునుండి విముక్తుడై స్వతంత్రుడగుచు, ప్రకృతిపై తొలి యాధ్యాత్మిక విజయము సాధింపనేర్చును. పురుష-ప్రకృతి సంబంధమునకు, దాని అజ్ఞాన పూర్వక వ్యాపారమునకు వెనుక ఈశ్వర-శక్తి సంబంధము దాగియుండి అద్దానివి క్రమవికాస సాధనరూపమగు ప్రయోజనముననై

మ్మతి యొసగునట్టియు, లేక అనుమతి నిరాకరించునట్టియు వ్యష్ట్యాత్మ స్వరూపము కాననని గుర్తింపనేర్చును.

ప్రస్తుతమీ యాత్మ, లేక ఈ పురుషుడు, మరుగుననున్న తనచైతన్యపు లొత్తిడిచే సత్తయొక్క ప్రవృత్తి విలాసములను బహుశః ప్రభావితమొనర్చుచు, అంగీకారపూర్వకముగ ప్రకృతి కార్యములను తిలకించువాడుగ మాత్రమేయుండి, తన శకులను, లేక అశక్తుల తాలూకు ఒక లేశమును బాహ్యవ్యక్తికే ఎక్కువగా అప్పగించువాడై యున్నాడు. ఈ బాహ్యవ్యక్తి ప్రకృతికి లోబడియున్న అనీశుడుగాని, ఆమె ననుశాసింపగల ఈశుడు కాదు. కాని, ముసుగు తొలగిపోయిన నాడు, అతడు ప్రకృతి కార్యముల ననుమతించుటలోగాని అనుమతించలేకపోవుటలోగాని తన ప్రాబల్యము చూపుచు, వాటికి తానే ప్రభువై, ప్రకృతిలో ఏ మార్పునైనను ప్రభువువలె అనుశాసింపనేర్చును. పూర్వపు స్థిరసంసర్గ ఫలితముగనేమి, పూర్వసంచిత శక్తిప్రాబల్యము వలననేమి, దీర్ఘకాలముదనుక ఒక వేళ అంతఃపురుషుని అనుమతితో నిమిత్తములేకయే పూర్వపు ప్రవృత్తి ఇంకనూ కొనసాగుచుండినను, అనుమతిగల ప్రవృత్తిని పూర్వాభ్యాసములేని కారణమున్న ప్రకృతి యింకను పట్టుదలతో త్రోసిపుచ్చుచుండినను, కడకు తన అనుమతికిగాని, అనుమతినిరాకరణకుగాని తప్పక విజయము ఘటిల్లితీరునని యతడు గుర్తించును.

విశేష ప్రతిఘటనతో నెమ్మదిగానో, తన సాధన విధానమును వేగముగ సర్దుబాటుచేసికొనుట ద్వారా త్వరితముగానో, ప్రకృతి అతని అంతర్దృష్టి, సంకల్పము నిర్దేశించిన పద్ధతిలో తనను, తన కార్య కలాపములను మార్పుగావించుకొనును. మానసిక నియమము, అహంకారిక సంకల్పము,—వీటికి బదులుగా అంతరీక్షమైన ఆధ్యాత్మికాధిపత్యమాతనికి అలవడును. అతనిలో పనిచేయు ప్రకృతి

---

ని వినియోగించుకొనును. ఈశ్వర-శక్తి సాక్షాత్కారము ఆధ్యాత్మికమైన ప్రకృతియందు సంపూర్ణైక్య సామరస్యములతో మహోదాత్తమైన శక్తి విలసన పూర్వక దివ్యకర్మ కలాపములో భాగస్వామ్యమును సాధకునకు సిద్ధింపజేయును.

శక్తులతని నింతకాలము తెలియరాకుండ తమ యుపకరణముగ నుపయోగించు కొనుచు, యంత్రప్రాయుడగు దాసునిగాచేసికొనినవి. ఇపుడాతడా ప్రకృతిశక్తులకు ప్రభువై విరాజిల్లును. అతని కూర్ధ్వమునను, అతనిని పరివేష్టించియు జగజ్జనని యగు మహాశక్తి యున్నది. ఆమె విధానముల యథార్థజ్ఞాన మాతనికి గలిగి, ఆమెలోని ఈశ్వరేచ్ఛకు యథార్థమైన సమర్పణము నాతడు గావించుకొనినచో, తన అంతరములోని ఆత్మకు గావలసియున్న సమస్తమును అత డామెనుండి బడయనేర్చును.

తుట్టతుద కాతడు తన దర్శన, జ్ఞానములకు మూలము, అనుమతికి, ఆమోదమునకు, నిరాకరణమునకు మూలమునై తనయందును, సకల ప్రకృతియందును అంతర్యామియై యున్న శక్త్యాత్మక పరమాత్మజ్ఞానోపలబ్ధిని పొందగలుగును. ప్రభువు, పరముడు, అంతటను ఏకస్వరూపుడై యున్నవాడు అగు నీ యీశ్వర-శక్తియందొక అంశమై యొప్పారునట్టిదే అతని యాత్మ. అది యీ పరమసత్తలో అంతర్భాగమైన సత్త, ఆ పరాశక్తిలో అంతర్భాగమైన శక్తి. ఇక పైన మన పురోగతి అంతయు నా నిఖిలకర్మాధినాథుడు ప్రపంచమునందును మన యందును తన యిచ్ఛ నభివ్యక్తము గావింపుమ, సర్వగత సర్వాతీతశక్తి ద్వారమున కొనసాగించు కార్యనిర్వహణము విధానములను గురించిన మన జ్ఞానోపలబ్ధిపై నాధారపడియుండును.

ఏది యెట్లు జరుగవలెనో అద్దానిని పరమేశ్వరుడు తన సర్వజ్ఞత్వమున వీక్షించును. ఈ యీక్షణమే అతని యిచ్ఛ, పరమేచ్ఛ, పరమసంకల్పము. అది యొక సృజనాత్మక శక్తివిశేషము, అట్లాతడు ఈక్షించినదానినే అతని కభిన్నమై వెలయు అఖండ చిత్స్వరూపిణియగు జగన్మాత తన శక్త్యాత్మలోనికి గైకొని దానికొక రూపమొసగును. అంతట ఆ యిరుపురియొక్కయు సర్వశక్త్యాత్మక సర్వజ్ఞత్వపు యంత్రస్వరూపిణియగు ప్రకృతిశక్తి దానిని కార్యరూపమున నెరవేర్చును. కాని, ఏమి కావలసియున్నది, ఏమి జరుగవలసియున్నది, అనుదానికి సంబంధించిన యీ దర్శనము పరమేశ్వరుని సచ్చిదానంద స్వరూపమునుండి - సూర్యునినుండి వెలుగుపలె - సరాసరిగా స్వచ్ఛందముగనే ప్రవహిల్లును.

# పరమ సంకల్పము

అయ్యది ప్రకృతి కార్యకలాపపు యథార్థమును కనుగొనుటకై మన మర్త్యులు విశేషశ్రమముతో కొనసాగించు ప్రయత్నమువంటిది కాదు. మన వ్యష్ట్యాత్మ తన సచ్చిత్స్వరూపమున పరమేశ్వరునితో ఏకత్వమును పొంది పరమ జననియైన ఆదిశక్తితోడి సాక్షాత్సంస్పర్శను పొందనేర్చిననాడు, మనలో పైతము ఆ పరమ సంకల్పము ప్రకృతియొక్క స్వచ్ఛందగతిలో అనివార్యముగ సాధించబడునదై మహోదాత్తమగురీతితో అవిష్కారము చెందుట సంభవించును. ఆస్థితియందు, ఏకామన, ఏ బాధ్యత, ఏ ప్రతిక్రియ తొంగిచూచుటకు అవకాశము లేదు, సకలమునకు ఆధారమై, సకలమును ఆవరించి, సకలములోను అధివసించి యుండు పరమేశ్వరుని దివ్యశాంతి, స్థైర్య, తేజఃశక్తుల విలసనముతో సర్వమును సాగిపోవును.

పరమేశ్వరునితోడి ఏకత్వసాధనలో, పైన చెప్పినంతటి పరమోన్నత స్థాయికి మనము చేరుకొనకముందు గూడ, ఆ పరమసంకల్పమునకు చెందిన విశేష మేదేనియొక విధాయకమైన ప్రేరణగాను, ఈశ్వరాదిష్టమైన ప్రవృత్తిగాను మనలో అభివ్యక్తమగుట కవకాశమున్నది. అట్టి సందర్భములో మనము స్వచ్ఛందమైన స్వయంనిర్ణాయక శక్తివిలసనముతో పనిచేయనేర్తుము. మనకార్యము యొక్క ఆంతర్యమును, లక్ష్యమునుగురించిన పూర్ణజ్ఞానము ఆ కార్యానంతరమున మాత్రమే మనకు కలుగును. లేక, కార్యప్రవృత్తికి ప్రేరణము బుద్ధియందు గాక హృదయమునందు, శరీరమునందు ఒక విధమగు అంతఃస్ఫురణముతో కలుగుటయు కలదు. ఇచట ఒకవిధమైన చూపు లేకపోలేదుగాని, అది విస్పష్టమైన పూర్ణజ్ఞానముకాదు. ఒకవేళ అట్టి జ్ఞానము కలుగుచోనది తరువాత కలుగవలసినదే. కాని, పరమసంకల్ప మొకొక్కప్పుడు, ఒక తేజోమయమైన ఆదేశముగానో, లేక మన సంకల్పములోనికి భావనలోనికి కర్తవ్యమును గురించిన సమగ్రస్ఫూర్తి, లేక ఎడతెగని ప్రవాహరూపస్ఫూర్తిగానో, లేక ఊర్ధ్వమునుండి వచ్చి క్రింది విభాగములచే అప్రయత్నముగ నెరవేర్పబడు నిర్దేశముగానో అవతరించుట కూడ జరుగుచుండును, యోగము అపరిపూర్ణ స్థితిలోనున్నప్పుడు, కొన్ని కార్యములు మాత్రమే ఈ పద్ధతిలో జరుగుట కవకాశమున్నది. లేక, సాధకుడొక మహో

దాత్త జ్ఞానసంస్థితిలో నుండెడి సందర్భములలో మాత్రమే ఈవిధమైన కార్యాచరణ మాతనికి అలవడవచ్చును. యోగము పరిపూర్ణస్థితి నందికొనినప్పుడు మాత్రము సకల కర్మయు నిట్టిలక్షణము కలదిగనే విరాజిల్లును.

ముఖ్యముగా మూడుదశలను ఈ సాధన పురోగతియందు మనము గుర్తింపవచ్చును. వ్యష్టిసంకల్పము అప్పుడప్పుడుగాని, లేక తరుచుగా గాని తనకంటె అతీతమగు పరమసంకల్పముచే, ఇచ్ఛాశక్తిచే ప్రదీప్తమై ప్రేరేపించబడుట మొదటి దశ. వ్యష్టి సంకల్పమునకు మారుగా పరమసంకల్ప ప్రవృత్తి నిరంతరముగా ప్రవర్తింపసాగుట రెండవ దశ. వ్యష్టి సంకల్పము పూర్తిగా ఆ దివ్యశక్తితో ఏకత్వమును పొంది దానిలో లీనమైపోవుట మూడవదశ మొదటి దశలో మన మింకను మన బుద్ధిచే, మన హృదయముచే, ఇంద్రియములచే పరిపాలించబడు చుందుము. దివ్యప్రేరణము కొరకు, మార్గదర్శిత్వము కొరకు అన్వేషణము సాగించుచు నిరీక్షణము చేయవలసియుండును. కాని, వాటికవి సర్వదా లభించు ననుటకు వీలులేదు. రెండవదశ యందు మానవబుద్ధికి బదులుగా ఆధ్యాత్మికమైన దీప్తబుద్ధి, లేక స్ఫురితబుద్ధి పనిచేయును. బహిః ప్రవృత్తిగల మానవ హృదయమునకు బదులుగా ఆంతరంగికమైన చైత్యహృదయము పనిచేయును. మామూలు ఇంద్రియములకు బదులుగా స్వార్థరహిత విశుద్ధ ప్రాణశక్తి పనిచేయును. మూడవ దశయందు మన మీ ఆధ్యాత్మికబుద్ధిని గూడ అతిక్రమించి పైకిపోయి అతిమానస భూమికలకు చేరుకొందుము.

బంధవిముక్త కర్మాచరణ ప్రవృత్తికి గల ప్రధాన లక్షణము ఈ మూడు దశలలోనూ ఒక్కటియే. - అహంకారముద్వారా, అహంకారముకొరకు గాక, పరమపురుషుని ఇచ్ఛానుసారముగా, అతని భోగముకొరకే ప్రకృతి కార్యాచరణము స్వచ్ఛందముగా కొనసాగును. ఉన్నతస్థాయిలో నియ్యది వ్యష్ట్యాత్మద్వారమున అభివ్యక్తమగుచు, ప్రకృతిచే ఎరుకతో కార్యరూపము ధరింపజేయబడు సర్వాతీత పరతత్త్వపు సత్యధర్మమే యగును గాని వేరు కాదు. ఇందు అవర జ్ఞానముతో తడబడుచు వికృత రూపమున బనిచేయు మన అవరప్రకృతికి సంబంధించిన మనక చూపునకు, విపరీత ప్రవృత్తికి ఏ విధమైన అవకాశ

మరెడదు. అంతయు సర్వాతీత, సర్వగత జగజ్జనని సర్వజ్ఞత్వ విలసనమే. పరమేశ్వరుడు తనను, తన అఖండ జ్ఞానమును, నిత్యచైతన్యమును అజ్ఞాన పూర్వక ప్రకృతిశక్తియందు మరుగుపరచుకొని, ఆ ప్రకృతిశక్తిచేత అహంకార రూపములో వ్యష్టాత్మ స్వకీయానుమోదముతో ప్రబోధింపబడుటకు అవకాశము కల్పించినాడు.

ఒక ఘనతరాశయముకొరకు, స్వచ్ఛతరమైన ఆత్మజ్ఞానోపలబ్ధి కొరకు మసక వెలుగులో మానవు డొనరించు అసమగ్ర ప్రయత్నముల సందర్భములో పైతము తరముగా ఈ అవరప్రకృతి కార్యకలాపము ప్రబలముగా కొనసాగు చునేయుండును. ప్రకృతి మనకో కొనసాగించుచు వచ్చిన పూర్వప్రవృత్తులయు, పూర్వకల్పనలయు, చిరకాలముగ వేరుతన్నుకొనియున్న సంసర్గములయు ప్రాబ ల్యము కారణముగా, సంసిద్ధికొరకై మనము చేయు మానవ ప్రయత్నముల విఫలమగుటయు, లేక కుంటిగా సాగుటయు జరుగుచున్నది. మన అవరజ్ఞానము కంటెను, అవరశక్తికంటెను ఘనతరమైన జ్ఞానము, శక్తి మన యీ అజ్ఞానావరణ మును భేదించి, మన వ్యష్టిసంకల్పమును స్వయముగా చేపట్టి నడపజాలినగాని, ఈ ప్రయత్నము ఉన్నత శిఖరారోహణముతో విజయవంతమై నెగడనేరదు. మన మానవసంకల్పము తప్పుదారిలో ప్రవేశపెట్టబడి తిరుగాడుచూ పరమసంకల్ప శక్తినుండి వేరైపోయిన యొక కిరణము. ఈ యవరప్రవృత్తిలోనుండి ఉచ్చతర తేజస్సులోనికి, స్వచ్ఛతర శక్తివిలసనములోనికి నెమ్మదిగా ఆవిష్కారము పొంద నగు కాలమే సంసిద్ధికై శ్రమించు సాధకుడు దాటవలసియున్న మృత్యుచ్ఛాయా పథము.

పెక్కు విషమపరీక్షలు, బాధలు, దుఃఖములు, చీకటులు, తడబాటులు, పొరపాటులు, పతనములతో మనల నుక్కిరిబిక్కిరి యొనర్చెడి భయంకర మార్గమిది. దీని బాధలు తగ్గించుకొనుచు దివ్యానందముతో మనము దీనిని దాట వలెననిన, శ్రద్ధ ఆవశ్యకము. లోనుండి ఆవిర్భూతమగు జ్ఞానప్రాబల్యమునకు మనస్సు అంతకంతకు అధికముగా విధేయమైపోవుట ఆవశ్యకము. అన్నిటికంటె ముఖ్యముగా, నిక్కమైన ఆకాంక్ష, తడబాటులేక సరియైన మార్గములో ప్రతికరణ

శుద్ధిగ కొనసాగుసాధన ఆవశ్యకము. అధైర్యమునకు తావీయని హృదయముతో, తడబాటు లేకుండ యోగము ననుష్ఠించ వలసినదని గీత బోధించుచున్నది. ప్రయాణములో మొదట మనము ఆంతరంగిక వైషమ్యములతోడను, బాధల తోడను నిండారిన దుస్సహవిషమునే కుత్తుకబంటిగా గ్రోలవలసియుండును, కాని, చిట్టచివరకు మనకీ పాత్రికయందు అందబోవునది అమృతత్వము యొక్కయు, దివ్యానందము యొక్కయు మధురసపాన మాధుర్యమే.

—o—

# అధ్యాయము 9

# సమత అహంకార నిర్మూలనము

ఈశ్వర సంకల్పమునకు మన సకలసత్తను, సకలప్రకృతిని సమర్పణము గావించవలెననిన, సమగ్రమైన ఆత్మనివేదనము, సంపూర్ణమైన సమత, సడలని దీక్షతో అహంకార నిర్మూలనము, అజ్ఞానపూర్వకమైన ప్రవృత్తిఘోరణులనుండి మనయందలి ప్రకృతికి పరివర్తనపూర్వకమగు విమోచనము,— ఈ సోపానముల మీదుగా అద్దానిని సాధింపవలసియున్నది. ఎట్టి మినహాయింపునకూ అవకాశము లేని నిక్కమైన ఆత్మార్పణముగా వెలయవలసియున్న సర్వసమర్పణమది. ఇందుకు మెట్టమొదటగా గుదురవలసినది మన కార్యకలాపములందు ఆత్మనివేదనాత్మకమగు భావసమగ్రత, మనయందును, సకలప్రాణులయందును, విశ్వమున కొనసాగు సకల కార్యకలాపములందును సన్నిధిచేసియుండి మరుగుగానున్న దివ్యశక్తియగు పరమునకు యజ్ఞవిధిగా సకలకర్మను సమర్పణచేయుటకు ఎడతెగని సంకల్పము మనలో మొదట ఉదయించవలెను. పిమ్మట అది మన సత్తయందంతటనూ బాగుగా ఇంకిపోయిన అక్కరయై దీపించవలెను. చివరికది. మనలో అప్రయత్నముగా ఎరుకతో సచేతనమై కొనసాగు స్వతస్సిద్ధమగు నలవాటుగా పరిణమించవలెను.

జీవితమే ఈ యజ్ఞమునకు బలిపీఠము. మనముచేయు కర్మలే బలిసమర్పణములు. ఇవి సమర్పింపబడు దైవము, మన మింకనూ సాక్షాత్తుగా దర్శించి తెలిసికొనకపోయిననూ, మన భావనయందు తోచునట్టియు, లేక ఈషణ్మాత్రముగ ద్యోతకమగునట్టియు సర్వాతీత, సర్వగత, దివ్యసాన్నిధ్య దివ్యశక్తిస్వరూపుడు. ఈ యజ్ఞమునకు,— ఈ ఆత్మనివేదనమునకు,— ఇరుపార్శ్వములు కలవు. ఒకటి కేవలకర్మ, రెండవది ఆ కర్మకు ఏడుగడయై వెలయు భావన. మన చూపు, మన

ఆలోచన, మన అనుభవము,- వీటన్నిటియందును యజ్ఞేశ్వరుడగు పరముని ఆరాధనా రూపముగా ఈ భావన దీపించవలసియున్నది.

కేవల కర్మ మొదట మన అజ్ఞానస్థితియందు, సాధ్యమైనంతలో మనము ద్యోతకము చేసుకోగలిగినంత వెలుగు ననుసరించి నిర్ణీతమగుచుండును. నిర్వర్తించ బడవలసినదిగా దేనిని మనము భావింతుమో అదియే ఆ కర్మ. అది మనము కర్తవ్యదృష్టితో రూపొందించుకొన్నది కావచ్చును. ఇతరులకు, ప్రపంచమునకు ఏది శ్రేయస్కరమని మనము భావింతుమో అద్దానినిబట్టి నిర్ణీతమైనది కావచ్చును. సకల కర్మలకు ప్రభువగు పరమేశ్వరుని మన మింకనూ తెలిసికొనకున్ననూ, ఆయనయందు విశ్వాసము కలిగియున్నవారమై, ఆయన ప్రతినిధిరూపమున మనము భావించునట్టియు, మనకంటె జ్ఞానియై మనము గురువుగా స్వీకరించినట్టియు వేరొకరి నిర్దేశానుసారముగా అనుష్ఠితమగునది కావచ్చును. ఏవిధముగా రూపొందినదైననూ, దాని మూలసూత్ర మొక్కటియే. కర్మయజ్ఞపు ముఖ్యలక్షణము అందు ద్యోతకము కావలెను. మన కర్మల ఫలితమునెడ ఆసక్తిని పూర్తిగా వదలుకొనుటయే ఆ ముఖ్యలక్షణము. కర్మఫలమునకై మనము శ్రమించుట జరుగుచునే యుండును. కాని, ఆ ఫలమునందు ఆసక్తి మాత్రము పూర్తిగా వర్జనీయము.

ఏలయన,—ఫలాపేక్షతో మనము కర్మచేయుచున్నంతకాలము, మనము సమర్పించు యజ్ఞబలి పరమేశ్వరునకు గాదు, మన అహంకారమునకు. కాదని మన భావన కావచ్చును. కాని, అట్లు భావించుట మనలను మనము వంచించుకొనుటయే. పరమేశ్వరునిగురించిన మన భావన, కర్తవ్యమునుగురించిన మన ఆశయము, తోటి ప్రాణులయెడ మన సానుభూతి, ఇతరులకుగాని ప్రపంచమునకుగాని, ఏది శ్రేయస్కర మనుదాని విషయములో మన అభిప్రాయము, కడకు మన గురువునెడ మనము చూపు విధేయత,—ఇవి అన్నియుగూడ ఇట్టి సందర్భములో మన అహంకారిక వాంఛా పరితృప్తికొఱకై ధరించిన మాయముసుగులే యగును. మన ప్రకృతినుండి అహంకారమును పూర్తిగా పెకలించివేయవలసిన అవసరమునుండి తప్పించుకొనుటకై మనము కల్పించుకొను మిథ్యావాదరూపమైన అవరోధములుగా అవి పరిణమించును.

యోగసాధనయందలి ఈ దశయందు,—యోగసాధనయం దంతటనూ గూడ,—అహంకారికమైన యీ ఆసక్తివిశేషము శత్రుప్రాయమైనది. ఈ శత్రువు మనలో తలయెత్తకుండుటకు నిర్నిద్రజాగరూకతతో మనము నిత్యమూ కడు సావధానులమై యుండవలయును. మనలో ఈ శత్రువు నడయాడుచు పలురకాలమారు వేషములు ధరించుచుండినంతమాత్రమున మన మధైర్యము చెందవలసిన పని లేదు. కాని, వాని మారువేషము లన్నింటినీ మనము జాగరూకులమై కనిపెట్టుచూ, వాని ప్రభావమును త్రోసిపుచ్చుటలో కడు నిర్దాక్షిణ్యముగా ప్రవర్తింప నేర్చియుండవలయును. "కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన,"—"కర్మలు ఆచరించుటయందే నీ కధికారముగాని ఎట్టిసందర్భములలోనూ వాటి ఫలములపై నీ కధికారము లేదు," అనెడి గీతా విధివాక్యము ఈ విషయములో చక్కని ప్రబోధము కల్పించుచున్నది. సకల కర్మలకు ప్రభువగు పరమేశ్వరునకు మాత్రమే కర్మఫలము చెందియున్నది. మన పనియెల్ల, శ్రద్ధాపూర్వకమైన కర్మద్వారమున విజయసిద్ధికై తగు ప్రయత్నముచేసి, విజయము సిద్ధించునెడ దానిని పరమేశ్వరున కర్పించుటయే.

పిమ్మట, కర్మఫలమునెడ ఆసక్తిని వదలిపెట్టినట్లుగానే కర్మయెడ ఆసక్తిని గూడ మనము వదలిపెట్టవలెను. మనముచేయు కర్మను వదలి దానికి బదులుగా వేరొక కర్మను చేపట్టుటకుగాని, ఒకవేళ సకల కర్మలను వదలివేయవలెనన్నదే పరమేశ్వరుని విస్పష్టాదేశమైనచో ఆ విధముగానే చేయుటకుగాని, ఏ క్షణములో నైనను మనము సంసిద్ధులమై యుండవలెను. లేనియెడల, మనము చేయుపనిని పరమేశ్వరునికొరకుగాక, ఆ పనియందు మనకుగల సంతృప్తి, సంతోషము కొరకు, క్రియాశీల ప్రకృతికుండెడి ప్రవృత్తిలాలసకొరకు, మన అభీష్టములు నెరవేరుటకొరకు చేయువారమగుదుము ఇవన్నియు అహంకారము నిలువద్రొక్కు కొను స్థానములే. మన సామాన్యజీవితగతికి ఎంత అవసరములుగా తోచిననూ వీటిని మన ఆధ్యాత్మిక చైతన్యాభివృద్ధిని సాధించు సందర్భములో విసర్జించి, వీటికి బదులుగా వీటి దివ్యప్రతిమూర్తులను మనలో ప్రతిష్ఠించుకోవలసియున్నది.

అజ్ఞానపూర్వకమగు ప్రాణకోశ సంబంధమైన సంతృప్తికి, సంతోషము నకు బదులు, భగవదున్ముఖమగు అపౌరుషేయ దివ్యానందము మనలో తొణికిస లాడవలసియున్నది. అట్లే, క్రియాశీల ప్రకృతికి సంబంధించిన ప్రవృత్తిలాలసకు బదులుగా మహోల్లాసభరితమైన దివ్యశక్తిప్రేరణము మనలో ప్రకటితము గావ లసియున్నది. అదేవిధమున, మన అభీష్టములు నెరవేరుటగాక, ఒక విముక్తాత్మ యొక్కయు, అద్దాని దివ్యప్రకృతి యొక్కయు స్వాభావిక సత్యధర్మ ప్రవృత్తి ద్వారమున ఈశ్వరుని దివ్యసంకల్పము మనలో నెరవేరవలసియున్నది.కట్టకడకు, మన హృదయములోనుండి కర్మఫలమునందలి ఆసక్తిని, కర్మయందలి ఆసక్తిని గూడ మనము పారద్రోలివైచిన విధముగానే, కర్మలు చేయునది మనమనే కర్తృ త్వాభిమానమును సైతము విసర్జించవలసియున్నది. మనము వదల్చుకోవలసి యున్నవాటిలో నిది చిట్టచివరిది. సకల కర్మలకు నిజమైన కర్త ఈశ్వరుని దివ్య శక్తియే యనునది మన లోపలను, పైనను, అనుభవపూర్వకముగా మనము తెలియగలిగి యుండవలెను.

*　　　　*　　　　*

కర్మయెడ, కర్మఫలమునెడ ఆసక్తిని విడనాడుట మన మనస్సునందును, ఆత్మయందును సర్వసమగ్రమగు సమతాసాధనకు సంబంధించిన విస్తృతోద్య మమునకు ప్రారంభము. సంపూర్ణమైన ఆత్మసంస్థితి మనయం దేర్పడవలెననిన, ఈ సమతయందు మనము సుప్రతిష్ఠితులము గావలెను. ఏలయన, సకల కర్మలకు ప్రభువగు నీశ్వరుని యారాధనకు మనలోను, సకల వస్తువులలోను, సకల సంఘ టనలలోను ఆయనను విస్పష్టముగా గుర్తించి సమ్మోదముతో గ్రహింపనేర్చుట అత్యంతావశ్యకము. సమత యీ ఆరాధనాప్రవృత్తికి చిహ్నము, సమతారూప మైన యీ ఆత్మభూమియందే నిక్కమైన బలిసమర్పణము, ఆరాధనము జరుపు టకు వీలగును.

ప్రభువు సకల ప్రాణులయందును సముడై యున్నాడు. మనకు ఇతరులకు, జ్ఞానులకు అజ్ఞానులకు, మిత్రునికి, శత్రువుకు; మానవునికి జంతువుకు, పుణ్యా త్మునికి పాపాత్మునికి నడుమ ఎట్టి ముఖ్య విభేదములను మనము చేయరాదు. ఎవ

రినీ మనము ద్వేషించగూడదు. నిరసించగూడదు. ఎవరియెడలను విముఖులము కాగూడదు. ఏలయన, అందరిలోనూ మారువేషమున తన యిచ్ఛానుసారముగా అభివ్యక్తమైయున్న అద్వయుడగు నా పరమేశ్వరునే మనము దర్శింపవలెను. ఒకరి యం దాయన కొంచెముగా అభివ్యక్తము గావచ్చును. వేరొకరియందు అంత కంటె హెచ్చుగా అభివ్యక్తము గావచ్చును. తదితరులయందు మరుగుపడి పూర్తిగా వికృతరూపమున గనుపడవచ్చును ఇదంతయు ఆయన ఇచ్ఛ ననుసరించియు, వారియం దేరూపము తాను గైకొని, ఏ కర్మలు వారి ప్రకృతి ననుసరించి తా నొనర్చుట ఉత్తమమో అద్దానిని గురించిన ఆయన జ్ఞానము ననుసరించియు జరుగుచుండును.

సకలము మన ఆత్మయే. ఒకే ఆత్మ అనేక రూపముల గైకొన్నది. ద్వేషము, అసహ్యము. నిరసనము. వైముఖ్యము. బంధనము, ఆసక్తి, అభీష్టము,- ఇవన్నియు ఒక దశలో సహజములు, ఆవశ్యకములు, అనివార్యములే. మనలో ప్రకృతి ఏమి నిర్వహింపదలచుకొన్నదో అద్దానికవి సహాయభూతము లగును. కాని, కర్మయోగికి మాత్రము అవి అవిద్యాసంబంధమైన అవశేషములు, అవరోధములు, గతివిశేషములే యగును. సాధనలో అతడు ముందుకు పోయిన కొలది అవి యతని ప్రకృతినుండి క్రమముగా రాలిపోవును. శైశవావస్థలోని ఆత్మకు వికాసదశయం దవి ఆవశ్యకములే. కాని, దివ్యసంస్కృతి నలవరించు కొను సందర్భములో పరిణతాత్మనుండి యవి రాలిపోవలసియేయుండును.

భగవత్ప్రకృతియొక్క మహోన్నతస్థాయిని మనము అందుకోవలసియున్నది. ఆ స్థాయియందు, వజ్రకఠినమైన- వినాశాత్మకముగూడ నగు,-తీవ్రత మనలో ఉండిన ఉండవచ్చునుగాని ద్వేషమనునది యుండరాదు. దివ్యత్వలక్షణోపేతమైన వక్రోక్తి యుండదగునేగాని నింసనభావ ముండరాదు. విస్పష్ట దర్శనముతో కూడినదై, ప్రశాంతము, ప్రబలమునగు నిరాకరణమున కచట తావుండునే గాని, అసహ్యభావముతో కూడిన తిరస్కారమునకు గాదు. మనము వినాశమొందింపవలసినదాని విషయములలోగూడ, అసహ్యించుకొనుట మనకు తగదు. ఆ వినాశకృత్యములో, నిత్యుడగు పరమేశ్వరుని ప్రచ్ఛన్నమైన తాత్కాలికచేష్టనే మనము అసందిగ్ధముగా గుర్తింపగలిగియుండవలెను.

సకల వస్తువులను ఒకే ఆత్మయొక్క అభివ్యక్తి విశేషములే కావున, విరూపులయెడ సురూపులయెడ, వికలాంగులయెడ సౌష్ఠవగాత్రులయెడ, ఘనుల యెడ నీచులయెడ, ప్రీతికరమైనవానియెడ, అప్రీతికరమైనవానియెడ,—అంతటనూ ఆత్మయందు సమతతోనే మనము ప్రవర్తింపవలెను. ఇచ్చటకూడ ద్వేషము, నిరసనము, విముఖత్వము అనునవి ఉండవు సకల వస్తువులను, వాటి నిజస్వభావమును, వాటి యథానిర్దిష్టస్థానమును తిలకింపగల సమదృష్టిమాత్రమే యుండును. ఏలయన, సకల వస్తువులను ఈశ్వర సంబంధమైన ఒకానొక సత్యమును ఒకానొక శక్తివిశేషమును, గర్భితలక్ష్యమును, అభివ్యక్తమొనర్చుటయో లేక మరుగుపరచుటయో, వికాసము నొందించుటయో లేక వికృతపరచుటయో చేయుచున్నవని మన మపుడు తెలిసికొనగలుగుదుము. అవి యీ పనులను తమ ప్రకృతియొక్క వికాసక్రమములో సద్యఃస్థితిగతులమేరకు సాధ్యపడినరీతివి తమకు నిర్దిష్టమైన సన్నివేశములందు, ఇప్పటి వస్తుసముదాయ సమష్టికినీ, కడకు సాధింపవలసిన సంసిద్ధికినీ అవసరమైన విధముగా, యథాశక్తితోడను, తప్పవిసరి యగు లోపములతోడను నిర్వర్తించుట జరుగుచున్నది.

ఏ సత్యమును అవి యీ రీతిగా అభివ్యక్త మొనర్చుటయు లేక మరుగు పరచుటయు, వికాసము నొందించుటయు లేక వికృతపరచుటయు సంభవించు చున్నదో ఆద్దానిని మనము,—ఈ తాత్కాలికాభివ్యక్తి మరుగున ఉన్నదానిని,—అన్వేషించి కనుగొనవలసియున్నది. అట్లొనర్చినప్పుడు, బాహ్యరూపములకు భ్రాంతులముగాక, అభివ్యక్తియందు కాననగు లోపములచేతను వికారములచేతను విక్షిప్తులముగాక, ఈ మాయముసుగుల వెనుక సదా, అమలిన స్వచ్ఛ సుందర పూర్ణ స్వరూపుడై తేజరిల్లు పరమేశ్వరుని మన మారాధించ సమర్థుల మగుదుము. సకలమూ మారవలసియుండు ననుమాట నిజమే. విరూపమునుగాక దివ్య సౌందర్యమునే మన మామోదింపవలసియున్నది. అపరిపూర్ణతతో మన మాగిపోక పూర్ణత్వసిద్ధికొరకే పాటుపడవలసియున్నది. కాని, ఏ పని మనము చేసినను ఆయ్యది ఆధ్యాత్మికమైన అవగాహనతో, జ్ఞానదృష్టితో చేయుట అత్యంతావశ్యకము. ఆ యీ వస్తుజాతమునకు సంబంధించిన మానవధర్మప్రమాణములుగాక, దివ్యశ్రేయము, దివ్యసౌందర్యము, దివ్యసంసిద్ధి, దివ్యానందము మాత్రమే మన కనుసరణీయములు గావలెను. మనము సమతానిష్ఠులము గానిచో, అవిద్యయే

మనలనింకనూ వెంటాడుచున్నదనుట కది గురుతు. సమత లేనిచో మనము దేనినీ సరిగ అవగాహన చేసికొనజాలము. సమతలేని మన ప్రయత్నములు పూర్వపు దోషస్థితిని నిర్మూలించి క్రొత్త దోషస్థితిని కల్పించుకొనుటే యగును. ఏలయన, దివ్యప్రమాణములకు బదులుగా, మన మానవ బుద్ధియొక్కయు, కామాత్మయొక్కయు ప్రమాణములను మన మనుసరించుచుండెడి పరిస్థితి యిది.

సమత యనిన నొక క్రొత్త అజ్ఞానమును, గుడ్డితనమును కల్పించుకొనుట గాదు. దృష్టి కొకవిధమైన బూడిదరంగు వెలుగు సంతరించుకొని సకలవర్ణచ్ఛాయలను తుడిచివేయుటయునూ గాదు. భేదజ్ఞాన మచటకూడ కలదు. అభివ్యక్తియందలి వైవిధ్య మచటసైతము గుర్తించబడుచునే యుండును. ఈ వైవిధ్యమును మనము కడుచక్కగా గ్రహింపనేర్తుము గూడ. ఖండదృష్టితో తప్పుదారిని ప్రవర్తించు రాగము ద్వేషము, పురస్కారము తిరస్కారము, సామరస్యము వైమనస్యము, సుముఖత్వము విముఖత్వము మొదలైనవానిచే కంటికి మబ్బు ఆవరించినప్పటికంటె ఎంతో సక్రమమైన పద్ధతిలో ఈ వైవిధ్యగ్రహణశక్తి మనలో పెంపొందును. కాని యీ వైవిధ్యమునకు వెనుక, దాని యంతరమున నివసించి యున్న పరిపూర్ణుని, అక్షరుని మనము నిత్యమూ దర్శించుచునేయుందుము. ప్రతి అభివ్యక్తి విశేషమునకు ఏ వివేకవంతమైన ప్రయోజనము కలదో, ఏ దివ్యావసరమును పురస్కరించుకొని ఆ అభివ్యక్తి జరుగుచున్నదో స్ఫురణ పూర్వకముగ మనకు తెలియనగుచునే యుండును. ఒకవేళ అది అట్లు స్ఫురించక మరుగుననే యుండు పక్షములో అద్దానినిగురించిన దృఢవిశ్వాసమైననూ మనలో పెంపొంది యుండును. మన మానవ ప్రమాణముల ననుసరించి చూచినచో ఆ అభివ్యక్తి సమగ్రము సామరస్యపూర్వకము, లేక అసమగ్రము అపరిపక్వము, లేక అన్ృతము అశివము,—ఇట్లీవిధముగా గన్పట్టిననూ గన్పట్టవచ్చుమగాక :

ఇదేరీతిని జయాపజయములు, మానావమానములు, కీర్త్యపకీర్తులు,సౌభాగ్యదౌర్భాగ్యములు మొదలు సుఖదుఃఖకర సంఘటన లన్నిటియెడలను గూడ ఆత్మయందు మనస్సునందు ఒకే సమభావము మనయందు నెలకొనియుండును. ఏలయన, సకల కర్మలకు, కర్మఫలములకు ప్రభువైన ఆ పరమేశ్వరుని సంకల్పమునే అన్ని సంఘటనలలోనూ మనము దర్శించుచుందుము. క్రమవికాసపూర్వక

మైన పరమేశ్వరాభివ్యక్తి యందలి ఒక విన్యాసవిశేషముగామాత్రమే ప్రతిసంఘ టనయు మనకు పొడగట్టును. చూడనేర్చినచో చూపుగలవారికి ఆ పరమేశ్వరుడే, వివిధశక్తుల క్రీడయందును, వాటి ఫలితములయందును, అట్లే వివిధవస్తులయం దును, ప్రాణులయందును తనను దా నభివ్యక్తము గావించుకొనుచుండును.

ఒక దివ్యసాఫల్యసిద్ధి దెసకే సకల వస్తుజాతము ప్రయాణించుచున్నది. ప్రతి అనుభవము,–సుఖము దుఃఖము, తృప్తి, అతృప్తి,–అన్నియు ఈ జగ దుద్యమ నిర్వహణమునం దావశ్యకములైన గతివిశేషములే. వాటిని అవగాహన మొనర్చుకొని బలపరచుటయే మనము చేయవలసిన పని. తిరుగుబాటుచేయుట, తెగనాడుట, గోలయొనర్చుట,–ఇవి మన అసంస్కృత, అజ్ఞానప్రవృత్తుల లక్ష ణము. తిరుగుబాటునుదానికి జగల్లీలలో తదితరములన్నిటికివలెనే ఉపయోగము లను కలవు. తగిన సమయము, సన్నివేశము ఏర్పడినప్పుడు, ఈశ్వర నిర్దిష్ట మైన పురోగతికి తిరుగుబాటు అవశ్యకము, సహాయకము, విధాయకము గూడ నగుచున్నది. కాని, అజ్ఞాన పూర్వకమైన తిరుగుబాటు ఆత్మయొక్క శైశవ దశకు, అపరిపక్వమైన కౌమారదశకు సంబంధించినది. పరిపక్వస్థితికి వచ్చిన ఆత్మ దేనినీ తెగనాడక, అవగాహనమొనర్చుకొని స్వాయత్తము గావించుకొను టకు ప్రయత్నించును. గోల యొనర్చుటకు బదులు స్వీకరించి పరిస్థితిని మెరుగు పరచుటకు, విర్దుష్టము గావించుటకు పాటుపడును. ఆంతరంగికముగ తిరుగుబా టొనర్చుటకు మారు విధేయమగుచు, పరివర్తన పూర్వక సాఫల్య సిద్ధికి కృషి సల్పును.

కావున పరమేశ్వర హస్తములనుండి సకల వస్తువులను సమభావమున స్వీకరించుటకు మనము సంసిద్ధులమై యుందుము. అంతిమ దివ్యవిజయముసిద్ధించు ఘడియ వచ్చుపర్యంతమూ జయమునువలె అపజయమును గూడ నొక మజలీగా పరిగణించి గ్రహింపనేర్తుము. దైవ నిర్ణయానుసారముగా ఎంతటి తీవ్ర దుఃఖ ములు, బాధలు, సంకటములు సంప్రాప్తమైనను, మన ఆత్మలయందు, మనస్సు లయందు, దేహములయందు ఏమాత్రమూ చలింపక నిలువబడుదుము. అట్లే ఎంతటి ప్రబల సుఖ సంతోష సమయములలోనైననూ ఉబ్బితబ్బిబ్బుకాకుండ మెలగనేర్తుము. మహోన్నత స్థాయిని యీరీతిగా మనము చిక్కబట్టుకొని మన

ప్రయాణములో సకల వస్తువులనూ సమానమైన స్థిరభావమున స్వీకరింపగలుగు దుము. పిమ్మట ఇంతకంటెగూడ ఉదాత్తస్థితి నందుకొన సమర్థులమై, పరమము, శాశ్వతమైనమునైన దివ్యానందములోనికిసైతము ప్రవేశము గావింతుము.

*　　　　*　　　　*

సుదీర్ఘమైన కఠిన పరీక్షలకు నిలువదాకి ఓపికతో ఆత్మసంయమాభ్యాస మొనర్చినగాని ఈసమత అలవడనేరదు. కామనఅనునది మనలో బలముగానున్నం తకాలము ఈ సమత నిశ్చలత్వము కుదిరిన సమయములలోను, కామనకు అలసట యేర్పడిన సందర్భములలోనూదక్క మనకు బొత్తుగా అలవడనే అలవడదు. అప్పు డైననూ అయ్యది ఒక విధమగు జడప్రాయమైన ఔదాసీన్యము, కామనకు గలిగిన తాత్కాలిక పరాఙ్ముఖత్వమే యగునుగాని, నిక్కమైన నిశ్చలత్వము,ఆధ్యాత్మికమైన ఏకత్వభావన కానేరదు అదియునుగాక, ఆత్మసమర్పణము పెంపొందించుటకై కొన సాగెడు ఈ సాధనక్రమములో కొన్ని దశలుకలవు. సాధారణముగా మనము ప్రారంభదశలో సహనము నభ్యసించవలసియుండును. ఏలయన, విషయస్పర్శ లన్నింటినీవి దురొక్కని సహించి, జీర్ణించుకొనుటను మనసు నేర్చుకొనవలెను. విముఖత కలిగించెడి విషయముల జూచి బెదరక, సుఖదాయకములై ఆకర్షణీయము లగువానికొరకు ఆతురతతో పరుగులెత్తక, ఉభయమునూ అంగీకరించి ఎదుర్కొని సహించి జయించుట మనలోని ప్రతిఅణువునకు అలవడునట్లు చేయుట అత్యావ శ్యకము.

వ్యక్తిగతముగ మనకు సంబంధించిన స్పర్శలనేగాక మన చుట్టునుగల లోకములతోడి మన నానుభూతివలన, సంఘర్షణలవలన ఏర్పడిన స్పర్శలన్నిం టినిసైతము సైరణచేయగల దిట్టతనము మన కలవడవలెను. తోటి మానవులయు, వివిధ వస్తువులయు, శక్తులయు ప్రవృత్తుల ప్రాబల్యాను మనపై ప్రసరించు నప్పుడును, దేవతల ఒత్తిడులు, అసురుల తాకిడులు మనకు కలుగునప్పుడును, ప్రశాంతముగా వాటిని మన మీ దశయందు సహింపగలుగుదుము. ఆత్మయొక్క అనంతానుభవ మార్గములందు మనలోనికి వచ్చిపడు సమస్తమును మన మెదు ర్కొని, అచల ప్రతిష్ఠములై యొప్పారు మన ఆత్మజలధులందు విలీనమొనర్చ

కొననేర్తుము. సమతా సాధనలో సుఖదుఃఖములకు వికారము చెందకుండు విరాగ దశ యిది. కదు ప్రాథమిక దశయేయైనను ధీరత్వ లక్షణోపేతమైన దశ. కాని, శరీరమునందు, బుద్ధియందు, హృదయమునందు ప్రతిష్ఠితమగు నీ సహనము దైవేచ్ఛయెడ ఆధ్యాత్మిక విధేయతతో పరిపుష్టిని సంతరించుకొనుటగూడ అవశ్యకము. ఈ మృణ్మయ శరీరము కఠినశిక్షణతో కూడిన ధీరత్వలక్షణోపేతమైన అంగీకారముతోనే గాక, కష్టములందు సైతము ఏది ఎట్లయిననూ సమ్మతమే యనెడు భావముతోడను, ఎరుకతోడను. తన సంసిద్ధికై తనను తీర్చిదిద్దుచున్న ఈశ్వరకరస్పర్శకు విధేయమగుట యలవరచుకొనవలెను.

జ్ఞానయుతమైనట్టియు, భక్తిపూర్వకమైనట్టియు, మిక్కిలి కోమలమైనట్టియు విరాగము భగవద్భక్తునిలో నుండును. అట్టిది సాధ్యమే. స్వశక్తిపై ఆధారపడు అభక్తుని సహనముకంటె ఇది ఉత్తమము. అభక్తుని సహన సాధనలో ఈశ్వరోపకరణమగు శరీరాదికము మృదుత్వమును కోల్పోయి అత్యంత కర్కశమై రూపొందుట కవకాశమున్నది. భక్తుని సహనభావమటులగాక, వివేకప్రేమల వెలార్చుకొను బలసంపత్తి నా యుపకరణమునకు సంతరింపజేయును. గంభీరమైన స్థిరతారూపమగు నిందలి ప్రశాంతస్థితి ఆనందములోనికి అవలీలగా పరిణతిచెందును. ఏమి కానున్ననూ సమ్మతమే యనెడు భావముతో కొనసాగు నీ సహన సాధనలో చేకూరు ముఖ్యప్రయోజనము ఎల్లతాకిడులను, సంస్పర్శలను సమభావముతో నెదుర్కొనగల ఆత్మబలసంపత్తి.

ఉదాసీనతతో కూడిన ఉపేక్ష, నిష్పాక్షికత తరువాతి దశయందు ప్రాధాన్యము వహించును. ఈ స్థితియందు సాధకునియాత్మ సంతోషముతో ఉప్పొంగదు, విచారముతో కుంగదు. సంతోషమున ఉప్పొంగుట, దుఃఖముతో తల్లడిల్లుట అను ఉచ్చులతో బడకుండ అయ్యది తప్పించుకొనును. సకలవస్తువులు, వ్యక్తులు, శక్తులు తనవిగాని ఇతరులవికాని సకల యోచనలు, సంవేదనలు సంస్పర్శలు——ఇవన్నియు గూడ వీనిచే నేమాత్రము విక్షేపము చెందక నిశ్చలమై నిలువగల స్థిరభావముతో ఉన్నతస్థాయినుండి తిలకింపబడుట సంభవించును. సమతాసాధనలో నిదియొక విశాలగంభీర ప్రవృత్తి కాలరాలమై యలరారు తాత్వికదశ. కాని, ఉపేక్ష యనునది కర్మప్రవృత్తినిగాని, అనుభూతినిగాని జడభావముతో

వర్జింపుటలోనికి పర్యవసింపరాదు. అలసట, ఏవగింపు, వెగటుపనము-వీనిచే కలిగిన విముఖత్వము కాగూడదది. కోరికయెడ మొగము మొత్తుటచేగాని ఆశాభంగము వలనగాని ఏర్పడు వైముఖ్యమును కాగూడదు. అహంకారికమైన తీవ్రాశయములకు ఎదురుదెబ్బలు తగులగా కంగారుపడి అసంతృప్తిలో కూరుకొనిపోవు అహంకారపు చిడిముడిపాటు లక్షణము సైతమీ ఉపేక్షయందు కనిపించకూడదు. ఈ రకమైన వైముఖ్యలక్షణములు అపక్వస్థితిలోనుండు ఆత్మయందనివార్యముగా పొడసూపుచుండుటయు, కామప్రేరితమైన ప్రాణమయ ప్రకృతి సంరంభమును నిరుత్సాహపరచుట ద్వారా అద్దాని పురోగతి కవి ఒకవిధముగా సహాయకారు లగుచుండుటయు కలదు.

కాని, మనము సాధింపగోరు సంసిద్ధిలక్ష్య మదికాదు. విషయ స్పర్శం కతీతముగా ఉదాసీనమై (ఉత్ + ఆసీనమై) యుండు ఆత్మయొక్క సుస్థిరోన్నతియే మనము సంపాదించగోరు ఉపేక్షకు, నిష్పాక్షికతకు లక్షణమై వెలయవలసియున్నది. విషయస్పర్శలతో వ్యవహరించు సందర్భమున వాటినది ఆమోదించుటగాని, నిరాకరించుటగాని చేయుచుండినను, ఆ నిరాకరణముచే దాను విచలితమగుటయు, ఆ యామోదమునకు తాను వివశమైపోవుటయు సంభవింపదు. ప్రకృతి కార్యముల కాధారభూతమైయుండి వాటిని సంభవింపజేయుచు, వాటికంటె వేరై, స్వయంసిద్ధమైయుండు నిశ్చల, నీరవ పరమాత్మతత్త్వముతో తన సన్నిహితత్వమును, ఏకత్వమును గుర్తించుటకు మొదలిడును. విశ్వవ్యాపారమునెల్ల అతిక్రమించియుండు పరమ సత్యమునం దంతర్భాగముగా తనను తెలిసికొనుచు దానియందు తాను అంతర్లీనమగుట కుపక్రమించును. విశ్వగతికి చెందిన సుఖదాయకమైన చిరుతరంగములకుగాని, భయంకరమగుతైన ఉప్పెన కెరటాలకుగాని ఏమాత్రమూ చలింపని ఆత్మయొక్క శాంతిస్థానమును అందుకొనుటయే ఈ అతీతానుభవపు దశలో సాధనకు చేకూరెడి ముఖ్యప్రయోజనము.

ఆంతరంగిక పరివర్తనముతో కూడిన యీ రెండు దశలలో ఏ ఒకదానియందునూ స్తంభించి నిలిచిపోక రెంటినీగడచి మనము ముందునకు సాగిపోవుదుమేని, ఆధ్యాత్మికమైన మహోత్సాహముతోడను, ప్రశాంతమైన ఆనందోద్వేగముతోడను, తొణికిసలాడు మహత్తరమైన యొక దివ్య సమతాస్థితిలోనికి మనము

ప్రవేశింపనేర్తును. పూర్ణత్వమును పొందిన ఆత్మకు సహజలక్షణమై యొప్పారు మహదానందముతో నిండారినట్టి సమత అది,—సకలమూ తెలియనేర్చి సకలమునూ భుక్తపరచుకో గలుగునట్టి సమత. పరమేశ్వరునకును, జగన్మాతకును సంపూర్ణమైన ఆత్మసమర్పణానందముద్వారా ప్రాపింపవలసియున్న యీ దశ ఉత్తమోత్తమమైనది. ఏలయన, ఈ దశయందు సత్వము ఆనందసందాయకమైన ప్రభుతగా పరివర్తనము చెందును. శాంతి పరమగాంభీర్యమును సంతరించుకొని ఆనందములోనికి పర్యవసించును. దివ్యమైన స్థిరతాసంపత్తి మరింత ఉన్నతిని బొంది దివ్యకర్మ విలసనమున కాధారభూమియై విలసిల్లును.

కాని, యీ మహత్తర సంసిద్ధి చేకూరవలెననిన, వివిధ రూపములయు, వ్యక్తులయు, శక్తులయు, ప్రవృత్తులయూ ప్రవాహగతిని పైనుండి తిలకించెడి ఆత్మయొక్క ఉదాసీనత మార్పునుబొంది, సుదృఢము, సుస్థిరమునైన వినమ్రితలోనికి, ప్రబలము, ప్రగాఢమునైన ఆత్మసమర్పణములోనికి పర్యవసింపవలసియున్నది. ఈ వినమ్రత ఏమి కానున్నను సరియే యనెడు భావముతో దేనికైననూ తలయొగ్గుటగా గాక, సంతోషపూర్వకముగా దాని నామోదించుటగా విరాజిల్లును. ఏలయన, ఏదియో బాధను సహించుచుంటినను భావము, ఏదియో భారము వహించుచుంటినను భావము ఇచట నుండదు. ప్రేమ, ఉల్లాసము, ఆత్మసమర్పణానందము, వీని మేలుకలయిక ఇచట కానవచ్చును. ఇక నీ యాత్మసమర్పణమో,—ఇయ్యది మనము గుర్తించి ఆమోదించి విధేయులమై చరించునట్టి ఈశ్వరేచ్ఛకు సమర్పణము మాత్రమే కాదు, ఆ ఈశ్వరేచ్ఛయందు మనము దర్శించెడి దివ్యజ్ఞానమునకును, ఆ ఈశ్వరేచ్ఛయందు మనకు ద్యోతకమై మన మానందముతో అనుభవించెడి దివ్యప్రేమకును సమర్పణము. ఆ దివ్యజ్ఞానము, దివ్యప్రేమ వేరెవ్వరివో కాదు,—మనకు, ఈ సమస్తమునకు ఆత్మయై, పరమాత్మయై, పరమానందమున మన మైక్యము భజింపవలసియున్న పరమునికి.

మౌని సాధించెడి తాత్త్వికసమత ఐకాంతిక శక్తికి, శాంతికి, నైశ్చల్యమునకు తావలమైయుండును. అట్లుగాక, సమగ్రమైన పూర్ణానుభూతి ఆత్మకు కలిగినప్పుడు, అయ్యది స్వయంకల్పితమగు నీస్థితినుండి విముక్తమై, అనంతుడైన పరముని ఆద్యంత రహితానందపు పరమోల్లాస జలధిలోనికి ప్రవేశించును. అపుడు

మనమాస్థితియందు సకల సంస్పర్శలను మహదానంద పూరితమైన సమతతో గ్రహింప సమర్థుల మగుదుము. ఏలయన, ఆ సంస్పర్శలయందు మనకు అనశ్వర మైన దివ్యప్రేమానంద సంస్పర్శయే,—సకల హృదంతరాళములలోనూ దాగి యున్న పరమోల్లాస సంస్పర్శయే అనుభూతమగును. అనంతము, వాచామగోచ రమునైన ఆత్మానందానుభవపు కవాటములు విచ్చుకొనుటయే సర్వసమ, సర్వ గతోల్లాస లక్షణోపేతమైన యీ చరమదశ ముఖ్యప్రయోజనము.

*　　　*　　　*

కామ నిర్మూలనమునకు, ఆత్మసమత్వసిద్ధికి కొనసాగు నీ పరిశ్రమము పరిపూర్ణసాఫల్యము పొందుటకు పూర్వమే అహంతానిర్మూలనమునకు దారితీయు ఆధ్యాత్మికోద్యమ ప్రగతివిశేషము కూడ పూర్తి కావలసియుండును. కాని, ఈ మార్పులో ద్యోతకము కావలసిన అత్యంత ముఖ్యమైన లక్షణము కర్మచేయువాని యందు తాను కర్మచేయుచున్నానను భావము లేకుండుట. ఏలయన, యజ్ఞేశ్వరుడైన పరమునకు మనము కర్మఫలమును, కర్మఫలాసక్తిని వదలివేయు సందర్భములో రాజసిక కామనకు సంబంధించిన అహంతను మనము విడనాడినను, కర్మచేయు నది మనమే యనెడి అహంతను మాత్రము మనమింకనూ విడనాడియుండక పోవచ్చును. కర్మచేయునది మనమే యనియు, మనలో నుండియే కర్మప్రవృత్తి యుదయించుచున్నదనియు, దానికి అనుమతి నొసగునది మనమే యనియు,—ఈ విధమైన భావమునకు మనము వశవర్తులమైయుందుము. కర్మను ఎన్నికచేయునది, నిర్ణయించునది ఇంకనూ 'అహమే.' కర్మను నిర్వహించు బాధ్యతను వహించి దాని మంచిచెడ్డలతో సంబంధము పెట్టుకొనునదియు 'అహమే'.

వేరుతనముతో కూడిన యీ 'అహంత' ను పూర్తిగా నిర్మూలించుట మన పూర్ణయోగమందలి యొక ముఖ్యలక్ష్యము. ఏ అహంవృత్తియైనను ఒకవేళ మనలో నింకనూ కొంతకాలముపాటు నిలుపవలసియున్నచో, అది దాని ఒకానొక రూప విశేషమై, అట్టి రూపవిశేషముగా తనను తాను గుర్తెరిగి, సత్యచైతన్య కేంద్రము మనలో నావిష్కరింపబడుటతోడనే తాను అదృశమగుటకు సిద్ధమై యుండవలెను. అట్లు ఆవిష్కారము పొందెడి సత్యచైతన్యకేంద్రము ఒకే చిద్వ

స్తువుయొక్క దివ్యరూప కల్పనా విశేషము,—ఒకే సద్వస్తువుయొక్క వివిధోప కరణము. విశ్వశక్తి విలసనపు వైయక్తిక ప్రవృత్తికి, అభివ్యక్తికి ఆధారభూత మగు నీ చైతన్యకేంద్రము తన మరుగున నున్న మనలోని నిక్కమైన పురుషుని,— పరాప్రకృతియొక్క సనాతనాంశమై నిత్యమైన జీవాత్మను ('అంశస్సనాతనః పరాప్రకృతి ర్జీవభూతా',—గీత.)క్రమముగా మనలో నావిష్కరింపజేయును.

అజ్ఞానపూర్వకమైన అహంకారపు దుస్తును మన ఆత్మ క్రమముగా విసర్జించివైచెడి యీ సాధనక్రమమున గూడ పురోగమనము వివిధ దశలుగా సాగుట కలదు. ఏలయన, కర్మఫలములే కాదు పరమేశ్వరునకు చెందునవి, మన కర్మలు సైతము ఆయనకు చెందవలసినవే. మన కర్మఫలితములకు వలెనే మన కర్మలకును ఆయనయే నిక్కమైన ప్రభువు ఇది కేవలము మన బుద్ధిప్రవృత్తికి తెలియబడుటే కాదు. మన యావచ్ఛేతనకు సైతము దీని యాథార్థ్యము పూర్తిగా గోచరము కావలసియున్నది. కర్మను ఆచరించు సమయములో సైతము,— కర్మను ఆరంభించి తుదివరకు దానిని కొనసాగించు వివిధ దశలయందుకూడ,— ఆ కర్మలెంతమాత్రమూ తనవి కావనియు, అవి పరమాత్మనుండి తనద్వారా ప్రకటితము లగుచున్నవనియు సాధకుడు బుద్ధితో ఆలోచించి గ్రహించుటేకాక, ప్రత్యక్షముగా దర్శించి అనుభవింపనేర్చియుండవలెను. ఒక దివ్యశక్తి, ఒక దివ్యసన్నిధి, ఒక దివ్య సంకల్పము తన వైయక్తికప్రకృతిద్వారా పనిచేయుచున్నదనెడు ఎరుక అతనిలో నిత్యమూ దీపించుచుండవలెను. కాని, సాధన ఈ మలుపుగైకొను సందర్భములో సాధకుడు ప్రచ్ఛన్నరూపమున భ్రమింపజేయు తన అహంకారమును గాని, అవరశక్తి విశేషములనుగాని పరమేశ్వరునిగా భ్రమించి, అవ్వాని ఆదేశములను పరమేశ్వరుని ఆదేశములుగా భావించునట్టి ప్రమాదము సంప్రాప్తమగుటకవకాశము కలదు.

కానరాని విధముగా తన అవరప్రకృతి యిట్లు పొంచియుండి తనకు పైకొనుట సంభవించినపు డాతడు దానికి లొంగిపోయి, పరాశక్తికి తాను సర్వసమర్పణము గావించుకొంటినను పేరున తన స్వకీయేచ్ఛను, తన కామోద్వేగములను విస్తృతరూపమున యథేచ్ఛగా అనుభవింపజూచుట సంభవించును. ఈ ప్రమాదమును నివారించుటకు గొప్ప అంతశ్శుద్ధి కావలసియున్నది. మనకు ప్రత్యక్షముగా

తెలిసియున్న మనస్సునకేగాక, పెక్కు నిగూఢప్రవృత్తుల కాలవాలమైయుండు మనలోని ప్రచ్ఛన్న విభాగమునకు సైతము ఇట్టి అంతశ్శుద్ధి అలవడునట్లుగా మనము చేయవలసియున్నది. ఏలయన, ముఖ్యముగా నీ ప్రచ్ఛన్నవిభాగములోని మన ప్రాణమయప్రకృతియందే మన దిద్దుబాటుల కేమాత్రమూ లొంగక యథేచ్ఛగ ప్రవర్తించెడి మాయనటకుడున్నాడు. కామమును విడనాడుటలోను, సకల సంఘటనలయెడ, సకల కర్మప్రవృత్తులయెడ ఆత్మయందు సుస్థిరమైన సమతను నెలకొల్పుకొనుటలోను సాధకు డెంతయో పురోగతిని సాధింపనేర్చినగాని పరమేశ్వరునిపై తన సకల కర్మప్రవృత్తుల భారమును పూర్తిగా నదలివేయగలస్థితి కాతడు రాజాలడు. అహంకారపు మాయనటనలను, పెడదారిని పట్టించు తమోమయశక్తుల కానరాని దాడులను అనుక్షణము కడు జాగరూకతతో కనిపెట్టుచూ నతడు ముందుకు సాగవలసియుండును. ఏలయన, ఈ తమోమయ శక్తులు పరమమైన వెలుగునకు, సత్యమునకు తామే మూలమైనట్లు భ్రమింపజేయుచు, ఆత్మను తమ బందీగా జేసికొనుటకై దివ్యరూపములను బోలిన మారువేషముల నెన్నింటినో ధరించుట కలదు.

సాధకు డటుతరువాత వెనువెంటనే అవలంబించవలసిన విధానము సాక్షిత్వము ఉద్వేగరహితము, వ్యక్తిత్వభావాపేతమునైన స్థితియందు ప్రకృతికంటె వేరై నిలిచి, తనలో పనిచేయు ప్రకృతిశక్తిని సాక్షిగ తిలకించుచు, దాని ప్రవృత్తిలక్షణము నవగాహన మొనర్చుకోవలెను. ప్రకృతికి చెందినవేయగు విశ్వశక్తుల ఖేలనము నతడీ వేర్పాటు ద్వారమున గుర్తింపనేర్చి, దైవాసుర సంఘర్షణలు— వెలుగుచీకటుల—అల్లికపని నామె యేరీతిగ కొనసాగించుచున్నదియు వివేచింపగలుగుచు, అవిద్యావశుడగు మానవజీవిని ఆమె ప్రబలశక్తివిశేషము లేవిధమున ఉపయోగించుకొనుచున్నవో విశదముగా కనిపెట్టవలెను. సత్వము, రజస్సు, తమస్సు, అనెడి గుణత్రయముద్వారా ప్రకృతి మనలో పనిచేయుచున్నదని గీత చెప్పుచున్నది. సాధకుడు తన ప్రకృతియొక్క రాజ్యములోనుండి బయల్వెడలు సమస్తమును సాక్షిత్వమున నిష్పాక్షికముగా వివేచింపనేర్చినవాడై, ఈ ప్రకృతి గుణములు వేర్వేరుగను ఒండొంటితో కలసియు నేవిధముగా పనిచేయుచున్నవో వేర్పరించి తెలుసుకోగలిగియుండవలెను. విశ్వశక్తుల కార్యకలాపములు తనలో

సూక్ష్మరూపమున కానరాకుండ మారువేషములు దాల్చి యెట్టి మహావ్యూహకల్పనతో కొనసాగుచున్నవో గుర్తింపుచు, అందలి ప్రతి సూక్ష్మాంశమునూ అతడు తెలియనేర్చియుండవలెను.

క్రమక్రమముగా ఈ జ్ఞాన మాతనిలో వృద్ధిచెందుచున్నకొలదియు నతడు ప్రకృతిచేతిలో అజ్ఞానపూర్వకమైన ఉపకరణముగా నుండిపోవుటకు బదులు ఆయా కార్యముల కనుమతినొసగు అనుమంతగా కూడ విరాజిల్ల సమర్థుడగును. తనలోని ఉపకరణములు ప్రకృతిశక్తిచే వినియోగింపబడు సందర్భములో నతడు మొదట రజస్తమో గుణముల నాప్రకృతిశక్తి యణచి వాటిని సత్వగుణమునకు వశంవదమొనర్చునట్లు చేయవలసియుండును. పిమ్మట నీ మూడు గుణములను గూడ పరతరమైన యొకానొక దివ్యశక్తిచే వాని దివ్యప్రకృతులుగ రూపాంతరము చెందింపబడుటకై యీ ప్రకృతిశక్తి ఆత్మార్పణము గావించుకొనునట్లుగా కూడ చేయవలసియున్నది. అనగా, పరమమైన ప్రశాంతిలోనికి స్థిరత్వములోనికి దివ్యమైన జ్ఞానతేజములోనికి ఆనందములోనికి, దివ్యమైన శక్తిలోనికి తపస్సులోనికి ఈ గుణత్రయము రూపాంతరము చెందవలసియున్నది.

ఈ సాధనక్రమములోని తొలిదశ మనలోని మనోమయపురుషుని సంకల్పముచేతనే సుష్ఠుముగ సాధింపబడుట కవకాశ మున్నమాట నిజమే. కాని, దీని సంపూర్ణ నిర్వహణము, అటుతర్వాత సాధింపబడునటుల రూపాంతరీకరణము,— ఇవి మన హృదయాంతర్వర్తియగు చైత్యాత్మ ప్రాబల్యము మన ప్రకృతిపై విస్తరిల్లి, మనోమయపురుషునినుండి దాని యేలుబడిని చైత్యపురుషుడు కైవసమొనర్చుకో గలిగినప్పుడుగాని సాధ్యపడనేరవు. ఇది సంభవించినపుడు కేవలమొక ఆకాంక్ష, ఆశయము, క్రమాభివృద్ధిపూర్వక ఆత్మత్యాగప్రవృత్తితోనేగాక, అత్యంత ప్రగాఢము, ప్రబలశక్తిసమన్వితమునైన ఆత్మసమర్పణ భావముతో తన కర్మలనెల్ల సాధకుడు ఈశ్వరునకు పూర్తిగా సమర్పణమొనర్చివైచుకొనుటకు సంసిద్ధుడైయుండును. లోపభూయిష్టమగు మానవబుద్ధిప్రవృత్తులతో కూడిన అతని మనస్సునకు మారుగా, దాని స్థానమున, క్రమముగా ఆధ్యాత్మికము, జ్ఞానదీప్తమునైన మనస్సు వికాసము చెందుటయు, అదియే తుట్టతుదకు అతిమానసమైన

విజ్ఞాన చేతనలోనికి ప్రవేశింపనేర్పుటయు సంభవించును. అటుపిమ్మట అతడు దోషభూయిష్ఠమై అయోమయప్రవృత్తులతోగూడిన త్రిగుణాత్మక అజ్ఞానమయ ప్రకృతితోగాక, ఆధ్యాత్మికమైన స్థిరతకు, తేజస్సుకు, శక్తికి, ఆనందమునకు నిలయమైన దివ్యప్రకృతితో కర్మాచరణ మొనర్ప సమర్థుడగును. అజ్ఞానపూర్వక మైన బుద్ధివృత్తిని, సంకల్పశక్తిని అంతకంటె అజ్ఞాన భూయిష్ఠమయిన హృదయభావావేశములు, ప్రాణమయకోశవాంఛలు, అన్నమయకోశ ప్రవృత్తులు ప్రేరేపించగా, అట్టి కలగాపులగపు మనఃప్రవృత్తితో కర్మయందు ప్రవర్తించుటకు మారుగ నతడు మొదట ఆధ్యాత్మికతను సంతరించుకొనిన ఆత్మప్రకృతుల స్థాయి నుండియు, పిమ్మట అతిమానసమైన దివ్యప్రకృతుల స్థాయి నుండియు కర్మాచరణ మొనర్పనేర్చును.

ప్రకృతియొక్క ముసుగు తొలగిపోయి, సర్వమునకు ప్రభువగు పరమేశ్వరుని సాక్షాత్కారమును సాధకుడు ప్రత్యక్షముగ పొందనేర్చినవాడై, తన కర్మ ప్రవృత్తులనెల్ల నిత్యశుద్ధము, సత్యము, పూర్ణము, ఆనందమయమునైన పరాశక్తి కార్యకలాపమున విలీన మొనర్చుకొగలుగుట కనువైన అంతిమ సాధనసంపత్తి యెల్ల ఈ రీతిగా ఒనగూడుట సంభవించుచున్నది. సాధకుడీ స్థితిలో తన సకల కర్మలను, కర్మఫలితములను పూర్తిగా సమర్పణ మొనర్చి సర్వకర్త్రియగు నామె చేతిలో తాను కేవల ముపకరణముననను యెరుకతో ప్రవర్తింప సమర్థుడగును. కర్మకు అనుమతి యొసగునది యిక తాను గాదు. తనలోనున్న వివిధోపకరణములయం దీశ్వరాదేశమును గ్రహించి, అద్దానిని పరాశక్తిచేతులలో తా నుపకరణమై అనువర్తించుటే ఆతని పని. కర్మలు చేయునది తానని తలంచక, ఆ పరాశక్తియే తన ద్వారమున ఆ పనులను నెరవేర్చుచున్నదని అతడు భావించును. తన మానసిక కల్పనలు, హృదయ వాంఛలు నెరవేరుటకా దతడిప్పుడు కోరునది. అతి గుహ్యము, అది మోహనము. అత్యగాధమునైన దివ్యప్రేమ స్వరూపము, నిత్య సత్యానందస్వరూపమునై, సర్వజ్ఞమై యొప్పారు సర్వశక్తిమయ పరమ దివ్య సంకల్పమునకు విధేయుడై అద్దాని కార్యకలాపములో పాల్గొనుట కతడు సర్వసమర్థుడగును.

—o—

## అధ్యాయము 10

# ప్రకృతి గుణత్రయము

మానవుని యాత్మ తన ఆంతరంగిక స్థితియందేమి, కర్మప్రవృత్తులందేమి, బంధరాహిత్యమును బడయవలెననిన, అవరప్రకృతియొక్క స్వాభావిక వ్యాపార సరళి కతీతముగా అయ్యది వర్తింపగలుగుట అత్యంతావశ్యకము. ప్రాకృత పరికరములు నిర్దుష్టముగా, చక్కగా పనిచేయువలెననిన, ఈ విశ్వప్రకృతికవి సామరస్య పూర్వకముగ వశవర్తులై మెలగవలసి యుండుననుమాట నిజమే. కాని, ఆత్మకుమాత్రమది ఆదర్శమై వెలయజాలదు. ఆత్మ తాను వశవర్తికావలసినదొక్క ఈశ్వరునకు, ఈశ్వర శక్తికి మాత్రమే. స్వీయప్రకృతి నయ్యది తన వశమున నుంచుకోవలెను. ఈశ్వరుని పరమసంకల్పము తన ద్వారా నెరవేరవలసియున్నది కావున, ప్రాకృత పరికరములగు మనఃప్రాణదేహముల పరిశ్రమము కొరకై ప్రకృతి సమకూర్చి యుండిన శక్తిసంపదను, పరిసర పరిస్థితులను, సమష్టివ్యాపారిలయవిన్యాసమును ఎట్లు వినియోగించుకొనవలెనో తన దర్శనశక్తి చేతను, అంగీకార-అనంగీకారములచేతను నిర్ణయింపవలసినది ఆత్మయే కాని, ఈ అవర ప్రకృతిని వశములో నుంచుకొనవలెననిన, దీని నతిక్రమించి చని ఊర్ధ్వమునుండి దీని నుపయోగించుకోవలసియుండును. అవర ప్రకృతి శక్తులను, గుణములను, కార్యపద్ధతులను అతిక్రమించగలుగు పక్షమున మాత్రమే ఇయ్యది సాధ్యమగును. లేనియెడల, మనమే ఆమె నిబంధనలకు లోనై నిస్సహాయముగ ఆమెకు వశవర్తులమైపోవుట సంభవించుమగాని, బంధవిముక్తిని మన ఆత్మయందు బడయజాలము.

ప్రకృతి కార్యసరణియందు మూడు ముఖ్యమైన తీరులు కలవనెడి భావము ప్రాచీన భారతీయ మనీషులు సృష్టించినది. ఇయ్యది కడుదీర్ఘమయిన మానసిక పరిశోధనల ఫలితముగను, కడులోతైన ఆంతరంగికానుభూతుల ఫలితముగను

రూపొందవదగుటచే. దీని నిజతత్త్వము ఒక్కసారిగ వెంటనే తెలియబడదు. కావు వనే. ప్రకృతిశక్తుల సునిశిత పరిశీలనానుగత బోధవిస్ఫూర్తిలేకయు, సుదీర్ఘమైన ఆంతరంగికానుభవసంపత్తి లేకయు దీనిని చక్కగా గ్రహించి సద్వినియోగపర చుకొనుట మిక్కిలి కష్టము. కాని, దిఙ్మాత్రముగా కొన్ని సూచనలను అద్దానివి గురించి చేయుదుమేని, కర్మయోగ సాధకుడు తన ప్రకృతి కార్యసరణి నవగాహన మొనర్చుకొని విమర్శ చేసికొనుటకును, తన అంగీకార-అనంగీకారముల ద్వారా అద్దానిని నియమన మొనర్చుటకును అయ్యది తోడ్పడవచ్చును. ప్రకృతి కార్య సరణియందలి ఈ తీరులు గుణములుగా భారతీయ గ్రంథ ములలో పేర్కొనబడినవి.

సత్వము, రజస్సు, తమస్సు, అని యీ గుణముల పేరు. సత్వము స్థాయి లక్షణముతో నొప్పారెడి శక్తి. సద్భావము, సామరస్యము, సుఖము, తేజస్సు అను గుణవిశేషముల నిది వ్యక్తము చేయును. రజస్సు చలనాత్మకమైన శక్తి. ప్రయాస, ప్రయత్నము, ఉద్వేగము, కార్యతత్పరత,—అను గుణవిశేషముల నియ్యది వ్యక్తము చేయును. తమస్సు జడత్వలక్షణాత్మకమయిన శక్తి. అజ్ఞానము, అన మర్థత, అకర్మణ్యత,-అను గుణముల నియ్యది వ్యక్తము చేయును. మానసిక మయిన ఆత్మవిమర్శ సందర్భములో మాత్రమే సాధారణముగా ఈ గుణవిమర్శ చేయబడుచున్నను, భౌతికప్రకృతియందు కూడ ఈ గుణభేదములు కలవు. అవర ప్రకృతియందలి ప్రతి వస్తువిశేషము గుణాత్మకమే. గుణాత్మకమయిన ఈ శక్తి విశేషముల ప్రభావము లొండొంటిపై పనిచేసినదాని ఫలితముగనే ప్రతి వస్తువు యొక్కయు శక్త్యాత్మక స్వరూపము, ప్రవృత్తి విధానము ఏర్పడుచున్నవి.

చేతనము కానిండు, అచేతనము కానిండు, ప్రతి వస్తువుయొక్క స్వరూ పము చలనాత్మకమయిన ప్రకృతిశక్తుల ఒకానొక స్థాయివిశేషమని చెప్పనగును. తన చుట్టును గల ఇతర శక్తి సముదాయములకు సంబంధించినవైన అనుకూల-ప్రతికూల సంస్పర్శల అంతులేని ప్రవాహవిశేషములకు అయ్యది సదా లోనగు చుండును. మనఃప్రాణ దేహములతో కూడిన మన ప్రకృతికూడ అట్టి ఒకానొక శక్తిసముదాయపు స్థాయివిశేషమేకాని వేరుకాదు. పరిసరములతోడి సంస్పర్శను గ్రహించి వాటికి ప్రతిస్పందించు సన్నివేశములోనే పైనపేర్కొనబడిన గుణత్రి

యము గ్రహీతయొక్క స్వభావమును, ప్రతిస్పందనయొక్క లక్షణమును నిర్ణ యించుచున్నది. జడుడు, అశ్రద్ధానుడునై అతడా సంస్పర్శలను ఎట్టి ప్రతి స్పందనయు లేక, ఎదుర్కొనుటకుగాని, జీర్ణించుకొనుటకుగాని ఎట్టి ప్రయత్నము చేయక అనుభవించుట సంభవించవచ్చును. ఇదియే తమోవిధానము, జడత్వ పద్ధతి.

అంధత్వము, అజ్ఞానము, అసమర్థత, బుద్ధిహీనత, బద్ధకము, అకర్మణ్య త్వము, యంత్రప్రాయమైన దినచర్య, మనోమాంద్యము, నిద్రమత్తు జీవనము, ఆత్మమౌఢ్యము—ఇవన్నియు తమస్సు లక్షణములు. ఏ విధమైన క్రొత్త సృష్టికి, క్రొత్త స్థాయికి పురోగతి సూచకమగు శక్తివిశేషమునకు అవకాశమీయని పరి స్థితియందు, ప్రకృతి కల్పితమైన ప్రాతరూపము, ప్రాతస్థాయి విచ్ఛిత్తిని పొందు టయే దీని పర్యవసానమగును. నూతనానుభవమునకై ప్రేరేపించు పరిసరశక్తుల సూచనలను, అనుకూల ప్రతికూల సంస్పర్శలను అవగాహన మొనర్చుకొని చేపట్టి వినియోగించుకొన నొల్లని సోమరితనము, అశక్తత, అజ్ఞానము, ఈ జడత్వ లక్షణోపేతమైన దౌర్బల్యమునకంతకు మూలమైయున్నది.

అట్లుగాక, ప్రకృతి సంస్పర్శలను పొంది ఆమె శక్తులచే ఉత్తేజితుడు, లాలితుడు, లేక తాడితుడునైన వ్యక్తి, ఆ ఒత్తిడులకు అనుకూలముగానో ప్రతి కూలముగానో ప్రతిక్రియకు గడంగుట కలదు. అట్టి సందర్భములో ప్రకృతి, పరి సరములను ప్రతిఘటించి అతడు వాటిపై తన ఆధిపత్యము సాధించుటకై తన యిచ్ఛాశక్తి ప్రాబల్యమును ప్రకటించుకొనుచు, పోరాడి, సృష్టించి, జయించు నట్లుగా అతని కవకాశమును కల్పించి ప్రేరేపించి ప్రోత్సహించును. ఇదియే రజోవిధానము,—ఉద్వేగ పూర్వకము, క్రియాత్మకము కామతృష్ణాసంకులము నైన పద్ధతి, సంఘర్షణ, మార్పు, నూతన సృష్టి, జయము, అపజయము, సుఖము, దుఃఖము, ఆశ, నిరాశ,—ఇత్యాదులన్నియు దాని ఫలితములు. రంగు రంగుల జీవన సౌధ నిర్మాణముచేసి దానియందది ఆసక్తిని వెలార్చుకొనును. కాని, దాని జ్ఞానము విపరీత జ్ఞానము, దోషభూయిష్ఠము నగుటచే, దాని ప్రయత్నములు అజ్ఞానపూర్వకములు, ప్రమాద భరితములు నగుచు, అవ్యవస్థితిని, విషయ సంగ

రూపమైన వేదనను, ఆశాభంగములు నష్టములు అపజయములతో కూడిన దుఃఖమును కల్పించుట సంభవించును.

సృష్టిచేయునట్టియు, ప్రతిరోధముల నవఘళింప గలుగునట్టియు, క్రియాత్మకమైనట్టియు శక్తిని రజస్సు ప్రసాదించు ననుమాట నిజమే, కాని, అజ్ఞాన పూర్వకమైన మాయవెలుతురుతోడను, మసకవెలుతురుతోడను కొనసాగెడి ప్రవృత్తి దానిది. అసుర, రాక్షస, పిశాచ శక్తుల స్పర్శలు దాని నడకను వక్రింప జేయుచుండును. మానవ మనస్సున గూడుకట్టుకొనియున్న దురహంకారపూర్వకమైన అజ్ఞానము, ఆత్మసంతృప్తితో ఆ మనస్సుచేయు విపరీతకల్పనలు, అహంకారికములైన పొరపాటులు, పార్థివ ప్రకృతిని వికృతపరచెడి గర్వము, దురాకాంక్ష, స్వాతిశయప్రవృత్తి, క్రౌర్యము, పరపీడనము, పాశవిక క్రోధము, హింసాప్రవృత్తి, దుస్స్వరము, నీచత్వము, మిథ్యాచారము, విశ్వాసఘాతుకత్వము, అత్యాశ, బండిపోటుతనము, అసూయ, మాత్సర్యము, అంతులేని కృతఘ్నత,—ఇవన్నియు దాని ఫలితములే

కాని, దేహధారియగు జీవుడు ఈ ద్వివిధ ప్రకృతి గుణములకే పరిమితుడైనవాడు కాదు. పరిసర సంస్పర్శలను, విశ్వశక్తి ప్రవాహగతి విశేషములను అతడు అనుసంధానింపగలుగుటకు ఇంతకంటె మేలుతరమైన,- ఇంతకంటె ప్రకాశవంతమైన,- మార్గము వేరొకటున్నది. స్పష్టమైన అవగాహనముతోడను, స్థాయీ విశేషముతోడను ఈ సంస్పర్శలను గ్రహించి ప్రతిస్పందించుటకు పైతము వీలుకలదు. అవగాహనముతో కూడినదైన కారణమున సానుభూతితో వర్తించు సామర్థ్య మీ మార్గమున ప్రకటితమగును. ప్రకృతిప్రేరణ, ప్రకృతి విధానము,- వీని లోతులు తరచి నియమన పూర్వకముగా వీనిని పెంపొందించుటకు అయ్యది సమర్థమగును. ప్రకృతి విధానముల ఆంతర్యములోనికి చొచ్చిచూచి వానిని జీర్ణించుకొని ఉపయోగించుకొనగల బుద్ధివిశేషమునది వెలార్చుకొనును. సంస్పర్శలకు వశమైపోవుటకు మారుగా, వానిని సరిదిద్దుకొని సామరస్యము ఘటింపజేసి, సకల వస్తుజాతమునందునూ గర్భితమైయుండు ఉత్తమ లక్షణమును వెలికిదీయు రీతివి చక్కగా వాటితో వ్యవహరింప నేర్చును.

ఇదియే సత్వగుణ పద్ధతి. వెలుగును, స్థాయిని వెలార్చుకొనుచు, శుభము నకు, సుజ్ఞానమునకు, రసానందమునకు, సరియైన అవగాహనకు, స్థాయికి, క్రమ పద్ధతికి దారితీయు ప్రకృతి విన్యాసమిది. ప్రకాశవంతము, విస్పష్టమునైనజ్ఞానము, నిర్మలము, సుస్నిగ్ధమునైన సానుభూతి, సాన్నిహిత్యము దాని స్వభావమునందు సుసంపన్నములై యుండును. చక్కని సంస్కారము, జ్ఞానము, సంయమపూర్వక మగు శక్తివిశేషము, సకల సత్త్వయందును ప్రతిష్ఠితమగుస్థాయి, సామరస్యము,— ఇవి సాత్వికప్రకృతిచే సాధింపబడు ఉత్తమ లక్షణములు.

సృష్టియందేదియూ ఈ విశ్వప్రకృతి గుణములందేదోయొక గుణపు మూస లోనే ప్రత్యేకముగ పోతపోయబడినదై యుండదు. ప్రతి ఒక్కరియందును, ప్రతి తావునందునుగూడ ఈ గుణత్రయము కానవచ్చుచునేయుండును. ఎడతెగని సంకలన, వ్యవకలనములతో, ఒకదానినొకటి ప్రభావిత మొనర్చుకొనుచుండెడు వీని విస్ఫూర్తులు మారుచుండును. తరచుగా వీని మధ్య నొకవిధమైన సంఘర్షణము, ఒకదానిపై నొకటి ఆధిపత్యము నెలకొల్పుకొను నిమిత్తముగా పోరాటము కొనసాగు చుండును. ఎల్లరిలోనూ,— గొప్పగా కానిండు కొద్దిగా కానిండు,— ఒక్కొక్క ప్పుడు బొత్తుగా అత్యంతాల్పాంశమే కావచ్చును,— సత్వస్థితులు కలవు. వెలుగు, విశుద్ధత, సంతోషము, పరిసరములయెడ సానుభూతి, సామరస్యము, బుద్ధి విశే షము, స్థాయి, సమ్యగ్భావన, సమ్యక్సంకల్పము, సమ్యక్ప్రేరణ, సౌశీల్యము, క్రమపద్ధతి,— వీని యంకురము లెల్లరియందును కానవచ్చును.

ఎల్లరిలోనూ అటులనే రాజసస్థితులు కలవు. కోపము, ఉద్వేగము, సంఘర్షణ, విపరీతభావన, అసత్యము, స్ఖాలిత్యము, స్థాయి కొరవడిన సుఖదుఃఖములు, ఏదియో చేయవలెననియు; సృష్టించవలెననియు దూకుడు, తొందరపాటు, పరిసర ముల ఒత్తిడికి, జీవితపు తాకిడులకు, అనుకూలావకాశములకు కడు నిబ్బరము గను, తీవ్రముగను ప్రతిస్పందించుట,— ఈ పంకిల ప్రవృత్తి లక్షణములు ఎల్లరి లోనూ కాననగును. అదే విధముగ ఎల్లరిలోనూ తామసస్థితులున్నవి. అజ్ఞానావృత మైన భాగములు, చైతన్యరహితమైన క్షణములు, దీర్ఘమైన అలవాటు చొప్పున గాని, తాత్కాలికమైన వృత్తివిశేషముచేగాని, జరుగునది జరుగనిమ్మని దుర్బలత్వ

ముతో మిన్నకుండుట, లేక మందకొడితనముతో ఆమోదించుట, అలుపు, అజాగ్రత్త, సోమరితనము, అజ్ఞానము, అసమర్థత, అధైర్యము, భయము, పరిసర పరిస్థితులకు, వివిధ వ్యక్తులయు, శక్తులయు, సంఘటనలయు ఒత్తిడులకు పిరికితనముతో లొంగిపోవుట,– ఈ మొదలైన లక్షణములు ప్రతివానిలోనూ చోటు చేసికొనియున్నవి. మనలో ప్రతి ఒక్కరము, మన ప్రకృతికి, మన మనస్సుకు, మన శీలమునకు సంబంధించిన కొన్ని ప్రవృత్తులయందు సాత్వికులము, కొన్నిటియందు రాజసికులము. మరికొన్నిటియందు తామసికులము అగుదుము.

ఒక్కొక్కరి సామాన్య స్వభావమునందేమి, మానసిక లక్షణమునందేమి, కార్య ప్రవృత్తియందేమి, ఏగుణము ప్రాబల్యము వహించిన అద్దానినిబట్టి యతడు సాత్వికుడనియో, రాజసికుడనియో, తామసికుడనియో చెప్పబడుచుండును. కాని, సర్వదా ఒకే గుణముతో నుండువారరుదు. పూర్తిగా ఒకే గుణము ఎవ్వరియందును ఉండదు. వివేకవంతులు సర్వదా వివేకవంతులు కారు. బుద్ధిశాలురు తుంపులు తుంపులుగా మాత్రమే బుద్ధిశాలురు. పుణ్యశ్లోకుడు తనలోగల పాపప్రవృత్తుల నెన్నింటినో అణచివేసికొనుచుండును. పాపాత్ములు పూర్తిగా పాపులుకారు. అత్యంత మందప్రజ్ఞునిలోకూడ అనభివ్యక్తమైన ప్రజ్ఞలు దాగియుండును. మహాభీరువుకూడ ఒక్కొక్కరీతిలో కొన్ని కొన్ని క్షణములందు ధైర్యము ప్రదర్శించును. ఎంతటి దుర్బలుడు, నిస్సహాయుడు నైనవాని ప్రకృతిలో నైనను బలము గర్భితముగ దాగియే యుండును. దేహధారియందు ప్రబలమై గోచరించెడి గుణములాతని ఆత్మగుణములుకావు. అయ్యవి అనంతమైన కాలములో అతని వికాస క్రమమునందొకానొక ఘట్టమున, వర్తమాన జీవితముకొరకై తాను రూపొందించుకొనిన సంపుటికి సూచకములు మాత్రమే.

* * *

సాధకుడు తనలో, తనపై, ప్రకృతి కొనసాగించు కార్యకలాపమునుండి వేరై నిలిచి, దానితో జోక్యము కల్పించుకొనక, దానిని సవరించుటకుగాని అవరోధించుటకుగాని పూనుకొనక, తానొకటి వేరుగా ఎన్నిక చేయుటకు, నిర్ణయించుటకు దలపెట్టక, దాని ఖేలనము కొనసాగనిచ్చుచు, దాని విధానమును సవి

మర్మముగ తిలకింప నేర్చినపుడు, దాని గుణప్రవృత్తుల పోకడలు స్వతంత్రము లనియు, ఆడించివదలిన యంత్రము స్వకీయవ్యవస్థమూలముననే స్వకీయ శక్తి ప్రేరణలతో పనిచేయురీతిని అవి పనిచేయుచున్నవనియు త్వరలోనే అతనికి విశదమగును. ఆ శక్తి ప్రేరణలకు మూలస్థానము ప్రకృతిగాని తానుకాదు, తన మనస్సే తన కర్మలకు కర్తయని తాను భావించినది ఎంత పొరపాటో అతని కపుడు తెలిసివచ్చును. తన మనస్సు తనలో గల ఒక చిన్న విభాగము మాత్రమే. అది ప్రకృతిచే నిర్మింపబడిన ఒక యంత్రము. బొమ్మలతో ఆడుకొను బాలికరీతి త్రిగుణములనూ ఆడించుచు వాటితో క్రీడించుచున్నది ప్రకృతియే. అతని అహంకారము కేవలమొక ఉపకరణము,ఆటవస్తువు.అతని శీలము,బుద్ధిపాటవము, నైతిక గుణములు, మానసికకల్పనలు, కోపము, సహనము, క్రౌర్యము, దయ, అనురాగము, ద్వేషము, పుణ్యప్రవృత్తి, పాపప్రవృత్తి, వెలుగు, చీకటి, సంతోషము, దుఃఖము, అంతయూ ప్రకృతి క్రీడయే, ఆ క్రీడకు అతని యాత్మ ఆకృష్టమై, దానిచే జయింపబడి, దానికి వశవర్తియగుచు మిన్నక దానితో ఏకీభవించు చున్నది,

అయినను ప్రకృతినిర్ణయమే ఖాయమైనదీ, తిరుగులేనిదీ కాదు. ఆత్మకు గూడ దీనిలో కొంత ప్రమేయమున్నది కాని, ఆత్మయనగా మనలోగల నిగూఢాత్మరూపుడగు పురుషుడుగాని యీ మనస్సు; అహంకారము కాదు. ఏలయన, ఇవి ప్రకృతి అంతర్భాగములే గాని స్వతంత్రమైన తత్వములు కావు. ప్రకృతి ఖేలనమునకు పురుషుని అనుమతి అవసరమైయున్నది. పురుషుడు తాను ప్రభువు, అనుమంత యైన కారణమున మౌనముగా తన అంతరికేచ్ఛచే ఖేలనముయొక్క నియతిని నిర్ణయించి, దాని మేళనవిధానములందు జోక్యము కల్పించుకొనగలడు. కాని ఆ నిర్ణయమును భావన, ఇచ్ఛ, క్రియ, ప్రేరణల రూపములో ఆచరణలో పెట్టవలసినది ప్రకృతియే,_ దానిదే ఆ విశేషాధికారము. ప్రకృతి వ్యాపారములందు జోక్యము కల్పించుకొనుట ద్వారమునగాక, ప్రకృతిపై తన దృష్టిని విగిడించుట ద్వారమున నొక సమరస పద్ధతి నామె యనుసరించునట్లాత డనుశాసింపగలడు. ప్రకృతి ఆ అనుశాసనమును వెంటనే కాని,విశేష ప్రయాసానంతరము గాని,అను

రూపమైన భావములోనికి, శక్తిమంతమైన ప్రేరణలోనికి, సార్థకమైన ఆకృతి లోనికి పర్యవసింపజేయును.

ప్రకృతస్థితిలోని మన ప్రకృతి దివ్యచైతన్యశక్తివిశేషముగ మార్పుచెంద వలెననిన, అవరగుణములగు రజస్తమముల ప్రభావమునుండి మనము తప్పించు కొనుట అత్యంతావశ్యకమని దీనివలన సుస్పష్టము. మన ప్రకృతియందలి జడత్వ లక్షణోపేతమైన చీకటికోణములోనికి దివ్యజ్ఞానతేజః ప్రసారము చొరబారకుండా తమస్సు అడ్డుతగులును. దివ్యప్రేరణకు ప్రతిస్పందించు సామర్థ్యమును, దివ్య శక్తి కుపకరణమగునట్లుగా అభివృద్ధి సాధించగోరు విచ్ఛను, పరివర్తన సాధక మైన శక్తిని తమస్సు హరించివేసి మనల నశక్తుల గావించును. రజస్సు మన జ్ఞానమును వక్రింపజేసి, అసత్యమునకు, అసత్ప్రవృత్తులకు తోడగునట్లుగా మన బుద్ధిని మలచుకొనుచు, మన ప్రాణశక్తిని, తత్ప్రేరణలను కల్లోలపరచి, శరీరము యొక్క స్థాయిని, ఆరోగ్యమును తలక్రిందులొనర్చును. ఉన్నతస్థాయికి చెందిన సకల భావములను, సకల ప్రవృత్తులను కైవస మొనర్చుకొని, అహంకారికము లగు అసత్ప్రయోజనములకు వాటిని వినియోగించుకొనుట రజస్సు లక్షణము. పృథ్వీభూమికలోనికి దిగివచ్చినప్పుడు దివ్యసత్యము, దివ్య ప్రభావ విశేషములు సైతమూ ఇట్టి దుర్వినియోగమును తప్పించుకొనజాలవు. తమస్సుకు వెలుగు సంతరింపకయు, రజస్సును పరివర్తనము చెందింపకయు దివ్యపరివర్తనము గాని, దివ్యజీవనముగాని సాధ్యము కానేరదు.

ఇట్టి సందర్భములో, కేవల సత్వగుణాలంబనమే మనకు తరణోపాయమై కనుపట్టును. కాని, ఇక్కడ గల చిక్కేమనిన, ఈ మూడుగుణములో ఏ ఒక్క టియు తనకు తానుగ తక్కిన రెండింటినీ త్రోసిపుచ్చి ప్రబలము కాజాలదు. మన అశాంతికి, దుఃఖమునకు, పాపాచరణమునకు కారణము కామోద్వేగ పూర్వకమైన రజోగుణమని భావించి దానిని అణచి లొంగదీసికొనుటకు ప్రయత్నింతుమేని. రజస్సు అణగును గాని తమస్సు ఉద్రేకించును. ఏలయన, కర్మప్రవృత్తి మంద గింపగా జడత్వము అద్దాని స్థానము నాక్రమించును. విశ్చలమైన శాంతి, సంతో షము, జ్ఞానము, ప్రేమ, సమ్యగ్భావము, ఇవి సత్వగుణపు వెలుగువలన ఒనగూడి నను, రజస్సు పూర్తిగా అణచివేయబడి లోపించుట సంభవించినచో ఆత్మయందలి

నిశ్చలత నిష్క్రియత్వపు ప్రశాంతిగ మారునేకాని క్రియాశక్త్యాత్మక పరివర్తనకు స్థిరభూమి కానేరదు.

శక్త్యాత్మకము కాని సమ్యక్చింతనము, సమ్యగ్వర్తనము, సాధుత్వము, సౌమ్యత, సమత్వము,- ఈ లక్షణములతో నొప్పారు హేతువుచే మన ప్రకృతి విభాగములు సాత్విక తామసికములై, వెలవెల బోవుచు, నిష్ప్రాణికములు, సృజ నాత్మక శక్తిహీనములుగ తయారగును. మానసికము, నైతికమునగు అజ్ఞానావర ణము లేకపోవచ్చును గాక. కాని, దానితోపాటు కార్యోత్సాహపు జలలు పెల్లుబికి వచ్చుటయు లేకుండబోవును. ఇది మరొక విధమైన అశక్తత. ఏలయన, తమః ప్రవృత్తి రెండు విధములుగా నుండును. ఒకటి, జడత్వముతో రజస్సును ప్రతి రోధించుట. రెండవది. సంకుచితత్వము, అస్పష్టత, అజ్ఞానము, వీనిచే సత్వ మును ప్రతిరోధించుట. సత్వ రజస్సులలో ఏది తగ్గిననూ ఇది దాని తావును ఆక్రమించుటకై పొరలివచ్చును.

ఈ ప్రమాదమును సరిదిద్దుటకు మనము రజస్సును మరల నాహ్వానించి సత్వముతో పొత్తుగూడునట్లుగ జేయుచు, ఆ రెండింటి కలయిక ద్వారమునను తమస్సును వదలించుకొనుటకు ప్రయత్నింతుమేని, మన కర్మప్రవృత్తికి ఉన్నత స్థాయి కల్పించగలుగుదుమనుట నిజమేకాని, అచట తిరిగి మనము రాజసికమైన తొందరపాటు, ఉద్వేగము, నిస్పృహ, వ్యధ, క్రోధము, మొదలైనవానికి లొంగ వలసిన పరిస్థితి యేర్పడును. విస్తృతియందును, విధానమునందును, స్వభావము నందును ఈ ప్రవృత్తులు వెనుకటికంటె ఉన్నతస్థాయిలోనే కొనసాగవచ్చుగాక, కాని, మనము సాధింపగోరు శాంతి, స్వతంత్రత, సామర్థ్యము, ఆత్మ ప్రాభ వము. ఇవి కావు. ఎచ్చటెచ్చట కామము, అహంకారము నిలువదాకియుం డునో అచ్చటచ్చట నెల్ల ఉద్వేగము, సంక్షోభము దానితోపాటు నిలువదాకి వాని మనుగడలో పాల్గొనుచుండును. సత్వము ప్రధానముగను, రజస్తమస్సులు అప్రధానములుగను మూడింటికిని పొత్తుగూర్చెడి ప్రయత్నము మనము సల్పు దుమేని, అప్పుడు కూడ మనము పూర్వముకంటె కొంత సౌమ్యమనదగు ప్రకృతి విలసనమును మాత్రమే సాధించినవారమగుదుము. ఒక క్రొత్త స్థాయి చేకూరిన మాట నిజమేకాని, ఆధ్యాత్మికమయిన స్వాతంత్ర్యము, ప్రాభవము మన కింకనూ

పొడగాన వచ్చుటలేదు. ఒకవేళ కనవచ్చినను అవి కడు దవ్వున నున్నవనియే చెప్పవలసియుండును.

మౌలికముగా అత్యంతవిభిన్నమగు కార్యసరణి యొకటి యీ గుణముల నుండి మనలను వేఱుచేసి వీని కతీతుల మగునట్లుగ పైకెత్తవలసియున్నది. ప్రకృతి గుణముల కార్యసరణి నామోదించు తప్పిదమిక కొనసాగరాదు. ఏలయన, ఈ యామోదము కొనసాగు నంతకాలము మనయాత్మ గుణప్రవృత్తులలో చిక్కుపడి వాటి నియతికి వశవర్తి కావలసియుండును. రజస్తమస్సులతోపాటు సత్వమును గూడ మనము అతిక్రమించవలసి యున్నది. ఇనుప సంకెలలు, మిశ్రమ లోహ శృంఖలాభరణములతోపాటు, బంధకమయిన బంగారు గొలుసులనుగూడ మనము ఛేదింపవలసి యున్నది. ఇందుకు గీత ఒక క్రొత్త ఆత్మసంయమన పద్ధతిని బోధించియున్నది. గుణప్రవృత్తులనుండి వేరువడ నేర్చుకొని, ఆ ప్రకృతి శక్తుల వెల్లువకు పైగా ఆసీనుల మగుచు. దాని గతివిశేషమును సాక్షిగా తిలకింప గలుగుటయే ఆ పద్ధతి ప్రకృతికార్యములకు దూరమైవాటికంటె ఉన్నతస్థానమున నాసీనుడైయుండి, వాటిని నిష్పాక్షికముగా, ఉదాసీనముగా తిలకించుటయే ఈ సాక్షికిగల లక్షణము. తరంగములవలె అవి లేచిపడుచుండగా, వాటి నామోదించుటగాని, వాటి నడకయందు జోక్యము కల్పించుకొనుటగాని చేయక అతడు వాటిని తిలకించును. సాధకుడు మొదట ఈ రీతిగా సాధింపవలసినది. అపౌరుషేయ సాక్షిత్వమందలి స్వాతంత్ర్యము. ప్రభువైన ఈశ్వరుని నియంత్రిణ మాపిమ్మట సిద్ధించును.

* * *

ప్రకృతికార్యకలాపమునుండి వేరుపడునట్టి యీ విధానమువలన చేకూరు తొలి ప్రయోజనమేమనిన, సాధకుడు స్వీయప్రకృతినీ, సకల ప్రకృతినిగూడ అవగాహన మొనర్చుకొనుటకు మొదలుపెట్టును ప్రకృతికార్యములనుండి వేరైన సాక్షి, అహంకారబంధ మెంతమాత్రమునూ లేకయే అవిద్యాసంబంధియగు నామె గుణఖేలనమును పూర్తిగా కనుగొనుచు, అద్దాని లోతుపాతులు, ముసుగులు, సూక్ష్మతలలోనికి బాగుగా చొరబారుటకు సమర్థుడగును. ఏలయన, ఆ ఖేలనమంతయు మాయనటనములు, మారువేషములు, ఉచ్చులు, జిత్తులు, వంచనములతో

నిండి నిబిడీకృతమై యుండును. దీర్ఘానుభవముచే బోధితుడై, సకలకార్యకలాపమూ గుణముల అన్యోన్యక్రీడనమే యని యెరుగుచు, వాని విధానములను బాగుగా ఎరుగనేర్చియుండు కారణమున, అతడిక వాటి దాడులకు లొంగిపోవుటగాని, వాటి మాయవేషములకు మోసపోవుటగాని, వాటి ఉచ్చులయందు ఆకస్మికముగా తగుల్కొనుటగాని సంభవింపనేరదు.

గుణముల అన్యోన్యక్రీడనము కొనసాగుటకు కల్పితమైన యొకానొక గ్రంథివిశేషమే అహంకారమని సైతమూ అతడు తెలిసికొని ఆ దృష్టితో దానిని చూడనేర్చుటవలన, అహంకారికమగు అవర ప్రకృతి మాయావిభ్రమమునుండి కూడ అతడు విముక్తుడగును. భూతదయాపరులయి, పరమపావన జీవనులయి, మహామనీషులయి సాత్వికాహంకార బంధమునుండి యతడు తప్పించుకొనును. రాజసికాహంకారపు అధిశాసనము తన ప్రాణకోశ ప్రవృత్తులపై కొనసాగకుండ పరిహరింపనేర్చి, బహువిధశ్రమలతో స్వప్రయోజనములను సాధించుకొనునట్టియు, కామక్రోధములకు బందియై బానిసగా వాటికి చాకిరీ చేయునట్టియు మార్గమును విసర్జించును. అటులే, గతానుగతికమైన సామాన్యమానవ జీవనగతియందు ఆసక్తమగుచు, వట్టి మందకొడితనముతో అంధప్రాయముగ ప్రవర్తించు అజ్ఞానభూయిష్ఠమగు తామసికాహంకారమును తన జ్ఞానతేజస్సుచేత భేదించుటకు గూడ అతడు సమర్థుడగును.

మన సకల వైయక్తిక ప్రవృత్తులయందును అహంకారికదృష్టి నెలకొనుట మహాపాపమని అతడీ విధముగ గుర్తించి, ఆ నిశ్చయమున సుప్రతిష్ఠితుడైనప్పుడు ఆత్మోద్ధరణకు, ఆత్మవిమోచనమునకు సాధనముగా రాజసికాహంకారమునుగాని, సాత్వికాహంకారమునుగాని ఆలంబనముగా గైకొనుట కేమాత్ర మంగీకరింపక, ఈ ప్రకృత్యుపకరణములకును, కార్యకలాపములకును అతీతముగ తేజరిల్లుచు సకల కర్మాధీశ్వరుడగు పరమేశ్వరునీ,—ఆ పరమేశ్వరుని శక్తియేయైన పరాప్రకృతినీ ఆశ్రయింప నుత్సహించును. మన సకల సత్తయూ విశుద్ధము, విముక్తమునై విరాజిల్లగలుగునది అచ్చోటనే. అచ్చటనే పరమసత్యము యొక్క రాజ్యస్థాపనము సాధ్యము.

ప్రకృతియొక్క గుణత్రియమునుండి వేరై ఒక విధముగా వాటి కతీత మైన స్థాయిని అందుకొనుటయే ఈ అభివృద్ధిసాధనలో జరుగు మొదటి కార్యము. సాధకుని యాత్మ అవరప్రకృతినుండి ఆంతరంగికముగ వేరై, విడుమరగాంచి, దాని చటిత్రములో తగుల్కొనక దాని కతీతస్థితిలో ఉదాసీనము, సంతుష్టము నై విరాజిల్లును. గుణత్రియమునకు సంబంధించిన పూర్వపు అలవాట్ల ప్రకారము ప్రకృతి తన కార్యకలాపములనుకొనసాగించుచునేయుండును.హృదయముకామము చేతను, సుఖదుఃఖములచేతను సంకుచితమగుచుండుటయు, ఉపకరణములు అల సట పొంది అకర్మణ్యతలోనికి, అజ్ఞానములోనికి కూరుకొని పోవుచుండుటయు, హృదయములోనికి, బుద్ధిలోనికి, శరీరములోనికి వెలుగు, శాంతి మరల ప్రసరిం చుటయు జరుగుచునే యుండును. కాని, ఆత్మ యీ మార్పులచే నెంతమాత్రమూ స్పృశింపబడనిదై తానెటి మార్పునూ లేక నిలిచియుండును. మనః ప్రాణదేహము లందు చెలరేగు తృష్ణను, దుఃఖమును తానేమాత్రమూ చలింపకయే తిలకించుచు వాటి సంతోషపు పొంగులకు, విపరీత శ్రమలకు నవ్వుకొనుచు, బుద్ధివృత్తులచే చీకట్లకు, వైఫల్యములకును, హృదయభావముల తీవ్రతలకు, దౌర్బల్యములకును కలంగక, బుద్ధియందు దోచు వెలుగులకు తాత్కారణమున జనించు సుఖాదులకు తగులువడనిదగుచు, అయ్యది ఈ నానావిధములగువానిలో ఏ ఒకదానితోనూ తాదాత్మ్యము చెందక, పరమ సంకల్పపు సూచనలకొరకును, పరమ జ్ఞానతేజపు స్ఫూర్తులకొరకును నిశ్చలభావమున నిరీక్షించును.

ఇట్టిది నిత్యమూ ఈ నిష్ఠలోనే యుండు కారణమున, తన శక్త్యాత్మక విభా గమునందు సైతమూ త్రిగుణముల సంఘర్షణ నుండియు కడకు విముక్తినిసాధింప నేర్చును. ఏలయన, ఈ అవర ప్రకృతి యిప్పుడు క్రమముగా పరాశక్తినుండి కలి గెడు యొత్తిడిని గుర్తెరుగ నారంభించును. దాని ప్రాత అలవాట్లకిక అనుమతిలభిం పక పోవుటచే అవి పునఃపునః ప్రవర్తమానములగుట క్రమముగా తగ్గిపోవును. పర తరమైన కార్యాచరణమునకు, సంస్థితికి తా నాదేశింపబడుచున్నట్లు గ్రహించి, ప్రారంభమున ఎట్టి వైమనస్యము, తడబాటులతో కూడిన ఎట్టి అజ్ఞానము అడ్డు దగిలినప్పటికినీ,—కడు నెమ్మదిగనూ అనిచ్ఛాపూర్వకముగనే యగుగాక,—తుద

కది విధేయమగుచు మార్పునకు అభిముఖమై అందుకొరకు తాను సంసిద్ధమగుట నిశ్చయము.

ఈ పరిస్థితియందు, కేవలము సాక్షి, జ్ఞాత, మాత్రముగనే యుండినప్పటి ఆత్మయొక్క అచల స్వాతంత్ర్యము శక్త్యాత్మకమైన ప్రకృతి పరివర్తనముచే మహోజ్జ్వలమైన మార్పును సంతరించుకొనును. మన మనః ప్రాణదేహములందు అన్యోన్యప్రభావమున కలగాపులగముగా విషమగతితో కొనసాగుచుండెడి గుణత్రయ వ్యాపారము తన మామూలు గందరగోళపు పద్ధతిలో సాగుట ఇక సంభవింపదు. అంతకంటె సక్రమము, దీప్తిమంతము,— మన యిప్పటి దోషభూయిష్ఠ ప్రకృతికి అప్రాకృతము, అసాధారణముగ చూపట్టిననూ, ప్రకృతి పురుషుల ప్రగాఢతను దివ్యలీలావిశేష దృష్ట్యా అత్యంత సహజము, అత్యంత సాధారణమునై విరాజిల్లు ఒక క్రొత్త కార్యాచరణపద్ధతి ఇకమీద సాధ్యమగుచూ క్రమక్రమముగా విస్తరిల్లి పరాకాష్ఠ నందుకొనును. భౌతిక మానసమును తన కట్టడిలో నుంచుకొను శరీర మిపైన ఒకే రకమైన అజ్ఞప్రవృత్తిని నిత్యమూ చర్విత చర్వణముగా అవలంబించుచుండెడి తామసిక జడత్వమును మూర్ఖతతో ఆశ్రయించుకొనియుండుటకు బదులు, ఒక మహత్తర శక్తికి, తేజస్సుకు తానొక తటస్థ క్షేత్రమూ ఉపకరణమూనై, ఆత్మశక్తియొక్క ప్రతి నిర్దేశమునూ మన్నింపుచు, ప్రగాఢమగు ప్రతి వినూత్న దివ్యానుభవ విశేషమునకునూ దోహదము చేయుట నేర్చుకొనును.

అట్లే, గత్యాత్మకములు, శక్త్యాత్మకములునైన మన ప్రాణకోశ విభాగములు,— మన నాడీమండలమునకు, హృదయభావావేశములకు, ఇంద్రియ సంవేదనలకు, సంకల్పప్రవృత్తులకు సంబంధించిన మన ప్రాణమయ సత్త అంతయు,— బలశక్తిసంపదయందు విస్తరిల్లి, బడలికలేని కార్యాచరణమునకును, ఆనంద సంధాయకమైన అనుభవసమృద్ధికినీ అవకాశమిచ్చుచు, ఆదేసమయమున, సువిశాలమగు ఆత్మస్థాయితో కూడిన ప్రశాంత నిశ్చలత్వపు పునాదిపై తాను సుస్థిరమై యుండుట నేర్చుకొనును, శక్తియందుదాత్తమై, విశ్రాంతియందు దివ్యమై, ఉప్పొంగుటలూ ఉద్రేకించుటలూ లేక, బాధలకూ దుఃఖములకూ వివశత్వమునొందక, విపరీతముగ తొందరపెట్టు కామప్రవృత్తులచే కొల్లపోవుటయు, సోమరి

తనముచేగాని అసమర్థతచేగాని మొద్దుపాటుటయు లేనిదై తేజరిల్లెడి నిశ్చలత్వమది. అదేవిధముగా, ఆలోచనాత్మకము, మననశీలము జ్ఞానశక్తి సహితమునైన మన మనస్సు, మన బుద్ధి, తనకుగల సాత్వికారణమును త్రోసిపుచ్చి, ఒక మహత్తర మైన తేజస్సునకూ, అద్దాని శాంతిసంపదకూ ఉన్మీలితమగును. అద్భుతమైన విస్తృతి విశేషములతో, అంతులేని జ్ఞానసంపత్తి మనకు అందుబాటులోనికి వచ్చును.

ఈ జ్ఞానము మానసిక కల్పనలతో కూడినదియు, ఏవో కొన్ని భావము లకు, అభిప్రాయములకు పరిమితమైనదియు కాదు. తడబాటులతో కూడిన సందిగ్ధ తార్కిక ప్రజ్ఞపైగాని, క్షుద్రమైన ఇంద్రియ సంస్పర్శల ప్రాపుపైగాని ఆధార పడినట్టిదియు కాదు. ఇయ్యది సంశయరహితము, యథార్థము, సర్వంకషము, సర్వగ్రాహకమునైన జ్ఞానము. అటులే, నిరవధికములైన శాంత్యానందములు అంతకంతకు విశాలములై ప్రవహిల్లెడి పెక్కు కాలువల ద్వారమున మన ప్రకృతి నంతనూ ఆక్రమించు నిమిత్తమై మన ఆంతరంగిక క్షేత్రములలోనికి పొర్లుకొని వచ్చును. ఈ శాంత్యానందములు ప్రతిరోధములతో కూడిన సృజనశక్తి యొక్కయు, ప్రబల కార్యకలాపముయొక్కయు పరిశ్రమమునుండి విడుమర పొందుటపై ఆధారపడి యున్నట్టివియు గాదు; పరిచ్ఛిన్నములగు కొన్ని సంతో షాత్మక ప్రవృత్తులతో రూపొందినట్టివియుగాదు, స్వయంసిద్ధములై సర్వమునూ తమలో నంతర్భూత మొనర్చుకొనజాలు శాంత్యానందములివి. మనఃప్రాణ దేహముల కతీతమైన స్థానమునుండి ఇట్లొక పరతరమైన శక్తి, జ్ఞానము, ఆనం దము ప్రవహిల్లుచు వచ్చి, ఒకానొక దివ్యరూపమున నా యుపకరణములను మలచు నిమిత్తమై వాటిని కైవసమొనర్చుకొనుట సంభవించును.

మన అవరసత్తకు సంబంధించిన గుణత్రయపు అపత్రుతు లిచట అతిక్రి మించబడి, పరాప్రకృతికి సంబంధించిన మరొక ఘనతర త్రిపుటి ఇటుపై పని చేయ నారంభించును. జడత్వలక్షణోపేతమైన తమోగుణపు అజ్ఞాన మీ పరిస్థితి యందుండనేరదు. దాని స్థానమున నొక దివ్యశాంతియొక్క పరమస్థాయి నెలకొని, ప్రశాంతైకాగ్రతానిష్ఠమైన గర్భాశయమునుండివోలె అందుండి కర్మజ్ఞానముల ఖేలనము వినిస్సృతమగును. ఇటులే, రాజనికోద్వేగసైతమిచట నుండదు. కామము, సుఖదుఃఖాత్మక పరిశ్రమముతో కూడిన వర్తనము, సృష్టి, భోక్తృ

త్వము, సంక్షుభిత ప్రేరణలతో కూడిన గందరగోళము,-ఇవేమియు నిచట నుం డవు. రజస్సుకు బదులుగా నిచట ఆత్మస్థైర్యముతో కూడిన అపారమైన క్రియా శక్తివిలసనము కాననగును. ఎంతటితీవ్రతమ విజృంభణములోనైననూ ఆ క్రియా శక్తిమూలమున ఆత్మయొక్క అచలస్థాయికి భంగము కలుగనేరదు. ఆత్మనిష్ఠ మైన శాంతియొక్క అనంతగగనసీమలను, జ్యోతిర్మయాగాధతలములను ఆ క్రియాత్మకశక్తి మలినపరుపజాలదు. పరమ సత్యమును పట్టి బందీ చేయబూనెడి మానసికకల్పనల వెలుగున కచ్చోట తావు లేదు. నిష్క్రియత నాశ్రయింపగో రెడి భద్రతరహిత సుఖలాలసయు నచట నుండదు. ఇదే రీతిని, సత్వగుణము నకు మారుగా, ఆత్మయొక్క అనంత అగాధ సత్తకు అభిన్నమైన జ్ఞానదీప్తి, ఆధ్యాత్మికానందము మనలో విలసిల్లనారంభించును. మనలో మరుగైయున్న సర్వజ్ఞతత్వపు నిగూఢ మహాతేజఃపుంజములనుండి సరాసరిగ వెల్లుబికి వచ్చెడి సత్యజ్ఞాన ప్రభ యచట అపరోక్షమై భాసించును. ఈ మహత్తర చైతన్యములో నికే మన అవరచేతన రూపాంతరము చెందింపబడవలసి యున్నది. అశాంతికి, అస్థిరతకు నిలయమగు గుణత్రయ ప్రవృత్తులతో గూడిన మన అజ్ఞానభూయిష్ఠ అవరప్రకృతి మహత్తరము, తేజోమయమునైన పరాప్రకృతిలోనికి పరివర్త నము గాంచవలసియున్నది.

మొట్టమొదట మనము గుణత్రయమునుండి వేరై, వాటివలన సంక్షోభవ మును బొందక విముక్తులమై నిస్త్రైగుణ్యుల మగుదుము. కాని, యిది మన ఆత్మ యొక్క సహజస్థితిని మరల చిక్కబట్టుకొనుటయే కాని వేరేమియు గాదు. బంధ రహితమైన ఆత్మ తన అచలస్థాయిలో తానుండి అజ్ఞాననిష్ఠమైన అవరప్రకృతి కార్యకలాపమునంతనూ తిలకించుచుండును. దీని నాధారముగ జేసికొని, అవర ప్రకృతి గతివిశేషమగు మన ప్రకృతియు విముక్తము గావలెననిన, ఒకానొక దివ్యనీరవశాంతినుండి ఆవిర్భూతమగు క్రియానైశ్చల్యము మూలముననే అయ్యది నెరవేరవలసియున్నది. అవసరమైన క్రియాకాలాపమంతయు ఆనీరవశాంతియందు మనఃప్రాణసత్తల ప్రమేయ మేమియు లేకయే సాగిపోవుట సంభవించును. మనః ప్రాణములు తానే ఆ క్రియల నుపక్రమించుటగాని, వాటిలో పాల్గొనుటగాని, వాటికి ఎరుకతో ప్రతిస్పందించుటగాని జరుగదు. మనఃప్రాణ కోశములం దొక

చిరుతరంగముగూడ తలయెత్తకుండగనే ఆ క్రియాకలాపము అంతయు సాగి పోవును అపౌరుషేయ విశ్వశక్తిచేగాని, విశ్వాతీత శక్తిచేగాని ప్రేరేపించబడు నదియు, ప్రారంభించబడునదియు, నిర్వహించబడునదియునై ఆ క్రియాకలాపము కొనసాగవలసియుండును.

విశ్వాత్మకమైన మనఃప్రాణ ద్రవ్య సంపుటి యొకటి ఇచటనే పనిచేయ వలసి యుండును. లేక, మన వైయక్తిక సత్తకంటెను, అద్దానిచే కూర్చుకొన బడిన ప్రకృతికంటెను వేరైన విశుద్ధ సర్వాతీత ఆత్మశక్తి, ఆత్మానందము ఇచట ప్రవర్తిల్లవలసియుండును. ఈ విముక్తస్థితి కర్మయోగమున అహంకారమును, కామమును, సకలారంభములను విసర్జించి, విశ్వాత్మునకు, లేక విశ్వశక్తికి మన సత్తను సమర్పణ మొనర్చుకొనుట ద్వారమున చేకూరుట కవకాశము కలదు. అట్లే జ్ఞానయోగమున నియ్యది ఆలోచనల విరమించి, మనోమౌనమును సాధించి, విశ్వచేతనకు, విశ్వాత్మకు, విశ్వశక్తికిగాని, లేక పరమ సత్యమునకుగాని మన సకలమునూ ఉన్మీలన మొనర్చుకొనుట ద్వారమున చేకూరుట కవకాశము కలదు. అదేరీతిని భక్తియోగమున మన సకల సత్తకూ ప్రభువూ ప్రియుడూనై విరాజిల్లు అఖండానందస్వరూపుని చేతిలోనికి మన హృదయమును, మన సకల ప్రకృతిని సమర్పణ మొనర్చుకొనుట ద్వారమున చేకూరుట కవకాశము కలదు. కాని, దీని పర్యవసానముగా సిద్ధించెడి పరివర్తనము కేవల విముక్తస్థితిగనేకాక, శక్త్యాత్మక మగు అతీత స్థితిగకూడ విరాజిల్లగలదు. మహత్తరమైన అధ్యాత్మిక శక్తివిలసన మున మనల పాల్గొనజేయగల త్రిగుణాతీత స్థితిలోనికి పరివర్తన మిది. విషమ గతిలో ప్రవర్తిల్లు అపరప్రకృతి గుణములు మూడును ఇచట పరాప్రకృతికి చెందిన స్థాయిని, శక్తిని, తేజస్సును వెలార్చుకొనుచు, సమగతిలో ప్రవర్తిల్లు అతీత త్రిపుటిలోనికి పరివర్తనము చెందును.

అహంకారికమైన సంకల్పము, వరణము, ఆచరణము అంతరించి, పరి చ్ఛిన్నమగు మన బుద్ధికి నిశ్చలత యేర్పడినగాని, పరమమైన యీ సామరస్య సిద్ధి కలుగజాలదు. వైయక్తికాహంకార ప్రయత్న మంతరింపవలెను. బుద్ధికి

మానముద్ర యలవడవలెను. కామసంకల్పము తలయెత్తరాదు. మన వ్యక్తిత్వము తన మూలస్థానమును అనుసంధింపవలెను. సకల యోచనలు, సకలారంభములు ఊర్ధ్వమునుండియే రావలెను. అంతట, మన యంతరమున నిగూఢమైయుండి మన కర్మప్రవృత్తులకెల్ల ప్రభువై విరాజిల్లు పరమేశ్వరుడు మనకు క్రమముగా సాక్షాత్కరింపుచు, తన పరమసంకల్ప పరమజ్ఞానస్థాయినుండి అనుమతింపుచుండగా, పరాశక్తియే విశుద్ధతను, ఉన్నతిని సంతరించుకొన్న మన ప్రకృతిని తన యుపకరణముగా జేసికొని తానే మనలో సకలకర్మలను నిర్వర్తించును.

మన వైయక్తిక కేంద్రమిచట ఆమె కార్యకలాపమునకొక ఆధారస్థానము వంటిది మాత్రమే. ఆ కార్యకలాపమును స్వీకరించి అద్దానికి వాహకమగుచు, ఆమెశక్తిని తనయందు ప్రతిబింబింపునదియు, ఆమె జ్ఞానానందశక్తి విలసనమున తానుగూడ దీప్తితో పాల్గొనునదియునై అయ్యది విరాజిల్లును. కర్మనుచేయుచుండియును అది చేయనిదే. అవర ప్రకృతి ప్రతిస్పందన లేవియూ దానిని అంటజాలవు. ప్రకృతియొక్క గుణత్రియము నధికరించుట తొలుత సంభవింపగా, అటుపై ఆ గుణత్రయమును రూపాంతరము చెందించుట యీ మార్పులో జరుగు ముఖ్యవిశేషము. కర్మమార్గమీ మార్పు ఫలితముగా మన మానవప్రకృతియొక్క సంకుచితరూపమైన చీకటికూపమునుండి ఉద్ధరించబడి, మన కూర్ధ్వమున తేజరిల్లు దివ్యసత్య తేజోమయ సువిశాలతలోనికి విస్తరిల్లును.

—౦—

# అధ్యాయము 11

## నిఖిల కర్మాధినాధుడు

మన కర్మలకు ప్రేరకుడును, అధినాధుడును నైనవాడు ఏకస్వరూపుడై విశ్వమయుడు, పరముడు, నిత్యుడునైన అనంతుడు. ఆతడు మనకు ఊర్ధ్వమున విలసిల్లు అజ్ఞాత-అజ్ఞేయ-అవ్యక్త-అనభివ్యక్త-సర్వాతీత పరబ్రహ్మము. అంతియే కాక, అతడు సకల భూతాంతరాత్మయై, నిఖిలభువనాధీశ్వరుడై, సర్వాతీతాయి యగుచు, పరమజ్యోతి, పరమగురువు, పరమ సుందరుడు, పరమానంద స్వరూపుడునై విరాజిల్లు పరమప్రియుడు, పరమప్రేమరసైకమూర్తికూడ. మనచుట్టునూ సృష్టివిలాసమును ప్రదర్శించుచున్న యీ విశ్వశక్తియు విశ్వాత్మయును నాతడే. ఆతడే మనలో అంతర్యామియైగూడ వెలుగొందుచున్నాడు. ఉన్నది సమస్తమూ ఆతడే. ఈ ఉన్నదానికంటె మించిఉన్నవాడునూ ఆతడే, మనకు తెలిసినను తెలియకపోయినను మన మందరమూ గూడ, ఆతని సత్తలోని సత్తయు, శక్తిలోనిశక్తియునై, అతనినుండియే సంక్రమించిన చైతన్యస్వరూపులము. ఈ మన మర్త్యస్వరూపముగూడ అతనియందలి పదార్థమునుండి రూపొందించబడినట్టిదే. మనలోపల, అమర్త్యము, నిత్యమునై భాసించు దివ్యానంద, దివ్యజ్యోతి స్ఫులింగ మొకటి కలదు. జ్ఞానముచేగాని, కర్మచేగాని, ప్రేమచేగాని, మరి దేనిచేనైననూ గాని,-ఎట్లయిననూ సరే మన ఉనికియొక్క యీ సత్యమును గుర్తించి, సాక్షాత్కరించుకొని, ఇహమునగాని పరమునగాని దాని సాఫల్యసిద్ధిని పొందుటయే సకల యోగసాధనకునూ లక్ష్యము.

*    *    *

కాని, బహుళశ్రమతో, సుదీర్ఘ ప్రయాణమొనర్చినగాని, సత్యదర్శన సమర్థములైన చక్షువులతో అతనిని మనము వీక్షింపజాలము. అతని యథార్థప్రతిమగా మనలను మనము పునర్నిర్మాణము గావించుకొనవలెననిన, మన ప్రయత్నము మరింత దీర్ఘము, మరింత బహుళశ్రమోపేతము గాకతప్పదు. ఆ నిఖిల కర్మాధీశ్వరుడు ఒక్కసారిగ వెంటనే సాధకునకు సాక్షాత్కరింపడు. తెర మరుగున దాగియుండి అతని దివ్యశక్తియే సర్వదా పనిచేయుచున్నది. కర్మలు చేయుచున్నది మనమే యను కర్తృత్వాహంకారమును మనము పరిత్యజించినగాని, ఆ శక్తి మనకు అభివ్యక్తము గానేరదు. ఆ పరిత్యాగము మనలో అంతకంతకు ఘనిష్ఠరూపము దాల్చుచున్న కొలది దాని ప్రత్యక్ష చర్యయు మనలో నధికమగుచుండును. పరాశక్తికి మనము చేయు నాత్మార్పణము నిరపేక్షమూ సంపూర్ణమూనైనప్పుడే అయన సాక్షాత్సాన్నిధ్యమున నివసించు నధికారము మనకు కలుగును. మనముచేయు కర్మ ఈశ్వరేచ్ఛ కనురూపమైన వడియచ్చున స్వాభావికముగా, సమగ్రముగా, సరళముగా పోతపోయబడుట సంభవించునది యప్పుడే.

కాని, యీ పూర్ణత్వసిద్ధికి మనము చేయు ప్రయత్నమునందు,- ప్రకృతి భూమికలలోని ఇతర పూర్ణత్వసిద్ధులకొరకై కొనసాగింపబడు పురోగతుల సందర్భములో వలెనే,- కొన్ని అంచెలు, మజిలీలు ఉండుట అనివార్యము. సిద్ధియొక్క పూర్ణవైభవ దర్శనము మనకు ముందుగానే,- హఠాత్తుగ గాని క్రమక్రమముగ గాని, ఒక్కసారిగగాని పలుసార్లుగగాని, కలుగుట సంభవింపవచ్చును. కాని, పునాది సమగ్రము, సుస్థిరము నగు పర్యంతము అయ్యది సంగ్రహప్రాయము, ఏకదేశనిష్ఠము నగునే కాని, సుస్థిరము, సర్వవ్యాపకమునైన అనుభూతి సాక్షాత్కారము కాజాలదు. ఈశ్వర సాక్షాత్కారపు విస్తృతులు, అనంత విభూతులు మనకు తరువాత క్రమక్రమముగా ద్యోతకములగుచు, తమ ఆంతర్యమును, శక్తి విశేషములను విశదముగా మనకు బొడగట్టజేయును. అట్లుగాక, ఒకవేళ మన ప్రకృతియొక్క శిఖర స్థానమునందీ దర్శనము నిలుకడగా నిలిచియుండినను, మనలోని అవరవిభాగము అద్దానికి సంపూర్ణముగ ప్రతిస్పందించుట క్రమక్రమముగా మాత్రమే సంభవించును. సకల యోగములందును తొలుదొల్త మనకు అలవడవలసిన లక్షణములు విశ్వాసము, సహనము. పరంధామమును ఒక్కసారిగ ముట్ట

దించి ఆక్రమించుకోవలెననెడి హృదయోద్వేగములు, సంకల్పతీవ్రతలు తమ ఉద్వేగ, తీవ్రతలకు ఈ సౌమ్య వినమ్ర సహకారి లక్షణములను తోడు చేసికొన నిచ్చగింపనిచో, అద్దాని ఫలితములు కడు దుఃఖకరములై పరిణమించుట కవకాశము కలదు. సుదీర్ఘము, కష్టబహుళమునైన పూర్ణయోగమునందు సాధకుడు సంపూర్ణమైన విశ్వాసమును, అచంచలమైన సహనమును దృఢముగా నభ్యసింప నేర్చుకొనుట అత్యంతావశ్యకము.

మన బుద్ధియందు, హృదయమునందు, సంకల్పశక్తియందు అసహన పూర్వకమగు తొందరపాటు చెలరేగుచుండు కారణమున నీ విశ్వాస, సహనములను మిట్టపల్లములు గల ఇరుకైన యోగమార్గమునందు అభ్యసించుటయు అలవరచుకొనుటయు మిగుల కష్టము, మానవుని ప్రాణమయ ప్రకృతి యెల్లప్పుడునూ తన కృషిఫలితముకొరకై వెంపరలాడుచుండును. ఆ ఫలితము తనకు నిరాకరించబడుచున్నట్లు తోచినను, అది తనకు చేకూరుటకు దీర్ఘ విలంబనము జరుగుచున్నట్లు కనిపించినను, అయ్యది తన లక్ష్యమునందును, అద్దాని నేతృత్వమునందును విశ్వాసమును కోల్పోవును. ఏలయన, అతని బుద్ధి సదా ఆయా విషయజాతపు బాహ్యలక్షణములను బట్టి మాత్రమే నిర్ణయములు గావించుచుండును. ఎక్కడలేని నమ్మికతోనూ అతడు పట్టుకొని వ్రేలాడు హేతువాదధోరణికి పట్టువడిన తొలి అలవాటు అదియే. దీర్ఘకాలము మనము బాధలకు లోనుగావలసివచ్చినప్పుడుగాని, చీకటిలో దారిగానక తొట్రుపాటులు పడవలసి వచ్చినప్పుడుగాని, మన హృదయములో భగవంతుని నిందించుటకంటె సులభతరమైనది మనకు వేరొకటి లేదు, మనము పెట్టుకొనిన లక్ష్యమును విడనాడుటయు అట్టి సందర్భములో కడు సులభమే.

ఏలయన, "ఆ పరమేశ్వరుని నే నెంతగానో నమ్మకొనియుంటిని. కాని, బాధలు, కలుషములు, ప్రమాదములు నాకు సంప్రాప్తమైనవి, నేను వంచితుడనైనాను," అని మన మందుము లేక, "ఒక లక్ష్యసిద్ధికొరకై నేను నా జీవితమునెల్ల ఒడ్డితిని. కాని, నా అనుభవమునకు వచ్చిన కఠిన సందర్భములు నా లక్ష్యమునకు విరోధులై నిరుత్సాహమును జనింపజేయుచున్నవి, ఇతరు లేరీతిని తమకు గల పరిమితులకు లోబడి తమ సాధారణానుభవపు స్థిరభూమిపై నడచుచున్నారో

అట్లే నేనునూ చేసియుండిన బాగుండెడిది,"- అని వక్కాణింతుము. అట్టి క్షణ ములయందు,- ఇది ఒక్కొక్కప్పుడు కడు తరచుగా సంప్రాప్తమై దీర్ఘకాల ముండుట గూడ సంభవించుచుండును,-అంతకు పూర్వము మనకు కలిగియుండిన ఘనతరానుభూతుల నన్నింటినీ మనము మరిచిపోవుచుందుము. హృదయముతనను ఆవేశించిన కలతలో తాను నిమగ్నమై పోవును. ఇట్టి చీకటి సన్నివేశములలోనే మనము శాశ్వతముగ పతనము చెందుటయు, మనము చేయు దివ్య పరిశ్రమము నుండి పూర్తిగా మరలి పోవుటయు సంభవింపగల ప్రమాద మున్నది.

దీర్ఘకాలము నిలుకడగా సాధన కొనసాగించుటను సాధకుడు నేర్చుకొనిన యెడల, అతని హృదయమందలి విశ్వాసము ఎంతటి భయంకరమైన ప్రతికూల పరిస్థితియందైననూ సడలక నిలిచయుండ గల్గును. ఒకవేళ అది తొలుత మఱుగు పడుటయు, లేక అణగారిపోయినట్లు తోచుటయు జరిగినను, అచిరకాలముననే మరల ప్రకటితమగుట తథ్యము. ఏలయన, హృదయముకంటెను, బుద్ధికంటెను పరతరమైన దొకటి ఎంతటి విపరీతపు తొట్రుపాటులందైనను, ఎంతటి దీర్ఘమైన వైఫల్యస్థితియందైనను అద్దానికి తాను ఊతయొసగి నిలువబెట్టును. కాని, యిట్టి తొట్రుపాటులు, మబ్బుతెరలు అనుభవశాలియగు సాధకుని పురోగతికి గూడ అవరోధకమై పరిణమించుచుండుట కలదు. అట్టియెడ, ప్రారంభదశలోని సాధకుని కవి మిక్కిలి ప్రమాదకరములే కదా, కావున సాధకుడు మొదటినుండియుగూడ ఈ మార్గములోని బహుశ్రమను గుర్తించి, అంగీకరించి, బుద్ధికి అంధప్రాయ ముగా గనుపట్టినను, బుద్ధికంటె వివేకవంతమని చెప్పదగు విశ్వాసావశ్యకతను బాగుగా హృదయస్థ మొనర్చుకోవలసియున్నది.

ఏలయన, ఈ విశ్వాసము ఊర్ధ్వమునుండి మనకు అందింపబడెడి చేయూత బుద్ధికి, దాని ప్రమాణములకు అతీతమై వెలయు ఒకానొక నిగూఢ జ్యోతియొక్క కాంతిమయచ్ఛాయావిశేషమది. బాహ్యదృశ్యములపై ఎంత మాత్రమూ ఆధార పడని నిగూఢజ్ఞానహృదయ మీ విశ్వాసము. పట్టుదలతో విశ్వాసమును మనము పీడకయుందుమేని. అయ్యది తన ప్రయోజనమును నిరూపించుకొనుచు ఉన్నతిని పొంది, కడకు దివ్యజ్ఞాన సాక్షాత్కారములోనికి రూపాంతరము చెందును. "అని

ర్విణ్ణమైన,- విషాదమున క్రుంగిపోని,-హృదయముతో యోగమును సంతతముగ నభ్యసించుచుండవలె "నను గీతాబోధను మనము సదా వీడక అనుష్ఠించుచుండుట అవసరము. "సర్వపాపముల నుండియు నీకు నేను తప్పక విమోచనము కల్పించెద" నని ఆ ప్రభువు చేసిన వాగ్దానమును సంశయాకులమగు బుద్ధికి మనము నిత్యమూ గుర్తుచేయుచుండవలెను. కట్టకడకు, విశ్వాసము చలించుట పూర్తిగా కట్టువడిపోయి, ప్రభుని సాక్షాద్దర్శనమును పొందినవారమై, ఆతని దివ్యసన్నిధిని సదా అనుభవించుచుండెడి స్థితికి మనము చేరుకోగలుగుదుము.

* * *

మన కర్మల కధినాథుడైన ప్రభువు మన ప్రకృతిని ఒక వంక రూపాంతరము చెందించుచునే వేరొకవంక దానిని గౌరవించుచుండును. అతడు మన ప్రకృతిద్వారమున పనిచేయునేకాని ఏదియో నిరంకుశమైన అస్థిరధోరణిలో పని చేయడు. దోషజుష్టమగు మన ప్రకృతియందు నిర్దుష్టతకు తోడ్పడగల మూల పదార్థములున్నవి. కాని అవి ఒక తీరుగా లేవు. క్రమవిరహితముగా, కలగాపులగముగా, అస్తవ్యస్తముగా, ఆరంభదశయందున్నవి. ఈ పదార్థము నంతనూ నెమ్మదిగా శుద్ధమొనర్చి, క్రమపరచి, క్రొత్తగా పోతపోసి రూపాంతరము చెందింపవలసియున్నది. అంతియేకాని, దానిని చితుకగొట్టి, నరికి, ఛిన్నాభిన్నముచేసి, హతమార్చుటయు, బలవంతముగనూ నిరాకరణపూర్వకముగనూ అద్దానిని తుడిచిపెట్టుటయు చేయరాదు. ఈ ప్రపంచము, అందు నివసించుచున్నమనము ఆ ప్రభుని అభివ్యక్తిరూపముగా అతనిచే సృజింపబడినవారము. అజ్ఞము, సంకుచితము నైన మన మనస్సు అవగాహన మొనర్చుకోజాలని పద్ధతిలో అతడే ప్రపంచముతోనూ మనతోనూ వ్యవహరించును. మనస్సు మౌనస్థితిలో నిమగ్నమై, దివ్యజ్ఞానమున కున్మీలితమైనగాని ఆతని పోకడలు దానికి తెలియజాలవు.

మనము చేయుతప్పులకు మూలమున నొక సత్యపదార్థము కలదు.తడుములాడు చున్న మన బుద్ధికి తన ఆంతర్యమును వెల్లడింపవలెననిఅద్దాని ప్రయత్నము. తప్పులతోపాటు సత్యమునుగూడ మానవబుద్ధి ఖండన మొనర్చి దాని స్థానమున సగము సత్యమైన సగము తప్పు నొకదానిని నెలకొల్పుచుండును. ప్రతి తప్పు

చాటుననూ గుప్తపరుపబడియున్న సత్యమును మనము తెలిసికోగలుగు పర్యంతము, దివ్యజ్ఞాన స్వరూపుడైన ఆ పరమేశ్వరుడు మన తప్పులను సహనముతో కొనసాగనిచ్చుచుండును. మనము చేయు పాపములు మనలో నొక అన్వేషణలో నున్న ఒకానొక శక్తి తప్పుదారిలో పడి చేయు పదన్యాసములు మాత్రమే. అద్దాని లక్ష్యము పాపాచరణముకాదు. దివ్యగుణవిశేషముగ పేర్కొనదగిన ఒకానొక విశుద్ధతను సాధించుటయే అద్దాని లక్ష్యము. తరుచుగా నీ పాపము లొక గుణవిశేషమును కప్పిపుచ్చెడి మాయ ముసుగులు. వికృతమైన యీ ముసుగు నూడ్చి అద్దానిని రూపాంతరము చెందింప వలసియున్నది. అట్లుకానిచో, నిర్దుష్టమగు భూతసృష్టివిధానమునందు ఈ పాపము లనువాటిని ఉండనిచ్చుటయు, కొనసాగనిచ్చుటయు జరిగియుండెడిది కాదు. మన కర్మల కధినాధుడైన ఈశ్వరుడు పొరపాట్లు చేయునట్టివాడు కాదు. కొరమాలిన యీ పాపముల నుదాసీనుడై తిలకించువాడును, భోగియై వాటితో సయ్యాట లాడువాడును గాదు. మన హేతువాద ప్రజ్ఞకంటెను, మన గుణసంపద్విశేషముకంటెను అతడు వివేకశాలి.

మన మానవప్రకృతి, యిచ్ఛాశక్తి విలసనమున పొరపాట్లకు లోనగునది, జ్ఞానశక్తి విలసనమున తెలివిమాలినది మాత్రమేగాక, క్రియాశక్తి విలసనమున కడు దుర్బలము కూడ. కాని, ఈశ్వరశక్తియందు మనము విశ్వాసముంచి, మన లోపములను, సామర్థ్యములను ఈశ్వరకార్యము కొరకు వినియోగింతుమేని, మనకు చేయూత యొసగి నడిపించి తీసుకొనిపోవుటకు ఈశ్వరశక్తి సిద్ధముగనే యున్నది. మనము వెంటనే సాధింపవలెననుకొన్న లక్ష్యము నొకవేళ సాధింపలేకపోయినచో, ఆ వైఫల్యము ఈశ్వరేచ్ఛచే కలిగినదే. మన వైఫల్యము తరచుగా మనలను సరియైనదారిలో పెట్టి, తక్షణవిజయము మనకు అందింపగలిగి యుండుదానికంటె నిక్కమైన లక్ష్యసిద్ధికి మనకు సహాయకారి యగుచుండును. మనము బాధలకు గురికావలసి వచ్చుచో, దానికి కారణము మనలో నేదియో అపురూపమైన ఒకానొక ఆనందప్రాప్తికి సన్నద్ధము గావింపబడవలసియుండుటయే. దారిలో మనము తొట్రుపాట్లు పడుచున్నచో, అయ్యది సరియైన నడక నేర్పు తుదకు మనము నేర్చుకో గలుగుటకే.

శాంతిని, విశుద్ధిని, పూర్ణసంసిద్ధిని సంపాదించుటకు అమిత తీవ్రతతో కూడిన తొందరపాటు మనకు కూడదు. శాంతిని మనము సాధింపవలసినదే,—కాని అది శుష్కమైనట్టియు, నిష్ప్రచ్ఛరమైనట్టియు, అశాంతిప్రకటన కసమర్థములుగా జేయబడిన వినష్ట సామర్థ్యములు గలిగినట్టియు శాంతి కారాదు. అటులే, విశుద్ధి సాధనయు మనకు లక్ష్యముగావలసినదే,—కాని అది శూన్యస్థితిని వెల్లడించునట్టియు, కఠినమైన ఉదాసీనతను ప్రకటించునట్టియు విశుద్ధి కారాదు. అదేవిధమున, పూర్ణ సంసిద్ధియు మనము పొందితీరవలసినదే,—కాని అది సంకుచితమైన పరిమితుల లోపల బంధింపబడినట్టియు, అనంతుని అంతులేని విస్తృతికి అవధిని విధించు నట్టియు సంసిద్ధి కారాదు, దివ్యప్రకృతిలోనికి పరివర్తనము చెందుట మనలక్ష్యము. కాని, యీదివ్యప్రకృతి మానసికస్థితియో నైతికస్థితియో కాదు. అయ్యది ఒకానొక ఆధ్యాత్మికస్థితి. దానిని సాధించుట మిక్కిలి కష్టము. మన బుద్ధిచేత దానిని ఊహించుట సైతమూ మిక్కిలి కష్టమే. మన కర్మలకు, మన యోగసాధనకు అధినాథుడగు పరమేశ్వరునకు ఏమిచేయవలెనో తెలియును. ఆ చేయవలసినదానినాతడు తన సాధనములతో, తన పద్ధతిప్రకారము చేయుట కవకాశ మిచ్చుటయే మనము చేయవలసిన పని.

అవిద్యయందలి మూలప్రవృత్తి అహంకార విశిష్టమై యుండును. వ్యక్తిత్వము నామోదించి, మన అసమగ్రప్రకృతికి గల పరిచ్ఛిన్నమైన వెలుగును, శక్తిని పురస్కరించుకొని కర్మాచరణమున మనము ప్రవృత్తుల మగుచున్నంత కాలము, అహంకారమును నిరోధించుటకంటె మనకు కష్టతరమైనది వేరొకటి లేదు. కర్మాచరణ ప్రవృత్తిని విడనాడుట ద్వారా అహంకారమును కృశింపజేయుటగాని, వ్యక్తిత్వపు సకల ప్రవృత్తినీ త్రుంచివేయుటద్వారా దానిని హత మార్చుటగాని సులభమే. ఒకానొక శాంతి పారవశ్యములోనో దివ్యప్రేమానందములోనో నిమగ్నమగునట్లు దానికి ఉన్నతి ఘటింపజేయుటయు సులభమే. కాని, మనయందు నిక్కమైన పురుషునికి విమోచనము కలిగించి, దివ్యశక్తివిలసనమునకు నిర్దుష్టసాధనముగను, దివ్యకార్యాచరణమునకు విశుద్ధోపకరణముగను దివ్యమానవత్వసిద్ధిని సాధించు టెట్లుననదే మనమెదుర్కొనుచున్న కఠినతర సమస్య. ఇందుకు ఒక్కొక్క అడుగే స్థిరముగ వేసికొనుచు మనము ముందుకు

సాగవలసియున్నది. ఒక్కొక్క కష్టమునే పూర్తిగ అనుభవించుచు క్రమముగా అన్నిటినీ పూర్తిగ వశీకరించుకోవలసియున్నది. ఈ కార్యము మనకు ఒనగూడు నట్లు చేయజాలినది దివ్యజ్ఞానము, దివ్యశక్తి మాత్రమే. సంపూర్ణమైన విశ్వాస ముతో దానికి మనము విధేయులమై, సుస్థిర ధైర్యముతోడను, సహనముతోడను దాని కార్యగతుల ననువర్తింపుచు ఆమోదించుచుందుమేని, తప్పక అది సమ స్తమూ నిర్వహింపగలదు.

ఈ సుదీర్ఘమార్గములో మనము మొట్టమొదట చేయవలసిన పని మన సకల కర్మలనూ మనయందును; ఈ సకల ప్రపంచమునందును నెలకొనియున్న పరమేశ్వరునకు యజ్ఞవిధిగా నివేదన మొనర్చుట. బుద్ధికి, హృదయమునకు ఈ వైఖరిని అలవడజేయు సాధనను ఉపక్రమించుట ఏమంత కష్టము కాదుగాని, సంపూర్ణమైన అంతశ్శుద్ధితో దానిని కొనసాగించి దానికి అఖండవిస్తృతి చేకూ ర్చుట మిక్కిలి కష్టము. ఇక, దీని తరువాత జరుగవలసినది మన కర్మఫలము లందు మనకుగల ఆసక్తిని పూర్తిగా విడనాడుట. ఏలయన, నిక్కమైనదీ, అని వార్యమైనదీ, అత్యంత మపేక్షణీయమైనదీ అగు యజ్ఞఫలము మనలో దివ్య చైతన్యము, దివ్యశక్తి, దివ్యసన్నిధి దీపించుటయే. అది ఒక్కటే ముఖ్యముగా మనకు గావలసినది. అది లభించినచో ఇక తక్కిన సమస్తమూ దానంతటదియే లభింపగలదు. మన కామాత్మను, కామప్రకృతిని, ప్రాణమయసత్తయందలి అహంకారిక సంకల్పమును రూపాంతరము చెందించుటిది.

కాగా, ఆ తరువాత జరుగవలసిన మూడవ కార్యము 'నేను కర్త' నను అహంకారమునుగూడ విడిచి అహంకారపు గూడు లేకుండ చేసికొనుట. ఇదే సకల పరివర్తనములలోనూ అత్యంతకష్టసాధ్యమైనది. మొదట చెప్పిన రెండు కార్య ములూ సాధింపబడనిచో ఈ మూడవది నిర్దుష్టమగ సాధింపబడనేరదు. కాని, సాధనకు మకుటాయమానమైన ఈ మూడవది సాధింపబడనిచో మొదటి రెండునూ పూర్తి కాజాలవు కూడ. అహంకార నిర్మూలనము ద్వారా కామమూలము ఛేదింప బడుట యీ మూడవదశలో జరుగును. ప్రకృతినుండి యీ క్షుద్రాహంకారము పూర్తిగా పెకలించివేయబడినప్పుడే సాధకుడు పరమేశ్వరునిలోని ఒక అంశము,

శక్తివిశేషమునై ఊర్ధ్వమున విరాజిల్లుచుండెడు తన యథారపురుష స్వరూపమును తెలిసికొన నేర్చును. దివ్యశక్తియొక్క యిచ్ఛకుగాక ఇతరేచ్ఛల కన్నింటికీ ఆ సన్నివేశములో పూర్తిగా ఉద్వాసము చెప్పబడును.

* * *

పూర్ణత్వసాధకునకు నీ చిట్టచివరి ప్రగతిలో కొన్ని దశలు కలవు. ఏల యన, అది ఒక్కసారిగ వెంటనే సాధ్యమగునట్టిది కాదు. సుదీర్ఘ ప్రయాణముల అనంతరమునగాని గమ్యము అంతకంతకు చేరువయ్యె మనకు దానిని చేరుట సంభవింపదు. ఈ సందర్భములో మనము తొలుత అలవరచుకోవలసిన దృక్పథము కర్తృత్వభావమును విడనాడి మనము కేవలము విశ్వశక్తి ఉపకరణ మాత్రులమే యన్న దృఢజ్ఞానముతో నుండుట. ఏకమై విలసిల్లు విశ్వశక్తిగాక పెక్కు విశ్వ శక్తులు మనలను నడుపుచున్నట్లుగా ప్రారంభమున మనకు తోచును. కాని, యీ శక్తుల వినియోగము అహంకారపోషకముగా తయారగుట కలదు. ఈ విధమైన దర్శనము మనస్సుకు విమోచనము కల్పించునేకాని, తక్కిన ప్రకృతికి విమోచనము కల్పింపనేరదు. ఏకమైన విశ్వశక్తి యొక్కయు, అద్దాని వెనుకనున్న ఈశ్వరునియొక్కయు కృతకలాపమే సమస్తమూ నని మనము తెలియగలిగి నప్పుడుకూడ అది మన కృతిని విమోచనసాధకమగునని చెప్పుటకు వీలులేదు. నేను కర్తనను అహంకారము లేకపోయినచో దాని స్థానమున, 'నేను ఉపకరణము' ననెడి అహంకారము తలయెత్తుటయు, లేక కర్తృత్వాహంకారమునే మారురూపమున కొనసాగించుటయు సంభవించవచ్చును.

ప్రపంచ జీవితమున ఈ రకమైన అహంకారవిలసనమున కుదాహరణలు కొల్లలుగా నున్నవి ఇతరాహంకారముల కంటె ఎక్కువ ప్రబలము, పృథులము నై యీ అహంకారము కొనసాగుటకు వీలున్నది. యోగజీవితమునందు సైతమూ ఈ ప్రమాదమే కలదు. ఒకడొక ప్రజానాయకుడు కావచ్చును. లేక, కొద్దిమందిలో గాని పెక్కుమందిలోగాని ప్రముఖస్థాన మాక్రమించి, తన అహంకారిక శక్తి కంటె అతీతమైనదని తాను గుర్తించిన ఒకానొక శక్తి తనలో నిండి తొణికిస లాడుచున్నట్లు భావింపవచ్చును. ఒకానొక మహావిధి తన ద్వారమున పనిచేయు

చున్నదనియు, అత్యంత నిగూఢము, అగాధమునైన ఒకానొక మహాసంకల్పశక్తి, అత్యంత ప్రకాశవంతమైన ఒకానొక మహాతేజస్సు తనలో ప్రవర్తించుచున్న దనియు అతనికి తోచవచ్చును. అతని తలపులకు, చేష్టలకు, సృజనాత్మక ప్రతిభకు అసాధారణ ఫలితము లేవియో ఒనగూడుట జరుగుచుండ వచ్చును. మానవ జాతికి మార్గమును సరిచేయుటకై ఏదియో ఘోర వినాశము నాతడు కల్పించగలిగి యుండవచ్చును. లేక, తాత్కాలికముగా మానవజాతి కొంత విశ్రాంతిసౌఖ్యము ననుభవింపగలుగుటకై నిర్మాణాత్మకమైన మహాకృషిని అత డొనర్చియుండ వచ్చును. అతడొక ఉపద్రవమును తెచ్చిపెట్టినవాడో, వెలుగు నిచ్చినవాడో, ఆర్తిని నివారించినవాడో, సౌందర్యసృష్టి యొనర్చినవాడో, జ్ఞానమును అందించిన వాడో కావచ్చును. లేక, అతని కార్యకలాపము కొంత తక్కువస్థాయిలోనిది, పరిమితక్షేత్రములోనిది అయినప్పుడుగూడ, తానొక మహాశక్తి కుపకరణము ననియు, తాను చేయుకార్యమునకు తానెన్నుకోబడితిననియు బలమైన భావమతనిలో నెలకొనవచ్చును.

ఈ విధమైన విధివిశేషము, శక్తివిశేషములు కలవారు తాము విధిచేతిలో గాని భగవంతుని చేతిలోగాని ఉపకరణమాత్రులమని సులభముగా విశ్వసించి ఆ ప్రకారము ప్రకటించుకొనుచుండుటగూడ జరుగుచుండును. కాని, యిట్టి ప్రకటనలో సైతము, సామాన్యమానవులు తమలో ప్రోదిచేసికొని వెల్లడింప సాహసించు దానికంటె మిక్కిలి హెచ్చయిన అహంకారప్రాబల్యము చోటు కల్పించుకొని చొచ్చుకొనివచ్చుట కవకాశము కలదన్న సంగతి మనము గమనింపగలము. తరచుగా నిట్టివారు భగవంతునిగురించి మాట్లాడిరేని, అది ఆయనను తమయొక్కయు తమ ప్రకృతియొక్కయు బృహచ్ఛాయా మూర్తిగ చిత్రించుటయే తప్పవేరేమియు కాజాలదు. భగవంతుడనగా, తమకున్నమాదిరి సంకల్పములను, ఆలోచనలను, గుణములను, శక్తులను బలపరచెడి ఒక మహాతత్వమని వారి యుద్దేశము. వారు సేవించు ఈశ్వరుడిట్లు వారి అహంకారపు బృహద్రూపము మాత్రమే.

ప్రబలములయ్యూనూ అసంస్కృతములైన ప్రాణమయ ప్రకృతులుగాని, అతి సులభముగా తమకొక మహోన్నతస్థాయి కల్పించుకొనెడి మనోమయ ప్రకృతులు గాని, తమకుగల అత్యాశను,స్వాతిశయ ప్రవృత్తిని, గొప్పదనము సాధించ

కోవలెనన్న కోర్కెను తమఆధ్యాత్మిక సాధనలోనికి చొరనిచ్చి అద్దానిలక్ష్యవిశుద్ధిని కలుషిత మొనర్చుకొనుట జరిగినచో ఇట్టి పరిణామము కడుతరచుగా సంభవించు చుండును. బృహద్రూపముగై కొన్న అహంభావము వారికిని, వారి నిజసత్తకును నడుమ అడ్డుగా నిలిచి, వారిద్వారా పనిచేయు నొకానొక ఘనతరమైన అదృశ్య శక్తినుండి,— ఆ శక్తి దివ్యము కావచ్చును, అదివ్యము కావచ్చును,— లభించెడి బలసంపత్తిని తన వైయక్తిక స్వప్రయోజనముకొరకై కైవస మొనర్చుకొను చుండును. తమలో ఆ శక్తి అట్లు పనిచేయుచున్న సంగతిని వారు స్పష్టముగానో అస్పష్టముగానో తెలిసికొనుచునే యుందురు. కాని, మనకంటె గొప్పదైన శక్తి యొకటి మనలో పనిచేయుచున్నదని కేవలము బుద్ధిచేతను, ప్రాణతత్త్వము చేతను గ్రహించినంత మాత్రముతో అహంకారమునుండి విముక్తి సాధ్యము కానేరదు.

మహత్తర శక్తియొకటి ఇట్లు మన లోపల, లేక పైన, పనిచేయుచు మన లను నడపుచున్నదనెడి యీ భావము, ఈ జ్ఞానము భ్రమ కాదు. వెర్రి నమ్మ కము కాదు. ఇట్టిభావము, జ్ఞానము కలవారికి సాధారణ మానవుల కంటె విస్తృత దృష్టి యుండును. పరిచ్ఛిన్నమైన స్థూలబుద్ధిని దాటి వారొక అడుగు ముందుకు వేసినవారే. కాని, వారిది సంపూర్ణ దర్శనము, అపరోక్షానుభవము కానేరదు. ఏలయన, బుద్ధివైశద్యము, ఆత్మజ్ఞానము వారికి లేనందువలనను, ఆధ్యాత్మిక సత్త యందు కంటె ప్రాణమయ సత్తయందే వారెక్కువగా మేల్గొనియున్నందు వల నను, ఇట్టివారు పరమేశ్వరుని సాక్షాద్దర్శనము పొందుటగాని, పరమేశ్వరుని ఉపకరణములై అట్టి ఉపకరణముల పను ఎరుక గలిగియుండుట గాని సంభవింప నేరదు. ప్రమాదభరితము, దోషజుష్టమునగు వారి ప్రకృతిద్వారమున వా రుప యోగించుకొనబడుచుందురు. పరతత్త్వమును ఒక విధి రూపముననో, ఒక విశ్వ శక్తి రూపముననో మాత్ర మే వారు దర్శింపగలుగుచుందురు. పరిచ్ఛిన్నమగు నే దేవతకో, లేక పరమేశ్వరుని మరుగుపరచు నే రాక్షసశక్తికో వారు పరమేశ్వ రుని పేరు తగిలించుచుందురు.

కొందరు మతకర్తలు గూడ ఈశ్వరుని ఏ ఒక శాఖకో లేక జాతికో సంబం ధించిన వానిగనూ, తప్పులు సైరింపక శిక్షించు భయంకర స్వరూపునిగను, లేక

సద్గుణరాశియై దయామయుడైన సాత్త్వికప్రేమమూర్తిగను చిత్రించుట జరిగి యున్నది. అద్వయుడు, అనంతుడు నయిన ఈశ్వరుని వారు దర్శించినట్లు కనపింపదు. ఈశ్వరుడు తనను వారేరూపమున భావించిన ఆ రూపముననే వారిలో తన కార్యములను కొనసాగించుచుండును. ఒక మహాశక్తి వారి దోషజుష్టమగు ప్రకృతియందు ఇతరులలో కంటె ఎక్కువగా తీవ్రరూపమున గుర్తించబడి పని చేయును గావున వారిని ప్రేరేపించెడి అహంకారముగూడ ఇతరులలో కంటె యెక్కువ తీవ్రరూపములో ప్రకటితమగుట కవకాశమున్నది. అట్టి సందర్భములో మహత్తరమైన రాజసికాహంకారముగాని, సాత్త్వికాహంకారముగాని, వారిని ఇంకను ఆవహించియుండి పూర్ణసత్యము వారికి గోచరము కానీయకుండ అడ్డు తగులుచుండును. సత్యమైన పూర్ణానుభవస్థితికిది ఇంకనూ కడు దవ్వైయైననూ ప్రారంభదశగా కొంతవరకు గణుతింపదగినదే. కాని, మానవ సంబంధమైన కట్టుబాట్లు కొంతవరకు త్రెంచివైచుకొని, తగిన విశుద్ధిని, జ్ఞానసంపత్తిని సంతరించుకొనియుండనివారి కింతకంటె మిక్కిలి హీనస్థితి సంప్రాప్తమగుట కలదు. ఏలయన, వారు ఉపకరణములుగ రూపొందుట నిజమేగాని ఈశ్వరునిచేతి ఉపకరణములుగ మాత్రము కాదు. తరచుగా ఈశ్వరుని పేరు ఉపయోగించుచునే ఈశ్వరుని చీకటి ముసుగులను, అంధతమశ్శక్తివిశేషములను సేవించుట సంభవించుచుండును.

మన ప్రకృతి విశ్వశక్తికి తావలము కావలసినదే,— కాని, అద్దాని అవర విభాగమునకునూ, రాజసిక, సాత్త్విక ప్రకృతికినీ గాదు. విశ్వసంకల్పమునకిది ఉపకరణము గావలసినదే,— కాని, నిముక్తిసాధకమైన మహోన్నత జ్ఞాన మాతనికి ఏడుగడయై వెలయవలసియుండును. మనలో పనిచేయుచున్న మహాశక్తి ఘనతను మనము పూర్తిగా గుర్తెరిగియుండు సందర్భములో కూడ మన ఈ ఉపకరణపు దృష్టియందు ఏవిధమైన అహంకారము నుండరాదు. ప్రతి మానవుడు తెలిసికాని, తెలియక కాని, ఒక విశ్వశక్తియొక్క ఉపకరణమే. అంతరమున దివ్యసన్నిధి దీపించుట అటుంచినచో, ఒక పనికినీ ఇంకొక పనికినీ, ఒక ఉపకరణమునకునూ, ఇంకొక ఉపకరణమునకునూ మన అహంకారిక స్వాతిశయప్రవృత్తిరూపమైన అవివేకమును సమర్థనీయముగా చేయగల ముఖ్యభేద మేమియును లేదు.

ఆత్మయొక్క ఒకానొక అనుగ్రహ విశేషమే జ్ఞానమునకునూ అజ్ఞానమునకునూ గల భేదము. ఈశ్వరశక్తి విశేషము ఈనాడు ఒకరియందును, రేపు ఇంకొకరియందును తన బలమును పూరించుచు పనిచేయుచుండును. కుమ్మరివాడొక కుండను వేరొకకుండకంటె బాగుగా తయారు చేసినచో ఆ బాగు చేసినవానిది గాని కుండదికాదు. "ఇది నా బలము" అనిగాని, "చూడండి నాలోగల ఈశ్వరశక్తి" అని గాని, ఈ విధమైన దృష్టి మన మనస్సున కుండరాదు. 'ఈ మనస్సులోనూ శరీరములోనూ ఒక విశ్వశక్తి పనిచేయుచున్నది. సకల మానవులలో, జంతువులలో, వృక్షములలో, లోహములలో, సచేతనములలో, అచేతనములుగ గనిపించువానిలో,— అంతటా పనిచేయుచున్నది అదియే,' అను దృష్టి యుండవలెను. అందరిలోనూ పనిచేయుచున్నది ఒకదే యనియు, సకల ప్రపంచమూ ఒక దివ్య కార్యమునకు, క్రమాభివృద్ధికి సమానోపకరణమనియు,— ఈ విశాలదృష్టి మన పూర్ణానుభవముగా రూపొందునేని, మనలోని రాజసికాహంకారమునంతనూ ప్రోదోయుటకిది తోడ్పడుటేగాక, మన ప్రకృతినుండి సాత్వికాహంకారము సైతమూ క్రమముగా లొంగిపోవుటకు మొదలిడును.

ఈ విధమైన అహంకారము నిట్లు తొలగించివేయుట యథార్థముగా నుపకరణ మాత్రులమై,— నిమిత్తమాత్రులమై,— ఈశ్వరకార్యమును నిర్వర్తించగల స్థితికి మనలను సరాసరిగా తీసికొనిపోవును. ఉత్తమోత్తమ కర్మాచరణ సారమిట్టికర్మాచరణమే. ఎలయన, "నేను ఉపకరణము" అనెడి అహంకారమును మనము ప్రోది చేసికొనుచుండునంతకాలము, ఈశ్వరునిచేతి ఉపకరణముగా మనము తెలిసి వర్తించుచున్నట్లు మనకు మనము చెప్పుకొని ఎంతగా నటనచేయుచున్నను, యథార్థమునకు, ఈశ్వరశక్తిని మన కోరికలకు, మన అహంకారిక ప్రయోజనములకు ఉపకరణముగా జేసికొనవలెననియు మన ప్రయత్నము. అహంకారము నిర్మూలించబడకుండ వశీకరించుకోబడిన సందర్భములో కూడ, ఈశ్వరకార్యమునకు మనము నిజముగా ఉపకరణములమేయైనను నిర్దుష్టమైన ఉపకరణములయుగాక, మన మనస్సుచేయు పొరపాట్లచేతను, మన ప్రాణమయ ప్రకృతి కల్పించెడి వికారములచేతను, మన భౌతిక ప్రకృతికిగల అసమర్థతలచేతను ఆకార్యమును వక్రింపజేయుటయే సంభవించుచుండును. అట్లుగాక, ఈ అహంకారము

పూర్తిగా నిర్మూలించివేయబడినయెడల, అపుడు మనము ఈశ్వరహస్త మెట్లు త్రిప్పిన అట్లు ఎరుకతో ఆమోదపూర్వకముగా తిరుగు విశుద్ధోపకరణముల మగుటయే గాక, మన యథార్థ ప్రకృతిని, పరాశక్తి తన కార్యములనిమిత్తముగ తనలో రూపొందించుకొనిన నిత్యానంద స్వరూపుని చేతనావిభాగములను తెలిసికొనినవారముగూడ నగుదుము.

* o *

'ఉపకరణమును నే' ననెడి అహంకారము నిట్లు ఈశ్వరశక్తికి సమర్పణము చేసివైచిన అనంతరము నిర్వర్తించవలసిన మహత్తరకార్యము మరొకటున్నది. మనోమయ, ప్రాణమయ, అన్నమయ భూమికలందు మనలను, సమస్త ప్రాణులను ఆడించెడి ఒక విశ్వశక్తిగా ఆమెను తెలిసికొనిన మాత్రమున చాలదు. ఏలయన, ఇది అవరప్రకృతిమాత్రమే. దివ్యజ్ఞానము, దివ్యతేజము, దివ్యశక్తి యిందు మరుగైయుండి, అవిద్యయందు పనిచేయుచు, తెర కొంత తొలగించుకొని తమ నిజస్వరూపమును కొంత అభివ్యక్తము చేయజాలియున్నను లేక పైనుండి క్రిందికి దిగివచ్చి ఈ అవరప్రవృత్తులను పైకి ఉద్ధరింపగలిగియున్నను, ఆధ్యాత్మికముగా రూపొందించబడిన మనః ప్రాణశరీరచేతనలయందు ఆ ఏక స్వరూపుని మనము తెలిసికొనగలిగి యున్ననూగూడ, మన ప్రకృతియందలి శక్త్యాత్మక విభాగములందు ఒకానొక అసమగ్రత ఇంకనూ మిగిలియేయుండును. పరాశక్తికి ప్రతిస్పందించుటయం దింకనూ తొట్రుపాటు కాననగుచున్నది. పరమేశ్వరుని ముఖముపై తెర యింకనూ తొలగిపోలేదు. ఎడతెగని అవిద్యామిశ్రణ మింకనూ ప్రత్యక్షమగుచునే యున్నది. ఈ అవరప్రకృతి కతీతమైన పరాశక్తి యొక్క నిజతత్వ స్వరూపమునకు మన ముస్కిలత మైనగాని ఆమె జ్ఞానక్రియా శక్తులకు విశుద్ధమైన యుపకరణముగ మనము రూపొందనేరము.

విమోచనమేకాక పూర్ణత్వసిద్ధి కర్మయోగలక్ష్యమై నెగడవలసియున్నది. పరమేశ్వరుడు మన ప్రకృతిద్వారమున అద్దాని లక్షణము ననుసరించి పనిచేయును. మన ప్రకృతి అపరిశుద్ధమైనచో, తద్ద్వారమున జరుగు కార్యము సైతము అపరిశుద్ధము, మిశ్రితము, లోపభూయిష్ఠము నగును. ఘోరమైన పొరపాట్లు,

తప్పులు, నైతిక దౌర్బల్యములు, విక్షేప ప్రవృత్తులతో అయ్యది చెడిపోవుటయును గలదు. అప్పుడుగూడ ఈశ్వరేచ్ఛ మనలో పనిచేయుచునే యుండును. కాని, ఆ పనిచేయుట మన దౌర్బల్యము ననుసరించియే కాని మూలమందు అద్దాని బలముతో, విశుద్ధతతో కాదు. మనది పూర్ణయోగము కానిచో,- మన లక్ష్యము అంతస్థిత ఆత్మవిమోచనమో, లేక ప్రకృతినుండి వేరైన పురుషుని అచలసంస్థితియో మాత్రమే యెనచో, మన శక్త్యాత్మక విభాగమునందీ లోపమును లెక్కచేయ నక్కరలేదు. నిశ్చలత్వమున, ఎట్టి కలతకు అవకాశమీయక, క్రుంగుటయు ఉప్పొంగుటయు లేక, దోషాదోషములను, మంచి చెడ్డలను, పుణ్యపాపములను మనవిగా ఆమోదించుటకు నిరాకరించుచు, ప్రకృతిగుణములు గుణములందు ప్రవర్తించుచున్నదాని ఫలితమే యీ మిశ్రణ మని గుర్తింపుచు, ఆత్మయొక్క నీరవస్థితియందు నెలకొన్నవారమై, ప్రకృతి కార్యములను ఊరక సాక్షిత్వభావమున నిర్లిప్తులమై తిలకించుచు నుండగలము. కాని, పూర్ణయోగ లక్ష్యమగు సమగ్ర సంసిద్ధి మార్గమున నిదొక మజిలీ యగునే కాని, చిట్టచివరి విశ్రమస్థానము కానేరదు.

ఏలయన, ఆత్మయొక్క అచలాయతనమునందేగాక, ప్రకృతియొక్క గతివిశేషమునందుకూడ దివ్య సంసిద్ధిని సాధించుట మన లక్ష్యము. కార్యక్షేత్రమందు మన ప్రతి అడుగులో, మన సంకల్పపు ప్రతి మలుపులో, ప్రతి యోచనలో, భావనలో, ప్రేరణలో, అంతటా పరమేశ్వరశక్తినీ, సాన్నిధ్యమునూ మన మనుభూత మొనర్చుకోగలుగు పర్యంతమూ ఇయ్యది పూర్తిగా సాధ్యపడనేరదు. అవిద్యా ప్రకృతియందుసైతమూ ఒక విధముగా ఇట్టిది మనకు తోచుట కవకాశము కలదనుమాట నిజమే. కాని, అయ్యది ఆ దివ్యశక్తిసాన్నిధ్యముల ప్రచ్ఛన్నవేషము, సంకుచిత స్వరూపము మాత్రమే. మనము కోరునది ఇంతకంటె మహత్తరమగు సంసిద్ధి, దివ్యసత్యమునందు, దివ్యజ్యోతియందు దివ్యసంకల్పశక్తియందు, దివ్యజ్ఞాన మహావిస్తృతియందు విలసిల్లెడి ఈశ్వరశక్తివిశేషముగ మన ప్రకృతి ఆ సంసిద్ధియందు రూపాంతరము చెందవలసియుండును.

అహంకారపు ముసుగు తొలగించబడిన యనంతరము, మన మనఃప్రాణ శరీరముల ననుశాసించు త్రిగుణాత్మకమైక అవరప్రకృతి ముసుగును తొలగించ

వలసియున్నది. అహంకార పరిమితులు మాసిపోవ మొదలిడుటతోనే, ఆ ముసుగు ఏరీతిగా కల్పించబడినదో మనము తెలిసికొని, మనలో పనిచేయు విశ్వప్రకృతి కార్యకలాపమును కనుగొని, ఆ విశ్వశక్తి లోపలను, వెనుకను తేజరిల్లు విశ్వాత్మ సన్నిధిని, విశ్వమయుడైన ఈశ్వరుని క్రియాశక్తి విలసనమును గ్రహింప నేర్తుము. ఉపకరణములకు ప్రభువైన ఈశ్వరుడు ఈ సమస్త కార్యకలాపమున కోను వెనుక సంస్థితుడై యున్నాడు. ఆ కార్యకలాపమునందు సైతమూ ఆతని స్పర్శ, మార్గదర్శకమై వెలయు మహత్తర ప్రభావ విశేషము పనిచేయుచున్నట్లు మనము తెలిసికోగలుగుదుము. మనమిక సేవించునది అహంకారమును గాదు. జగత్ప్రభువునకు, సృష్టియందాతని క్రమవికాస ప్రేరణకు మనము విధేయుల మగుదుము. ప్రతి అడుగున మనము, ఒకానొక సంస్కృత శ్లోకమున నుడువ బడిన రీతిని, 'ఓ ప్రభూ, నా హృదయస్థుడవైన నీచే నేనెట్లునియోగింపబడుదునో అట్లు ప్రవర్తింతు' అని పలుకగలుగుచుందుము. కాని, ఈ కార్యాచరణముగూడ రెండు విభిన్నరీతులలో నుండవచ్చును. ప్రదీపము మాత్రమేయైన కార్యాచరణ మొకటి, రూపాంతరము చెంది మహత్తరమైన పరస్వభావములోనికి ఉద్ధరించబడి నది వేరొకటి.

ఏలయన, ప్రకృతిచేతను, అహంకారము రూపములో ఆమె కల్పించిన మాయచేతను మనము (యంత్రములపై ఆరూఢులమైనట్లుగ త్రిప్పబడుచు) ఆమె ఊతయిచ్చినదపు కర్మమార్గములోనే మనమింకనూ సాగిపోవుచుండవచ్చును. కాని, ఆ యంత్రముయొక్క స్వరూపమును, దాని వెనుకనున్నట్లుగా మనకు గోచరమగుచున్న సకల కర్మాధినాథుడు తన విశ్వసృష్టివిధానములో దాని నుపయోగించు తీరును మన మిపుడు సంపూర్ణముగా తెలిసికొనగలుగుచుందుము. ఆధ్యాత్మికతను సంతరించుకొన్న మనోభూమికయందు పెక్కుమంది మహాయోగులుగూడ సాధించియుండిన స్థాయియిది. కాని, యిదియే చరమస్థితి కానక్కరలేదు. మనోభూమికకంటె అతీతమై ఇంతకంటె మహత్తరమై వెలయు అతిమానస సంసిద్ధి చేకూరుటకు గూడ వీలున్నది. ఆధ్యాత్మిక మనోభూమికల స్థాయిని దాటి పైకి పోయి, దివ్యజననియగు పరాశక్తియందలి మౌలిక దివ్యవిజ్ఞానపు సాక్షాత్సన్నిధిలో ఎట్టి ప్రయత్నమునూ లేక ప్రవర్తించుట కవకాశమున్నది. అప్పుడు, మనచేష్ట

ఆమె చేష్టతో ఏకమై దానియందు లీనమైపోవును. మన సంకల్పము ఆమె సంకల్ప మందును, మన శక్తి ఆమె శక్తియందును చేరి ఏకమైపోగా, పరమమైన విజ్ఞానశక్తిగా అభివ్యక్తమైన పరముడుగా ఆమె మనద్వారా పనిచేయుచున్నట్లు మన కవగతమగును. రూపాంతరము చెందిన మనఃప్రాణదేహములు అతీతమ్ము, సమగ్రమునైన జ్ఞానసంస్థితి కారణమున అమోఘమై ప్రవర్తిల్లెడి పరమ తేజ శ్శక్తుల ప్రసారమునకు కేవలము వాహకములు మాత్రమే యని మనము తెలియ నేర్తుము. ఈ తేజశ్శక్తులను స్వీకరించి, వాటికి వాహకములుగాను, ఉపకరణ ములుగాను వినియోగపడుచేగాక, సుస్థిరము, మహోన్నతమునైన యొక పర మానుభూతియందు మనమా తేజశ్శక్తులలో అంతర్భాగమైపోవుటయు సంభవిం చును

ఈ చరమ సంసిద్ధిని పొందుటకు ముందు, పరతత్త్వపు అత్యంత తేజోమయ శిఖరములను పెక్కింటిని మన మింకనూ అందుకొనలేకపోయినను, దాని అత్యంత విశాలసీమలయందు కర్మాచరణములో పరతత్త్వముతో ఏకత్వానుభవస్థితి నందు కొనుట జరుగవచ్చును. ఏలయన, ఈ స్థితియందు మనము ప్రకృతిని, ప్రకృతి గుణములను ఊరక తిలకించుచుండుటేకాక, మన శరీరచేష్టలలో, నాడీమయ ప్రాణమయ ప్రవృత్తులలో, మానసిక వ్యాపారములలో, ఈ మనఃప్రాణశరీరముల కంటె అతీతమై, వాటిని కైవసమొనర్చుకొని వాటి సకల ప్రవృత్తులనూ నడపు నొక మహాశక్తిని గురించిన యెరుక మనలో ఏర్పడును. కదలుచున్నది, గ్రహిం చుచున్నది, ఆలోచించుచున్నది మనమను భావమిక ఉండనేరదు. ఆ మహాశక్తియే మనలో కదలుచున్నది, గ్రహించుచున్నది, ఆలోచించుచున్నది, అనెడి భావమేర్ప డును. అయ్యది పరమేశ్వరుని విశ్వశక్తి. తెరమరుగు చేసికొనియో చేసికొన కయో అయ్యది తానే స్వయముగా వ్యవహరించుచుండుటయు, లేక యీ విశ్వ మందలి జీవులు తనశక్తులను వినియోగించుట కనుమతించుటయు జరుగు చుండును. ఉన్నది ఆ మహాశక్తి యొక్కటే. దానివలననే సమస్త వ్యష్టి సమష్టి వ్యాపారములునూ సాధ్యమగుచున్నవి. ఏలయన, ఈ శక్తి కేవలము శక్తిరూప

మున గల సాక్షీశ్వరుడే. క్రియాశక్తి,ఆలోచనాశక్తి, జ్ఞానశక్తి, ప్రభుశక్తి,భోగశక్తి, ప్రేమశక్తి,- సర్వమూ అదియే. తనకు అనన్యమైనెలయు శక్తిద్వారా,సకల భూతములందును, సకల సంఘటనలందును అధివసించి వానిని భోగించువాడై అవి యెల్ల తానే యగుచూ తేజరిల్లెడి నిఖిల కర్మాధినాధుని నిత్యమూ మనలోను, ఇతరులలోను, ప్రతివస్తువులోనూ గుర్తెరుగుచూ, మనము కర్మలద్వారా ఈశ్వరునితో సాయుజ్యము నందినవారమై, కేవల భక్తిద్వారమునను, కేవల జ్ఞానముద్వారమునను ఇతరులు సాధించినదానినెల్ల యీ కర్మసంసిద్ధి ద్వారమున మనమునూ సాధింపగలుగుదుము.

కావి, ఇచట ఇంకనూ మరొక పని జరగవలసియున్నది. సర్వాత్మునితోడి తాదాత్మ్యస్థితి నుండి సర్వాతీతునితోడి తాదాత్మ్యస్థితిలోనికి ఆరోహణమది. మనకు, మన కర్మలకు అధినాధుడైన పరమేశ్వరుడు కేవలము మనలో నుండు భగవానుడు, విశ్వసంస్థితుడైన విశ్వాత్మ, విశ్వశక్తియే కాదు. విశ్వమే దైవమని విశ్వసించు వారు తలపోయునట్లు విశ్వము, పరమేశ్వరుడు ఒక్కటియే యని తలంపరాదు. విశ్వమొక అభివ్యక్తి, తనయందు అభివ్యక్త మగు అభివ్యక్తితో పరిమితమైపోని ఒకానొక తత్వముపైన అది ఆధారపడియున్నది. పరతత్వ మిచ్చటమాత్రమే లేదు. దీనికి అవల, నిత్యమైన సర్వాతీతస్థితి యొకటున్నది. వ్యష్టిరూపుడగుజీవుడు కూడ తన ఆధ్యాత్మిక స్వరూపమునందు విశ్వసంస్థితిలోని యొక కల్పనకాదు. మన అహంకారము, మన మనస్సు, మన ప్రాణము, మన శరీరము, ఇవీ అట్టి కల్పనలు. మనయందలి అక్షరము, అనశ్వరమునైన ఈ యాత్మ మాత్రము సర్వాతీతతత్వములోనుండి యాపిఘ్రాతమైనదే.

* * *

సకల జగత్తునకు, జగత్ప్రకృతికి అతీతుడయ్యును, అద్దానికధినాధుడై, తనలోని ఒకానొక అంశతో దానిలోనికి అవతరించి, దానిలో ఇపుడింకనూ అభివ్యక్తము గాకయున్న ఏ స్వరూపములోనికో దానిని మలచుచున్న పరాత్పరుడు మనకు, మన కర్మలకు మూలము, అధినాదుడు అయియున్నాడు. కాని, యీ

పరాత్పర చైతన్య స్థానము కేవలమైన దివ్యసత్తయం దూర్ధ్వమున విరాజమానమై యున్నది. కేవలమైన దివ్యశక్తి, దివ్యసత్యము, దివ్యానందము విలసిల్లు తావుకూడ నదియే. మన మనస్సు దానిని గురించి ఎట్టి భావనయు చేయజాలదు. ఎంతటి అత్యున్నతాధ్యాత్మికానుభూతియైనను ఆధ్యాత్మిక లక్షణములను సంతరించుకొన్న బుద్ధియందు, హృదయమునందు అద్దానికి సంకుచితమైన ప్రతిబింబము, అస్పష్టమైన ఛాయ వంటిది మాత్రమే యగును. అయినను, అద్దానినుండి, ఋత చేతన యని ప్రాచీన రహస్తత్వదర్శనులు పేర్కొన్న హిరణ్మయమైన ఒకానొక దివ్య సత్యానంత తేజశ్శక్త్యాత్మక జ్యోతిఃపరివేషము వినిర్గత మగుచున్నది. అదియే అతిమానసమైన దివ్యవిజ్ఞానము. అవిద్యనుండి వినిర్గతమగుచు అపరచైతన్యాత్మకమై వరలు నీ జగత్తుతో అద్దానికి నిగూఢమైన సంబంధము కలదు. ఛిన్నాభిన్నమై అవ్యవస్థితి పాలుగాకుండ దానిని కాపాడుచున్నది ఆ దివ్యవిజ్ఞానమే. విజ్ఞానమని, స్ఫురితజ్ఞానమని, దీప్తజ్ఞానమని మనమిపుడు పిలుచుకొనుచుండు శక్తులకు మూలమా అఖండజ్యోతియే.

దానితో పోల్చిచూచినప్పుడివి వట్టి వెలవెలబారు వెలుగులు మాత్రమే. దానికిని, మానవబుద్ధి అందుకోగల అత్యున్నత స్థాయికిని నడుమ ఆరోహణ క్రమములో పెక్కు అధిమానసభూమికలున్నవి. వీటిని వశీకరించుకోగలిగిన పిమ్మటగాని మనమీ అఖండ జ్యోతిని చేరుకొనుటయు, అద్దాని ఘనతను క్రిందికి గొనితెచ్చుటయు సంభవింపనేరదు ఎంత కష్టబహుళమైనను ఈ ఆరోహణము, ఈ విజయము సాధించవలసిన విధి మానవాత్మకు ఏర్పడియున్నది. దివ్యసత్యమును క్రిందికి గొనితెచ్చునట్టి యీ దివ్యారోహణముగూడ ప్రయాసబహుళమగు పృథ్వీప్రకృతి క్రమవికాసగతియం దనివార్యముగా ఘటిల్లవలసియున్న పరిణామమే. ఆ చరమసిద్ధి నుద్దేశించియే ఈ క్రమవికాసగతి యంతయు కొనసాగుచున్నది. ఈ భూమిపై మన జీవనప్రణాళిక ఆ అంతిమ సాఫల్యము కోసమే. సర్వాతీత పరబ్రహ్మము పురుషోత్తముడుగా నిచట మన నిగూఢ హృదయాంతరాళములో నెలకొనియున్నను, విశ్వవ్యాప్తమైన తన యోగమాయ కల్పించిన మారువేషములచే మరుగున పడియున్నాడు. ఇచ్చట ఈ శరీరములో మన ఆత్మ సాధింపగల ఆరోహణము, విజయములవలననే ఈ మారు వేషములు తొలగి

పోవుట సంభవించును. సృజనాత్మక స్ఖాలిత్యమై రూపొందు నీ పాక్షిక సత్యపు గజిబిజి అల్లికకు మారుగా పరమసత్యపు శక్తివిలసనము అపుడుగాని ఆవిష్కృతము కానేరదు. ఈ పాక్షిక సత్యపు జ్ఞానావిర్భూతియే జడద్రవ్యపు నిశ్చేతన లోనికి మునుక వైచి పిమ్మట నెమ్మదిగా మరలుచు, పాక్షికమైన స్వస్వరూపావగతి నందుచున్నది.

ఏలయన, ఇచట నీ ప్రపంచములో, సకల భూతజాలమునకును వెనుక నిగూఢముగా దాగియున్నది విజ్ఞానమేయైనను, ఇందు పనిచేయుచున్నది విద్యావిద్యల గారడీ యనదగి, గణుతింప శక్యముగానిదగుచు, పైకి యంత్రప్రాయముగా గనుపట్టు నొకానొక అధిమానసమహామాయ గాని విజ్ఞానము కాదు. పరతత్త్వమిచట ఒక దృష్టియందు సమము, నిష్క్రియము, వ్యక్తిత్వరహితమునగు సాక్షిచైతన్యముగ— ఈ జగద్వ్యాపారమున కనుమతించుచు, దేశకాల గుణ పరిచ్ఛేద మేమియు లేకయుండు అక్షరపురుషుడుగ గోచరమగుచున్నది. సర్వాతీతమైన పరమసంకల్పమొకప్పుడీ విశ్వమున తమ సాఫల్యమును సాధించుకొను నిమిత్తముగా అనుమతించిన సకలకార్యశక్తివిశేషముల ఖేలనమునూ నిష్పాక్షికముగా ననుమతించుచు, అద్దాని కాధారమై వరలుచున్నదీ సాక్షిచైతన్యము, అక్షరపురుషుడే. సకల వస్తుజాతమునందునూగల యీ సాక్షిచైతన్యము, అక్షరపురుషుడు దేనినీగూడ సంకల్పించనట్లు, నిర్ణయించనట్లే కనిపించునుగాని, తటస్థమైన తన కేవల సన్నిధిమాత్రముచేతనే అతడు సకల వస్తుజాతమునూ అద్దాని యజ్ఞానమునందుగూడ ఒక పరమగమ్యము దెసకు ప్రయాణించునట్లుగ నిర్బంధించుచున్నాడనియు, పొందవలసియున్న ఏకత్వము దెసకు అనేకత్వముద్వారా ఆకర్షించుచున్నాడనియు మనము గుర్తింతుము. అయినను, అమోఘమైన పరమ దివ్య సంకల్ప మేమియు నిచట మనకు గానరాదు. యంత్ర ప్రాయముగా పనిచేయు ప్రకృతియొక్క సువిస్తృత విశ్వశక్తి విలసనము మాత్రమే మనకు గనిపించును.

విశ్వాత్మునకు ఇదియొక పార్శ్వము. రెండవ పార్శ్వము విరాట్పురుషుడై మనకు గనిపించును. ఒక్కడయ్యునూ అనేక వ్యక్తిత్వములతో, శక్తులతో అతడు

విరాజమానుడు. అతని విశ్వశక్తిచేతనలోనికి మనము ప్రవేశించినపుడు, గుణ క్రియాసంకల్పముల ఆనంత్యమును, విశ్వవిశాలమైన జ్ఞానమును, ఏకమయ్యీ బహురూపమైన ఆనందమును అతడు మనకు అందజేయును. ఏలయన, అతని ద్వారమున మనము, సకల భూతములతోడనూ, వాని మూలతత్వముననేకాక కార్యప్రవృత్తి ఖేలనమున గూడ ఏకత్వమును బొంది, మనల నన్నింటియందునూ, అన్నింటినీ మనయందునూ దర్శింపనేర్చి, సకలజ్ఞానములు, సకల యోచనలు, సకలభావనలు ఒకే విరాణ్మానసపు, ఒకే విరాడ్-హృదయపు వ్యాపారములనియు, సకల శక్తులు, సకల క్రియలు శక్త్యాత్మకమైన ఒకే విరాట్సంకల్పపు గతివిశేషము అనియు, సకల ద్రవ్యము, సకల రూపములు ఒకే విరాట్ శరీరపు అణువులనియు, సకల వ్యక్తిత్వములు ఒకే విరాట్పురుషుని విలసనములనియు, సకల అహంతలు నిక్కమైన ఒకే విరాడహంతకు వికృతులనియు గ్రహింపనేర్తుము. అతడు, మనము వేరుకాదని తెలిసికొని, గుణరహితము, నిత్యనిర్లిప్తమునైన సాక్షిచైతన్యానుభూతిచే విశ్వశాంతియందు మన అచలాహంతను మనము లీనము చేసికొను రీతిగానే, విశ్వవ్యాపారమునందు మన సచలాహంతను లీనము చేసికొనగలుగుదుము.

కాని, యిచట నీ యుభయస్థితులకు,- దేనినీ అంటక వేరైయుండు దివ్య నీరవతాస్థితికి, సకలమునూ అంతర్భుక్తముగావించుకొను దివ్యక్రియావిలసనస్థితికి,- వైరుధ్యము నిలిచియుండును. దీనిని మనలో మనము ఒకవిధముగా ఒకానొక ఉన్నతస్థాయిలో సవరించుకొని, అది యిక పూర్తిగా సవరణ అయిపోయిన ట్లెంచుకొనవచ్చును. కాని, అది ఆ రీతిని పూర్తిగా సవరణ కానేరదు. ఏలయన, అయ్యది సమగ్రమైన రూపాంతరీకరణము ద్వారా సాధించిన విజయము కాదు. విశ్వశాంతి, విశ్వశక్తి, విశ్వతేజస్సు, విశ్వానందము మనకు లభించినమాట నిజమే కాని, అద్దాని అభివ్యక్తి అతిమానసమైన ఋత-చేతనకు, దివ్యవిజ్ఞానమునకు సంబంధించినది కాదు. అయ్యది ఇంకనూ ఎంత అద్భుతమైన విముక్తిని, ఉన్నతిని, దీప్తిని సాధించినదయ్యును విశ్వాత్మని ఇప్పటి అభివ్యక్తిని బలపరచునది యగునేకాని, అతిమానస దివ్య విజ్ఞానావతరణము చేయగలుగురీతిని, అవిద్యాప్రపంచములోని సందిగ్ధప్రతీకలను, ప్రచ్ఛన్న మర్మములను రూపాంత

రము చెందింపజాలదు. మనము విముక్తులమే మైనాము; కాని, పృథ్వీచేతన యింకనూ బద్ధావస్థితిలోనేయున్నది. మరింత అతీత స్థితిలోనికి ఆరోహణము, అద్దాని అవతరణముల ద్వారమున మాత్రమే ఈ వైరుధ్యమును పూర్తిగా పరిహరించి, పూర్ణపరివర్తనమును, విముక్తిని సాధించుట సాధ్యము.

ఏలయన, నిఖిల కర్మాధినాథుడగు పరముని అతిపరమనిగూఢ రహస్యమును, పరమానందమును తెలిసికొనుటకు బీగమువంటిదైన మూడవవైపు ఆ పరతత్వమునకు గలదు. మిక్కిలి సన్నిహితము, వ్యక్తిత్వ లక్షణోపేతమై యలరారునట్టి వైపిది. ఏలయన, విశ్వాతీతుని నిగూఢస్థితినుండియు, విశ్వవ్యాపారపు సందిగ్ధ విలసనమునుండియు, యీ రెండింటి మధ్యను వంతెనగా ఏర్పడి ఒకదానినుండి ఇంకొకదానిలోనికి పోవుటకు మార్గముగా ఉపకరించగల వ్యక్తిత్వసహిత దివ్యశక్తి విశేషము నొకదానిని అతడిచట వేరుపరచును. పరమేశ్వరుని సర్వాతీత, సర్వగత పురుషస్వరూపమిచట మన వైయక్తిక పురుష స్వరూపమున కనుగుణమగుచు, మనతో వ్యక్తిగత సంబంధము నంగీకరించి, మన యందలి పరమాత్మ స్వరూపుడుగా మనతో ఏకత్వము నొందుచేగాక, మన ప్రభువుగా, సఖుడుగా, ప్రియుడుగా, పితగా, మాతగా, ఈ విశ్వమహాక్రీడయందు మొదటినుండియుగూడ శత్రు, మిత్ర, సహాయక, ప్రతిరోధకాది రూపములలో తనను తాను మరుగుపరచుకొనుచు మనతో నాడు ఆటగాడుగా, సకల సంబంధములలోనూ సకల కార్యములలోనూ మనలను మన విముక్తి దెసకు, సంసిద్ధిదెసకు నడిపించువాడై మనకంటె వేరగుచు మనకు మిక్కిలి సన్నిహితుడుగూడ నగును.

ఈ విధమైన వ్యక్తిగతాభివ్యక్తి ద్వారముననే పూర్ణమైన సర్వాతీతానుభవమును మనము పొందుట యనునది సాధ్యమగును. ఏలయన, వ్యక్తిగత సంబంధముతో నిట్లభివ్యక్తుడైన పరమునియందు మనమా అద్వయుని, విముక్తి లక్షణోపేతమగు నిశ్చల శాంతియందేకాక, కార్యాచరణమున తటస్థము, లేక ఉత్సాహపూర్వకమునైన విశ్వయతావృత్తితోనేగాక, మనల నావహించి నడపు విశ్వశక్తి జ్ఞానములతోడి విగూఢైక్యద్వారముననేగాక, అచలమైన సాక్షిచైతన్యమును, సచలమైన విశ్వశక్తిని అధికరించి, ఒకానొక మహత్తరానంద గర్భిత దివ్యత్వము

లోనికి పైకి దూసుకొని పోగల దివ్య ప్రేమానందముల పరమోత్సాహముతో అనుసంధానించుట సంభవించును. అత్యంత సన్నిహితమయ్యునూ మనకిపుడు తెలియరానిదై యున్న ఈ దివ్యత్వ విశేషమే సర్వాతీతుడగు పరముని పరమ గంభీర మహదానంద రహస్యమును, ఆనంద ఘన సంపూర్ణ సత్స్వరూపమును తీవ్రాభివేకముతో ముసుగు గప్పి మనకోసమై గుప్తపరచియున్నది. వర్ణింపనలవి కానిదగు నిర్విశేష, నిరపేక్ష పరతత్వములోనికి మనల గొనిపోవు జ్ఞానమువలన గాని, విశ్వవిధానమున కావల అద్దానికి మూలమైయుండు పరమప్రభునిలోనికి మనల నుద్ధరించెడి కర్మలవలనగాని యీ పని జరుగనేరదు.

కాని, పరమునితోడి వ్యక్తిగత సంబంధము ఎల్లవేళలా, లేక మొదటి సందియు మనకు అత్యంతవిశాలమగు విస్తృతిని, లేక పరమోన్నతమగు అతీతానుభూతిని కలిగింపదు. మనకు సన్నిహితుడైనట్టియు, లేక మనలో అంతర్యామియై యున్నట్టియు ఈ భగవానుని తొలుత మనము మనవైయుక్తిక ప్రకృతియొక్కయు, అనుభూతియొక్కయు పరిధిలోపలనే, మన అధినేతగా, ప్రభువుగా, మార్గదర్శిగా, గురువుగా, సఖుడుగా, ప్రియుడుగా, లేక ఒక దివ్యాత్మ, దివ్యశక్తి, దివ్యసన్నిధిగా మన హృదయమున నధివసించియున్నట్టియు, లేక అత్యున్నత బుద్ధికంటె అతీత స్థాయినుండి మన ప్రకృతిపై అధ్యక్షత వహించునట్టియు తన ఆంతరంగిక సత్య ప్రాబల్యమున మన ఉన్ముఖప్రవృత్తి రూపుదై అద్దానిని ఉద్ధరించువాడగుచు మాత్రమే మనకు ద్యోతమానుడగును. మన వైయక్తిక క్రమవికాస సాధనయందే ఆతని నిమగ్నత. మన ఆనందమునకు, సాఫల్యమునకు తావలమై వెలయు వ్యక్తిగత సంబంధమది,–మన ఆత్మోపలబ్ధిని, సంసిద్ధిని ప్రతిబింబించు స్వకీయ దివ్య ప్రతిమగా మన ప్రకృతిని రూపొందించు ప్రయత్నము. ఈ క్రమవికాసగతికి ఆధారక్షేత్రమగుచు, వివిధదశలలో అందుకు గావలసిన సామాగ్రిని, అనుకూల ప్రతికూల శక్తులను సమకూర్చుటకు మాత్రమే యీ బాహ్యప్రపంచ మేర్పడినట్లు కానుపించును. అందు నిర్వర్తించబడు మన పనులు తాత్కాలికమైన ఏదియో యొక సార్వజనీన ప్రయోజనమున కవి యుపయోగపడు సందర్భములోనైనను, మన దృష్టిలో వాని ముఖ్యప్రయోజనము ఈ అంతర్యామియైన పరమునితో మన

సంబంధములను బహిర్ముఖముగ గాని అంతర్ముఖముగ గాని శక్తిసంపన్నములుగ నొనర్చుటయే.

చాలమంది సాధకులు అంతకంటె నెక్కువగా ఏమియు కోరరు. ఈ ఆధ్యాత్మిక వికసనము పరలోకములో కొనసాగి అచట సంసిద్ధిని పొందుననియు భావింతురు. పరమునితో సాయుజ్యము అతని దివ్యసౌందర్యానంత సంసిద్ధులకు నిత్య నివాసమైన లోకమున చరమ సాఫల్యమును బొంది శాశ్వతమై విలసిల్లుననియు తలంతురు. కాని, పూర్ణయోగసాధకున కిది చాలదు. తన ఒక్కడిదేయగు వ్యక్తిగతసంసిద్ధి అతని పూర్ణలక్ష్యము, పూర్ణజీవనము కానేరదు. వ్యక్తిగతదృష్టి సార్వజనీనతలోనికి వికసించు నొకానొక సమయము తప్పక వచ్చితీరవలెను. మన వ్యక్తిత్వమెల్ల,–ఆధ్యాత్మిక, మానసిక, ప్రాణిక, శారీరిక వ్యక్తిత్వభేదములు కూడ,–సార్వజనీనతను పొందవలెను. ఆస్థితిలోనది యాతని ఒకానొక విశ్వశక్తి విశేషము, విశ్వాత్మ వికసనమునై గోచరించును. లేక, వ్యష్టిచేతన తన బంధనములను త్రెంచుకొని, ఊర్ధ్వముఖముగ సర్వాతీతములోనికిని, అన్నివైపులా అనంతునిలోనికిని పొంగి ప్రవహించునపుడు పొందనగు వర్ణనాతీత మహావిశాలత యందీ ప్రపంచమెల్ల ఏకదేశమైపోవును.

* * *

ఆధ్యాత్మికతను సంతరించుకొన్న మనోభూమికయందు మాత్రమే ప్రవర్తిల్లు యోగపద్ధతియందు పరమేశ్వరుని యీ ప్రధాన ముఖములు మూడును,– అనగా వ్యక్తిగతము లేక అంతర్గతము, విశ్వగతము, విశ్వాతీతము అని పేర్కొనదగిన యీ మూడును,– వేర్వేరు ఉపలబ్ధులుగా భాసించుట కవకాశము కలదు. సాధారణముగా అటులనే జరుగుచుండును. అట్టి సందర్భములో ప్రతిదియు దేనికది సాధకుని తీవ్రవాంఛను తీర్పజాలినదిగానే గోచరమగును. హృదయాంతరాళము లోని నిగూఢ జ్యోతిర్మయ మందిరములో, వ్యక్తిరూపుడైన భగవానునితో ఏకాంతమున మెలగుచు నతడు తన ప్రియతముని రూపములోనికి తనను మలచుకొని, ఆత్మైశ్వర్య సంపన్నమైన ఏ పరంధామమందో ఆతనితోపాటు నివసించుటకు

తాను ఈ అవరప్రకృతిలోనుండి ఊర్ధ్వమున కారోహించుట జరుగవచ్చును. విశ్వ విశాలతయందు విముక్తిని సాధించి, అహంకారవినిర్ముక్తుడై, విశ్వశక్తి యొక్క ఒకానొక విలసనముగ తన వ్యక్తిత్వము మార్పుచెందగా, విశ్వజనీనతయందు తాను నిశ్చలుడు, విముక్తుడు, అమరుడునై, అంతులేని దేశకాలములయం దంతు లేక విస్తరిల్లుచునే సాక్షిచైతన్యమున నచలుడై, కాలపరిచ్ఛేదరహితమైన స్వాతం త్ర్యము నతడీ ప్రపంచమున ననుభవించుట సంభవింపవచ్చును. వర్ణనాతీతమైన ఒకానొక సర్వాతీత స్థితిని పొందగోరు నేకాగ్రతతో, తన వ్యక్తిత్వమును పరిహ రించివైచి, విశ్వశక్తి విలసనపు పరిశ్రమ మేమియు తనకు లేకుండజేసికొని యతడు అనిర్వచనీయ నిర్వాణ స్థితిలోనికి నిర్గమించువాడై, అసహిష్ణువైన అత్యుదాత్త నిరపేక్షానుభూతిలోనికి ఉద్గమించి, వస్తుజాతమునెల్ల రూపుమాపివేయు టయు తటస్థించును.

కాని, పూర్ణయోగపు సువిశాల సమగ్రలక్ష్యసిద్ధి నభిలషించువానికి ఈ ఉప లబ్ధులలో నేదియు చాలదు. వ్యక్తి విమోక్షణముతో నతడు తృప్తిచెందడు. ఏలయన, పరిచ్ఛిన్నమగు తన వైయక్తిక సంసిద్ధియందు సంకుచిత ప్రగాఢాను భూతికంటె ఎంతయూ విస్తృతము, విశాలమునైన విశ్వచేతనలోనికి తాను ఉన్మీ లితుడగుచున్నట్లాతడు కనుగొనును. దాని పిలుపు అనుల్లంఘనీయము. అద్దాని ప్రబల నిర్బంధముచేత చోదితుడై యతడు, తనను వేరుచేయుచున్న హద్దులనెల్ల భేదించి విశ్వప్రకృతిలోనికి విస్తరిల్లుడు. విశ్వమును తనలో నంతర్భుక్తముచేసికో వలసియున్నది. ఊర్ధ్వమునగూడ, ఈ జీవలోకముపై పరాత్పరునివలన కలుగు చున్న యొత్తిడి కారణముగ, ఒకానొక శక్త్యాత్మకోపలబ్ధినతడు సాధించవలసిన ఆవశ్యకతకలదు. విశ్వచేతనను ఒక విధముగా పరివేష్టించి అతిక్రమించుట జరిగి ననే తప్ప, ఇంతవరకునూ వెలికి విరజిమ్మబడకయున్న అదాని మహావైభవ మిచట అభివ్యక్తమగుటకై విడుదల కాజాలదు. కాని, విశ్వచేతన సైతము ఈ లక్ష్యసాధనకు సమర్థము కానేరదు. ఏలయన, అయ్యది పరమసత్యపు పూర్ణస్వరూ పము గాదు. వ్యక్తిత్వమునకు వెనుక ఒకానొక దివ్యరహస్యము మరుగైయున్నది. సాధకుడద్దానిని కనుగొనవలసియున్నది.

సర్వాతీతము రూపుగైకొను రహస్యము కాలచక్రములో నిచట బహిర్గత మగుటకై అందు వేచియున్నది. విశ్వచేతన కొనయందు పరమోన్నత జ్ఞానమున కొకవిధమైన వెలితి యేర్పడియున్నది. తన్మూలమున నది ఒక పరిమిత జ్ఞానమును మాత్రమే వినియోగించునదిగ గన్పట్టునట్టియు, దోషజుష్టమైన సృష్టిని,— అథవా అస్థిరము, పరిచ్ఛిన్నము, శృంఖలాబద్ధమునైన దోషరహితసృష్టిని మాత్రమే చేయజాలు అజ్ఞానపు ముసుగువైచుకొనినట్టియు శక్తివిశేషము కలిగిన దగుచు, విమోచనము కల్పించుటకు మాత్రము సమర్థమైయున్నదేకాని. ఆ పరమోన్నత జ్ఞానము నావిష్కరింపగల స్థితిలోలేదు. ఒకవైపున బంధరహితమై అచలాయతనమైన సాక్షిత్వము. వేరొకవైపున కార్యసాధనసామగ్రి పూర్తిగా సమకూర్పబడక బద్ధమైయున్న కార్యకర్త. విరుద్ధలక్షణములుగల యీ సహవాసులకు సామరస్యము ఘటింపజేయు కార్యము నిలిచిపోయి, వాయిదాపడి, మనకింకనూ అందుబాటులోలేని అతీత, అనభివ్యక్తస్థితియందు అపుచేయబడియున్నది. కాని, కేవలమైన ఒకానొక సర్వాతీత స్థితిలోనికి తప్పించుకొనిపోవుటవలన వ్యక్తిత్వమునకు పూర్ణసాఫల్యస్థితి కలుగనేరదు. విశ్వవ్యాపార మసంపూర్ణముగనే యుండిపోవును.

పూర్ణయోగ సాధకునకీ పరిస్థితి తృప్తిని చేకూర్పదు. నిత్యమైన పరమసత్యము సృజనసమర్థమైన యొక మహాశక్తియేగాక సుస్థిరమైన ఒక మహా సత్తయనియు నతనికి పొడగట్టుచుండును. కేవల మాయామయమైనట్టియు, అజ్ఞానభూయిష్ఠమైనట్టియు సృష్టిని గావించు శక్తిమాత్రమే కాదది. నిత్యమైన పరమసత్యము కాలచక్రములోపల స్వకీయ సత్యముల నభివ్యక్తము చేయగలదు. పరమునిలోనికి ఆరోహణమేగాక, పరముని దివ్యావతరణము గూడ సాధ్యము. రేపటి సంసిద్ధికి, నేటి విమోచనకు దివ్యావతరణమును సాధించుటకు వీలున్నది. సాధకుని జ్ఞానము వికసించినకొలది, ఈ లక్ష్యసాధన నిమిత్తమే నిఖిలకర్మాదినాథుడగు పరమేశ్వరుడు తనయందలి ఆత్మాంశను స్వకీయాగ్నిస్ఫులింగమును బోలె ఈ చీకటియందు ప్రవేశపెట్టి, నిత్యమైన దివ్యజ్యోతికి కేంద్రముగా అది యచట వికాసమొంద నుద్దేశించినాడని అంతకంతకు విస్పష్టముగా అతనికి తెలియనగుచుండును.

సర్వాతీతము, సర్వగతము, వ్యక్తిగతము,— ఈ మూడును సకల సృష్టిసీ

అంతర్భూత మొనర్చుకొని అద్దానియం దంతర్గతమై, అద్దానిలోనికి చొచ్చుకొని ప్రవేశించిన శక్తిత్రయము. ఇదియే మొట్టమొదటి మూర్తిత్రయము. చైతన్య వికసనమున గూడ మూలభూతమైన తత్త్వము లీ మూడే. పరమసత్యపు పూర్ణానుభూతి మనకు కలుగవలెననిన, ఈ మూడింటిలో దేనినీ నిర్లక్ష్యము చేయుటకువీలు లేదు. వ్యక్తిచేతనలోనుండి విస్తృతతర విశ్వచేతనలోనికి మనము మెలకువను పొందుదుము. కాని, నానావిధ రూపవిశేషములతోడను, శక్తివిశేషములతోడను గూడిన యీ విశ్వచేతనలోనుండికూడ, దానికంటె మహత్తరమై, నిరపేక్షమైన కేవలత్వమున సుప్రతిష్ఠితమగు నఖండ చేతనలోనికి మన మారోహింప వలసి యున్నది. అయినను, ఈ యారోహణమున, మనచే వదలివేయ బడునట్లు గోచరించువాటిని మనము నిజముగా తుడిచిపెట్టివేయుట సంభవింపదు. వాటిని మనము చేపట్టి రూపాంతరము చెందింతుము.

ఏలయన, ఈ మూడును ఒకదానిలో నొకటి నిత్యముగ విలసిల్లుచుండెడి ఉన్నతస్థాయి ఒకటున్నది. ఆస్థాయిలో నవి సామరస్యపూర్వకముగు నేకత్వమందు మహదానందమున సుసంఘటితములై యున్నవి. కాని, ఆ శిఖరస్థానము ఆధ్యాత్మికతను సంతరించుకొన్న అత్యున్నత మనోభూమిక కంటె పైన ఉన్నది. దాని ప్రతిఫలనము కొంత ఈ ఉన్నత మనోభూమికయం దనుభూతమగును నుండ వచ్చును. మనస్సు అద్దాని నందుకొని ఆచట నివసింపవలెనన్న, తనను దా నధికరించి అతిమానస దివ్యశక్తిద్రవ్యములోనికి రూపాంతరము చెందింపబడవలసి యున్నది. సంకుచితమగు నీ యవరచేతనయందుకూడ సామరస్య సాధనకు ప్రయత్నము చేయవచ్చునుగాని, ఆ సామరస్యము సదా అసమగ్రముగనే యుండక తప్పదు, ఒకవిధమైన పొంతనము సాధ్యమే,‒ ఏకకాలముననే ఏకీకరణ సాఫల్య సిద్ధి మాత్రము సాధ్యముకాదు. ఏ మహత్తరోపలబ్ధికైనను మనస్సులోనుండి పైకి ఆరోహణము అత్యాంతావశ్యకము. లేక, ఆరోహణముతోపాటుగను, దాని యనంతరమునను, స్వయంసిద్ధ శక్త్యాత్మక దివ్యసత్యావతరణముకూడ జరుగవలసి యున్నది. ఈ దివ్యసత్యము మనస్సుకంటె పైన, ఈ ప్రాణము జడద్రవ్యము అభివ్యక్తమగుటకు పూర్వముగూడ, తనదే యగు తేజస్సులో తాను మహోన్నత స్థాయిలో సదా విరాజమానమై యున్నట్టిది.

ఏలయన, మనస్సు మాయ,- సదసత్తు, సత్యాసత్యములు, సదసత్తులు ఒండొంటిని కౌగిలించుకొనియున్న క్షేత్రమొకటి కలదు. ఆ సందిగ్ధక్షేత్రములోనే మనస్సు రాజ్యము చేయుచున్నట్లు కానుపించును. కాని, ఆ స్వంత రాజ్యమునందు గూడ అది వాస్తవమున చేతనయొక్క ఒకానొక సంకుచిత రూపము. సకలమునకునూ మూలమై వెలయు నిత్యుడైన పరమేశ్వరుని మూలశక్తిలో భాగము కాదది. మూలసత్యపు ప్రతిరూపమును కొంత మనస్సు తనలో ప్రతిబింబించు కొనగలిగియున్నను, ఆ సత్య స్వరూపపు శక్తివిలసనము లద్దానియందు సదా ఖండితములై విభక్తములై యున్నట్లే కానవచ్చును మనస్సు చేయగలిగినదెల్ల ఆ తునకలను చేర్చి ఏకత్వమును సాధించుట మాత్రమే.

పాక్షిక సత్యమే మనస్సు నిజతత్త్వము. అది ఒక చిక్కుసమస్య యందలి భాగము మానసిక జ్ఞాన మెప్పుడును సాపేక్షికము, పాక్షికము, సందిగ్ధము. అద్దానినుండి బయల్వెడలు క్రియాకలాపము, సృష్టి మరింత తారుమారుగా నుండును. ఒకవేళ కొంత నిష్కృష్టముగా గనుపట్టినను అయ్యది కడు సంకుచితమైన క్షేత్రములో, తునకల నేదోవిధముగ చేర్చికూర్చి సాధించినది మాత్రమే. ఇట్టి సంకుచిత చేతనయందు కూడ పరమేశ్వరుడు మనోగతాత్మగా,-ప్రాణమునందు ప్రాణగతాత్మగను, అంతకంటె తెలియరాని స్థితిలో జడద్రవ్యమునందు జడద్రవ్యాత్మగను వర్తిల్లుచున్నరీతిగానే,- అభివ్యక్తమగును. శక్త్యాత్మకమైన ఆతని సంపూర్ణాభివ్యక్తి, నిర్దుష్టమైన ఆతని ఐక్యస్వరూప ప్రకటనము,-ఇవి మాత్ర మిచట నుండవు. మనఃపరిమితిని దాటి, దివ్యసత్యమునకు స్వస్థానమైన సువిస్తృత తేజోమయచేతనలోనికి,-ఆత్మజ్ఞానోద్భాసిత వస్తువులోనికి మనము ప్రవేశింప నేర్చినప్పుడే, ఆ పరమేశ్వరుని అనశ్వర పరిపూర్ణ సత్యస్వరూపము, శక్తివిశేషములు, కార్యకలాపములు మనకు సాక్షాత్కారమగును. అచ్చోటనే మనలో అతని కార్యకలాపము అమోఘమైన అతిమానసలక్ష్యపూర్వక నిర్దుష్టగతివిశేషమును సంతరించుకొనుటయు సంభవించును.

* * *

కాని, ఇది కడు దీర్ఘము, కష్టబహుళమునైన ప్రయాణానంతరమునచేరెడు గమ్యము. నిఖిల కర్మాధినాథుడగు పరమేశ్వరుడు యోగపథమునందు సాధకుని గలిసికొనుటకుగాని, తన గుప్తహస్తమును, లేక యీషత్ప్రకటిత హస్తమును అతనిపైనను, అతని అంతరంగిక జీవన ప్రవృత్తులపైనను నిక్షేపించుటకుగాని అంతవరకు వేచియుండుట సంభవింపదు. అచేతనద్రవ్యపు దట్టపు ముసుగుచాటున కానరాక నక్కియుండియు, ప్రాణశక్తి విలసనమున మారువేషములు దాల్చియు, మనస్సునందు ప్రతీక దేవతా రూపముల ద్వారమున ద్యోతమానుడగుచును, కర్మలను ప్రారంభింప జేయువాడు, స్వీకరించువాడునునై ఇదివరకే ఆతడీ ప్రపంచమున విలసిల్లుచున్నాడు. పూర్ణయోగ పథమున బోవలసియున్న ఆత్మను ఆతడు మొదట ఈమారువేసములలోనే గలిసికొనుట సంభవింపవచ్చును. లేక, ఇంతకంటె అస్పష్టమైన ముసుగులు ధరించి యాతడు, ఒక మహాదర్శముగ మనచే భావింపబడుటయో, ప్రేమ, జ్ఞానము, శివము, సుందరము, అనువాని భావాత్మక శక్తివిశేషముగ నూహింపబడుటయో, జరుగవచ్చును. లేక, పూర్ణయోగ పథములో ప్రవేశించుటకు మన ముముక్షులమైనప్పుడాతడు, మానవత పిలుపు పిలుపుగను, తమస్సు, అసత్యము, మృత్యువు, దుఃఖము, అనువాని పిడికిటి పట్టునుండి,–అజ్ఞానముపేరిటి పెద్ద చెరసాలనుండి,–ప్రపంచమునకు విముక్తి కల్పించు నిమిత్తముగా ప్రేరణ మొనర్చుచున్న సర్వభూతాంతర్గత మహాసంకల్పముగను తనను మరుగుపరచుకొని మనలను చేరవచ్చుట తటస్థింపవచ్చును.

ఆ పథమునందు మనము ప్రవేశించిన యనంతర మాతడు, తన సువిశాల, మహత్తర, విముక్తిదాయక, వ్యక్తిత్వరహిత స్వరూపముతో మనల నావరించుట గాని, వ్యక్తిత్వ సహిత భగవత్స్వరూపుడుగ మన దరికి చేరవచ్చుటగాని సంభవించును. మనకు ప్రాపై మనలను రక్షించి పోషించు నొక మహాశక్తి మన లోపలను, మన చుట్టును ఉన్నట్లుగా మనకు పొడగట్టును. దారితెలిపి మనలను ముందుకు నడపు నొక మహావాణిని మనము విననేర్తుము. మనకంటె మహత్తరమైన యొక చిత్సంకల్పము మనలను ఏలుకొనును. త్రోసివుచ్చరాని యొక మహావీర్యము మన తలపులను, చేష్టలను, మన శరీరమును సైతము నడపును. నిత్య

విస్తృతిని గాంచుచుండెడి యొక మహాచేతన మన చేతనను తనలో సంతర్భుక్త మొనర్చుకొనును. సచేతనమైన యొక మహాజ్ఞానతేజము మనలోని సమస్తమును వెలుగుతో నింపివేయును. ఒక మహానందప్రవాహము మనలోనికి పొర్లుకొని వచ్చును. ప్రత్యక్షము, పృథులము, అప్రతిహతమునైన యొక మహాబలాతిశయము పైనుండి మనల నదుముచు మనలోనికి చొచ్చుకొనివచ్చి మన ప్రకృతి యందంతటను నిండుకొనును. ఒకానొక మహాశాంతి, మహాతేజస్సు, మహానందము, మహాబలము, మహనీయత అచట పరిఢవిల్లును.

లేక, ప్రాణమువలె మిక్కిలి చేరువయైనట్టియు, ప్రేమవోలె కడు తీయనైనట్టియు, ఆకాశమువలె మనలను చుట్టుకొనియున్నట్టియు, గభీరకాసారమువలె లోతైనట్టియు వ్యక్తిగత సంబంధములు అనేకము కలవు. ఒక పరమసఖుడు మన ప్రక్క నిలిచి మనకు సహచారియై నడచును. ఒక పరమ ప్రియుడు మన హృన్మందిరనివాసియై మనతో ఏకాంత మిచ్చగించును. మన కర్మలకు, కఠిన పరీక్షలకు అధినాధుడగువా డొకడు మనకు మార్గము చూపును. సకల భూతములకు సృష్టికర్త యగువాడొకడు తన యుపకరణముగా మనల నుపయోగించుకొనును. జగజ్జనని చేతులలోనికి మనము గైకొనబడుదుము. మనకెక్కువ అందుబాటగు నట్లుగా ఆ అవాఙ్మానసగోచరుడు మనలను గలిసికొనుటకై ధరించు నీ రూపము లన్నియు యథార్థములే,- ఉపయోగకరములగు భావనలు, ప్రతీకలు మాత్రమే కావు. కాని, మనము ముందరకు సాగుచున్న కొలది, తొలుత మన అనుభవములో అపరిపూర్ణములై యుండు నీ రూపవిశేషములు అవ్వాని చాటున దాగియున్న అద్వయసత్యపు విస్తృతతర దర్శనమునకు దారితీయును. వాని నావరించియుండు మానసికపు ముసుగులు అడగడుగునను ఊడ్చివేయబడి, విస్తృతతరము, ప్రగాఢతరము, ఆప్తతరమునైన పరమార్థమును అవి సంతరించుకొనును.

తుట్టతుదకు, అతిమానసభూమిక పొలిమేరలలో ఈ భగవన్మూర్తులన్నియు పవిత్రములగు తమ రూపవిశేషములను మిళిత మొనర్చుకొని, తమ యునికిని కోల్పోకుండగనే ఒండొంటితో గలిసిపోవును. పూర్ణయోగపథములో భగవద్రూప విశేషముల యావిష్కారము ఆ తరువాత వానిని త్రోసిపుచ్చివైచుటకు గాదు.

అవి మాయాచైతన్యవిశిష్టముగ కల్పించబడిన తాత్కాలికాధ్యాత్మిక సౌకర్యములు గావు. పరాత్పరుని అవిజ్ఞేయ సర్వాతీత చైతన్యముచే అత్యంత దురూహ్యముగ మనయెదుట ప్రదర్శింపబడిన స్వప్నమూర్తులును గావు. మీదుమిక్కిలి, ఏ పరమ సత్యమునుండి అవి ఆవిర్భూతమైనవో అద్దానికి చేరువయగుకొలఁది వానిశక్తి విస్తరిల్లుచు వాని పరమస్వరూపము మనకు సాక్షాత్కారమగును.

ఏలయన, ప్రకృతమున మనకు అతీత పరాచేతనయై విలసిల్లు నా సర్వాతీతము పరమసత్తాస్వరూపమే కాక, పరమ శక్తిస్వరూపముగూడ. అతిమానసమైన సర్వాతీతము శూన్యప్రాయమైన ఒకానొక పరమాద్భుతము గాదు. తన నుండి యావిర్భూతమైన సకల వస్తుజాతమును అది తనలో గర్భిత మొనర్చుకొని యున్నది. వాని నది యచట అవ్వాని పరమ నిత్యసత్యస్వరూపమునను, స్వాభావిక గుణపారమ్యస్వరూపమునను గర్భిత మొనర్చుకొనియున్నది. విడదీయరాని చిక్కుసమస్యను, నిగూఢ మాయాసృష్టిని ఇచట కల్పనచేయు హీనస్థితి, విభజనము, అల్పత్వము,–ఇవి ఊర్ధ్వమునకు మన మారోహణము చేయుటలో తమంత తాము క్షీణించి మననుండి జారిపోవుట సంభవింపగా, ఈశ్వరశక్తివిశేషములు తమ యథార్థ స్వరూపమును సంతరించుకొని, ఇచట నుపలభ్యము కావలసియున్న పరమసత్యమును అంతకంత కధికముగా ప్రకటించునవియై మనకు గోచరించును. పరమేశ్వరుని ఆత్మాంశ మొకటి యిచట జడద్రవ్యపు అచేతనలో దాగియుండి, ఆ సుప్తావస్థనుండి నెమ్మదిగా మేలుకువ చెందుచున్నది.

మనకర్మల కధినాథుడైన ఈశ్వరుడు వట్టి మాయాజాలమునకు గాక పరమ సత్యమునకు అధినాథుడు. క్రమవికాసపూర్వకమైన అభివ్యక్తికొరకై మూలాజ్ఞానరూపమైన పట్టుపురుగుకాయలందు తాత్కాలికముగా సుప్తావస్థ యం దుంచబడిన ఆత్మప్రకాశక సత్యమును అందుండి క్రమముగా విమోచనము నొందించి రూపొందించుట కాతడు కృషిచేయుచున్నాడు. అతిమానసమైన సర్వాతీతస్థితి ఇప్పటి మన యీ సంస్థితికి పొత్తుగా సంబంధించనిదై వేరై యున్నట్టిది గాదు. అచేతనలోనికి దిగజారి అందుండి వెలికివచ్చు నాత్మ యొక్క సాహసక్రీడ నిమిత్తముగా ఆవిర్భావము నొందిన ఈ మహాసృష్టి

కంతకూ మూలమగు మహాతేజస్సది. ఆ సాహసక్రీడ అట్లు కొనసాగుచున్న సందర్భమున నయ్యది మన మనస్సుల కతీతముగా మనకు అందరాని పరచేతన యందు వేచియుండి మన యెరుకలోనికి వచ్చు సమయముకొరకై నిరీక్షించుచుం డును. పిమ్మట అది తన ముసుగులను తొలగించివేసుకొని తద్ద్వారమున మన యొక్కయు, మన కర్మలయొక్కయు పరమార్థమునంతనూ మనకు సంపూర్ణముగా సాక్షాత్కరింపజేయును. ప్రపంచములో ఎవని పూర్ణాభివ్యక్తి ఆ నిగూఢపరమార్థ మును వెల్లడించి సఫలత నొందింపగలదో అట్టి పరమేశ్వర సాక్షాత్కారము ఇందుమూలమున మనకు సిద్ధించును.

సర్వాతీతమైన పరతత్వము పరమసత్తాస్వరూపముగను, మన జీవనమున కంతకూ పరమమూలముగను ఈ సాక్షాత్కారమున మనకు తెలియనగును. అంతే కాక, తన అభివ్యక్తిక్షేత్రములోని కాతడు తనను తాను అధికాధికముగ ప్రవ హింపజేసికొనుటకై రూపొందించబడిన ఈ సృష్టికిని, మన సకల కర్మలకును అధి నాధునిగ గూడ అతనిని మనము దర్శింపనేర్తుము. విశ్వచేతనయు, తాద్వ్యాపార మును ఇకమీద క్రమబద్ధమైన యొక బృహత్తర యాదృచ్ఛిక ఘటనరూపమున గాక, పరమేశ్వరాభివ్యక్తికై ఏర్పడిన క్షేత్రరూపముగ గోచరించును. పరమేశ్వరు డిచట సర్వాతీతునినుండి సమస్తమును గ్రహింపుచు; సర్వవ్యాపియై, అధ్యక్ష స్థానమును వహించియుండి, క్రిందికి దిగివచ్చు వానినెల్ల, ప్రస్తుతము అస్వచ్ఛ ములు, అర్ధస్వచ్ఛములుగనే యున్నను స్ఫటిక స్వచ్ఛతను విధివిధానానుసార ముగా ఒకనాటికి సంతరించుకొనవలసియున్న రూపములలోనికి మలచువిశ్వాత్మగా మనకు దృశ్యమానుడగును, వ్యష్టిచేతన తన యథార్థజ్ఞాన క్రియోపలబ్ధిని తిరిగి పొందనేర్చును.

ఏలయన, అయ్యది పరమాత్మనుండి క్రిందికి పంపబడిన యొక ఆత్మ చైతన్య రూపము. రూపరహితము, కాలపరిచ్ఛేదరహితమునైన పరతత్వమును కాలములో, జడములో నివసింపజేయుటకై జగజ్జననియగు పరాశక్తిచేయు శరీర కల్పనలకు అయ్యది నాభిస్థానము వంటిది. కర్మల కధినాధుడైన పరమేశ్వరుని

సంకల్ప మిదియే యనియు, కర్మల అంతిమ పరమార్థము సైత మిదియే యనియు మన దృష్టికి, అనుభవమునకు క్రమక్రమముగా సాక్షాత్కరించును. ఈ ప్రపంచ సృష్టికి, ఈ సృష్టిలో మన మొనర్చు కర్మలకు వెలుగును, సార్థక్యమును ఘటింప జేయునది ఇదియే. దీనిని గుర్తించి తత్సంసిద్ధికై ప్రయత్నము సల్పుటే పూర్ణ యోగములోని దివ్యకర్మమార్గమున కేకైక లక్ష్యము.

—o—

# అధ్యాయము 12

# దివ్యకర్మాచరణము

కర్మమార్గావలంబియగు సాధకుని యన్వేషణమిట్లు తన సహజ పర్యవసానము పొందిన యనంతరము,– పొందినట్లుగా చూపట్టిన యనంతరము,– ఒకే ప్రశ్న యింకనూ మిగిలియుండును. విముక్తిని పొందిన పిమ్మట ఆత్మ ఏకర్మనైననూ చేయవలసియుండునా, ఎట్టి కర్మ చేయవలసియుండును, ఎందుకొరకు, అనునదియే ఆ ప్రశ్న. అతని ప్రకృతియందు సమత నెలకొన్నది. సమతయే అతని యావత్ప్రకృతినీ పాలించుచున్నది. అహంతనుండి,– పరివ్యాప్తమై యుండిన అహంకారమునుండి,– అహంకారపు భావనలనుండియు, ప్రేరణలనుండియు, కామసంకల్పములనుండియు,– పూర్ణవిముక్తి సాధింపబడినది. బుద్ధియందు, హృదయమునందేకాక, అతని సత్తయందలి సకల విభాగములందునూ గూడ పూర్ణమైన ఆత్మనివేదనము కొనసాగినది. పూర్ణ విశుద్ధి పూర్వకముగా త్రిగుణాతీతస్థితి సమరసభావమున సుప్రతిష్ఠితమైనది. ఆత్మ తన కర్మల కధినాథుడగువానిని దర్శించి యాతని సన్నిధిలో నివసించుట, అతని స్వరూపములో తానంతర్భాగమని గుర్తెరుగుట, అతనితో ఏకత్వమును బొందుట, హృదంతరమున గాని ఊర్ధ్వమున గాని అతని బొడగాంచుచు తదాజ్ఞానువర్తియగుట,– ఇట్టి యుపలబ్ధులను సంపాదించినది, తన నిజస్వరూపమెట్టిదో గుర్తించి అజ్ఞానపు ముసుగు నూడ్చిపారవైచినది. ఇట్టి పరిస్థితిలో, మానవునియందలి కర్మి చేయవలసిన కరణీ ఇంకనూ ఏముండును? ఉండినచో, ఏ ఉద్దేశ్యముతో, ఏ లక్ష్యముతో, ఏ భావముతో ఆ కర్మను నిర్వర్తించవలెను?

*　　　*　　　*

భారతదేశమున మనకు మిక్కిలి పరిచితమైన జవాబు ఏమనగా,— ఏ కర్మనూ చేయవలసియుండదు. నిశ్చలత్వమున నుండిపోవుటే ఇక మిగిలియుండునది. పరమేశ్వరుని నిత్యసన్నిధిలో ఆత్మ నివసింపగలిగిన పిమ్మటనేమి, సర్వాతీతమైన పరబ్రహ్మముతో నైక్యము పొందిన పిమ్మటనేమి, ఈ లోకములో మన జీవితమునకు లక్ష్యమనునది ఏదైన నున్నచో అది తక్షణమే తీరిపోవును. సకల కర్మయు నిక ఆ పరమానుభవ స్థాయిలోనుండి క్రిందికి దిగజారి తిరిగి అజ్ఞానములోనికి వచ్చుటయే యగును. జీవితమునెడ ఇట్టి దృక్పథము ప్రాణమయ ప్రకృతియందలి దోసగును పురస్కరించుకొని రూపొందిన ఒకానొక అభిప్రాయము మూలముగా నేర్పడుచున్నది. అవసరము, అశాంతిపూర్వక సహజప్రేరణము, కామము,—అను అవరహేతువులు మూడింటిలో ఏ ఒకటియో గాని, లేక మూడునూ గాని,—ఇవియే ప్రాణమయప్రకృతిని అనుశాసించి కర్మలయందు ప్రవర్తింప జేయుచున్నవి. సహజప్రేరణ ముపశమించి, కామము నిర్మూలించబడినప్పుడిక కర్మలకు తావెక్కడ ? యంత్రప్రాయమైన అవసరమొకటి యింకనూ మిగిలియుండవచ్చును. కాని, శరీరపతనానంతరము ఆ అవసరము కూడ శాశ్వతముగా తొలగిపోవును.

కాని, యేదెట్లున్నను, జీవితమున్నంతకాలము కర్మ తప్పదు. పట్టి ఆలోచనయు కర్మయే. ఎట్టి ఆలోచనయు లేకుండ ఊరక జీవించుటయు కర్మయై పెక్కు కార్యములకు కారణమగుచున్నది. ప్రపంచమునందలి ప్రతి సంస్థితియు,— మట్టిగడ్డ జడత్వము, నిర్వాణప్రాంగణములో అచలబుద్ధుని మహామౌనస్థితికూడా,— కర్మయే, శక్తివిశేషమే. తన కేవల సన్నిధి చేతనే ప్రతిదియు సమష్టియందు శక్త్యాత్మకమైన యొక ఫలితమునకు గారణమగుచున్నది. కర్మ ఏవిధముగా జరిగినది, ఏ పరికరములు ఉపయోగించబడినవి, లేక తమంత తామే ప్రవర్తించినవి, ఎట్టి భావముతో, దృష్టితో కర్త ప్రవర్తించినాడు, అనునది మాత్రమే ఇచట విచారణీయము. ఏలయన, వాస్తవమునకు ఏ మానవుడును కర్మ చేయుటలేదు. ప్రకృతియే అతని ద్వారా, అంతరమున అనంతునినుండి ఆవిర్భూతమగుచున్న ఒకానొక మహాశక్తియొక్క ఆత్మాభివ్యక్తి కొరకై కర్మ యొనర్చుచున్నది. అది తెలిసికొని, ఏ కోరికయు. ఏ కర్తృత్వ భ్రమయు లేకుండ, ప్రకృతి కధినాధు

దైన పరమపురుషుని సన్నిధిలో, స్వరూపములో నివసించుటొక్కటే చేయవలసి యున్నపని. నిక్కమైన విముక్తి నిచ్చునది అదియే కాని, శారీరిక కర్మసన్యాసము కాదు.

ఒకడు కదలక మెదలక స్తబ్ధుడై కూర్చుండియు, అవిద్యాబంధమున నొక సామాన్య జంతువు, కీటకముఎట్లో అట్లే బంధింపబడి యుండవచ్చును. అట్లుగాక, అతడే మహత్తరమైన జ్ఞానదృష్టిని తనలో నుద్దీప్తము గావించుకొనగలుగునేని, అపుడు సకల జగత్తుల కర్మకలాపమంతయు నతని ద్వారమున సాగిపోయినను అతడు అఖండ శాంతిస్థిరతలయందు సుప్రతిష్ఠితుడై, ఎట్టి బంధనము లేక పూర్ణ విశ్రాంతుడుగానే విలసిల్లును. కర్మ మనకీ ప్రపంచములో, మన ఆత్మవికాసము నకు, ఆత్మసాఫల్యమునకు తొలుత సాధనముగ నుండు నిమిత్తమై యొసగబడి నది. కాని, సాధింపదగిన కట్టకడపటి దివ్యసమగ్రతను మనము చేరుకోగలిగి నప్పుడు కూడ, ప్రపంచములో ఈశ్వరోద్దేశ్య సాఫల్యముకొరకు, ప్రతిజీవియు ఏ విశ్వాత్మలో భాగమై విశ్వాతీతునితోనుండి విశ్వాత్మలోపాటుగ దిగివచ్చినదో అట్టి విశ్వాత్మ సాఫల్యముకొరకు కర్మ యింకనూ ఒక సాధనముగా నిలిచియే యుండును.

యోగసాధన ఒకవిధమగు పర్యవసానమును బొందినపుడు, కర్మ లనునవి మానవునకు ఒక విధముగా తొలగిపోవుననియే చెప్పవలెను. ఏలయన, తనకొరకై ఏ కర్మలూ అతనికిక చేయవలసిన యవసర ముండదు. కర్మలు తనచేత చేయ బడుచున్నవను భావ మతనిలో నంతరించిపోవును. కాని, యతడు కర్మక్షేత్రము నుండి పలాయనము కావలసిన అగత్యము లేదు. సుఖసంపూర్ణమైన జడత్వము నాశ్రయించవలసిన పనియును లేదు. ఏలయన, ఇప్పుడతడు, బంధకమైన ఏ అవ సరపుటొత్తిడియు లేకయే, ఏ అజ్ఞానపు నిర్బంధమును లేకయే, ఈశ్వరసత్త యెట్లు ప్రవర్తించుచున్నదో అట్లే ప్రవర్తించును. కర్మలు చేయుచున్నప్పుడు సైతము అతడు చేయనివాడే. తనకొరకై తానొక కార్యారంభము నతడు చేయడు. ఈశ్వర శక్తియే అతని ప్రకృతిద్వారమున నతనిలో పనిచేయుచుండును. ఏ పరాశక్తియం దతడొక భాగమో, దేని సంకల్పముతో అతని సంకల్పము, దేని శక్తివిశేషముతో

అతని శక్తివిశేషము తాదాత్మ్యము చెందిపోయినచో అట్టి పరాశక్తియొక్క స్వచ్ఛందప్రవృత్తిలో కర్మాచరణ మాతనియందు కొనసాగును. అతనియందలి ఆత్మచైతన్య మీ కర్మను తనలో నంతర్భూతమొనర్చుకొని, దాని కాధారమై విలసిల్లుచు, సాక్షిగా దానిని తిలకించుచుండును. జ్ఞానదృష్టి పూర్వకముగ నద్దానిపై తాను అధ్యక్షత వహించియుండునేకాని, ఆసక్తి, అవసరము అనువాని జిగురుతో అద్దానికి అంటుకొనిపోవుటయు, ఫలాపేక్షయను బంధమునకు లోనైపోవుటయు, ఎట్టి కర్మప్రేరణకుగాని బానిసయైపోవుటయు సంభవింపనేరదు.

కామము లేకుండ కర్మ అసాధ్యమనియు,అర్థరహితమనియు తలచుట సాధారణముగా జరుగుచున్నది. ఇది పొరపాటు. కామము అంతరించినచో కర్మకూడ అంతరించక తప్పదని యనుచుందురు. కాని, అతిసులభముగా సాధించబడుచుండు ఇతర సాధారణీకరణములవలెనే ఇదికూడ, ప్రతిదానినీ ముక్కలుచేసి నిర్వచించబూను మనస్సుకు కడు ఆకర్షణీయముగనే యున్నను, యథార్థము కాదు. విశ్వమున కొనసాగు కార్యకలాపములో అధికభాగము కామపుజోక్య మేమియు లేకుండగనే జరిగిపోవుచున్నది. ప్రకృతియొక్క స్వచ్ఛందనియతిని బట్టియు, విశ్వలమగు నవసరమునుబట్టియు అది యట్లు కొనసాగుచుండును. మానవుడు కూడ, పలువిధములైన కర్మను ఒక విధమైన స్వచ్ఛందవృత్తితోడను, అంతఃస్ఫురణతోడను, సహజప్రేరణతోడను, లేక ప్రకృతిసిద్ధమగు నవసరమునకు, స్థితిగతుల ప్రాబల్యమునకు లోబడియు, ఎట్టి మానసిక యోచనగాని, భావావేశపూర్వకమైన కామసంచలనముగాని లేకయే నిర్వర్తించుచుండును. తరచుగా నతని చేష్ట అతని ఉద్దేశ్యమునకు, అతని కామనకు విరుద్ధమై యుండును. ఒక అవసరమునకు, లేక నిర్బంధమునకు లోబడియో, ఒక ఆవేగమునకు తలయొగ్గియో, అతనిలోని ఏ శక్తియో అతనిని ఆత్మప్రకటనార్థమై ముందుకు త్రోయుటవలననో, పరతర సూత్రమొకదానిని ఎరుకతో అనుసరించుటవలననో అయ్యది ప్రవర్తించుచుండును.

కామమనునది ప్రకృతి తన అవాంతర ప్రయోజనముల కవసరమైన ఒక విధమైన రాజసిక ప్రవృత్తిని సాధించునిమిత్తము ప్రాణిలోకపుజీవితమున విశేషప్రాధాన్యమును కల్పనచేసి రూపొందించిన యొక అదనపుటాకర్షణము. ఆమె ఉపయో

గించు యంత్రసాధనము కేవల మది యొక్కటియే కాదు,- ముఖ్యమైనదియును గాదు.అది యుండునంతకాలము దానివలన పెద్దప్రయోజనమే కలదు.జడత్వములో నుండి బయటపడుట కది తోడ్పడును, కర్మప్రవృత్తి నవరోధించు తామసికశక్తుల నది వ్యతిరేకించును. కాని, కర్మమార్గమున చాల దూరము ప్రయాణించిన సాధకుడు కామమొక సహాయక యంత్రమై యొప్పారు నీ యవాంతర దశను దాటి పోయినవాడగును. అతని కర్మాచరణకు దాని ప్రేరణ యిక అపరిహార్యముకాదు. పైపెచ్చు, అది యొక భయంకర ప్రతిబంధకమై, తొట్రుపాటుకు, అసమర్థతకు, అపజయమునకు మూలముగూడ నగును. వైయక్తిక దృష్టిని, అభీష్టమును అనుసరించుట ఇతరులకు తప్పదు. కాని, అతడు మాత్రము, అపౌరుషేయ మానసము తోడను, లేక విశ్వమానసముతోడను, లేక అనంతుడగు పరమపురుషుని చేతిలో ఉపకరణముగను, అతని స్వరూపములో నంతర్భాగముగను వ్యవహరింప నేర్చుకోవలెను. నిశ్చలమైన ఔదాసీన్యము, ఉల్లాసపూరితమైన నిష్పాక్షికత, పరాశక్తి ఆదేశమునకు మహదానందముతో ప్రతిస్పందించుట అనునవి అతని పటిష్ఠ కార్యాచరణమునకు లక్షణమై యుండును. కామ ప్రేరితుడు, సంగరహితుడునై కాదతడు కర్మయందు ప్రవృత్తుడు కావలసినది. పరమశాంతియందు కదలాడు దివ్యసంకల్పము, పరంజ్యోతినుండి ప్రసరించు దివ్యజ్ఞానము, పరమానందము నుండి ప్రసృతమగు దివ్యప్రేరణము అతని కర్మప్రవృత్తి ననుశాసింపవలెను.

* o *

యోగసాధన బాగుగా పురోగమించిన దశయందు, వ్యక్తిగతాభీష్టముదృష్ట్యా ఏ కర్మ తాను చేయవలెను, ఏది చేయరాదు, అనునది సాధకునకు పరిగణనీయము కాదు. అసలు తాను కర్మ చేయవలెనా, చేయరాదా, అనునది కూడ అతని వ్యక్తిగతాభీష్టము ననుసరించి నిర్ణయింపబడదు. పరమసత్యమునకు ఏది అనుగుణమై యున్నదో, లేక పరమేశ్వరుడు దేనిని అతని ప్రకృతిద్వారమున నిర్దేశించునో అది చేయుటకు మాత్రమే అతడు సదా ప్రవృత్తుడగుచుండును. కాని, దీనిని పురస్కరించుకొని యొక తప్పు సారాంశమును లాగుట యొకొక్కప్పుడు జరుగుచున్నది. ఆధ్యాత్మిక పథములోని మానవుడు, తనకు విధి, దైవము, లేక పూర్వ

కర్మ ఏస్థితిని కల్పించునో అద్దాని నామోదింపుచు, జన్మనుబట్టియు పరిస్థితినిబట్టియు తనవియైన వంశము, తెగ, కులము, జాతి, వృత్తుల పరిధియందే పనిచేయుటతో తృప్తిచెంది, అద్దానిని అధికరించు ఏ ప్రయత్నమునుగాని, గొప్పదైననూ ఐహికమగు ఏ లక్ష్యసాధన కృషినిగాని చేయడనియు, చేయరాదనియు భావింపబడుచున్నది.

వాస్తవముగా నతడు చేయవలసిన కర్మ యేదియు లేదుకావునను, శరీరధారియై తానున్నంతకాలము ముక్తి సాధించు నిమిత్తముగా ఏ కర్మలనైనను ఉపయోగించుట మాత్రమే అతడు చేయవలసియున్నది కావునను, ముక్తిని సాధించిన పిమ్మట పరమ సంకల్పమునకు విధేయుడై దాని ఆదేశానుసారముగ వర్తించుట మాత్రమే అతడు చేయవలసియున్నది కావునను, ఏ కర్మక్షేత్ర మాతని కొసగబడినదో అది ఈ ప్రయోజనమునకు చాలునని తలంచబడుచున్నది. ముక్తి సాధించిన మీదట, శరీరం పతనమై తాను అనంతునిలో లీనమైపోవు ఘడియ వచ్చు పర్యంతము, విధి, పరిస్థితులు తనకు కల్పించిన క్షేత్రమునందే అతడు కార్యాచరణము కొనసాగించుచు నుండవలెను. ఒక ప్రత్యేకలక్ష్యమును అనుసరించగోరుటగాని, గొప్పదైన యొక ఐహిక ప్రయోజనము కొరకు పనిచేయుటకాని కర్మల మాయలో పడిపోవుటయే యగును; ఐహిక జీవితమునకొక సుజ్ఞేయమైన లక్ష్యము, ఆవాప్యమైన ప్రయోజనములు కలవనెడు దుర్భ్రమను పెంపొందించుకొనుచే యగును. జగత్తులో ఈశ్వరసన్నిధిని భావమున నంగీకరించుచునే, ఆచరణయందీశ్వరుని నిరాకరించు మాయాసిద్ధాంత మీరీతిగా మనకు మరల ప్రత్యక్షమగుచున్నది. కాని, పరమేశ్వరుడీ జగత్తులో కేవల స్థితిరూపమున నేకాక, శక్త్యాత్మకమైన గతిరూపములో కూడ నున్నాడు, ఆధ్యాత్మికమైన ఆత్మస్వరూప సాన్నిధ్యములతోనేకాక, నానావిధ శక్తివిశేషములతోగూడ విలసిల్లుచున్నాడు. కావుననే జగత్తులో ఈశ్వరకర్మాచరణము సాధ్యము.

కర్మయోగి పాటించవలసిన నియతి ఇదియనిగాని, చరించవలసిన క్షేత్రమిదియనిగాని, ఏ సంకుచిత సూత్రమునకు, ఏ పరిమిత క్షేత్రమునకు ఆతనిని బద్ధుని చేయుటకు వీలులేదు. మానవుని భావనకు కొద్దిదిగా తోచునదిగాని గొప్పదిగా తోచునదిగాని, సంకుచితమై కన్పట్టునదిగాని విశాలమై కన్పట్టునదిగాని,

ఏవిధమైన కర్మయైనను, అతని విముక్తికొరకు కొనసాగు సాధనయందు సమానముగనే ఉపయుక్తము కాగలదనుమాట నిజము. అటులే, విముక్తిని సాధించిన యనంతర మాతడు ఏ జీవితరంగమునం దైనను, ఎట్టి కార్యపద్ధతియం దైనను ప్రవర్తించి, ఈశ్వరునియందు తన జీవిత సాఫల్యసిద్ధి నచట పొందవచ్చునను మాటయు నిజమే. తనయందలి పరమాత్మచే ప్రేరితుడగుటను బట్టి యతడు తన జన్మచేతను, పరిస్థితులచేతను తన కేర్పాటయిన క్షేత్రమునందే ఉండిపోవుట సంభవించవచ్చును. లేక, ఆ చట్రమును భేదించి, మహోన్నతస్థాయి నందుకొన్న తన చేతనకు,జ్ఞానమునకు తగిన ఉపాధియై వెలయగల అప్రతిబద్ధ కర్మపథములో సాగిపోవుటయు జరుగవచ్చును. బయటనుండి చూచువారికి, అంతరములో నాతడు పొందిన విముక్తి అతని బాహ్యచేష్టలలో ఎట్టి మార్పును ఘటింప జేయనట్లే కనుపట్టవచ్చును. లేక, అందుకు భిన్నముగా అంతరమున నాతడు పొందిన స్వాతంత్ర్యము, అనంతత్వము విస్తృత, వినూత్న, శక్త్యాత్మక కర్మాచరణముగ రూపుదాల్చి, తన్మూలముగా నీనూతన శక్తి విలసనము సర్వసమ్మాన్యత నందుకోవచ్చును. అంతరమున గల పరముని యిచ్ఛననుసరించి, విముక్తాత్మ తన పూర్వ పరిసరములందే పరిమిత కర్మప్రవృత్తితో తృప్తిచెందుచు, వాటి బాహ్యస్వరూపమును మార్చుట కేమాత్రమును ప్రయత్నించకపోవచ్చును. అట్లుగాక, అయ్యది ఒక వినూత్న కార్యమునకు ప్రేరేపించబడినదై, తద్ద్వారమున నది స్వకీయ బాహ్యజీవన పద్ధతులను మార్చుటేకాక, పరిసరములను సైతము పూర్తిగా మార్పుచెందించుచు, ఒక వినూత్న ప్రపంచమును, వినూత్న వ్యవస్థను సృష్టిచేయుటకు ప్రవృత్తము కావచ్చును.

అస్థిరమైన యీ జగజ్జీవనమందు జీవునికి పునర్జన్మము లేకుండ జేయుట ముక్తి యనుదాని ఏకలక్ష్య మను భావమొకటి ప్రచారములో నున్నది. ఈ ముక్తి చేకూరుట నిశ్చయమగునేని, ఇహజీవనమునగాని పరజీవనమునగాని జీవునకిక ఏ కర్మతోను పనిలేదు. ఉన్నచో నది శరీరయాత్రకు అవసరమైనంతవరకు, పూర్వజన్మకృత కర్మానుభవమున కవసరమైనంత మేరకు మాత్రమే.యోగాగ్నిచే దగ్ధము గావింపబడినదై యీ కర్మావశేషము శరీరమునుండి ముక్తాత్మ వినిర్గ

మించుటతో పూర్తిగా అంతరించిపోవును ఈ పునర్జన్మ రాహిత్య లక్ష్యము జీవుని పరమలక్ష్యముగ భారతీయ మానసమున చిరకాలముగ పాదుకొనియున్నది. దివ్యాకర్షణ హేతువుగ పెక్కుమతములచే భక్తజన మానసమున స్థిరపరుపబడిన స్వర్గలోక సుఖభోగమును త్రోసిపుచ్చి నేడు ప్రాబల్యము వహించియున్నది. వేద ఋక్కుల స్థూల బాహ్యార్థమే ప్రాధాన్యము వహించి యుండిన కాలమున భారతీయ మతముకూడ ఈ ప్రాచీనపు అవర ప్రేరణను బలపరచియున్నది. తరువాతి కాలమున భారతదేశపు ద్వైతమతములవారు కూడ పరమమైన తమ ఆధ్యాత్మిక లక్ష్యములో నంతర్భాగముగ దీనికి తావొసగి యున్నారు. మానసికా నందమునకును, శాశ్వతత్వము కల్పించబడిన శారీరిక సుఖమునకును నిలయమైన స్వర్గప్రాప్తికంటె, మానసిక, శారీరిక పరిచ్ఛిన్నతలనుండి విమోచనపూర్వకముగా ఆత్మసంబంధమైన నిత్యశాంతిని, విశ్రాంతిని, నీరవతాస్థితిని పొందుట యనునది మిక్కిలిగా నచ్చగల లక్ష్యమే యనుటకు సందేహము లేదు. కాని, ఇదియును ఒకవిధమైన ఆకర్షణయే యగుచున్నది. ప్రపంచమునెడ మనస్సు విసిగి వేసారి పోవుటకు, జన్మలనెత్తు సాహసమును జీవుడు చేయనొల్లకుండుటకు ప్రాధాన్యము నొసగు నీ లక్ష్యము బలహీనతకు సూచకమగునే కాని, పరమలక్ష్యము గానేరదు.

ముక్తిని గాంచవలెనను కోరిక,— ఆ ముక్తి ఎంతటి మహోదాత్తమగున దైనను,— అహంకారమునుండి జనించినదే. అది మన వ్యక్తిత్వపు భావనము పురస్కరించుకొని బయలుదేరినట్టిది. తన వ్యక్తిగత శ్రేయమును కోరునదియు, దుఃఖానుభవమునుండి విడుమర నాశించునదియు, తిరిగి జన్మమెత్తవలసిన బాధ లేకుండపోవలెనని యాక్రోశించునదియు నీ వ్యక్తిత్వమే. జన్మరాహిత్య మిందు వలననే మన జీవిత పరమలక్ష్య మగుచున్నది. వైయక్తిక మోక్షాసక్తిని దాటి పైకి పోనేర్చినవే తప్ప, ఈ అహంకారపు కుదురు పూర్తిగా నిర్మూలించబడ నేరదు. ఈశ్వరుని మన మన్వేషించుట ఈశ్వరునికొరకే కాని మరి దేనికొరకును కారాదు. ఏలయన, అది మన యథార్థసత్తనుండి వచ్చిన పరమాహ్వానము,— ఆత్మస్వరూపమునందలి పరమగంభీర సత్యము. మోక్షముకొరకు, ఆత్మ స్వాతంత్ర్యముకొరకు, పరమమైన ఆత్మోపలబ్ధికొరకు, ఈశ్వరునితో సాయుజ్యముకొరకు మనము చేయు ప్రయత్నము సమర్థనీయమై యొప్పారుట అది మన స్వభావము

యొక్క పరమధర్మమైనందువలననే,- మనలోనున్న అవరమును మనలోని పరము తనవైపున కాకర్షించుకొనుట యైనందువలననే,- మనలోనున్న యీశ్వరుని దివ్యసంకల్పమైనందువలననే. తగిన సమర్థనమేకాక, అది యద్దానికి పరమహేతువు కూడ నగుచున్నది. ఇతర హేతువులన్నియు అసహజముగా పెరిగిన పెరుగుదలలు, అప్రధానమైన సత్యములు, ఉపయోగకరములగు నాకర్షణలు మాత్రమే. వాని ఉపయోగము తీరిపోయి, పరముని తోడను, సకలజీవుల తోడను ఏకత్వస్థితి మన చేతనయందు నెలకొని, అంగలి యానందము మన ఆధ్యాత్మిక వాతావరణముగ విలసిల్లు సమయము వచ్చుటతోడనే సాధకుడు వానిని వదలివేయుట అత్యంతావశ్యకము.

ఈ వైయక్తిక మోక్షేచ్ఛ మరొక యాకర్షణచే జయింపబడుట తరచుగా చూచుచుందుము. అదికూడ ఉన్నతస్థాయిలో మన ప్రకృతి గైకొను నొక మలుపునకు సంబంధించినదే. ముక్తాత్మ అనుసరించవలసిన కార్యపద్ధతి ముఖ్యలక్షణ మెట్లుండవలెనో అయ్యది సూచించును. అమితాభబుద్ధుని యాత్మ నిర్వాణద్వారము చెంతకు చేరినప్పుడు, అతడద్దానినుండి మరలిపోయి, ప్రపంచములో ఒక్క జీవి దుఃఖియై, అజ్ఞానియై మిగిలి యున్నంతకాలము తానా ద్వారము దాటి పోనని శపథము గైకొన్న మహత్తరగాథయందు గర్భితమైనది ఇదియే. "అష్టసిద్ధులతో గూడిన పరమస్థితినిగాని, జన్మరాహిత్యమునుగాని నేను కోరను. దుఃఖితులైన సకలజీవుల దుఃఖమునూ నేను పొంది వారిని దుఃఖ విముక్తులుగ జేయుటకై వారియందు ప్రవేశింతునుగాక" - అను భాగవత పురాణములోని మహోదాత్త శ్లోకమున నీ యర్థమే ఇమిడియున్నది.

వివేకానందస్వామిచేత ఒక లేఖలో నీ క్రింది విశిష్ట భావోపేతవాక్యముల నుల్లేఖింపజేసిన దిదియే. ఆ మహావేదాంతి ఇట్లు వ్రాసినాడు : "నా మోక్షమునకై కోరికయెల్ల నాలో పూర్తిగ నశించిపోయినది. మరల మరల జన్మలు ఎత్తి దుఃఖపరంపరల ననుభవింపవలెనని కోరుచున్నాను. ఎందుకు ? ఉన్న ఒకే ఒక భగవంతుని,- సకలజీవాత్మల సమష్టిరూపుడైన భగవంతుని,- అంతేకాదు,- దుష్టుల రూపములోనున్న నా భగవంతుని,- దుఃఖితుల రూపములోనున్న నా భగవంతుని,- సకలజాతులలోనూ దీనుల రూపములోనున్న నా భగవంతుని

అర్చించుకొనుటకు. నేను ప్రత్యేకముగా అర్చించునది అతని నొక్కనినే. ఉన్నతుడు పతితుడు, పుణ్యాత్ముడు పాపాత్ముడు, దేవతారూపుడు క్రిమిరూపుడు, అయిన ఆ ప్రత్యక్షస్వరూపుని ఆ జ్ఞేయస్వరూపుని, ఆ వాస్తవికస్వరూపుని, ఆ నిఖిలస్వరూపుని అర్చించుచు, ఇతర విగ్రహములనెల్ల పగులగొట్టివేయండి. ఎవనికి పూర్వజన్మము, ఉత్తరజన్మము లేదో, ఎవనికి మరణము, గమనాగమనములు లేవో, ఎవనిలో మనమింతకుముందు ఎల్లప్పుడునూ ఉండి ఇకముందుగూడ ఎప్పుడునూ ఉండగలమో అట్టివానిని అర్చించుచు ఇతర విగ్రహములనెల్ల పగులగొట్టివేయండి."

ఉన్న విషయమంతయు కడపటి రెండు వాక్యములలోనే యున్నది. కుటుంబమును, సమాజమును బాహ్యముగ వదిలివేయుట మాత్రమున నది నిక్కమైన సన్యాస మెట్లుకాదో, అట్లే ఇహజీవనమును త్రోసిపుచ్చుటయు, ఆధ్యాత్మిక విలయనమును జీవుడు పొందుటయు జన్మబంధమునుండి నిక్కమైన విమోచనము కానేరదు. ఎవనియందు పూర్వజన్మము, ఉత్తర జన్మము, అనే విభాగము లేదో, జన్మలు లేని నిత్యమైన ఆత్మసంస్థితి మాత్రమే ఎవనియందు కలదో, అట్టి ఈశ్వరునితో అంతరమున ఏకత్వమును పొందుటయే నిక్కమైన విమోచనము. అంతరమున విముక్తుడైనవాడు కర్మను చేయుచుండియు చేయనివాడేయని గీత నుడువుచున్నది. ఏలయన, ప్రకృతి కధినాథుడైన పరమేశ్వరుని యాజ్ఞకు లోబడి ఆతనిలో పనిచేయునది ప్రకృతి. అటులనే, వంద పర్యాయములు దేహధారణ మొనర్చినను అతడు జన్మబంధమునుండియు, సంసారచక్రమునుండియు విముక్తుడే.

ఏలయన, అతడు నివసించునది జనన మరణములు లేని ఆత్మయందు,-శారీరిక జీవితమునందు కాదు. కావున, పునర్జన్మమునుండి తప్పించుకొనుటయందాసక్తిని ఇతరులెవరు వదలకున్నను, పూర్ణయోగ సాధకుడు పగులగొట్టి పారవేయవలసిన విగ్రహములలో నిది యొకటి. ఏలయన. అతని యోగము విశ్వాతీతుని సాక్షాత్కారమును వ్యష్ట్యాత్మ పొందుట మాత్రముతో పరిమిత మగునది కాదు సకల జీవాత్మల సమష్టి రూపమైన విశ్వాత్మ సాక్షాత్కారము సైతము దానియందంతర్భూతమైయున్నది. కావున నీ యోగము వైయక్తిక మోక్షేచ్ఛా ప్రవృత్తి

పూర్వకముగా జగచ్చక్రమునుండి తప్పించుకొనిపోవుటకు పరిమితమై పోనేరదు. విశ్వపరిమితుల నధికరించిన అతీతానుభవ స్థితియందుకూడ అతడు పరమేశ్వరుని యందు ఎల్లరితోడను ఏకమై యున్నాడు. కావున విశ్వములో అతడు కొనసాగించ వలసిన ఈశ్వరకార్య మింకనూ మిగిలియే యుండును.

* * *

ఏ మనఃకల్పిత నియతిచేగాని, ఏ మానవధర్మ ప్రమాణముచేగాని ఈ కార్యము నిర్ణీతముకాజాలదు. ఏలయన, అతని చేతన మానవ ధర్మమును, దాని పరిధులను దాటిపోయి, దివ్యస్వాతంత్ర్యములోనికి చేరుకొనినది. బాహ్యము, నశ్వరమునైన నియతిని దాటిపోయి. అంతరము, నిత్యమునైన ఆత్మనియతి లోనికిని, పరిచ్ఛిన్నతలోని బంధహేతుక ప్రమాణములను దాటిపోయి అపరిచ్ఛిన్నతయందలి బంధరహిత స్వయంనిర్ణయస్థితిలోనికిని ప్రవేశించినది. "అతడెట్లు నివసించినను, ఎట్లు వర్తించినను, నాయందే నివసించును, నాయందే వర్తించును." అని గీతావాక్యము. మానవబుద్ధి నిర్ణయించిన నియమములు ముక్తాత్మకు వర్తింపజాలవు. మానసిక సంబంధములును, పూర్వనిర్ణయములును విధించిన ప్రమాణములు, శోధనలు అతనినిగురించి తీర్పు చెప్పుటకు వనికిరావు. పొరపాట్లు పడుట సైజముగాగల యీ న్యాయనిర్ణేతల న్యాయనిర్ణయాధికార పరిధి కాత డతీతుడు.

సన్యాసుల కాషాయ వస్త్రముల నతడు ధరించినను, లేక సంపూర్ణ గృహస్థ జీవితమునే నడపుచున్నను, బుద్ధుడు, క్రీస్తు, శంకరుని మాదిరిగ మానవులకు నేరుగ జ్ఞానబోధ చేయుచున్నను, లేక జనకునివలె రాజ్యపాలన మొనర్చుచున్నను, లేక శ్రీకృష్ణునివలె రాజనీతిజ్ఞుడగను, సైన్యధినేతగను లోకమునకు గన్పట్టినను, ఏమి తినినను ఏమి త్రాగినను, ఎట్టి అలవాటులు వ్యాసంగములు కలవాడైనను, అపజయములు పొందినను జయములు పొందినను, నిర్మాణాత్మకమైనపని చేయుచున్నను వినాశాత్మకమైన పని చేయుచున్నను, పూర్వవ్యవస్థను బలపరచి పునరుద్ధరించుచున్నను, లేక నూతనవ్యవస్థా నిర్మాణమునకై కృషిచేయుచున్నను, లోకులు

సమ్మానింప నుత్సహించెడి సహచరులు కలవాడైనను,లేక ధర్మవర్తనమున వారిచే తా మధికులమనెడి భావమున సంఘ బాహ్యులుగను పతితులుగను భావింపబడెడి సహచరులు కలవాడయినను,సమకాలికులచే నతని జీవితము,వర్తనము ప్రశంసింప బడునదైనను లేక లోకము నపమార్గమున బెట్టి మతవిషయికముగను, నైతికము గను, సాంఘికముగను అధర్మధోరణుల ప్రోత్సహించుచున్నట్లుగా నిరవింపబడున దైనను,_ ఈ వివక్షలేవియు నతని విషయములో పరిగణనీయములుకావు. మాన వుల న్యాయనిర్ణయములు, అజ్ఞలు రూపొందించు ధర్మములు అతని ననుశాసింప జాలవు.

తనలో వినవచ్చు నంతర్వాణి కతడు విధేయుడు. కానరాని యొక దివ్య శక్తిచే నతడు నడుపబడుచుండును, అతని యథార్థ జీవన మతని యంతరములో నున్నది. భగవంతునియందు, పరమేశ్వరునియందు, అనంతునియందు నివసిం చుచు ప్రవర్తించుచుండుటయే ఆ జీవితలక్ష్యము. కాని, అతని వర్తనము ఏబాహ్య నియతిచేతను అనుశాసింపబడక పోయినను, బాహ్యముకాని ఒక నియతినిమాత్ర మది పాటించుచుండును. ఏ వైయక్తిక కామముచేతను, లేక లక్ష్యముచేతను, అయ్యది అనుశాసింపబడదుగాని, జగత్తునందు ఎరుకలో పనిచేయు ఈశ్వర కర్మ కలాపములో నంతర్భాగముగమాత్ర మది విలసిల్లుచుండును. స్వయంవ్యవస్థితమై తత్కారణముగా సువ్యవస్థితమై యలరారు కర్మకలాపమిది.

ముక్తాత్ముని కర్మాచరణము కామముచే ప్రేరితముగాక, లోకసంగ్రహార్థ ముగ,_ అనగా లోకమును కూడగట్టియుంచుటకు తోడ్పడునదిగ,_లోకమునకు నిర్దిష్టమైన మార్గములో అద్దాని పరిపాలనా నిర్వహణములు కొనసాగుటకు తోడ్ప డునదిగ,_ విలసిల్లవలెనని గీత యుద్బోధించుచున్నది. కాని, ఈయాదేశ మేరీతిగా వ్యాఖ్యానించబడుచున్నదనిన,_ ప్రపంచము మాయ కావునను, అత్యధిక సంఖ్యాకు లగు జనులు మోక్షమున కనధికారులు కావునను, సాంఘిక ధర్మముచే వారికి విహితమైయున్న పూర్వాచారపూర్వక కర్మలయందు ఆసక్తి వారిలో పెంపొందు లాగున ముక్తాత్ముడైన జ్ఞాని కర్మల నాచరించవలెనని ఆ వ్యాఖ్యాన సారాంశము. అది అట్లే యగునేని, అది చాల అలతి నియమమే యగును. ప్రతి ఉదాత్త హృదయుడు అమితాభబుద్ధుని దివ్యప్రతిజ్ఞను, భాగవతపురాణపు పరమ ప్రార్థన

మును, వివేకానందుని తీవ్రకాంక్షను అనుసరించు నిమిత్తముగ దానిని త్రోసి పుచ్చుటకే సిద్ధమగును. అట్లుగాక, ఈ జగత్తు ఈశ్వర ప్రేరితముగ ఈశ్వరుని వైపుగా ప్రయాణించుచు, మానవుని రూపమున ఆవిష్కారము పొందిన ప్రకృతి కొనసాగించు మహోద్యమమనియు, గీతయందు భగవానుడు తాను పొందవలసినదీ, పొందకయున్నది ఏమియులేకపోయిననూ సర్వదా కర్మయందు ప్రవర్తించుచున్న ట్లుగా చెప్పుకొనిన కర్మ ఇదియే యనియు.—ఈ దృక్పథమును మన మూ మోదిం తుమేని, గీతయందలి ఈ మహనీయాదేశమునకుగల నిక్కమైన గంభీరార్థము మనకు సువ్యక్తమగును. ఆ యీశ్వర కర్మయందు పాల్గొనుట, ఈశ్వరుని కొరకు జగత్తులో నివసించుట,— ఇదియే కర్మయోగి అనుసరించవలసిన నియతి,— జగత్తులో ఈశ్వరునికొరకు నివసించుటయన, జగత్తునం దీశ్వరు డంతకంత కధికముగా అభివ్యక్తము కాగలుగునట్లును, తెలియరాని యీ మహాయాత్రయం దేమార్గముమీదుగానైనను జగత్తు ముందుకు సాగిపోయి ఆ దివ్యత్వమునకు మరింత సన్నిహితము కాగలుగునట్లును వ్యవహరించుటయే.

ఇది యత డెట్లు చేయవలెను, ఏ ప్రత్యేక విధానానుసారము చేయవలెను, అనునది ఏ సామాన్య నియతినిబట్టియు నిర్ణీతము కాజాలదు. అది మన లోపల నుండియే వికసించి తనను దాను నిర్వచించుకోవలసియున్నది. ఆ నిర్ణయము పరమాత్మయైన ఈశ్వరునకును, ఆయన చేతిలో నుపకరణమునకును నడుమ తేల వలసియున్నది. మన విమోచనమునకు పూర్వముగూడ, మనమది గుర్తించగలుగు స్థితికి వచ్చుటతోడనే, మన అంతరాత్మనుండియే ఈ అనుజ్ఞ,— ఆధ్యాత్మికముగ నిర్ణీతమైన యీ వరణము,— ఆవిష్కృత మగును. చేయవలసిన కర్మను గురించిన జ్ఞానము కేవలము లోపలనుండి పుట్టుకొనిరావలసినదే. ముక్తజీవి నిర్వర్తించవల సిన కర్మ ఇదియని, అనుసరించవలసిన పద్ధతి ఆదియని ఏ ప్రత్యేకకర్మను, తప్పనిసరి యనునట్లు బాహ్యముగ నిర్ణీతమైన ఏ కార్యపద్ధతిని, లేక నియంతిని నిర్దేశించుటకు వీలులేదు. చేయవలసియున్న యీ కర్మను నిర్దేశించెడి గీతలోని పద ప్రయోగము (కర్తవ్యం కర్మ) ఫలాపేక్షరహితముగా మన విధిని మనము నిర్వ ర్తింపవలెనను నర్థములో నన్వయించబడి వ్యాఖ్యానికచబడినది. కాని, ఇయ్యది

భావసంపుటియందు ఆధ్యాత్మికముగాక నైతికము, ఆంతరికముగ లోతైనదిగాక బాహ్యమునైన ఐరోపీయ సంస్కృతినుండి జనించిన భావన.

విధియని మనము సామాన్యముగా పేర్కొనదగినది ఎక్కడను లేదు. తరచుగా ఒకదానితో నొకటి సంఘర్షించుకొను విధులుమాత్ర మున్నవి. ఇవి మన పరిసరములనుబట్టియు, సామాజిక సంబంధములనుబట్టియు, జీవితములోని బాహ్య పరిస్థితులచే ఏర్పడిన మన అంతస్సునుబట్టియు నిర్ణీతమగుచుండును. అపరిపక్వమైన నైతికప్రవృత్తికి తగు శిక్షణ యొసగి, స్వార్థపూరిత కర్మప్రవృత్తిని నిరుత్సాహపరచు ప్రమాణము నొకదానిని ఏర్పాటుచేయుట కవి మిక్కిలి యుపయోగకారులే. లోవెలుగు అనునది సాధకునికి లేనంతకాలము, అతడు తనకు అందుబాటయినంతలో మేలుతరమైన వెలుగు ననుసరించి తనకు తాను నడుపుకొనుచుండవలెనని లోగడనే చెప్పబడినది. ఏదేని ఒక విధిని, సూత్రమును, పక్షమును తాత్కాలికముగా తనకు ప్రమాణముగ నేర్పాటు చేసికొని యతడు ప్రవర్తింపవచ్చును. కాని, ఏమైనను, ఈ విధులు బాహ్యవిషయములే, ఆత్మసంబంధమైనవి కావు,—మన యీ మార్గములో మనకు చరమ ప్రమాణముగ నుపయోగపడ జాలినవి కావు. యుద్ధము చేయవలసివచ్చినపుడు యుద్ధము చేయుట,—తన బంధుమిత్రులపైనను శస్త్రప్రయోగము చేయుట,—సైనికుని విధి. కాని, అదే ధర్మమునుగాని, దానిని బోలిన ధర్మమునుగాని; ముక్తజీవునకు విధించుటకు వీలులేదు. అదిగాక, ప్రేమించుట, దయగలిగియుండుట, మన సత్తయందు పరమసత్యమునకు విధేయుల మగుట, పరమేశ్వరాదేశము ననువర్తించుట,—వీటిని విధులనుటకు వీలులేదు. ఇవి పరమేశ్వరుని వైపునకు ఆరోహించెడి మన ప్రకృతి ధర్మము,—మన ఆత్మసంస్థితినుండి బయల్వెడలు ప్రవృత్తి ప్రవాహము,—మన ఆత్మస్వరూపపు మహనీయ యాథార్థ్యము.

ముక్తుడైన కర్మయోగిప్రవృత్తికూడ అట్లు తన ఆత్మనుండి పొంగివచ్చినదికావలెను. ఆధ్యాత్మికముగ పరమేశ్వరునితో నత డైక్యము పొందినదాని సహజఫలితమై అయ్యది అతనిలోనుండి బహిర్గతము కావలెను. అంతియే కాని, మానసిక సంకల్పము, భావన, వ్యావహారిక హేతువాదయుక్తి, సాంఘిక దృష్టి, వీనిచే

రూపొందించబడిన యొక మహోదాత్త కల్పన కొరాదు. సామాన్య జీవితము నందు, వైయక్తికముగను, సాంఘికముగను, సాంప్రదాయికముగను రూపొందిన నియతి, ప్రమాణము, లేక ఆదర్శము మార్గదర్శకమే యగును. కాని, ఆధ్యాత్మిక యాత్ర ప్రారంభమైన పిమ్మట, దీని స్థానమున, మన ఆత్మసంయమమునకు, విమోచనమునకు, సంసిద్ధికి అవశ్యమగుచు, ఆంతరము బాహిరముకూడనై యొప్పారు జీవనపద్ధతి యొకటి మనకు ఏడుగడయై వెలయవలెను. మన మనుసరించు మార్గమున కనుగుణమైనదియు, లేక మన అంతరమునగల పరమగురు వుద్బోధించినదియు, దారి చూపి మనలను ముందుకు నడిపించు పరమనేత ఆదేశించినదియు నై అయ్యది దీపించవలెను. ఆత్మయొక్క అనంత్యము, స్వాతంత్ర్యము అనుభూతమగు కట్టకడపటి దశలో, బాహ్యప్రమాణము లన్నియు పూర్తిగా విసర్జించిబడి, పరమేశ్వరునితోడి యైక్యముతో, పరమేశ్వరునకు స్వచ్ఛందముగను, సంపూర్ణముగను మనము విధేయుల మగుటయు, మనస్వరూప స్వభావముల సంపూర్ణాధ్యాత్మిక సంసిద్ధికై స్వచ్ఛందముగ మన కార్యాచరణము ప్రవర్తిల్లుటయు మాత్రమే మిగిలియుండును.

మన స్వభావముచే నిర్ణీతమై నియతమైన కర్మయే మన ప్రవృత్తిధర్మము కావలెనన్న గీతాబోధను ఈ గంభీరార్థములోనే మనము గ్రహింపవలసియున్నది. ఉపరితలపు గుణశీలములు, అభ్యాసప్రవృత్తులు. అనునర్థమున స్వభావపదమిచ్చట ఎంతమాత్రమూ ప్రయోగింపబడలేదు. 'స్వభావము' అనెడి వాచ్యార్థమునందే అయ్యది ప్రయుక్తమై యున్నది. 'స్వ-భావ' మనగా, మన స్వకీయసత్త, మన మూలప్రకృతి, మన ఆత్మలయందలి దివ్యపదార్థము,అన్నమాట. ఈ మూలములో నుండి ఏది వెల్లుబికి వచ్చినను అయ్యది అత్యంత ప్రగాఢము, సారభూతము, సమీచీనమునై విలసిల్లును. తక్కినవి,-అభిప్రాయములు, ఆవేగములు, అలవాటులు, కోరికలు,-అన్నియు కేవలము ఉపరితలమున రూపొందినవి, లేక యాదృచ్ఛిక చాపల్యముతో లోనుండి బహిర్గతమైనవి, లేక, వెలినుండి మనలోనికి ప్రవేశించినవి మాత్రమే యగును. అస్థిరములై మార్పులు చెందునట్టివవి. ఇది అటుల గాక, స్థిరమై నిలిచియుండును. ఇది ప్రకృతి మనయందు వివిధకరణముల రూప

ములో గైకొన్న స్వరూపముకంటె వేరైనది. మనలో నిలకడగా అభివ్యక్తమగు చుండెడు స్వరూపముకంటె గూడ వేరైనది. విశ్వమున సార్వకాలికముగ నిలిచి యుండునదై తేజరిల్లెడి మనలోని ఆధ్యాత్మిక సత్తయది. మనలో నిహితమైయున్న ఆత్మ-సంభూతియు దీనిలో నంతర్భాగము.

అయినను, ఆంతరికము, యథార్థము నగు నీ స్వభావనియత కర్మను మనము సులభముగ గుర్తింపజాలము. అహంకారమువలన మన బుద్ధియు, హృదయమును కలుషితములై యుండునంతకాలము ఇయ్యది మనకు తెలియరాక తెర మరుగుననే యుండును. అంతవరకును మనము మన పరిసరములనుండి యేతెంచిన నానావిధములైన అస్థిర భావములు, ఆవేగములు, కోరికలు, సూచనలు అనుశాసనములనే అనుసరించుచుందుము. లేక అశాశ్వతమైన మన యీ మానసిక, ప్రాణిక, శారీరిక వ్యక్తిత్వము కల్పనచేసినవాటినే కార్యరూపమున బెట్టుచుందుము. ఈ వ్యక్తిత్వము మన స్వకీయ సత్తకు, అవర విశ్వప్రకృతికి నడుమ జరిగిన ఆదానప్రదానముల ఫలితముగా మనకొరకై రూపొందించబడిన ప్రయోగాత్మకమగు నస్థిరమైన కల్పితాత్మ. మనము విశుద్ధుల మగుచుండినకొలది, మన లోని యథార్థ సత్త అంతకంతకు స్పష్టముగా తనను తాను ప్రకటించుకొనుచుండును. బయటనుండి వచ్చు సూచనలయందు మన సంకల్పము చిక్కుకొనుట అంతకంతకు తగ్గిపోవును. అలతియైన మన మానసిక కల్పనలలో మనము కప్పుపడిపోవుటయు క్రమముగా క్షీణించును. అహంకారము విసర్జించబడి ప్రకృతి విశుద్ధిని బొందినప్పుడు కర్మ ఆత్మాదేశముల ననువర్తించును,—ఆత్మయొక్క గభీర తలములనుండియు, ఉన్నతశిఖరములనుండియు ప్రవహిల్లును. లేక, మన హృద్దేశములయందు కానరాక సదా ఆసీనుడై యుండు పరమేశ్వరునిచేతనే బాహాటముగా నియతమగుచు విరాజిల్లును.

విశ్వాసమునకు, ఆచరణకు సంబంధించిన సకల సాంప్రదాయిక సూత్రములను, మార్పు నంగీకరించని సకల బాహ్యనియతులను, సకల బాహ్యప్రకృతి కల్పనలను, ఒక్కమాటలో సకల ధర్మములను,-యోగి పరిత్యజించి ఈశ్వరుని మాత్రమే శరణు బొందవలెననునది గీత కట్టకడ కొసగుచున్న పరమసందేశము,

కామము, సంగము లేక, సకల ప్రాణులతోడను ఏకత్వమును బొంది అనంతమైన పరమ సత్యమునందు, పరమవిశుద్ధతయందు నివసించుచు, తన అంతశ్చేతన అగాధతలములనుండి ప్రవర్తించువాడై, అమరము, దివ్యము, పరమమునైన తన ఆత్మస్వరూపముచే పరిపాలింపబడు కారణమున అతడాచరించు కర్మలన్నియు మన నిక్కమైన ఆత్మస్వభావవిశేషము ద్వారా, మనలోని దివ్యశక్తిచేత సరాసరిగ నడుపబడుచుండును. జగత్తులో ఈశ్వరసంసిద్ధిని సాధించుటకై, ఎరుకగలిగి, పోరాడుచు, పాటుపడుచు, ప్రేమించుచు, ప్రవర్తిల్లు నీ స్వభావము సదా దివ్యమై యలరారుచు, కాలపరిధిలో అనంతుని ఆత్మప్రకటనము రూపమున విరాజిల్లుచున్నది.

ఈశ్వరునితో ఏకత్వమును బొందిన మన అంతరాత్మయొక్క వెలుగునుండియు, శక్తినుండియు స్వచ్ఛందముగా, స్వేచ్ఛగా, పొరపాటుల కాస్కారము లేని విధముగా, ఆవిర్భూతమగు దివ్యకర్మాచరణమే యీ పూర్ణకర్మయోగములోని చిట్టచివరి దశ. ముక్తికొరకై మనము తప్పనిసరిగ ప్రయత్నము చేయవలసినది సంసార దుఃఖమునుండి వైయక్తికముగా మనము విముక్తులమగుటకే కాదు. వైయక్తిక ముక్తికూడ మనకు లభించగలదనుటలో సందేహము లేదు. కాని, మనము ముక్తి నన్వేషించవలసినది ముఖ్యాతిముఖ్యముగా నిత్యుడు, పరముడునైన యీశ్వరునితో నైక్యమును బొందగలుగుటకు. అటులనే, పరిపూర్ణతను, పరమ సంస్థితిని, విశుద్ధతను, జ్ఞానమును, బలమును, ప్రేమను, సామర్థ్యమును మనము సంపాదించవలసినది వ్యక్తిగతముగా మనమా దివ్యప్రకృతిసంపద ననుభవించుటకు, లేక దేవతారూపులమై మనము విలసిల్లుటకు గాదు. మన సాధనఫలితముగా అదికూడ మనకు సిద్ధింపగలదనుటలో సందియములేదు. కాని, మనమీ సంసిద్ధి నన్వేషించవలసినది ముఖ్యాతిముఖ్యముగా, ఈ విముక్తియు, సంసిద్ధియు మనలోని ఈశ్వర సంకల్పము, ప్రకృతివిధానములో మన ఆత్మయొక్క పరమ యాథార్థ్యము, విశ్వమున క్రమవికాస పూర్వకముగా కొనసాగు నభివ్యక్తికి నిత్య నిర్దిష్ట గమ్యము అయినందువలననే.

స్వతంత్రము, విశుద్ధము, ఆనందమయమునైన పరాప్రకృతి మొదట వ్యక్తియందభివ్యక్తమై తద్ద్వారమున జగత్తులో నభివ్యక్తము కావలసియున్నది.

అవిద్యాస్థితియందుకూడ వ్యక్తి వాస్తవముగ విశ్వసమష్టియందు విశ్వప్రయోజనము నిమిత్తమే జీవించుచున్నాడు. ఏలయన, అహంకారికములైన తన కోరికలను, ప్రయోజనములను సాధించు ప్రయత్నములోనే యతడు ఆ యాహంకారిక ప్రయత్నముద్వారా భువనములయందు ప్రకృతి కొనసాగించు కార్యమునకు తోడ్పడునట్లుగ నామెచే బలవంతముగ నియోజితుడగుచున్నాడు. కాని అది యతడు తెలిసికొని చేయుటలేదు. ఆ చేయు పని సైతము దోషభూయిష్ఠము. అక్షరదండించు తోడ్పాటు అసమగ్రచేతనతో అసమగ్ర వికాసమునొంది అసమగ్ర రీతిలో కొనసాగుచున్న యామె కార్యసరళికి మాత్రమే. అహంకారమును విడనాడి ఈశ్వరునితో ఐక్యము చెందుటతో నతని వ్యక్తిత్వము విముక్తినీ ఆత్మసాఫల్యమునూగూడ పొందుచున్నది. ఆ రీతిగా విముక్తుడు, విశుద్ధుడు, పరిపూర్ణుడునైన వ్యక్తి,— ఈశ్వరాంశమై విలసిల్లెడి యాత్మ,— విశ్వాతీత ఈశ్వరతత్త్వమునందు ఆ యీశ్వరునికొరకే,— విశ్వమున నంతర్గతమైయున్న ఆతని యిచ్ఛకొరకే,— సంపూర్ణమైన యెరుకతో సర్వసమగ్రముగా నివసింప నేర్చును.

జ్ఞానమార్గములో మనము వ్యక్తిత్వములో నుండియు, విశ్వసమష్టిలో నుండియు వెలికి లంఘించి, సకల యోచనలను, సంకల్పములను, కర్మలను,— ప్రకృతి పథమును సర్వమును విడనాడి, నిత్యునియందు విలీనత్వమున సర్వాతీతములో మునిగిపోయెడు ఒకానొక ఘట్టమునకు మనము చేరుకొనుట కలదు. ఈశ్వర సాక్షాత్కారమును పొందినవానికది విధాయకము గాకపోయినను, మనలో నున్న ఆత్మ అన్వేషించెడి లక్ష్యము, గైకొనెడి నిర్ణయము అదియే కావచ్చును. అటులే భక్తిమార్గమున, తీవ్రమైన భక్త్యానందములద్వారా మనము ఆ పరమ ప్రియునితో సాయుజ్యమును బడసి, ఆతనియందే నిమగ్నులమగుచు ఒక దివ్యానందలోకమున ఆతనితో నత్యంత సన్నిహితముగ మెలగుచు, ఆతని దివ్య సాన్నిధ్య మహదానందమున నట్లే శాశ్వతముగా నుండిపోవు పరిస్థితికి మనము చేరుకొనుటయు కలదు. అదికూడ మనలోనుండి వచ్చిన ప్రేరణము, మన ఆత్మ చేసికొనిన ఆధ్యాత్మిక వరణమే కావచ్చును. కాని, కర్మమార్గములో ఇంకొక పరిస్థితి యేర్పడుట కవకాశమున్నది. ఈ మార్గమున ప్రయాణించుచు మనము, అనంతునితో సాధర్మ్యమును పొందుటద్వారా విముక్తిని, సంసిద్ధిని బడయు స్థితికి చేరుకొనవచ్చును.

ఈ స్థితిలో మనము, మన ఆధ్యాత్మిక సంస్థితియందేకాక మన సంకల్పము నందు, ఆత్మశక్తి ప్రకటనమునందుగూడ ఆతనితో ఏకత్వమును పొందియుందుము. కర్మాచరణమొక దివ్యమైన ఫక్కిలో నడచుట యీ ఏకత్వసిద్ధికి సహజ పర్యవసానము. ఆధ్యాత్మిక స్వాతంత్ర్యపూర్వకమైన దివ్యజీవనము దీని యాత్మ ప్రకటనమునకు శరీరము. పూర్ణయోగములో ఈ దృక్పథములు మూడును, ఇతర సంసర్గమొల్లని తమ ప్రత్యేకధోరణులను విసర్జించి, ఒకదానినొకటి కలిసి కొని ఏకమగుటయు, లేక ఒకదానిలోనుండి యొకటి ఆవిర్భావము నందుటయు సంభవించును. ఆత్మనావరించిన మనస్సను తెర తొలగిపోగా మనము సర్వాతీత స్థితిలో నివసింప నేర్తుము. హృదయమునందలి భక్తితత్పరతద్వారా, అఖండ పరమ ప్రేమానందైకరసమున నోలలాడగలుగుదుము. మన సత్తయందలి సకల శక్తులు ఒకే దివ్యశక్తిలోనికి ఉద్ధరించబడి, ఒకే దివ్యేచ్ఛకు, దివ్యశక్తికి మన యిచ్ఛ, మన కార్యకలాపములు సమర్పితములైపోగా, పరాప్రకృతియందలి శక్త్యాత్మక సంసిద్ధిని మనలో నావిష్కరించుకొనగలుగుదుము.



# అధ్యాయము 13 *

## అతిమానసము - కర్మయోగము

మానవసత్త నంతనూ మహోన్నతమైన ఆధ్యాత్మిక చేతనలోనికి, మహా విస్తృతమైన దివ్యసంస్థితిలోనికి పరివర్తనము చెందించుట యనునది పూర్ణయోగపు సర్వసమగ్ర చరమలక్ష్యములో నత్యంత ప్రధానాంశమై యున్నది. మనలోని సంకల్పక్రియాప్రవృత్తుల విభాగములు, జ్ఞానప్రవృత్తుల విభాగములు, మనలోని ఆలోచనాత్మక సత్త, రసభావాత్మక సత్త, ప్రాణమయ సత్త. మనలోని పురుష ప్రకృతుల తత్త్వము సమస్తము, అనంతుడు, నిత్యుడునైన యీశ్వరునే అన్వేషించి, అతనిలోనికే చొచ్చి, అతనిలోనే ఐక్యము చెందవలెను. కాని, మానవుని ఇప్పటి ప్రకృతిలక్షణము పరిచ్ఛిన్నము, విభక్తము, విషమమునై యున్నది. తన సత్తయందు మిక్కిలి బలముగానున్న విభాగముప నేకాగ్రతను బొంది, తన ప్రకృతికి తగిన యొక సునిశ్చితమైన అభివృద్ధిపథము ననుసరించుట అతనికి మిక్కిలి సులభము. పరమమైన అనంతత్వసాగరములోనికి వెంటనే సరాసరిగ ఒక్క ఉదటున లంఘించెడి శక్తిసామర్థ్యముగల వ్యక్తులు కడు అరుదుగా నుందురు.

---

* ఈ యధ్యాయము తొలుత ప్రకటితమైన గ్రంథమునందు లేదు. దివ్యకర్మ యోగము నింకనూ విస్తరించి వ్రాయదలపెట్టి శ్రీ అరవిందులీ యధ్యాయమును ప్రారంభించిరి. కాని, పూర్తిచేయలేదు. వారి నిర్యాణానంతరము 1965 లో ప్రచురింపబడిన శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్ర ప్రచురణల సందర్భములో తొలుతగా నిది ప్రకటింపబడెను.

కావున, కొందరు తమలోని నిత్యసత్యమైన ఆత్మస్వరూపమును గనుగొనుటకు ప్రారంభదశలో తమ ఆలోచనా సరళియం దేకాగ్రతను, ధ్యాననిష్ఠను సాధనగా నెన్నుకొనవచ్చును. కొందరు సులభతరముగ తమ హృదంతరాళములోనికి చొరనేర్చి, అచట ఆ నిత్యుడైన పరముని సాక్షాత్కారమును బొందవచ్చును. మరికొందరు, ప్రధానముగా క్రియాశక్తియుక్తులగుటవలన తమ సంకల్ప శక్తిని కేంద్రముగా జేసికొని, కర్మలద్వారా తమ సత్తను విస్తృతపరచుకొనుట మిక్కిలి శ్రేయోదాయకమగును. అట్టివారు సకలమునకును మూలమైన ఆత్మతత్త్వపు ఆనంత్యమున తమ సంకల్పము నర్పణము గావించుకొనుటద్వారా, అద్దానితో నైక్యమును బొంది, తమలో నిగూఢుడైయున్న పరముని చేతనే తమ కార్యకలాపమున నడుపబడుచు,– లేక విశ్వవ్యాపారమున కధినాథుడై నెగడువాడే తమ ఆలోచనలకు, భావనలకు, క్రియలకు అధినాథుడై వానిని నడుపుచున్నాడను దృష్టితో అతని కాత్మార్పణ మొనర్చుకొని, తన్నిమిత్తముగ పొందిన విస్తృతిచే, స్వార్థరహిత సార్వజనీనతయందు విలసిల్లుచు, కర్మలద్వారా ఆధ్యాత్మికోన్నతికి సంబంధించిన ఒకవిధమగు పూర్ణత్వపు తొలి యనుభూతిని గాంచవచ్చును.

కాని, తొలుత ఎచ్చోటినుండి బయలుదేరినను ఈ మార్గము క్రమముగా సువిశాలప్రదేశములోనికి విస్తరిల్లక తప్పదు. కట్టకడపటికది, సుసంయోజితమైన జ్ఞానము, రసభావము, క్రియాశక్తిపూర్వక సంకల్పము, సకల సత్తయొక్కయు, సకల ప్రకృతియొక్కయు సంసిద్ధి,–వీని సమష్టి విలసనము ద్వారముననే అయ్యది ముందునకు సాగవలసియుండును. అతిమానసమైన విజ్ఞానచేతనయందును, అతిమానసమైన జీవనస్థాయి యందును ఈ సంయోజనము పరాకోటినందుకొనును. జ్ఞానము, సంకల్పము, రసభావము, ఆత్మసంసిద్ధి, ప్రకృతిశక్తి,– ప్రతిదియు నచట తన తన పరమస్థాయినందుకొని, అన్నియు నొండొంటిలో పరమ సామరస్యమున నేకమై, దివ్య సంపూర్ణతను, దివ్య సంసిద్ధిని పొందుట సంభవించును. ఏలయన, అతిమానసము ఋతచేతన. ఈశ్వరసత్త అందు సంపూర్ణముగ నభివ్యక్తమై యుండును. అవిద్యాపరికరముతో వికదానికి పనిలేదు. సత్తయొక్క

పరమమైన సత్యసంస్థితి అచ్చోట సంపూర్ణము, స్వతస్సిద్ధము నైన ఋతశక్తిగా, ఋతకర్మగా శక్త్యాత్మకమై విలసిల్లును.

అచటి ప్రతికదలికయు ఆత్మభానము, ఈశ్వరభానముగల ఋతవిలసనమే. ప్రతి విభాగము నచట సమస్తముతో సంపూర్ణ సామరస్యమును బొందియుండును. అత్యంత పరిమితము, పరిచ్ఛిన్నమునైన క్రియసైతము ఆ ఋతచేతనయందు నిత్యుడైన అనంతుని క్రియావిశేషమే యగుచు, నిత్యుడైన యనంతుని సహజ సంపూర్ణ పరమైశ్వర్యమున భాగస్వామ్యము నందుకొనును. అతిమానస విజ్ఞానము లోనికి ఆరోహణము మన ఆధ్యాత్మికచేతనను ఉన్నతస్థాయి కెత్తుటయేగాక, ఆ దివ్యజ్యోతిని, దివ్య సత్యమును మన సకల సత్తలోనికి, మన ప్రకృతివిభాగము లన్నిటిలోనికి అవరోహింపజేయును. అంతయు నపుడు ఆ దివ్యసత్యములో నంత ర్భాగమే యగును,- పరమమైన ఏకత్వసిద్ధికి సాధనభూతమే యగును. కావున నీ యారోహణావరోహణములే పూర్ణయోగపు చరమలక్ష్యమై యుండుట అత్యం తావశ్యకము.

ఈశ్వరసత్తతో మన సత్తను ఏకముచేయుట ఈ యోగపు ఏకలక్ష్యమై యున్నది. దీనిని గుర్తులో నుంచుకొనుట మిక్కిలి యవసరము, ఈ యోగసాధ నకు మనము పూనుకొనుట అతిమానససిద్ధిని సంపాదించుకొరకుగాక ఈశ్వరుని కొరకని మనము జ్ఞాపకముంచుకొనవలెను. అతిమానసలబ్ధిని మనము కోరుట కేవల మద్దాని ఘనతను, ఆనందమును అనుభవించుటకు గాదు,- ఈశ్వరునితోడి యైక్యముయొక్క పారమ్యమును, పూర్ణత్వమును బొందినవారమై అద్దాని పరమో న్నత,పరమవిశాల సీమలలో, మన ప్రకృతియందలి ప్రతి చిన్నసందు, గొంది, మలుపులోనూ అద్దానిని అనుభవించి, భుక్తమొనర్చుకొని, మన సత్తయం దెల్ల విధముల నది శక్త్యాత్మకమై విలసిల్లజేయుటకు.

మహత్తరమైన ఒకానొక అతిమానవత్వసిద్ధిని, మహత్తర దివ్యశక్తి విశేషమును, బృహత్తరమైన వ్యక్తిత్వోపలబ్ధిని బడయుట అతిమానస యోగ మని తలంచుట. తప్పు చాలమంది యీ తప్పు భావననే చేయుచుందురు. ఇది కడు నసత్యము, విపత్కరము నైన భావన. విపత్కర మేలయనగా, రాజసిక

మైన ప్రాణాత్మక మనస్సంబంధములగు గర్వము, స్వాతిశయము, అత్యాశ వీని మూలమున మనలో తలయెత్తుట కవకాశమున్నది. దీనిని మన మధికరించి జయింపకున్నచో, ఇవి మన ఆధ్యాత్మిక పతనమునకు దారితీయును. అసత్య మేలననగా, ఇది వట్టి యాహంకారిక భావన. అతిమానస పరివర్తనమునకు మొట్ట మొదటగా సాధింపవలసినది అహంకార నిర్మూలనము. ఇచ్ఛాక్రియాశీలుడగు మానవుని క్రియాప్రవణ ప్రకృతిని పైన పేర్కొనబడిన భావన శక్తిసంపాదన ప్రయత్నములోనికి అవలీలగా లాగుకొనిపోగల మహాప్రమాదమున్నది.

అతిమానస పరివర్తనమువలన శక్తి మనకు నిశ్చయముగనే చేకూరును. నిర్దుష్టకార్యాచరణమున కది ఆవశ్యకమే. కాని, ఆ చేకూరెడి శక్తి ఈశ్వరుని శక్తి,- ఆధ్యాత్మికజీవపురుషుని ద్వారమున పనిచేయు నద్వయుడైన పరమ పురుషుని శక్తి. అదియే మన ప్రకృతిని, జీవితమును చేపట్టి నడిపించుటకు బూను కొనును. అయ్యది వ్యక్తిగత శక్తివిజృంభణముకాదు,- వేరుభావనగల మనోమయ, ప్రాణమయాహంకారపు చరమ సంసిద్ధిరూప విన్యాసముకాదు. ఆత్మసంసిద్ధి యీ యోగఫలితముగా చేకూరుమాట నిజమే. కాని, దాని లక్ష్యము వ్యక్తిఘనతను ప్రకటించుట కాదు. ఆధ్యాత్మిక సంసిద్ధియే దాని యేకలక్ష్యము. ఈశ్వర చేతనను, ఈశ్వర ప్రకృతిని వహించునట్టి సాధర్మ్యముక్తి ద్వారమున ఈశ్వరునితోడి యైక్య ములో నిజాత్మ సంసిద్ధిని బడయగోరు లక్ష్యమది. ఇక తక్కినదెల్ల దాని ననుస రించి ప్రవర్తిల్లు విశేషముల విస్తరణమే. అహంకారికమైన ఆవేశములు, అత్యా శలు, స్వీయాధిక్యశక్తిసామర్థ్యముకొరకు వెంపరలాట, స్వాతిశయప్రవృత్తి,- ఇవన్నియు నీ మహనీయచేతనకు విజాతీయములు. అతిమానస పరివర్తనము వైపునకు అల్లంత దూరముగ చేరనరుగుటకైనను ఇవి తీవ్ర ప్రతిబంధ కములె.

సాధకుడు తన పరతరాత్మస్వరూపోపలబ్ధిని గాంచుటకు ఈశ్వరునితో నైక్యము పొందుటయే అతని ప్రధాన లక్ష్యము కావలెను. తన సత్తయొక్క,- సమస్త సత్తయొక్క,- యథార్థ్యమును కనుగొనుట, ఆ యాథార్థ్యము నందును, అద్దాని మహనీయచేతనయందును జీవించుట,- ప్రకృతియొక్క పూర్ణత్వసిద్ధి,-ఇవి

యెల్ల నా మహోద్యమమున తమంతట చేకూరు సహజఫలితములు మాత్రమే. పూర్ణ సంసిద్ధినుండి యివి వేరుచేయరానివి గనుకను, ఆ సంసిద్ధిఫలితముగ తప్పక పెంపొంది అందుబాటగునవి కావునను, ప్రధాన లక్ష్యములో నవి యొక భాగము మాత్రమే యగును.

అతిమానస పరివర్తనము బహు కష్టసాధ్యము, సుదూరస్థితము, సాధన యందలి చిట్టచివరి ఘట్టము, అనునది కూడా జ్ఞాపకముంచుకొనుట యవసరము. సుదూరమున దృశ్యమానమగు పథాంతమున ఉపలభ్య మగునట్టిదిగా అద్దానిని పరిగణించుట యవసరము. ప్రారంభదశలోనే సాధింప వీలైన లక్ష్యముగను, నిత్యసన్నిహితమై వెంటనే చేరనగు గమ్యముగను దాని నెంతమాత్రమును పరిగణింపరాదు. ఆత్మవశీకరణకు. ఆత్మోద్గతికి ఎంతయో శ్రమపడినమీదట, కష్ట బహుళమైన ప్రకృతివికాస యాత్రాపథమున అనేక విషమ పరీక్షల నెదుర్కొనుచు పెక్కు సుదీర్ఘ ప్రయాణములు చేసిన యనంతరము చిట్టచివరకు మాత్రమే సాధ్యమై తోచగల ఉపలబ్ధి యిది.

మొట్టమొదట మనము మనలో, ఈ యోగసంబంధమగు నంతర్దృష్టిని పెంపొందించుకొని, తద్ద్వారమున సామాన్యజీవితపు దృక్పథములను, సహజగతులను విడనాడుట అత్యంతావశ్యకము. మన యిప్పటి సత్తయొక్క పడికట్టు నందే మనమొక విప్లవాత్మకమైన మార్పు సాధించవలసియున్నది. పిమ్మట, మన మింకనూ లోతునకుపోయి.తెరమరుగున నున్న చైత్యపురుషతత్వమును కనుగొని, దాని వెలుగుచేతను, పాలనముచేతను మన బాహ్యాభ్యంతర విభాగములల్లెల్ల చైత్యప్రభావితములుగా నొనర్చి, మన మనఃప్రాణ శరీరముల సకల స్థితిగతులను మనలోని చైత్యాత్మకు ఎరుకతోకూడిన ఉపకరణములుగా మార్చుకోవలసియున్నది. తరువాతగాని, లేక పై ప్రయత్నము ఒక ప్రక్క కొనసాగుచున్న కాలమందే కాని, దివ్యతేజస్సును, శక్తిని, విశుద్ధతను, జ్ఞానమును, స్వతంత్రతను, విశాలతను మనలోనికి అవతరింపజేసికొనుటద్వారా మన సకలసత్తను అధ్యాత్మికము గావింపకోవలసియున్నది. వ్యష్టి మనఃప్రాణ దేహముల పరిమితులను విచ్ఛిన్నమొనర్చి, సమష్టిచేతనలోనికి ప్రవేశించి, విశ్వాత్మోపలబ్ధిని పొంది,

విశ్వజనీనమగు నాధ్యాత్మిక మనఃప్రాణ శరీర చేతనలను నంతరించుకొనుటయు జరగవలసియున్నది. అతిమానస చేతనలోనికి ప్రవేశము అపుడు మాత్రమే సాధ్యమగుట మొదలగును.

కాని, అప్పుడుకూడ మిక్కిలి కష్టసాధ్యమైన యారోహణ మొకటి జరగవలసియుండును. అందలి ప్రతి ఘట్టము కడు ప్రయాసతో వేర్వేరుగా అధిగమించవలసినట్టిదే. యోగమనునది జీవుని చైతన్యక్రమవికాసగతిని ఏకాగ్రమొనరించి త్వరితపరచు ననుమాట నిజమే, కాని, ఎంత త్వరితగతి కలిగినదైనను, కారణ ప్రకృతియందు వందలకొలది, వేలకొలది సంవత్సరములు, లేక వందల జన్మలు పట్టుదానిని అది ఒక్కజన్మలో సాధింపగలిగినదైనను, క్రమవికాసగతి సమస్తము వివిధదశానుక్రమముననే కొనసాగవలసియుండును. ఎంత ఏకాగ్రతతో, ఎంత తీవ్రవేగముతో కొనసాగు యోగసాధనయైనను అన్నిదశలనూ ఒక్కమాటుగ దాటివేయుటకుగాని, సహజ విధానమును తలక్రిందులుచేసి తుదిని మొదలుకు చేరువగా లాగుకొని వచ్చుటకుగాని సమర్థము కానేరదు. తొందరపాటు గలిగిన అజ్ఞమనస్సు, అత్యాతురతతో గూడిన శక్త్యావేగము ఈ ఆవశ్యకత నవలీలగా విస్మరించును. అతిమానసమును అవి వెంటనే సాధింపవలెనని ముందుకు పరుగెత్తి, అనంతునియందలి ఉన్నత శిఖరములనుండి అద్దానిని క్రిందికి దిగలాగవలెనని యాసించును. ఇది వట్టి తెలివిమారిన ఆశయేగాక, మిక్కిలి ప్రమాద భూయిష్ఠమైనది కూడ.

ఏలయన, ప్రాణమయకోశమునందలి కామము తమోమయములు, ప్రచండ వేగవంతములునైన ప్రాణమయ శక్తులను మేల్కొలుపగా, అయ్యవి అద్దాని అసాధ్యపు కోరికను వెంటనే సాధించిపెట్టగలమని ఆశపెట్టి దానిని భ్రమింపజేయుట సంభవింపవచ్చును. దీని పర్యవసానముగా సాధకుడు, పలువిధములైన ఆత్మవంచన పాలై, తమోమయశక్తుల ఆకర్షణలకు, అసత్యప్రేరణలకు లోనగుచు, అసాధారణ శక్తులకై వేట మొదలుపెట్టి, దైవీప్రకృతినుండి ఆసురీప్రకృతివైపునకు మరలినవాడై, అసహజము, అమానుషము అదివ్యమునైన బృహదహంకారపు విపరీత విస్తృతిలో అమితముగా ఊరిపోవు మహాప్రమాదము వాటిల్లుట కవకాశమున్నది అతడు అల్పసత్త్వ, దుర్బలప్రకృతి కలవాడైనచో

ఇంత మహాప్రమాద ముండదుగాని, స్థాయి తప్పిపోవుట, మనస్సు కీలుతప్పి విపరీతవాదనలోనికి దిగుట, ప్రాణకోశముపై తము కీలుతప్పి నైతిక భ్రంశము నకు లోనగుట, స్వస్థత తప్పిన విపరీతస్థితి యేర్పడుట,- ఈ దుష్ఫలితములు సంప్రాప్తము గావచ్చును, ఈ యోగములో, ఎటువంటి విపరీత స్థితినిగాని,- అది యెంత ఘనముగ చూపట్టునదైనను,- ఆత్మసంసిద్ధికి, ఆధ్యాత్మికోపలబ్ధికి సాధన ముగా గ్రహించుటకు వీలులేదు.

సహజత్వమునకు, సహేతుకతకు అతీతమైన అనుభూతిలోనికి ప్రవేశించి నప్పుడు కూడ సాధకుడు తనస్థాయికి భంగము కలుగనీయరాదు. చేతనయొక్క శిఖరస్థానమునుండి పాదస్థానమువరకు, అంతటా ఆ స్థాయిని దృఢముగ నిల బెట్టుకొనుచునేయుండవలెను. అనుభూతిని పొందెడు చేతన, విశృంలమగు స్థాయిని, పరిశీలనయందకలంకమైన వైశద్యమును, అనుక్రమమును, మహోదాత్తమగు సహజ వివేకమును, నిశితమైన ఆత్మవిమర్శకు, సమగ్రవీచక్షణకు, సమానాధికరణ మునకు, స్థిరదర్శనమునకు తావలమగు అమోఘశక్తివిశేషమును చిక్కబట్టుకో గలిగియుండవలెను. యథార్థస్థితిగతుల సమ్యగవగాహనము, ఆధ్యాత్మికోన్నతిని గడించుకొన్న ప్రత్యక్షవాదదృష్టి అతనియందు సదా దీపించుచుండవలెను.యుక్తి విహీనతను, లేక యుక్తిబాహ్యతను అవలంబించుటవలనగాదు మానవుడు సామా న్యప్రకృతిలోనుండి పరాప్రకృతిలోనికి పోగలుగునది. యుక్తిద్వారమున పరా యుక్తి యొక్క ఘనతరతేజములోనికి పోనేర్చి అద్దానిని సాధించవలసియున్నది. ఈ పరాయుక్తి యుక్తిలోనికి అవతరించి దాని పరిమితులను భిన్నమొనర్చుచు దాని నున్నత సీమలలోనికి గొనిపోవును. ఈ పరిస్థితియందు, యుక్తి నశించిపోవు టకు బదులు, పరివర్తనము చెంది, పరాప్రకృతియొక్క సమానాధికరణ శక్తి విశేషముగా తన అపరిచ్ఛిన్న నిజస్వరూపోపలబ్ధిని పొందనేర్చును.

మన మనస్సు కడు సులభముగా చేయుటకు వీలున్న మరొక తప్పు విష యమున గూడ మనము మిక్కిలి జాగరూకులమై యుండుట అవసరము ఉన్నత భూమికలోని ఏ అవాంతరచేతననో, లేక సామాన్య చేతనకంటె అతీతమైనదగు నే చేతనావిశేషమునో అతిమానసచేతనగ భ్రమించుట సంభవించుచుండును. మానవమనస్సుయొక్క సామాన్య ప్రవృత్తుల నధికరించినంతమాత్రమున అతి

మానస మందుబాటులోనికి రాదు. మానవ సత్తయొక్క సామాన్యపరిధికంటె అతీత స్థాయిలోనున్న ఘనతరతేజమును, ఘనతరశక్తిని, ఘనతరానందమును స్వీకరించ గలిగినంత మాత్రముననూ, అందు ఇచ్ఛా, జ్ఞాన, దర్శనశక్తులను పెంపొందించుకో గలిగినంత మాత్రముననూ అది అతిమానసోపలబ్ధి కానేరదు.

ప్రతితేజస్సూ ఆత్మతేజస్సు కాదు; ప్రతితేజస్సూ అతిమానసతేజస్సు అంతకంటెనూ గాదు. మనఃప్రాణశరీరములకు సైతము వేర్వేర వాని తేజస్సు లున్నవి. ప్రస్తుతమవి మరుగున నున్నను, మిక్కిలి ఉత్తేజమును, ఉదాత్తతను కల్పించి విషయజ్ఞానము నొసగి, క్రియాశక్తి నధికముగ సమకూర్పజాలినవే. విశ్వచేతనలోనికి భేదించుకొని చొచ్చుటవలన కూడా, చేతనయందు, శక్తియందు అపారమైన విస్తృతిని బొందుటకు వీలున్నది. మనఃప్రాణ శరీరముల అంతశ్చే తనల లోనికి, ప్రచ్ఛన్న చేతనయందలి ఏవిభాగములోనికైనను ప్రవేశింపగలిగి నచో అదియును అసాధారణమైన జ్ఞానక్రియాశక్తులను విడుదల యొనర్చుచుం డును. అశిక్షితమనస్సు కడు సులభముగా ఇట్టివాటిని ఆధ్యాత్మిక సాక్షాత్కారము లుగ భ్రమించుచుండును. ఊర్ధ్వమునకు ఉన్నత మనోమయభూమికలలోనికి ఉన్మీ లనము చెందుటవలన, అంతఃస్ఫూర్తిగల బుద్ధియొక్కయు, ప్రాణశక్తియొక్కయు తీవ్రప్రవృత్తిని సృజించు తేజశ్శక్తులను విశేషముగా క్రిందికి గొనిరావచ్చును. లేక, ఈ భూమికలలోనికి ఆరోహణము, యథార్థమయ్యునూ అసమగ్రమైన మిశ్ర మమున కవకాశమిచ్చెడి తేజస్సును క్రిందికి గొనిరావచ్చునుగూడ. ఈ తేజస్సు, మూలమునం దాధ్యాత్మికమేయైనను, క్రిందికి అవరప్రకృతిలోనికి దిగివచ్చునరికి దాని ప్రవృత్తి లక్షణ మెల్లవేళలా అట్టి యాధ్యాత్మికతను నిలుపుకోజాలినదిగా నుండదు. కాని, ఇవి ఏవియును గూడ అతిమానస తేజస్సు, అతిమానసశక్తి కాజాలవు.

మనోమయసత్తయొక్క శిఖర భూములను చేరి, అధిమానసములోనికి ప్రవేశించి, ఆధ్యాత్మిక సత్తయొక్క పరార్ధగోళపు సరిహద్దులలో నిలువనేర్చి నప్పుడుగాని, దీనిని దర్శించి గ్రహించుటకు వలనుపడదు. ఈ సమస్తభూతప్రకృ తికి మూలాధారమై మన మనఃప్రాణశక్తుల నన్నింటిని ఆవరించి, భేదించి, విశేష

ప్రాబల్యమున పరిమిత మొనర్చుచున్న అజ్ఞానము, నిశ్చేతనము, పాక్షికజ్ఞానము లోనికి కొంచెము కొంచెముగా మేల్కొనుచున్న మూలావిద్య అచ్చోట పూర్తిగా సంతరించిపోవును. ఎట్టి కలగలుపులకు, మార్పులకు అవకాశములేని ఋతచేతన సకల సత్తకూ మూలపదార్థముగా, విశుద్ధమైన అద్వాని సంస్థితి లక్షణముగా నల రారుచుండును అవిద్యాచక్రములోనే,-ఆ అవిద్య ఎంత వెలుగుతో గూడినదైనను నగుగాక,-ఇంకనూ మనము తిరుగాడుచుండు స్థితియందు మనకీ ఋతచేతనోప లబ్ధి కలిగినటుల భావించుకొనుట ప్రమాదభరితమైన అపమార్గములో మనలను బెట్టుటకును, మన సత్తయొక్క క్రమవికాసమును స్తంభింపజేయుటకును కారణ మగును. ఏలయన, ఏ అవరస్థితినో అతిమానసోపలబ్ధిగ మనము భ్రమించుట జరుగునేని, ఆ యుపలబ్ధికోసమై దుస్సాహసోపేతమైన అహంకారముతో మనము పడునట్టి వేగిరపాటు ఎట్టి అనర్థములను దెచ్చిపెట్టునని మనము గమనించియు న్నామో వాని కన్నింటికిని మన మగ్గమగుట సంభవించును.

అట్లుగాక, కొన్ని పరతరోపలబ్ధులను పరతమోపలబ్ధిగా మనము భావించుట జరుగునేని, మనము సాధించిన ఆ యుపలబ్ధి యెంత విస్తృతికలదైనను మన సత్తయొక్క పూర్ణలక్ష్యసిద్ధికి కొరవడనదే యగును. ఏలయన, రమారమియైన యుపలబ్ధితో మనము తృప్తిచెంది నిలిచిపోవుటవలన, పరమమైన పరివర్తనము మన కింకనూ అలభ్యముగనే యుండిపోవును. పూర్ణమైన ఆంతరిక విమోచనము, ఉన్నతమైన ఆధ్యాత్మిక చేతనోలబ్ధి మనము పొందనేర్చినను గూడ అది ఈ పరమ పరివర్తనము కానేరదు. ఏలయన, మనము పొందు నుపలబ్ధి స్వయముగ నొక పూర్ణసంస్థితియే కావచ్చును గాని, మనలోనున్న శక్త్యాత్మక విభాగము లింకనూ అతిమానసమునకు గాక ఒకానొక తేజోమయాధ్యాత్మిక మానసమునకు మాత్రమే చెందియుండు కారణమున, అవి మహత్తరమైన శక్తిజ్ఞానములతో విలసిల్లుచుండు సందర్భమున గూడ దోషయుక్తములగుచు, పాక్షికము, స్థానికమునైన చీకటి ముసుగునకు, పరిచ్ఛిన్నతను కల్పించు మూలావిద్యకు లోనైయుండుటే సంభ వించును.

—o—